శ్రీ రస్తు

శుభమస్తు

# శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్రము

## (పద్యకావ్యము)



గ్రంథకర్త

సహజకవిపంచానన, కవిశేఖర,

శ్రీ పూసపాటి నాగేశ్వరరావు



# కృతజ్ఞత

శ్రీమత్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి జీవిత చరిత్రము నొక పద్యకావ్యముగా వ్రాయవలయునను సంకల్పము నాకు గలుగుటయు నది పూర్తియగుటయు జరిగి యిప్పటికి జాలకాలమైనను ప్రకటనావకాశము లెప్పటి కప్పుడు దూరమగుచు వచ్చెను. ఏడెనిమిదేండ్ల క్రితము మా సహోపాధ్యాయులు (శ్రీచింతక్రింది కనకయ్య హైస్కూలు, మంగళగిరి) పూర్వ విద్యార్థులు నిది ముద్రణకు, దేవలయునని కొంత ప్రయత్నించిరి. అప్పుడొక అవాంతర పరిస్థితితో నది యట్లే యాగిపోయెను. వారెల్లరు చూపిన ఆదరాభిమానములకు నా కృతజ్ఞత లందజేయుచున్నాడను.

**శ్రీ ఎట్టోజు మాధవాచార్యులవారి** (ప్రిన్సిపాల్, ధర్మ అప్పారావు కాలేజి, నూజివీడు) ప్రోత్సాహమును, **శ్రీ మేకా రంగయ్యప్పారావుగారి** (యం. యల్. ఏ. నూజివీడు) ప్రోద్బలమును, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ అధ్యక్ష కార్యదర్శులు **డాక్టర్. శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ దేవులపల్లి రామానుజరావు గారల** యాదరమును, **శ్రీ నల్లపాటి సుబ్బారావు** (చార్టర్డు ఇంజనీరు, గుంటూరు) **శ్రీ కనగపాటి మధుసూదనరావు** (పి. డబ్లియు, డి. వర్కుషాపు, సీతానగరము) **శ్రీమతి సుతారి అచ్యుతాంబ** (జెవెలరీ షాపు, తెనాలి) మున్నగు దాతల సహాయ సంపదయు ముద్రణకార్యము నిర్వహింపజేసెనను సంతోషమును వెలిబుచ్చుచు వారి కందఱకు నా వినయపూర్వక నమస్కారము లందజేయుచున్నాను.

నా అభ్యర్థనను మన్నించి 'అమూల్యాభిప్రాయము' నొసగిన కవిసమ్రాట్, కళాప్రపూర్ణ **డా॥ విశ్వనాథ సత్యనారాయణ** గారికిని, 'కావ్యమీమాంస' వ్రాసియిచ్చిన **శ్రీ వి. వి. యల్. నరసింహారావు** (Head of the Telugu Department, Govt College, Macherla) గారికిని నా కృతజ్ఞతాభివందనము లందజేయుచున్నాను.

ఎడనెడ నాకితోధిక స్థైర్యమును గూర్చుచు పలుకుదోడ్పా టిచ్చిన కళాభిమానులు **శ్రీ గోనుగుంట రామయ్య** (గుంటూరు) గారికిని, **శ్రీ పొతకమూరి వీరబ్రహ్మాచార్యులు** (Hindi Lecturer, S. R. R. College, Vijayawada) గారికి నా కృతజ్ఞత లందజేయుచున్నాను.

**శ్రీ కందేపి ఈశ్వరాచారిగారు** (విజయవాడ) తన తల్లిదండ్రులు కీ. శే. వెంకాయమ్మ, సుబ్బారాయుడుగార్ల పేరిట ఈ కావ్యమున కిచ్చినరు116/-లును,

**శ్రీమతి అంజనీదేవి** (కంకిపాడు, కృష్ణాజిల్లా) గారు తన భర్త కీ. శే. కోలవెన్ను వీరభద్రాచార్యులుగారి పేరిట నిచ్చిన రు 58/-లును సముచిత స్థానమున కెడమైనందులకుఁ జింతిల్లుచు నవకాశము చిక్కినప్పుడట్టి స్థానము నలంకరింపఁ జేయుదు నని వారికి విన్నవించుకొనుచున్నాను.

ముద్రణ కార్యము కుంటుపడకుండ శ్రద్ధాసక్తులతోఁ గొనసాగించిన **శ్రీ లక్ష్మీప్రెస్, గుంటూరు** వారికి నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాఁడను—

అంతయును— శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి అనుగ్రహ విశేషమే— నేను నిమిత్తమాత్రుడను ! కావ్య గుణాగుణ నిర్ణేతలు- ఇక- సహృదయులైన పఠితలు ! వారి కిది- ఏలవలేశమేని- బ్రహ్మానందదాయక మగునేని నేను ధన్యుఁడను ! నా కృషి సఫలము !!

**మంగళగిరి**
**ది 1-5-1973**

ఇట్లు
బుధజన విధేయుడు,
**పూనపాటి నాగేశ్వరరావు**



ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవి, జ్ఞానపీఠ బహుమతి గృహీత,

కవి సమ్రాట్, కళాప్రపూర్ణ, పద్మభూషణ,

డా॥ విశ్వనాథ సత్యనారాయణ. M. A., D. Litt

వారి

## అమూల్యాభిప్రాయము

---

ఇది యొక మహాకావ్యము. ఈ కావ్యము పేరు శ్రీవీరబ్రహ్మేంద్ర చరిత్రము. వ్రాసిన కవి శ్రీపూసపాటి వాగేశ్వరరావు గారు. దేశములో నిట్టి కవి యొకఁ డున్నాఁ డని యెవ్వరికిఁ దెలియును? అందఱును పూఁతమెఱుంగు భావుకులు!

మహాకావ్య మన్నచో సామాన్యుల కర్థము గాదు. సామాన్యులు కావ్యము చదివెడి లక్షణము వేఱు. భావుకు లైన శబ్దవేత్తలకుఁ దెలిసినది వేఱు. నేఁడు గాలిలో ననేకభావములు గలవు. ఇది యొక నాగరకత. కొన్ని పైమెఱుంగుల భావములతో నీ నాగరకత సాగుచున్నది. ఈ పైమెఱుంగుల సిద్ధాంతములు మన దేశమున లోఁతులకుఁ బోనేరని జనులను గ్రమ్మినది. లోఁతులకుఁ బోనేరని తనము నేఁడు సర్వధా విజృంభించినది!

ఆ లోఁతులకుఁ బోఁగలిగిన వారికి నిది మహాకావ్యము. అనఁగా సామాన్యులకు నందుబాటులో నుండదు. అర్థము గాకుండ నుండునా? యన్నది ప్రశ్న. పయిమెఱుంగుల భావములకు నలవాటుపడిన వాఁడు లోఁతులకు పోఁడు. వాని చీలమండల లోఁతే వానికిఁ దెలియును.

పద్యమో పాటయో నేఁ డభివ్యాప్తిలో నున్న కుత్సితనాగరకతాసంబంధ భావములకు సంబంధమున్నచో సామాన్యులకుఁ దెలిసి వట్లుండును.

ఒక సాహిత్యము నందుఁ బలుమార్గము లుండును. పద్యరచన తీసి కొందము. ఒకటి ఖండకావ్యము; రెండు మహాకావ్యము. వీని రెంటికినిఁ జాల భేదము గలదు. నేఁ డందఱును ఖండకావ్యములే వ్రాయుచున్నారు. మహాకావ్య నిర్మాణశక్తి యెక్కువది. దాని లక్షణము వేఱు! దాని నిర్మాణము వేఱు!!

ఖండకావ్యమును మహాకావ్యమును గాకుండ నడుమ నొక లఘు కావ్యము గలదు. అది రెండుమూఁడు వందల పద్యములతోఁ దేలిపోవును. దానిలోఁ గూడ మహాకావ్యశిల్ప ముండదు !

ఇది యిట్లుండఁగా—ఖండకావ్యకర్త, నడిమిరకపు కావ్యకర్త, మహా కావ్యకర్త— ఈ ముగ్గురికి విస్పష్ట మైన భేదము లుండును. ఊహలో, కల్పనలో, పలుకుబడిలో— ముగ్గురి లక్షణములు మూఁడు విధములు.

మొదటి రెండురకముల కావ్యములలో సౌకుమార్యమో— మాధుర్యమో— శబ్దచిత్రణమో— ఒక నడక నడిపించుటయో— ఈ లక్షణములతోఁ గొంత ప్రశస్తి వచ్చినది. సామాన్యముగా సౌకుమార్యమాధుర్యగుణములు గల ఖండకావ్యకర్త కీర్తిప్రతిష్ఠలు ప్రబలినవి మహాకవులు మూలఁబడినారు !

మహాకవి యొక్క రచనలో సామాన్యముగా మాధుర్యసౌకుమార్యము లకుఁ దక్కువ స్థాన ముండును ఒక మహాకావ్యము నందుఁ బ్రౌఢి ప్రధానముగా నుండును. ఈ ప్రౌఢిని తెలిసికొనుట కష్టము. ఈ ప్రౌఢి కథను పెంచుటలో— కథాంశములను జిత్రించుటలో— ఉపమలు నుత్ప్రేక్షలు కల్పించుటలో— లోకోక్తు లను సమర్థముగా కావ్యశోభాసంపాదకములుగా సమకూర్చుటలో నుండును. ఈ లక్షణములు కొద్దికొద్దిగా పరుల యందున్నను వానిఁ బ్రాధాన్య ముండదు ప్రౌఢి యన్న గుణము దానియందు భాసించదు !

లోకము— తదితరకవులకును దెలియును; ఈ ప్రౌఢకవికిని దెలియును. ఈ ప్రౌఢకవి అందఱకుఁ దెలిసిన లోకమును విలక్షణముగాఁ జెప్పును దాని నొక ఉపమాలంకారము లోనవో ఉత్ప్రేక్షాలంకారము లోననో నిక్షేపించును.

ఈ కవి బహువిషయములు చూచినవాఁడు—

"విసిగి వేసారి మార్మనలు నిరుద్యోగి
కనుకోని పదవి పిల్చింది నపుడు" —1 ఆ-27 ప

ఈ విషయము సామాన్యకవికిఁ బ్రధానవస్తువు. దాని మీఁద కథ నల్లును ఏదో ఏదో చేయును. ప్రౌఢకవికి దాని వెల తెలియును. దాని నొక గొప్ప భావమునకు నంగముగాఁ జేయును. దాని కంతకంటె నధికశక్తి లేదు !

ఈ మహాకవి యొక్క మహాకవితాలక్షణము రెండుచోట్ల మిక్కిలిగా గనిపించును ఒకటి కథానిర్మాణకౌశలము. ఇది మహారహస్యవిషయము. గొప్పగొప్ప గ్రంథములు వ్రాసిన వారికిఁ గూడ దురూహ్య మైన విషయము.

రెండవది వర్ణనలలో నుండును. అది యెట్లుండు ననఁగా— ఎదో స్త్రీని వర్ణించు చున్నాఁడు. ఆమె కాళ్ళమీఁద కుచ్చె ళ్ళాడుచున్నవి— ఇది వందలాది కవులు వ్రాయుదురు. కాని ప్రౌఢకవి చూపు వేఱుగదా! అతఁ డేమనును ?

**'తొడల రాయిడికి నాగడ మైన కుచ్చెళు**
**లడుగుల నంటి జీరాడుచుండ'** —2 ఆ-70 ప

ఇట్లు వ్రాయును. ఇది యొక చూపు— ఒక గడుసుదనము— ఒక యూహ శక్తి; అగడము— లోకము లోని మాటయే. 'కుచ్చెళ్ళు' అగడము చేయుచున్న వట! ఆ అగడమునకు హేతు వున్న దట! అది తొడలరాయిడి!

ఇది గ్రంథములో నున్న వందలాది పొగసైన ప్రయోగములలో నొకటి.

ఇట్టి ప్రౌఢకవుల పద్యములు గూఢ చూచుటకుఁ డక్కన వారి పద్య ముల వలె నుండును. ఆ పద్యములో నొకచోట నొకమాట యుండును. ఆ మాటతో పద్యము యొక్క అర్థమంతయు రమణీయమై యూరకుండును. నిజమైన భావుకుఁడు దానినిఁ జూచెడి శక్తి గలవాఁడై యుండును.

వర్షమును వర్ణించుచున్నాఁడు—

**'తృషితధరాకుమారికఁ దన్ను నాకాశ**
**తరుణి పయోధరధార లేమొ!'** —5 ఆ-77 ప

ఆకాశము తల్లి— భూమి బిడ్డ— చన్నిచ్చి పెంచుచున్నది! పయోధర శబ్దము నింత రమణీయముగా వాడుట సంస్కృతకవులలో— ఎక్కడో— ఒక రిద్దఱు చేసిన పని నేఁటి పాఠకుఁడు దీనిని భావింపఁడు.— ఈ పద్య మంతయు నిట్లే యున్నది ప్రౌఢి — తన యూహను— లోకసామాన్య మైనదానినే— కవి తన గడుసుదనముతో మలయించుటలో నుండును.

ఈ కవి నా అభిప్రాయ మడిగినాఁడు; పీఠిక వ్రాయు మనలేదు. పీఠిక వ్రాయుటకును నా కోపిక లేదు. ఇంత మంచికావ్యము మీఁద నభిప్రాయము చెప్పకుండుట దోషము.

ఎవఁడో నూటికి కోటికి భావుకుఁ డుండును. ఇట్టి మహాకావ్యములు వారికొఱకు!

ప్రస్తుత పరిస్థితులు చూడఁగా మహాకావ్యములు నిలుచునా ? అవి గుర్తింపఁబడునా ? — అన్న సంశయము కలుగుచున్నది.

'శ్రీవీరబ్రహ్మేంద్రచరిత్ర' మను మహాకావ్యమును నిర్మించిన యీ కవి చిరాయుష్కుఁడై తన కవితాశక్తి మఱియు నొక రసవత్కథ మీఁద వినియోగించుఁగాక !

(సం) విశ్వనాథ సత్యనారాయణ
7-4-73



# కావ్యమీమాంస

**శ్రీ వాసిలి వేంకటలక్ష్మీ నరసింహారావు. M.A.**

ఆంధ్ర శాఖాధ్యక్షుఁడు, ప్రభుత్వ కళాశాల, మాచెర్ల

**"ఈశ్వరు వంశ మందు జనియించి, కృతార్థ మొనర్చి లోకమున్,**
**శాశ్వతకీర్తికాంతి వెదచల్లిన చల్లనివాని రాజయో**
**గీశ్వరు చిత్సుధామధురవృత్తము వస్తువు; పూనపాటి నా**
**గేశ్వరరావు కర్త; బళిరే, సరిక్రొత్త విభూష వాణికిన్ ।"**

**— పీఠిక - 13.**

ఇందు వస్తుగౌరవముతోపాటు కవిగౌరవమును సూచింపఁబడినది. ఆత్మప్రత్యయము లేని కవి తన కావ్యము వాణికి విభూష యగునని వక్కాణింపలేఁడు. పీఠిక యందలి ఒండురెండు పద్యము లంటి చూచినచాలు; ఈ కవి, కవితావ్యాసంగమున గడిదేఱిన జాణ యని యిట్టె చెప్పఁగలము.

ఏనాఁడో 'విశ్వకర్మతారావళి' యను చిన్ని పద్యకృతితో నంకురించిన భక్తిభావన పూలుపూచి కాయగాచి నేఁడీ 'వీరబ్రహ్మేంద్రచరిత్ర' రూపమున పక్వఫలమై వెలసినది. ఈ నడిమి కాలములో వెడలిన 'శిల్పసుందరి' 'నవఖండాలు' 'ఆదర్శపద్మిని' అను పద్యకృతులు ఈకవి ఖండకావ్యరచనలో సైతము సిద్ధహస్తుఁ డనుటకు నిదర్శనములు.

**— 'జాతిని నాతిఁజేయుటలు రామునికే తగు శిల్పికే తగున్' —**

అని కవితాశిల్పసుందరులకు కావ్యముఖమున నెయ్యపుంజవులు నెక్కొల్పిన కావ్యశిల్పి శ్రీనాగేశ్వరరాయకవి.

బ్రహ్మభావనామగ్నుఁడై ఈకవి చిరకాలముగా నొక మహాకావ్యము రచించుచున్నాఁ డని కర్ణాకర్ణిగా వినుటే కాని అందలి పద్యముల నాలకించు నవకాశము నాకు లభింపలేదు. ఉన్నట్లుండి హఠాత్తుగా నొక వారము దివముల క్రిందట ఈకవి మాయింట పొడసూపి "ఇదుగో ఇది శ్రీవీరబ్రహ్మేంద్రచరిత్రము; దీనిని సమీక్షించుభారము మీఁది" యని ముద్రిత మైన బృహద్గ్రంథప్రతి యొకఁడు నాయొడిలో పడవైచెను. వస్తువు మీఁది గౌరవముచే నేమి, కవి మీఁది యాదరముచే నేమి కావ్యపఠ నాసక్తి రెట్టించుచున్నను 'సమీక్ష' యనఁగనే జంకొదవినది. కానిమ్మని గ్రంథము పుటలు విప్పి చూతునుగదా! సమీక్షకుఁ డగువాని కుత్తుకపై చురకత్తుల వంటి ఈక్రింది పద్యపంక్తులు కంటఁబడినవి,

"కవిహృదయం బెఱుంగని పండితంమన్యుఁ
డంటిన సత్కృతివ్యాఖ్య యట్లు" (3-247)

కరములు తడఁబడ వేఱొక పుట తడవితిని.

"అటనట నయిదాఱు పుట లైనఁ జూడక
కావ్యవిమర్శకుఁ గడఁగి నట్లు" (4-95)

అను పంక్తులు కనఁబడెను. 'సమీక్ష' యనునది కావ్యరచన కంటె కష్టమైన పని యను నమ్మిక కలవాఁడ నగుటచేతను, సత్కావ్యమునకు సమీక్షతో పని లేదని వాదించు వాఁడ నగుటచేతను కొంచెము వెనుకాడుచుండ నాకంటి కిక్రింది పంక్తులు భాగ్యాక్షరముల వలెఁ దోఁచెను

"కావ్యంబులోఁ బస కలవైనఁ బండితా
భిప్రాయములు పెచ్చుపెరిగి నట్లు" (3-247)

కవి గారి వాక్యములు కవిగారికే చూపి తప్పుకొనఁ జూచితిని. నాగేశ్వరరావుగారి స్వభావము నాకుఁ దెలియును. ఆయనది వజ్రసంకల్పము. "పెచ్చుపెరుగు నంతటి పండితాభిప్రాయములు సేకరించు తలఁపు నాకు లేదు; సహృదయుఁ డగువాని తలస్పర్శి సమీక్ష యొక్కఁడు చాలును. తలస్పర్శి యనుటచే సమీక్ష సువిస్తృతముగను నుండవచ్చును; తిరిగి యొక పదినాళ్ళలో మీకు కనిపింతు" నని తెగవేసి చెప్పి తాను వెడలిపోయెను.

'సుఖమ్ముగా నున్న ప్రాణమున కది యొక సంకటము వచ్చిపడెనే యని తక్కిన పనులెల్ల కట్టిపెట్టి కావ్యపఠనమునకు పూనుకొంటిని. శ్రద్ధతో చదివితిని; నన్ను నేను మఱచి చదివితిని; నన్ను నేను మఱవకయు చదివితిని. 'రాజయోగీశ్వరు చిత్సుధామధురవృత్తము' నాకు ప్రసన్న మైనది. నాగేశ్వరరాయని ఈ కావ్య మాంధ్రవాణికి 'సరిక్రొత్త విభూష' యని నిస్సందేహముగా నన్పించినది.

## కావ్య హేతువు

'శ్రీవీరబ్రహ్మేంద్రచరిత్ర' యొక పద్యకావ్యము. ఈమాట పలుకుట తోడనే రెండు ప్రశ్న లెదు రగుచున్నవి.

1. ఇపు డీ వీరబ్రహ్మచరిత్రము వ్రాయవలసిన పనియేమి ?

2. వ్రాసినను దీనిని పద్యకావ్యముగా వ్రాయవలసిన పనియేమి ?

ఈ రెండు ప్రశ్నములకును సమాధానము కొంతవఱకు పైని పేర్కొనఁబడిన పద్యమందు(పీఠిక-13)లేకపోలేదు. అయినను మఱికొంత విశదీకరించుట మేలని ఈక్రింది పద్యము సైతము కవి పీఠికలో వ్రాసెను.

"వెలయించెన్ కడియాలవంశకరుఁ డా వీపూరయార్యుండు రా
గలయాధీనము యక్షగానము సుధాకందంబు; కందార్థముల్
వలికెన్ శ్రీశివరామయోగి, యితరుల్ వ్రాకుచ్చి రాఖ్యాయికా
దు లపూర్వం బగు పద్యకావ్య మొనరింతున్ నేను దద్భక్తితోన్

— (పీఠిక - 14)

నిజమే, బ్రహ్మంగారి చరిత్రమునకు సంబంధించిన వచనరచనలు, యక్షగానము, నాటకములు, బుఱ్ఱకథలు — అనేకము లున్నవి. బృహత్ప్రబంధముగాఁ జెప్పఁదగిన పద్యకృతులు లేనిమాట వాస్తవమే. బృహత్ప్రబంధములు లేవంటిమే కాని అసలు పద్యరచనలే లేవనఁ జాలము. శ్రీవడ్డెపాటినిరంజన శాస్త్రిగారి 'కల్యంధకౌముది' యందును, శ్రీపులివర్తిశరభాచార్యులుగారి 'రత్నగర్భ' మొదలగు కృతు లందును వీరబ్రహ్మేంద్రతత్త్వ మెడనెడ మనోజ్ఞముగా కీర్తింపఁబడినది. ఏమైనను నివి బృహత్ప్రబంధరూపమున బ్రహ్మేంద్రచరిత్ర పర్వస్వము నావిష్కరించునవి కావు.

కేవలపద్యకృతులు గానట్టి బ్రహ్మంగారి చరిత్రరచనలు తెనుఁగునాట ననేకము లున్నవి.

1. శ్రీ బ్రహ్మంగారి 'కాలజ్ఞానతత్త్వము' — (వచనము)
2. ,, కడియాల వీపూరయాచార్యుని 'బ్రహ్మంగారి(యక్షగాన)నాటకము'
3. ,, అనుములకొండ శివరామయోగీంద్రుని 'బ్రహ్మంగారికందార్థములు'
4. ,, జవంగుల నాగభూషణదాసుగారి 'శ్రీవిరాడ్విరబ్రహ్మేంద్ర స్వాములవారి సంపూర్ణజీవితచరిత్ర' (వచనము)
5. ,, నాటుకొండ సుబ్బయ్యశ్రేష్ఠిగారి 'బ్రహ్మంగారిచరిత్ర' (వచనము)
6. ,, తాటికొండ వేంకటరాఘవాచార్యులుగారి వీరాచార్యచరిత్రము (వచనము)
7. ,, వడ్డెపాటి నిరంజనశాస్త్రి, తత్త్వానందస్వామిగారల 'బ్రహ్మానందలీలలు' (నాటకము)

8. శ్రీ పులికొండ పరబ్రహ్మకవి గారి 'బ్రహ్మంగారి మహిమలు'
(వచనము)

9. ,, కొండూరి వీరరాఘవాచార్యులుగారి 'మన గురుదేవుఁడు'
(వచనము)

ఇవికాక యింకను 'రాజయోగి' మొదలగు ననేకరంగస్థలనాటకములు 'బ్రహ్మంగారికథ' మొదలగు పెక్కు బుఱ్ఱకథలును కలవు.

ఇవి యన్నియు, బ్రహ్మేంద్రచరిత్రము ప్రౌఢప్రబంధరూపమున బృహత్కావ్యముగా రచింపఁబడని కొఱత తీర్చునవి కావు. కనుకనే శ్రీనాగేశ్వరరాయ కవి ఉదాత్తరమణీయ మగు ప్రబంధమార్గమున చంపూకావ్యముగా వీరగురుని జీవితచిత్రణ మొనర్పవలసిన యావశ్యక మేర్పడెను బ్రహ్మేంద్రుని విరాడ్రూపమును స్వీయకవితాసరస్వతిమూలమున నీకవి యెంతవఱకు ప్రసన్న మొనర్పఁగలిగె నన్నది క్రమముగా సమీక్షావశమున తేలవలసిన విశేషము.

పైని చెప్పఁబడిన యంశము లన్నియు బ్రహ్మంగారి చరిత్రమును పద్య ప్రబంధముగా రచింపవలసిన అక్కఱను నిరూపించునవేకాని ప్రస్తుతకాలములో అసలు 'బ్రహ్మేంద్రచరిత్రము' రచింపవలసిన అవశ్యకమును నిరూపించునవి కావు.

బ్రహ్మేంద్రుఁడు మహాపురుషుఁడు, ఒక మహాపురుషుని జీవితచరిత్ర మిపు డేల యావశ్యక మయ్యె నను ప్రశ్నమునకుఁ దావు లేదు. మహాపురుషుల జీవితచరిత్రములు రచింపవలసిన యావశ్యకము సార్వకాలికము. రాముఁడు కృష్ణుఁడు, బుద్ధుఁడు, జీసస్, మహమ్మదు, శంకరుఁడు, రామానుజుఁడు, వేమన, వీరబ్రహ్మము, రామదాసు, కబీరు, రామకృష్ణుఁడు, గాంధి మొదలగు మహాపురుషులు జీవలోకము నుద్ధరింప నవతరించిన మహాత్ములు. వీరిలో కొందఱిది పూర్ణావతారము పలువురిది అంశావతారము. ఇందు వీరబ్రహ్మేంద్రునిది పూర్ణావతార మను విశ్వాసము భక్తకోటి యందు ప్రగాఢముగా నున్నది.

నిజమునకు బుద్ధుఁడు, జీసస్, మహమ్మదు, శంకరుఁడు మొదలగు మహాపురుషుల మతసిద్ధాంతములను విశాలదృష్టితో పరిశీలించిన తత్త్వవిషయిక మగు మూలసూత్రములలో వైషమ్యము కంటె సామ్యమే యెక్కుడుగ గోచరించును. కాని యామతములు లోకములో ప్రవర్తిల్లిన తీరుచూడ వాని వలన సామ్యము కంటె వైషమ్యమే పెచ్చుపెరిగి ప్రజాజీవితమును పలురీతుల కల్లోలిత మొనర్చెననుట ప్రత్యక్షసాక్ష్యము. ఒక దశలో నివి కులముల కుమ్ములాటలుగా చెలరేగి మానవుని మనుగడకే ముప్పుతెచ్చుటయు మన మెఱుఁగుదుము. ఈ ముప్పుతిప్పలు నేఁటికిని తప్పనివే కదా! ఎందఱు రామకృష్ణు లుదయించి

నను, ఎందఱు మహాత్ములవతరించినను ఈతిప్ప లిప్పటి కప్పుడు పెరుఁగు చున్నవే కాని తఱుఁగుట లేదు మానవు నంతరంగము నావరించిన లోభ మోహములకు, స్వార్థాహంభావములకు చ్యుతి యన్నది లేదుకదా! కనుక సర్వ మతసామరస్యము,సర్వమానవసౌభ్రాత్రము మొదలగు విశాలాశయములను రమ్య ముగ నుపదేశింప వలసిన యావశ్యక మట్లే నిలిచియున్నది. ఈ దృష్టితో నీ వీర బ్రహ్మేంద్రుని జీవితచరిత్రమును రసవత్కావ్యముగా రచింపవలసిన అక్కఱ మిక్కుట మైనది. బ్రహ్మేంద్రుని జీవిత మంతయు ననేక విశాలాశయములకు మనికిపట్టగుట చేతనే నాగేశ్వరరాయకవి తచ్చరిత్రరచన మొనర్చుట కత్యంత మాకర్షితుఁ డయ్యెను.

## రచనాలక్ష్యము

నాగేశ్వరరాయకవి బ్రహ్మేంద్రుని జీవితమును 'చరిత్ర'గా రచింపఁ దలచెను. ఇట్లనుటచే 'నిది చరిత్రమా కావ్యమా?' అను సంశయ మొదవుట కవకాశము కలదు. ఇది నిస్సంశయముగ చరిత్రమే. ఎట్టి చరిత్ర మనఁగా 'మనుచరిత్ర' 'వసుచరి'త్రాదు లెట్టి చరిత్రములో అట్టి చరిత్రము. అవి కావ్యము లయినచో నిదియు కావ్యమే. ఆ మనువసువులు గతించి మన్వంతరములు గడచి నవి. ఈ బ్రహ్మేంద్రుఁడు సమాధిగతుఁడై నిండ మూఁడు శతాబ్దులు కాలేదు. శ్రీకృష్ణదేవరాయలు గతించిన పిమ్మట విజయనగరవైభవము సగము చితికినది. ఆపిమ్మట రామరాజుతో ఆ సామ్రాజ్యమే అస్తవ్యస్త మయినది, తరువాత మహమ్మదీయుల విజృంభణము విమ్మరించెను కడపలో నవాబు, కర్నూలులో నవాబు, నంద్యాలలో నవాబు బనగానపల్లిలో నవాబు —ఎక్కడి కక్కడ ఒక్కొక్క నవాబు కొలువదీరెను. మఱొక వైపున వ్యాపారమిషతో నడుగు పెట్టిన పాశ్చాత్యులు క్రైస్తవమతమును ప్రబోధింప మొదలిడిరి. ఇది యంతయు 17వ, శతాబ్ది నాటికి ఒక్క ఆంధ్రదేశము నందే కాక యావద్భారతమున హైందవ మతమున కేర్పడిన యొక విపద్దశగా మాఱినది. మహారాష్ట్రములో 'శివాజి' చక్రవర్తి మహమ్మదీయులను నిరోధించుటకు చేయని ప్రయత్నమె లేదు. సమర్థ రామదాసస్వామి మున్నగు మహాయోగులు అధ్యాత్మవిద్యాప్రచారముతో పాటు మతవిషయికముగ జనజీవితము నుద్ధరించుటకును పాటుపడిరి. ఇఁక నిచ్చట నాంధ్రదేశమున* నీ పదునేడవ శతాబ్ది యందే వీరబ్రహ్మేంద్రుఁడును అధ్యాత్మ విద్యాప్రచారముతోపాటు సంఘసంస్కరణాదులును చేపట్టి పెక్కు మహిమలు

* వీరబ్రహ్మస్వామి క్రీ.శ. 1604 మొదలుకొని 1690 ప్రాంతము వఱకు జీవించి యున్నట్లు 1952-డిసెంబరు భారతిలో కళాప్రపూర్ణ, శ్రీకొండూరివీరరాఘవాచార్యులుగా రొక వ్యాసము ప్రచురించిరి.

సూచుచు తనజీవితము నుద్ధరించుట కవిరళకృషి యొనర్చెను. ఈ మహానుభావు డిన్నిరీతుల జనప్రియుఁ డగుట చేతనే తన జీవితకాలము నందే "జేజినాయన" యని భక్తిప్రేమములతో పిలువఁబడెను. ఈ 'జేజినాయన' యనునది మహాత్ముని మనము 'బాపూజీ' యని పిలుచుటవంటిదే కదా !

నిన్నమొన్న మన కనుల యెదుట నిలిచి జగత్తునకే క్రొత్తవెలుగులు నవరించిన బాపూజీ ప్రబోధములే నేఁడు మన కెవరైన గుర్తుచేసినగాని గుర్తు వచ్చుట లేదు. ఇట్టి స్థితిలో మున్నూఱేండ్ల క్రిందటి బ్రహ్మేంద్రుని బోధలు గుర్తుచేయవలసిన యావశ్యక మేలయుండదు ?

బోధలను గుర్తుచేయుట పెఱు; వానిని హృదయములో హత్తుకొనునట్లు మనోజ్ఞముగ కావ్యరూపమున వెలయించుట వేఱు. నాగేశ్వరరాయకవి హృద్యమగు పద్యకావ్యరూపమున బ్రహ్మేంద్రుని బోధామృతము సహృదయకోటికి చేరలతో చూఱ లిచ్చెను.

వీరబ్రహ్మేంద్రచరిత్రమును కేవలకావ్య మనుట కంటె తత్త్వకావ్య మనుట మేలు. ఇట్టి కావ్యరచనకు కవి యగు వానికి రసావేశ, తత్త్వావేశములు రెండును నావశ్యకములే. ఇవి రెండును ఈకవిలో సుసంగతములై యుండె ననుట కిక్రింది పద్యమే తార్కాణము.

"బ్రహ్మమయుఁ డైన వీర
బ్రహ్మము నాయందు నున్నవాఁ డఁట! శబ్ద
బ్రహ్మోపాసన మిది యట!
బ్రహ్మానందానుభూతి ఫల మఁట! తగదే" (పీఠిక - 12)

కర్తృత్వము రామచంద్రునం దారోపించి భాగవతరచనకు దొరకొన్న పోతన్న నిరహంకారతను తలపించు నీ ధోరణి తత్త్వకావ్యములకు పెట్టని తొడవు.

నన్నపార్యుని "అమితాఖ్యానకశాఖలం బొలిచి" (ఆది ౧ - 66)అను పద్యమును పోతనార్యుని "లలితస్కంధము కృష్ణమూలము (ప్రథమస్కంధము - 22) అను పద్యమును తలపించు నీక్రింది పద్యము బ్రహ్మేంద్రచరిత్రకావ్య తత్త్వమును సూచించుచున్నది.

"విలసద్యోగ మదృష్టమూలము, విరాడ్విఖ్యాతనానావిధో
జ్జ్వలశాఖారమణీయవృత్త ముపసేవానమ్రసిద్ధేంద్రహృ
త్కలికానందము: సర్వకాల ఫలితాంతస్సార: మమ్లానభా
వలతాంతం బగు బ్రహ్మకల్ప మిది సంప్రార్థ్యంబు లోకాళికిన్"
(పీఠిక - 19)

శ్లేషాలంకారసుభగ మైన ఈయొక్క పద్య మనియేకాక యితరము లగు పెక్కు పద్యము లందును కవిత్రయము, శ్రీనాథుఁడు, రాయలు, పెద్దన, తిమ్మన, ధూర్జటి, రుద్రకవి, రామకృష్ణుఁడు, భట్టుమూర్తి మొదలగు పలువురు ప్రాచీ నార్వాచీనకవుల పలుకుబడులు పోకడ లీ కావ్యమున నెడనెడ గోచరించును. వచనరచన యందును ఈకవి పలువురు ప్రాచీనుల నొకచోఁ జేర్చికొని స్వీయ మనిపించు నొక క్రొత్త త్రోవ త్రొక్కెను. ఈక్రింది గద్యపద్యముల నీదృష్టితో పరిశీలింపవచ్చును.

1—78; 1—143; 1—6; 1—15; 2—62; 3—114; 3—141;

3—230; 5—97; 5—163 మొదలైనవి.

'కేవలప్రాచీనమార్గములే కాని ఈ కవికి నవ్యమార్గములు నచ్చవా ? యని శంకింపఁ బనిలేదు. భావనాపద్ధతి యందును, అన్యదేశీయాదులు ప్రయో గించుట యందును ఈయన నవ్యతను సైత మాదరించెను, సన్నివేశము ననుస రించియు సన్నివేశగతపాత్రముల ననుసరించియు ఈనవ్యత చోటు చేసికొనినది. బ్రహ్మేంద్రుని శిష్యుఁ డగు సిద్ధుఁడు కొలువులో కడపనవాబునకు సలాము పెట్టక నిలిచెను, అప్పటి నవాబు నాంగికవాచికములను కవి యెట్లు చిత్రించెనో చూడుఁడు.

"హుంకా పిల్చుచు నోరఁగంటఁ గని యా యుర్వీశుఁ" డున్మాదమా?
నికా! నాకు 'సలామలేకు' మనకే విల్చెం బరధ్యానతన్
పకా హైందవపాదదాసుఁ డగు నిప్పాపాత్ముఁ బోనిచ్చినన్
దక్కంబోవదు గౌరవం బనుచుఁ గ్రోధం బారఁగా విట్లనున్." 3-221

ఈకవి "సంస్కృతాంధ్రాంగ్లహిందీప్రశస్తనంసకావ్యవీథీవిహారభాగ్యము' వడసిన ఆంధ్రపండితుఁ డగుటచె కాబోలు 'నాఁటి యీనాఁటి శుభలక్షణంబు లెఱిఁగి 'ద్వివిధమిశ్రంబుగా' రచనసాఁగింతు నని (పీఠిక - 17) ఉపక్రమించెను. గ్రంథ మాద్యంత మరయుదు మేని ఈయనకు నేఁటి కవితాలక్షణముల మీఁద కంటె నాఁటి కవితాలక్షణముల మీఁదనే ఆస్థ మెండని స్పష్టమగును. నిక్క మాడిన కథావస్తువు ననుసరించియు, రసప్రాదాన్యము ననుసరించియు నిట్టి తత్త్వకావ్యము లందు ప్రాచీనప్రబంధమార్గమే వరణీయ మనిపించును.

కావ్యరచనలో కవి తాను పాటింపఁదలచిన లక్షణములను కొన్నింటిని ఈక్రిందిపద్యములో పేర్కొనెను. లక్ష్యశుద్ధిని బట్టియే కదా లక్ష్యసిద్ధి !

శ్రవణీయ మగు శబ్దసంస్కారమే కాక
యర్థానుగమనంబు నాదరించి
స్మరణీయ మగు కథాసంవిధానమె కాక
పాత్రౌచితీప్రగల్భత నెఱింగి
కమనీయ మగు నలంకారశోభయె కాక
యుక్తంబు లైన లోకోక్తు లరసి
రమణీయ మగు రసప్రాచుర్యమే కాక
యుపదేశయుతముగా నుద్ధరించి

తగిన రీతిని పాకపద్ధతు లమర్చి
వీరయోగీంద్రతత్త్వసుధారసంబు
కావ్యచషకంబు నం దిడి కలయఁద్రిప్పి
చవుల మురిపింతు -మఱపింతుఁ జపలరుచులు." (పీఠిక - 18)

కావ్యము నెప్పుడును కవిదృష్టికోణము నుండి పరిశీలించి మంచి చెడుగులు నిర్ణయించుట సహృదయవిమర్శకుల లక్షణము. ఈదృష్టితో ఈకావ్యమందలి 1) కథాసంవిధానము 2) పాత్రౌచిత్యము 3) శబ్దసౌభాగ్యము 4) లోకోక్తిసంపద 5) అర్థగాంభీర్యము 6) అలంకారశోభ 7) రసరామణీయకము 8) ఉపదేశప్రాధాన్యము- పరిశీలించుట ప్రస్తుతము.

## కథాసంవిధానము

వీరప్పయ్య ప్రకృతాంబాపరిపూర్ణయార్యుల కన్నబిడ్డఁడు, పాపమాంబా వీరభోజయాచార్యుల పెంపుడు బిడ్డఁడు. వీరభోజయాచార్యుఁడు కన్నుమూసిన కొన్నాళ్లకు వీరప్పయ్య తల్లి నెట్లో ఒప్పించి తపస్సు చేయుటకై అడవుల కేగెను. వీరభద్రుని విగ్రహము నులఁచి దాని కాయు పూడెను ఆయనను గూర్చి తప మొనర్చి తత్ప్రసాదము వడసెను. పిమ్మట బనగానపల్లెకు పోయి అచ్చమాంబ యింట -ఆమె నెట్లో ఒప్పించి -పసులకాపరిగ జేరెను. అతని చేయి సోకఁగానే పశువులు పసదనముతో మసలఁజొచ్చెను ఆకలిదప్పు లుడిపి వానిని గిరిగీసి నిలపి తానొక గిరిగుహాగర్భములో ఫణిఫణామణిచ్ఛవులలో గంటముఁని అతఁడు "కాలజ్ఞాన"రచన సాగించెను అది కనులారఁగాంచిన అచ్చమాంబ బాలబ్రహ్మమునకు బనగానపల్లిలో మఠము కట్టించెను. జనులు తండోపతండములుగా వచ్చి స్వామి 'కాలజ్ఞానము' వినుటే కాక జ్యోతిశ్శాస్త్రయోగశాస్త్రరహస్యములు తెలిసికొన నుద్యమించిరి. కొన్నాళ్ళకు స్వామి అన్నాజయ్యను అచ్చటి మఠాధి

పతిని గావించి తాను కందిమల్లయ్యపురము చేరెను. అచ్చట కర్మయోగజ్ఞాన యోగము లవలంబించి 'వీరబ్రహ్మము'గా విరాజిల్లఁ దొడఁగెను — ఇది బాల యోగము.

శిశిర మాసన్న మాయెను. మాఘమున పెండ్లిండ్ల సందడి హెచ్చెను. బ్రహ్మేంద్రుడు మానసమున ఈడేరిన గోవిందమ్మ కదలాడెను. ఆమెయు బ్రహ్మమును గూర్చి కలలు గనసాఁగెను. కల యేమి కర్మ మని బ్రహ్మమే కదలి గోవిందమ్మ యింట పొడసూపెను. ఆమె తలిదండ్రులకు వీరప్పయ్య వెంగలియై కన్పట్టెను. ఆమె వానిని తప్ప నన్యుని వివాహ మాడనని చెప్పెను. గోవిందమాంబా బ్రహ్మేంద్రులవివాహ మనివార్య మయ్యెను నాఁటి బాలయోగి నేఁడు రాజయోగి యయ్యెను. నెల మసలిన గోవిందమ్మకు నాథుఁడు గర్భోపనిషద్రహస్యములు వినిపించెను. గర్భమువెలువడి సిద్ధలింగయ్య పుడమిపై పడెను. పిమ్మట క్రమముగా గోవిందయ్య, ఓంకారయ్య, శివరామయ్య, పోతులూరయ్య, వీరనారాయణమ్మయు జన్మించిరి. రాజయోగిగృహము అంచకూనల తోడి అంబుజాకర మయ్యెను.

సకుటుంబముగా రాజయోగి క్షేత్రసందర్శనకు బయల్వెడలెను. త్రోవలో ఆపన్నుల బాధ లపనయించుటకై ఆయన కొన్ని మహిమలు చూపవలసి వచ్చెను. శ్రీశైలమున కవ్వల నొక ద్విజుని కుష్ఠవ్యాధి నపనయించెను. కంచి కివల నొక బమ్మ'గాకాసికి కాల్సేతులు కట్టి వాకట్టు కట్టి బాటసారుల భయ ముడిపెను. నగరపాడున అనపత్యుడగు జగ్గయార్యునకు పుత్రవరము ప్రసాదించెను. అల్లాడుపల్లె కావల చోరుల చేష్ట లుడిగించెను. పెదకొమిర్లలోని తరుణవయస్కుల తుంటరితన ముడిపి బుద్ధి చెప్పెను. కందిమల్లయ్యపల్లిలో ఊరిబయల నాశ్రమము నెలకొల్పి అధ్యాత్మవిద్యోపాసనా నిమగ్ను డయ్యెను. ఇది రాజయోగము.

ముడుమాలనుండి సిద్ధప్ప యను మహమ్మదీయ బాలుఁడు కన్నవారిని విడనాడి గురుదేవు నన్వేషించుకొనుచు కందిమల్లయ్యపల్లి వచ్చెను. పోతులూరయ్య వాని కాశ్రయ మియ్యరాదనెను గురుదేవుఁ డాశ్రయ మిచ్చెను. సిద్ధుని తలితండ్రులగు ఆదంబీపీరుసాహెబు లాత్మజు నన్వేషించుచు ఆర్తులై వచ్చిరి. గురుదేవుడు చెప్పినను సిద్ధుఁడు కన్నవారి వెంటఁబో నిచ్చగింప లేదు.

సతీసుతాంతేవాసులకు గురుదేవు డధ్యాత్మతత్త్వోపదేశము చేయుచుండెను. తనువు నందె దేవత లున్నా రని షట్చక్రస్వరూపము వివరించు

చుండెను సరిగ నదేవేళకు శక్తి కొలువులకు చందా తెమ్మని కక్కడను వెట్టి వానిని గ్రామాధికారి గురుదేవు నొద్దకు పంపెను, కక్కడు వచ్చిన పని మఱచి, గురుదేవుని షట్చక్రస్వరూపనిరూపణమున సొంతము వినక తనువున నున్న దేవతలను తాను కనువాడై గబగబ యింటికి పరువెత్తెను కత్తి దూసి, యిల్లాలి గర్భ ముత్తరించి, అందు దేవతలను కానక. క్రుద్ధుఁడై "ఎందఱి కొంప లార్చెద" వని అంగలార్చుచు నెత్తురుగుడ్డలతో కత్తి చేబూని గురుదేవు నాశ్రమమునకు బయలుదేరెను. గురుదేవు డావేళకు గ్రామాధికారుల కచేరిలో నిలిచి, శక్తి కొలువులకై జంతుబలులు కూడ దని వారి నొప్పించుటకై శక్తిని రప్పించి మహిమ చూపవలసెను, గ్రామాధికారులు వెలివాడకు పోవలదని విన్నవించినను కక్కని యిల్లాలిని బ్రతికించుటకై గురుదేవుడు సంతోషముతో వెలివాడకు పోయెను

మహమ్మదీయుఁ డగు సిద్ధుఁడు హైందవుఁ డగు గురుదేవుని శిష్యుఁడైనాఁడని కడపనవాబు సిద్ధుని తన కొలువునకు రప్పించి వానిని శిక్షించుటకై నల్లఱాతిగుం డొకటి సిద్ధము చేసెను. సిద్ధుని భక్తిమహిమచే ఱాతి గుండు చిద్రుపలై పోయెను. శిష్యుఁడే ఇంతటి చిచ్చురపిడుగైన గురు విం కెంతటి గడుసరియో నవాబునకు చూడ బుద్ధి పుట్టెను.

ఒక శుభముహూర్తమున -సంచారసన్నాహ మొనర్చ మని గురుదేవుడు సిద్ధునకు ముదల వెట్టెను-ఇది సిద్ధయోగము.

సశిష్యముగా గురుదేవుడు బనగానపల్లె వేంచేసెను. అచ్చటి నవాబు గురుదేవుని మతసహనము పరీక్షించుటకై వస్త్రము గప్పిన మాంసపువంటకములు తెప్పించెను గురుని మహిమచే నవి ఫలావళు లయ్యెను. అల్పబుద్ధుల కిట్టి మహిమల వల్ల గాని మనసు మాఱదు. కనుకనే గురుదేవుడు వీనిని ప్రదర్శింప వలసెను. కడపనవాబు నొద్దను నిట్టి మహిమనే చూపవలసెను. స్వామి పుష్పగిర్యగ్రహార మేగెను. మ్లేచ్ఛుఁ డగు సిద్ధునిచే మంత్రోచ్చారణాదులు చేయించెనను కోపముతో అగ్రహారికులు స్వామి శకటముపై ఱాలు రువ్విరి. వారి అకృత్యమే అగ్నిజ్వాలయై అగ్రహారము నాహుతి కావించెను. స్వామిశక్తి అప్పటికి గాని వారి కెఱుకపడలేదు. దండములు పెట్టి దండకము లల్లి స్వామిని సంస్తుతించిరి. నంద్యాలలో శిల్పిబ్రహ్మలకు సైత మిట్లే బుద్ధి గఱపి వారి మూర్ఖత యుడుపవలసెను స్వామి కర్నూలు, హైదరాబాదు మొదలగు తావుల కేగి పలువురిచే వెల్లగొడుగులు పట్టించుకొని ఛత్రయోగముతో విల్లు చేరెను, కంది మల్లయపల్లె మఠమునకు గోవిందయ్య నధిపతిని గావించి తాను అంతర్ముఖుఁడు కాఁదొడఁగెను.—ఇది ఛత్రయోగము

వసంతము చివుళ్ళు తొడిగెను. శుకాలాపము శ్రావ్య మయ్యెను. జీవ సమాధి కాఁదలఁచిన స్వామి సంకల్పము సర్వుల కెఱుఁగ నయ్యెను. సతీసుత శిష్యవర్గము లుమ్మలించిరి. యథోచితముగ గురుదేవుఁడు వారి నోదార్చెను. సమాధికార్యసన్నాహము లిమ్ముగ నూర్చెను స్వామి సంకల్ప మేమో కాని, సిద్ధుని జేరఁబిలిచి పూజకై పూలు తెమ్మని సమీపారణ్యమున కనిపెను. పూలు దొరకక పోగా పెద్ద గాలివాన. సిద్ధుఁడు చెక్కు చెదరక పూలు సంపాదించి మరోన్ముఖుఁ డయ్యెను త్రోవలో నంతకుముందు లేని పెద్ద సెలయేఱు సిద్ధునకు విషయ మవ గత మయ్యెను. నోరార బ్రహ్మమును కీర్తించి ఈవలి యొడ్డునఁబడెను. కాని అప్పటికే స్వామి సమాధిగతుఁ డయ్యెను. సిద్ధుఁడు రోదించి ప్రాణత్యాగసంసిద్ధుఁ డయ్యెను స్వామి సమాధి తలుపు లూడిపడెను. 'ఆగు మాగు' మను శాంతి వాక్యము వినఁబడెను. కర్ణరసాయన మైన గురుదేవుని కంఠధ్వని సిద్ధునిలో జీవ కళలు నింపెను. గురుశిష్యు లభిన్ను లని చెప్పి గురుదేవుఁడు శిష్యునకును రాజయోగమే శరణ్య మని యుపదేశించెను. స్వామి శాశ్వతజీవసమాధినిష్ఠుఁ డయ్యెను — ఇది సమాధియోగము.

## ఆశ్వాస విభాగము

ఈ కావ్యములో ఆశ్వాసవిభాగము చేయుట యందు 'ఆశ్వాస' శబ్దమునకు బదులుగా 'యోగశబ్ద' ముపయుక్త మైనది: ఇది చాల యుక్తముగా నున్నది. యోగిజీవితమునకు సంబంధించిన కావ్యకథ యోగములుగా విభజింపఁబడుట ఉచితమే కదా! యోగవిభాగముచే మఱొక నిగూఢభావము సైతము సూచిత మగు చున్నది. అర్జునవిషాదయోగము-మొదలుగా మోక్షయోగము వఱకుఁగల భగవద్గీతాగ్రంథవిభాగములు యోగములు గానే విభజింపఁబడెను. ఈకావ్యమున కర్మజ్ఞానాదియోగవిషయములలో గీతాతత్త్వము సైతము భావిత మైన దని దీనిచే ప్రౌఢముగ సూచిత మగును. కావ్యాలంకారశాస్త్రాదిగ్రంథములలో ఆశ్వాస ములకు సమానార్థకముగా ప్రయుక్త మగు సర్గ, విలాస, విన్యాస, సోద్ఘాత, తానసాది శబ్దముల కంటె 'యోగ' శబ్దమే ఇచ్చట మిక్కిలి సమంజసముగ నున్నది యోగ శబ్దమునకుఁగల ప్రాప్తిప్రయత్నధ్యానాద్యనేకార్థములు సుసంగతము లగుచున్నవి.

## కథలో మార్పులు; చేర్పులు

బ్రహ్మంగారి కథకు సంబంధించిన పెక్కు గ్రంథము లందును, పరం పరగా పురాణధోరణిలో వినఁబడు విశేషము లందును సుసంగతములు గాని అంశము లనేకములు కనిపించును. ఈ యంశము లన్నింటికి నేకసూత్రత

కల్గించి, పూర్వాపరముల కౌచిత్యము కల్పించి వస్త్వైక్యము సాధించుట కావ్యమున" హాణికి సరిక్రొత్త విభూష "కావింపఁదలఁచిన కవి చేయవలసిన పని. ఈదృష్టి కవికి స్పష్టముగా కల దనుట క్రిందిది పద్యమే నిదర్శనము.

"చిరవిఖ్యాతము లైన తత్కథల నౌచిత్యంబు మై వ్యత్యయాం
తరపూర్వాపరముల్ పరస్పరవిరోధంబుల్ నిరోధించుచున్
సరసాంతర్ముఖకావ్యదృష్టినిఁ బరిష్కారంబుఁ గావింతు నే
ర్పరు లెల్లం దిలకించి నా కృషికి హర్షంబున్ బ్రవర్షింపఁగన్."

పీఠిక - 16

ఈ లక్ష్యము నీకవి యెంతవఱకు సాధింపఁగలిగెనో పరిశీలింపవలయును,

1. "కాలజ్ఞా"నాదులలో భూదేవి పాపభారము మోయలేక విష్ణువుతో మొఱవెట్టుకొనినట్లును, ఆ మొఱాలించియే విష్ణువు 'బ్రహ్మంగారు'గను, శంకరుఁడానందభైరవయోగిగను, బ్రహ్మదేవుఁ డన్నాజయ్యగను భూలోకమున కవతరించినట్లును గలదు. ఈ కావ్యములో నివి పరిహరింపఁబడి పాత్రనిరూపణాదులలో నాయా దివ్యత్వవిశేషములుమాత్రము గడుసుగా సూచింపఁబడినవి. ఇది సముచితము.

2. పూర్వగ్రంథములలో ప్రకృతాంబాపరిపూర్ణాచార్యులు గతించిన పిమ్మట వీరప్పయ్య కొన్నాళ్ళు 'అత్రి' యను నాతని యింటఁ బెరిగినట్లు కలదు. ఈకావ్యమున అత్రిపాత్రము పరిహరింపఁబడినది. నేరుగా ప్రకృతాంబయే వీరప్పయ్యను పాపమాంబావి భోజయాచార్యుల కొప్పగించినట్లు ఇందు గలదు. అత్రిపాత్రప్రయోజన మత్యల్ప మగుటచే కవి యట్లు చేసె ననవచ్చును.

3. పూర్వగ్రంథములలో వీరభద్రుని వృత్తాంతము అచ్చమాంబ దగ్గఱ వీరప్పయ్య పసులకాపరిగా చేరిన పిమ్మట ప్రసక్త మగును. ఈకవి వీరభద్ర వృత్తాంతము దీనికి ముందు ప్రవర్తింపఁజేసి పూర్వాపరములు చక్కఁగా నదికెను. వీరభద్రవిగ్రహము నిర్మించి దానికి ప్రాణము పోయఁగా కొన్ని వింత లుప్పతిల్లుట -పిమ్మట ఆవీరభద్రుని గూర్చియే వీరప్పయ్య తప మొనర్చి తత్ప్రసాదము వడయుట -అటుపిమ్మట ఆ వీరభద్రుఁడే రాజయోగి కడుపున పోతులూరయ్యగా ప్రభవించుటయు జరిగినది. పోతులూరిపాత్రలో వీరభద్రు నంశము గల దనుటకు సూచనగా వానిని మిక్కిలి కోపస్వభావునిగను, పరమ లోకజ్ఞునిగను, తుదకు వివేక ముదయించిన వానిగను చిత్రించుట మెచ్చఁదగి యున్నది.

4. వెనుకటి కథలలో వీరప్పయ్య పెండ్లి సంబంధమున కేగునపుడు చలిదియన్నపుమూటలు కట్టుకొని బయలుదేరుట మొదలగు నంశములు గలవు. బ్రహ్మేంద్రు నొక నైష్ఠికసుందరునిగా చిత్రింపఁదలఁచిన కవి చలిది మూటలు జాఱవిడుచుట చాల సహజము స్వామి మనసులో గోవిందమ్మ కనిపించుట, గోవిందమ్మ కలలో స్వామి పాదసూపుట మొదలగు నలౌకికాంశములు వారి దివ్యాంశములకు సూచకములుగా నుండి మిక్కిలి రమణీయము లగుచున్నవి.

5. వెనుకటివానిలో కక్కని కథకు, పోలేరు కథకు, గ్రామాధికారుల కథలకు సన్నిహితసంబంధము కనిపింపదు. ఇం దది సముచితముగ సాధింపఁబడినది. సత్ప్రబంధము శిథిలబంధము కారాదు గదా! శక్తి కొలుపులకై బ్రహ్మము నొద్ద చందా తెమ్మని గ్రామాధికారి వెట్టియగు కక్కని పంపుట వాఁడు వచ్చిన పని మఱచి వినునంత లోకోత్తరముగా గురుదేవుడు షట్చక్రదేవతావిశేషములు వివరించుట, ఆ పిమ్మట గ్రామాధికారులను ప్రబోధించుటకై బ్రహ్మము కచేరికి పోయి శక్తిచే మహిమ ప్రదర్శింపజేసి జంతుబలి నివారించుట. అచ్చటినుండియే వెలివాడకు కక్కని వెంటఁపోయి వాని యిల్లాలిని బ్రదికించుట మొదలగు సన్నివేశము లన్నియు నొకదానితో నొకటి విడదియరానంత చిక్కగా నల్లఁబడినవి.

6. కావ్యములో మొత్తము మీద నుపాఖ్యానములకు ప్రధానకథకు అంగాంగిభావము కల్పించుటకై కవి ఎంతో ప్రయత్నించెను. వీరభద్రప్రభావము సిద్ధుని పూర్వజన్మవృత్తాంతము, ద్విజకుష్ఠవ్యాధినివారణము, ఆ ద్విజు నాహ్వానము పురస్కరించుకొనియే స్వామి పుష్పగిర్యగ్రహారమునకు రాఁదలఁచుట, బ్రహ్మరాక్షసి నిబంధనము. జగ్గయార్యునకు సంతానభిక్ష, తస్కరపరాజయము మున్నుగా సర్వాంశములను బ్రహ్మేంద్రుని చరిత్ర మను పట్టు వలిపెములో పడుగుపేకలుగా నల్లుకొని ఔచితీభాసురము లైనవి. బ్రహ్మేంద్రుఁడు ప్రదర్శించిన మహిమలకును ప్రయోజనౌచిత్యము సూచింపఁబడుట గుర్తింపఁదగినది.

7. బ్రహ్మంగారికి ఈశ్వరమ్మ యను నొక మనుమరాలు గలదు ఈమె గోవిందయ్య కుమార్తె. ఈమె బ్రహ్మంగారి జీవసమాధికి ముందు జన్మించెనా ? పిమ్మట జన్మించెనా ? యను విషయమున అభిప్రాయభేదము గలదు. బ్రహ్మంగారి చరిత్ర రచించిన పలువురు బ్రహ్మంగారు జీవసమాధి పొందిన పిమ్మటనే ఈశ్వరమ్మ జన్మించినట్లు వ్రాసిరి, కాని యక్షగానరచయిత యగు శ్రీకడియాల వీపూరయాచార్యులుగారును 'మన గురుదేవుఁ' డను గ్రంథము రచించిన శ్రీకొండూరి వీరరాఘవాచార్యులుగారును బ్రహ్మముగారు సమాధిగతుఁ డగు నాఁటికే ఈశ్వరమ్మ జన్మించియున్నట్లు అభిప్రాయపడిరి ఈశ్వరమ్మ జన్మించిన

12సంవత్సరములకు బ్రహ్మంగారు సమాధి యైనట్లు శ్రీరాఘవాచార్యులవారి అభిప్రాయము. (భారతి - 1952 డిసెంబరు).

శ్రీనాగేశ్వరరావుగారు పైరెండు మతములలో మొదటిమతమే యనుసరించిరి. నిజమునకు ఈశ్వరమ్మ, బ్రహ్మముగారి పిమ్మట అంతటి మహానుభావురాలుగ ప్రశస్తి పొందినది. బ్రహ్మచారిణియై నిండు తొంబదియేండ్లు జీవించి, పరమబ్రహ్మవాదినియై, తాతగారికి వలె తానును దేశీయ మగు చిక్కని తెనుగులో తత్త్వవేదాంతగీతము లల్లి అశేషప్రజలను ప్రబోధించి పరమేశ్వరి అపరావతార మని ప్రశంస లందుకొన్న మహానుభావు రాలీమె. ఇట్టి ఈమెను కావ్యములో ప్రవేశపెట్టిన పిమ్మట ఆపాత్రమునకు న్యాయము చేకూర్చు ప్రయత్నము చేయవలెను. బ్రహ్మముపాత్ర తీర్చిదిద్దుట కెంత ప్రయత్న మవసరమో ఈమె పాత్ర చిత్రణమున కంతకంటె ఎక్కువ ప్రయత్న మావశ్యక మగును. కారణ మేమనఁగా ప్రౌఢపాత్రను దిద్దితీర్చుటలో నున్న సౌకర్యము బాలపాత్రమును దిద్దితీర్చుటలో నుండదు రచనాసౌకర్యము మాట యటుంచి పలువురు రచయితలు ఈశ్వరమ్మ బ్రహ్మము సమాధికి తరువాతనే జన్మించిన దని వ్రాయుటయే శ్రీనాగేశ్వరరావుగారికి అనుసరణీయ మయ్యెను. అయిన నిది కావ్యముగనుకను, బ్రహ్మము అనాగతవేది యను సౌకర్య మున్నది గనుకను కవి ఈశ్వరమ్మ ప్రసక్తి నిపుణముగాఁదెచ్చి ఆమె మహత్తు ప్రౌఢముగా సూచించెను.

బ్రహ్మము సమాధిగతుఁ డగుటకు ముందు గోవిందయ్య నోదార్చుచు పలికిన ఈక్రింది మాట కావ్యదృష్టితో చాల సముచితముగ నున్నది.

**"నాకుఁ బ్రియమును గూర్చు నందనుఁడ వయ్యు**
**ఈశ్వరికి జన్మదాతవై యెసక మెసఁగు**
**నీదు భాగ్యంబు వర్ణింప నాదిశేషుఁ**
**డైన శక్తుండు గాఁడేరఁ డది నిజంబు"** (5-25)

8. బ్రహ్మముగారు కాలజ్ఞానములో తాను తిరిగి 'వీరభోగవసంత రాయఁడై' జన్మింతు నని చెప్పిన ముచ్చట యొకఁడు గలదు. అట్లయిన 'ఆ వీర భోగవసంతరాయఁ డేడి ?' యను ప్రశ్న పుట్టును. ఈప్రశ్నకు తావులేకుండ శ్రీనాగేశ్వరరావుగారు బ్రహ్మముగారిచే "దేశం బెట్టకేని వీరభోగవసంతాధీనం బగు(1-182)నని శ్లేషార్థముతో గడుసుగాఁ జెప్పించిరి. దీనిచే భవిష్యత్కాలము వీరులకు, భోగులకు, వసంతర్తుశోభకు వశ మగునను అర్థమును ఉపపన్న మగును. ఇది చాల రమ్యముగా నున్నది.

ఇట్టి కావ్యములో 'చిరవిఖ్యాతము' లయిన పెక్కు కథలలో పూర్వాపర విరోధములు నిరోధించి సరసాంతర్మ్ముఖకావ్యదృష్టితో ఔచితీపరిపోషణ మొనరించుట స్పష్టమగుచున్నది.

## పాత్రౌచిత్యము : నాటకీయత

ఈ కావ్యమున బ్రహ్మంగారు మొదలుకొని బనగానపల్లెనవాబు వఱకు దాదాపు ఇరువదియైదు పాత్రములు కలవు, ప్రాధాన్యవివక్ష చేతను, కథాప్రసక్తి చేతను బ్రహ్మము, గోవిందమ్మ, గోవిందయ్య, పోతులూరయ్య, సిద్ధయ్యపాత్రలు ప్రధానము లనిపించినను కవి మాత్ర మేచిన్నిపాత్రను నిర్లక్ష్యము చేయలేదు. అల్పాక్షరములలో ననల్పార్థము నిక్షేపించు శక్తి ఈయనకుఁ గలదు. సిద్ధుని తలిదండ్రు లగు ఆదంబీపీరుసాహెబులను పరిచయ మొనర్చినతీరు చూడుఁడు.

**"ముడుమాల పేరి పుర మొ**
**క్కఁడు ఖాసిలు; నందు నీతిఘనుఁ, డాదంబీ**
**విడువాలుఁగంటి కొలువఁగ**
**నడిచప్పుడు లేక పీరుసాహెబుఁ డుండున్."** (3-3)

ధర్మదృష్టి కలిగి, నిరాడంబరులై గుట్టు చక్కఁగ కాపుర మొనర్చు, సాహెబుదంపతుల అన్యోన్యము నెంత గుట్టుచక్కగా చిత్రించినాఁ డీకవి! 'ఆదంబీనిడువాలుఁగంటి' యను సమాసపుకూర్పు కైవాడము తిరిగిన కవికిఁగాని సాధ్యము కాదు. మహమ్మదీయమతాచారవిశేషములను వర్ణించుపట్టుల వారి సంప్రదాయములకు వెలిగాని యనేకాంశములు వివరించుట కవికిఁ గల జాగరూకతకును లోకజ్ఞతకును నిదర్శనము (3-6)

పోతులూరయ్య జన్మముచే వీరభద్రు నంశము గలవాఁ డని చెప్పఁబడినను ప్రవృత్తిబలముచే కాబోలు వానికి బుద్ధిపరిపాకము చాలలేదు. ఈపాత్రను సంస్కరించుటకు కవి చాల ప్రయత్నించెను. ఈప్రయత్న మందే పోతులూరయ్య లోకజ్ఞత మెఱపు మెఱసినట్లు ప్రకాశించినది. సిద్ధుఁ డాశ్రయమియ్యఁదగనివాఁ డని వాదించుచు పోతులూరయ్య చేసిన ప్రసంగము ప్రౌఢిని స్పృశించుచున్నది. ఈతమ్ముని మాటల ప్రౌఢికి, అన్న గోవిందయ్య చేసిన శ్లేషార్థద్యోతకశబ్దవిన్యాసము చప్పిడి దైపోయినది (3-31, 37&35) బ్రహ్మేంద్రుని తత్త్వోపదేశసందర్భము నందును పోతులూరయ్య వేసిన ప్రశ్న సంసారమున కొట్టుమిట్టాడు సర్వజీవకోటి వేయఁదగిన ప్రశ్న.—

"రాగవతీదృగంచలధరస్మితముల్ వలవేసి క్రిందికిన్
భాగవతప్రబోధితసుభాషితముల్ పయి కీడ్చుచుండఁగా
రాగవిరాగశూన్యశిఖరంబులపై విహరించుటెట్లు? నీ
తో గిరవాట్లు వేసి తులఁదూగఁగ లేము; రహస్య మేమొకో!" 3-106

పోతులూరయ్య నోట వెడలిన సారభూతము లగు నీవాక్కులు విని పితృపాదుఁడు 'ఒరఁగంట దరహాసమరీచిక పుక్కిలించినాఁ' డంట. (3-107) సంసారి యగు యాతనాజీవినిర్వేద మంతయు నీపద్యమున పోతులూరయ్య వివరించినాఁడు. ఇంతటి ఆత్మవిచారము కలవాఁడు గనుకనే తొలుదొల్త అహంభావియై వర్తించినను కట్టకడపట పరమపశ్చాత్తప్తుఁ డయ్యెను. సమాధి కేగు తండ్రితో పోతులూరు పలికిన మాటలు హృదయవిద్రావకములుగ నున్నవి. "భవబంధమోక్షవిద్యాగరిమంబు నారయని వ్యర్థుని నాగతి యేమి తండ్రి!" అని నిర్వేదించినాడు "దుర్యోగవశంబునం గడు నయోమయ చిత్తుఁడ నైతి" నని శోకించినాఁడు. ఈశోకసంతాపములచేతనే పోతులూరు, గోవిందయ్యకంటె మనకు మిక్కిలి సన్నిహితుఁ డగుచున్నాఁడు. పోతులూరి పాత్రపై గురుదేవుని వ్యాఖ్య ఎంత గడుసుగా నున్నదో చూడుఁడు!

"పాకము మూఁగకాఁక నలుపాయ వడెన్ వగవంగఁ దప్పునే!" (5-28)
"కమనీయంబౌ చెట్టున పుట్టిన మాత్రన
పట్టునె చవి అపరిపక్వఫలమున కోయీ!" (5-33)

ఈమాట కర్థము 'తన యంతవాని కడుపున పుట్టి నంతమాత్రమున పోతులూరయ్య గొప్పవాఁడు కాలేఁ'డని కాదు. 'వీరభద్రు నంశమున జన్మించి నంతమాత్రమున అతఁడు వివేకశాలి కాలేఁడు?' అని అభిప్రాయము. ఇది సుదూరముపోయి స్పృశించు భావము.

ఇచ్చట నొక్కమాట చెప్పవలెను. పోతులూరయ్య పాత్రకు సంబంధించి పరంపరాగతముగా వినవచ్చు కొన్ని తొందరపాటుపనులు వెనుకటి గ్రంథములలో గలవు.

బ్రహ్మేంద్రుఁడు జీవసమాధి యగుటకు ముందు గోవిందమ్మతో "నీవు పసుపుకుంకుమలు విసర్జింప నక్కఱలే" దని చెప్పెను. జీవసమాధి కనుక ఆమె అట్లే చేసెను. కాని లోకు లామె నాడిపోయఁదొడఁగిరి. పోతులూ రది భరింపలేక తల్లిని తూలనాడెను. 'నీతండ్రి జీవించియే యున్నాఁ' డని యామె యెంత చెప్పినను వినక పోతులూరుతండ్రి సమాధి బ్రద్దలు గొట్టెను. తండ్రి కనులు

విచ్చి చూడక పోఁగా, నతఁ డాయన గడ్డము పట్టి యూఁచి రభస మొనర్చెను. గురుదేవు డప్పుడు యోగముద్ర వీడి, కనులు విచ్చి, కనికరము విడిచి, కొడుకును దారుణముగ శపించి, తిరిగి సమాధినిష్ఠుఁ డయ్యెను" బీభత్సహేతు వైన ఈకథ నము లోకసహజ మనిపించినను కవి ఉద్దేశించిన పోతులూరి పాత్రము తీరు తెన్నులే మాఱిపోవు ప్రమాదము కలదు. శ్రీనాగేశ్వరరావుగారు గురుదేవుని సమాధినిష్ఠకు భంగపాటొదవింపని పోతులూరయ్యనే గ్రహించి నిర్వేదసుందరు నిగ వానిని చిత్రించుట శాంతరస పోషణకు సముచితమే యనిపించుచున్నది. పైకథనము సత్యసన్నిహితమే యయినను, అట్టిదానిని సైతము మార్పుచేసి పాత్రల తీఱుతీయములు మలఁచుటలో కవి కొంత స్వాతంత్ర్యము వహింప వచ్చుననియే నా అభిప్రాయము.

గోవిందయ్య తల్లిదండ్రుల సద్గుణములు పుణికపుచ్చుకొన్న సౌజన్య మూర్తి యైనను పోతులూరయ్య ముందు తాత్కాలికముగ గోవిందయ్య తేలిపోవు చున్నట్లు కనిపించును. అంతఃసంఘర్షణ గల పాత్ర లాకర్షించినంతగా అన్య పాత్ర లాకర్షించుట కష్టముగదా! ఏమైనను గురుదేవు డన్నట్లు గోవిందయ్య ఈశ్వరమ్మ వంటి మహాయోగినికిని, పరమబ్రహ్మవాదినికిని తండ్రి కాఁదగిన యోగ్యుఁడు. (5-23, 25)

గోవిందమ్మ శుద్ధసాత్త్వికమూర్తిని కవి మిగుల రమ్యముగ నావిష్క రించెను వీరబ్రహ్మము నందామె నెక్కుడుగా నాకర్షించిన గుణము వాని "కాల జ్ఞాననిష్ణాతృత" యను విద్యావిశేషము. దీనికిఁ దోడు వానియందు కొలువై యున్న "శాంతశృంగారవిశదవేదాంతకళలు" బ్రహ్మేంద్రుఁ డామెతో నెఱపిన శృంగార మభివర్ణించుటలో కవి అసిధారావ్రతము పాటించెను. ఎక్కడికక్కడ కలమునకు కళ్ళెము వేసి నడపవలసెను. లేకున్న బ్రహ్మేంద్రు 'రాజయోగము' గోవిందమ్మ వలన పరపూర్ణ మగు టెట్లు ?

బ్రహ్మేంద్రు పాత్రములో బాలయోగమునుండి సమాధియోగము వఱకు కవి యొక క్రమవికాసమును చూపెను. ఈవికాసము బ్రహ్మేంద్రునిలోని అహంభావము క్రమముగా కరగుట వలన స్పష్ట మగును. సమాదియోగములో ఆయన పోతులూరయ్య నుద్దేశించి "ఇట్టి యహంభావము మై గట్టెక్కనె యెవ్వఁ డైన ? (5-33)అనుటలో నిది స్పష్ట మగును.

తత్త్వదృష్టితోఁ జూచువానికి భారతకావ్యములో నరనారాయణపాత్ర ములు రెండే ప్రధానము లగునట్లు ఈకావ్యము నందును సిద్ధబ్రహ్మేంద్రపాత్ర ములు రెండే ప్రధానములుగాఁ దోఁచును. గురుశిష్యు లభిన్నులను భావమును ప్రతిపాదించుచు కథాంతమున బ్రహ్మేంద్రుఁడు సిద్ధునితో "నీకుం దెల్పితి నెల్ల

ధర్మములు, నానీ భేదమే లేదు" (3-151)అని చెప్పుటచే బ్రహ్మేంద్రు నద్వైత భావన స్పష్ట మగుచున్నది. సిద్ధుఁడు సర్వభక్తకోటికి సంకేతమై బ్రహ్మైక్య భావనకు అలంబన మగు చున్నాఁడు "నానీ భేదమే లేదు" అనుటలో ఉపాస కోపాస్యభేదము నశించిన శుద్ధభక్తిలక్షణము సంభావిత మైనది.

భక్తులయెడ బ్రహ్మేంద్రుని కరుణ యెట్టిదో స్పష్టము సేయుటకై కవి, తొలుదొల్త సిద్ధుని బ్రహ్మేంద్రు నొద్ద ప్రవేశపెట్టుట యందే ఉపమాసామగ్రి నెట్లు పొందుపఱిచెనో చూడుఁడు !

**ఆశ్రమంబున కొలు వున్నయట్టి గురుని**
**చరణపీఠి సమీపించి శరణ మనుచు**
**వ్రాలె సిద్ధుఁడు శిబిమ్రోల వ్రాలినట్టి**
**పావురము వోలెఁ; నక్కఁ జంపడెను కొలువు. (3-13)**

ఉపమానబలము చేతనే గురుదేవుని ధర్మదయాశీలములు ప్రవ్యక్తము లగుచున్నవి ప్రౌఢ మగు నిట్టి యుపమానములు కావ్యమున కుదాత్తత సిద్ధింపఁ జేయును.

సిద్ధబ్రహ్మేంద్రుల భావనాపరంపర బాల్యమునుండి తత్త్వాన్వేషణ తత్పరములుగా నున్నట్లు కవి చిత్రించుట శ్లాఘాపాత్రము.

సిద్ధుఁడు చిన్ననాఁడే "నాకును మీకు నేనాఁటి సంబంధంబు లని మిత్ర సంతతి నడుగుచుండు" నఁట(3-9) వీరప్పయ్య తపస్సుకై అడవులకుఁ బోనెంచి తల్లి నడుగ నామె యేడ్చెను దాని కాతఁడు "ఎవ్వరి కేడ్తువీవు జననీ జగ మంతయు నేడ్పుగొట్టుదే ? పువ్వులు పూచునప్పట ప్రమోదము లుండవు రాలి పోవుచోన్" (1-56) అని యోదార్చెను.

బ్రహ్మేంద్రుని తత్త్వోపదేశము లోని ప్రసన్నతామాధుర్యము లనితర సాధారణములు. వానికి ముగ్ధుఁడు కాని జీవి యుండఁడు. కక్కని వంటి ప్రాకృతుఁడు సైతము ఆపలుకులకు సమ్మోహితుఁడై పోయి భార్య కడుపు చీల్చి చూడవలసెను. బ్రహ్మేంద్రుని వాక్కున కాశక్తి కలదు.

**"వావిరి నూర్ధ్వారోహణ**
**భావికి నుపయోగిపట్టభంగము లయ్యె**
**దేవతలు వొలచు చక్రము**
**లీ వెలుగుమ జ్ఞానదృష్టి నిష్ఠావాప్తిన్ (3-136)**

'ఈభాష కక్కని కర్థమయ్యెనా ?' అని ప్రశ్నించు వా రుండవచ్చును. బ్రహ్మేంద్రు డిది కక్కని నుద్దేశించి చెప్పినది కాదు. సతీసుతాంతేవాసులకు చెప్పినది. వారి కిది అవగత మగు భాషయే. మఱి కక్కఁడు "ఓహో తనువున దేవతలు గలరె తత్త్వద్విధముల్ విను భాగ్య మబ్బె"నని యెగిరి గంతువేసినాఁడే?" వాని కర్థము గాకున్న నాయానంద మెట్లు గలుగును ? ఇది శ్రవ్యకావ్యము గనుక బ్రహ్మేంద్రుని వాచికమే వినిపించుచున్నది. కథలో కక్కఁడు బ్రహ్మేంద్రుని వాచికముతో పాటు ఆంగికసాత్త్వికములు సైతము దర్శించి యుండుటచే వాని కందలి భావ మిట్టె బోధపడి యుండును, బ్రహ్మేంద్ర చరిత్రములో కక్కని పాత్రప్రసక్త మగునది కొలఁదిసేపే యైనను పఠితృమాన సములో శాశ్వతముద్ర వేయగల పాత్రములలో నిది ప్రథమగణ్యము. వెనుక నెప్పుడో 'రాజయోగి' యను నాటకములో నొక కళారసికుఁడు—శ్రీగోనుగుంట రామయ్యగారీ కక్కని పాత్ర మభినయింపఁగా చూచితిని; ముత్పులక లుద యించినవి. నేఁడీకావ్యములో తిరిగి అట్టి అనుభూతి నందఁగలిగితిని. ఇట్టి అనుభూతి కావ్య మందలి నాటకీయత వలన కలుగుచున్నది. కావ్యములో అలఁతి అలఁతి పాత్రములకును ఆయువు పోసి ప్రాణకళతో వాని నాడించుట సత్కవుల సొత్తు. దాని నీ వాగేశ్వరరాయకవి గుత్త గొన్నాఁడు.

## శబ్దసౌభాగ్యము : అర్థగాంభీర్యము

'కావ్యేందిరకు శబ్దార్థములు శరీరము; అలంక్రియావితానము సొమ్ములు; జీవము మాత్రము ధ్వని' (కావ్యాలంకారసంగ్రహము 2-53) సంస్కృతములో కావ్యప్రబంధములు సమానార్థకములే. తెనుఁగున భారతాది కావ్యముల కంటె మనుచరిత్రాదిప్రబంధములు భిన్నముగ నున్నవి. ప్రబంధ లక్షణము లన్నిటి నిట నుటంకించుట కంటె ఈ వీరబ్రహేంద్రచరిత్రము మను వసుచరిత్రల వంటి ప్రబంధమని చెప్పిన చాలును. ఇష్టదేవతాప్రార్థనాదికము కృతిప్రస్తావన, ధాతృప్రశంస, కృతికర్తృవంశావతారాభివర్ణనము,షష్ఠ్యంతములు, కథాప్రారంభము మున్నుగా తు.చ. తప్పక ఈ కవి రాయలనాఁటి ప్రబంధమార్గ మునే యనుసరించె ననవచ్చును. ఈయనకు చిత్రకవిత యందును అభిమా నాదరము లుండె ననుటకు ఇందలి బంధకవితామాలికయు, (5-217) కందగీత గర్భచంపకమును (5-200) నిరోష్ఠ్యమత్తేభమును (5-216) నిదర్శనములు. ఇవి యెల్ల పారిజాతాపహరణాదుల ప్రభావము కాబోలు !

కథానిబంధనము ఏకనాయకముగా సాగించినను వర్ణనల యందు అష్టాదశసంఖ్య పూరింపవలె నను నొత్తిడి లేకుండ శాంతరసప్రధానముగా కావ్య మును నడపించుటలో కవి క్రొత్త త్రోవ త్రొక్కె ననవచ్చును. వర్ణనలు సయి

తము రసోచితములై పరిమితములుగా సాఁగుట మెచ్చఁదగిన యంశము. ఈక్రింది సూర్యాస్తమయవర్ణనము చూడుఁడు.

"జర ప్రాపించి జగత్త్రియావసుఁడు సంజ్ఞానాథుఁడే కాలక
ర్మరతిం జేసి జగంబు వాసి చన నీ ఝ్మామండలిం బ్రాణు లె
ల్లరు కర్మంబునకున్ విన్రము లయి నిల్వందప్పునే యన్న త
త్త్వరహస్యంబు గ్రహించి లోకము ప్రశాంతం బయ్యె నప్పట్టునన్."
3—149

రసోచితవర్ణన మనఁగా నిట్లుండవలెను. తత్త్వకావ్యముల కత్యావశ్య మైన వర్ణనపద్ధతి యిది. నిస్తరంగక మగు శాంతరసాబ్ధిలో సంగమించు భావ ప్రవాహ మిట్లుండవలెను.

శబ్దాధికారవిషయమున నీ కవికి సంస్కృతాంధ్రములు రెంటను తుల్య సంస్కారము కలదు అవసర మగుచో అచ్చమగు జానుతెనుఁగు లోనె అమోఘ మగు ఓజస్సు సాధింపఁగలఁడు. అట్లుగాక, నిబిడవర్ణనసందర్భములో ప్రబంధ కవులు ఒక్కబిగిని జాడించి దీర్ఘసమాసము లాగివైచు ధోరణిలో పద్య మంతయు నేకసమాసముగను నడపఁగలఁడు. "కనిపించెన్వికటాట్టహాసరుచిమత్.... క్రవ్యాదభూతం బటన్" (2-118) అను పద్య మిందుకు ప్రబలనిదర్శనము. పొరచి పుట్టువులు (పీఠిక-28) మూరింబోవుటలు (2-3) జబ్బనచూఱలు (2-70) పిండలివండులు (4-110) నడికేరడములు (3-36) పుయిలోటలు (2-183) ఊడనిబాడుటలు (5-122) మొదలగు తెలుఁగు పలుకుబడు లెన్నేని చూపవచ్చును. తెనుఁగుసమాసపు కూర్పులో నీ కవికి గొప్ప యొడుపు గలదు. 'కూర్మిపాలవెన్నెల గిలిగింతలు (పీఠిక-57) చెవిచవిగానిమాటలు (4-94) ఏనుమొగాలబమ్మకులము (1-132) జగబిరుదుముండమొఱ్ఱు (4-80) ఇందు కుదాహార్యములు. నమస్య, (1-6) మత్ప్యండి (5-42) వంటి పదములు ప్రయోగించుట సులభముకాదు. వీనిని చేపట్టి పద్యములో జీర్ణింపఁజేసికొనుటకు చేవ గావలయును.

వంజెఱగు (4-152) నిక్కల (2-22) ఇఱ్ఱింకు (3-72) ముచ్చముడుగు (3-72) వంటివి ప్రయోగించుటకు శబ్దశాస్త్రవివేకము కావలయునుగదా!

మఱి, పిత్రుఁడు (1-97) కమండలము (5-106) వంటి ప్రయోగములు కవి బుద్ధిపూర్వకముగ ప్రయోగించిన వనిపించును. నిజమునకు శబ్దసుభగత్వము నర్థగాంభీర్యముతో వేఱుచేసి చూడరాదు. రమణీయార్థముచే భూషితము గాని పదజాలమునకు కావ్యములో స్థాన మెక్కడిది? 'శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ' అని పలికిన దండివాక్యమున కర్థ మదియేకదా!

ఇష్టార్థవ్యంజకశబ్దప్రయోగములో నాగేశ్వరరాయకవి సిద్ధహస్తుఁ డనుట క్రింది పద్యము పరిశీలింపవచ్చును. పోతులూరయ్య గురుదేవు నిట్లు ప్రశ్నించెను.

"కంబు గళంబు, తప్తకనకంబు శరీరము, వారిజప్రతీ
కంబు ముఖంబు, వజ్రఫలకంబు కపోల, ముదీర్ణచంచరీ
కంబు కటాక్ష, మబ్దగమకంబు కచంబు. సుధారసానుపా
కంబు రదచ్ఛదంబు —తమకంబు వహింపని చిత్త ముండునే ?
—3—104

అనుప్రాససుభగమై, 'సమతా' సుందర మైన కవితారీతి ఇట్లుండును.

కాంతాకనకములలో కాంతకుఁ గల అయస్కాంతశక్తి కనకమునకు లేదు గురుదేవు నంతికమున నాసీనుఁడై పోతులూరయ్య వేసిన ప్రశ్న ఆలోచనా రమణీయముగ నున్నది. అర్థగాంభీర్యము గల ఈక్రిందివద్యములు సహృదయు లకు చర్వణసహములుగా నుండును.

i) కాంచిన కోయిలమ్మ తన గాదిలిగ్రుడ్డు నొకళ్ళ కీయఁగా (1-45)
ii) ఈమాఘంబున నింటనింటఁ గననౌనే పెండ్లిపేరంటముల్ (2-9)
iii) అలరారెం బొరుగిండ్లు పెండ్లిపసతో నల్లుండ్రతో (2-5)
iv) పాలయల్కం గలుషించి బాల పెడమోముం బెట్టి (2-4)
v) కరులా, గుఱ్ఱములా, రథోత్కరములా, కాల్బంటులా ? మంత్రి శేఖరులా ? (3-227)

ఇందు కొన్ని ధారాశుద్ధికిని సంభాషణచమత్కృతికిని నుదాహార్యములే.

"పొట్టకు నంగలార్చుచు నభూతపుఁగూతలు గూయనేర్చి" అను పద్యము లోని (2-173) 'బట్టు' శబ్దసామర్థ్యముచే 'కళాద' శబ్దము ననుచితార్థమున ప్రయోగించి, వ్యాఖ్యానించిన కవివ్యాఖ్యాతల నేరినో ఈకవి మందలించు తీరు తోఁచుచున్నది, ఇట్లు నిగూఢరమణీయముగ భావమును ప్రపంచించుశక్తి అసాధారణము. ధ్వనికావ్యముల లక్షణ మిట్లే యుండును. కాని ప్రధానకథతో వీనికిఁ గల సంబంధమును పట్టి వీని యౌచిత్యము భాసించును. ఈకవి యిట్టి జాగరూకత సర్వత్ర చూపెను (2-152)

## సంస్కృతసూక్తులు : లోకోక్తులు

తెలుఁగు కావ్యములో సంస్కృతసూక్తులను లోకోక్తులను యథాతథముగా చెక్కుచెదరకుండ ఛందములో నొదిగించుట పద్యరచనలో చేయితిరిగిన కవు

తము రసోచితములై పరిమితములుగా సాఁగుట మెచ్చఁదగిన యంశము. ఈక్రింది సూర్యాస్తమయవర్ణనము చూడుఁడు.

"జర ప్రాపించి జగత్త్రియావనుఁడు సంజ్ఞానాథుఁడే కాలక
ర్మరతిం జేసి జగంబు వాసి చన నీ క్ష్మామండలిం బ్రాణు లె
ల్లరు కర్మంబునకున్ విసమ్రు లయి నిల్వందప్పునే యన్న త
త్త్వరహస్యంబు గ్రహించి లోకము ప్రశాంతం బయ్యె నప్పట్టునన్."

3—149

రసోచితవర్ణన మనఁగా నిట్లుండవలెను. తత్త్వకావ్యముల కత్యావశ్యమైన వర్ణనపద్ధతి యిది. నిస్తరంగక మగు శాంతరసాబ్ధిలో సంగమించు భావప్రవాహ మిట్లుండవలెను.

శబ్దాధికారవిషయమున నీ కవికి సంస్కృతాంధ్రములు రెంటను తుల్యసంస్కారము కలదు అవసర మగుచో అచ్చమగు జానుతెనుఁగు లోనె అమోఘమగు ఓజస్సు సాధింపఁగలఁడు. అట్లుగాక, నిబిడవర్ణనసందర్భములో ప్రబంధకవులు ఒక్కబిగిని జాడించి దీర్ఘసమాసము లాగివైచు ధోరణిలో పద్యమంతయు నేకసమాసముగను నడపఁగలఁడు "కనిపించెన్ వికటాట్టహాసరుచిమత్.... క్రవ్యాదభూతం బటన్" (2-118) అను పద్యమిందుకు ప్రబలనిదర్శనము. పోరచిపుట్టువులు (పీఠిక-28) మూరింబోవుటలు (2-3) జుబ్బనచూఱలు (2-70) పిండలివండులు (4-110) నడికేరడములు (3-36) పుయిలోటలు (2-183) ఊడనిబాడుటలు (5-122) మొదలగు తెలుఁగు పలుకుబడు లెన్నేని చూపవచ్చును. తెనుఁగుసమాసపు కూర్పులో నీ కవికి గొప్ప యొడుపు గలదు. 'కూర్మిపాలవెన్నెలగిలిగింతలు (పీఠిక-57) చెవిచవిగానిమాటలు (4-94) ఏనుమొగాలబమ్మకులము (1-132) జగబిరుదుముండమొల్లు (4-80) ఇందు కుదాహారణములు. నమస్య, (1-6) మత్ప్యండి (5-42) వంటి పదములు ప్రయోగించుట సులభముకాదు. వీనిని చేపట్టి పద్యములో జీర్ణింపఁజేసికొనుటకు చేవ గావలయును.

వంజెఱగు (4-152) నిక్కల (2-22) ఇఱ్ఱింకు (3-72) ముచ్చముడుగు (3-72) వంటివి ప్రయోగించుటకు శబ్దశాస్త్రవివేకము కావలయునుగదా !

మఱి, పిత్రుఁడు (1-97) కమండలము (5-106) వంటి ప్రయోగములు కవి బుద్ధిపూర్వకముగ ప్రయోగించిన వనిపించును. నిజమునకు శబ్దసుభగత్వము నర్థగాంభీర్యముతో వేఱుచేసి చూడరాదు. రమణీయార్థముచే భూషితము గాని పదజాలమునకు కావ్యములో స్థాన మెక్కడిది ? 'శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ' అని పలికిన దండివాక్యమున కర్థ మదియేకదా !

ఇష్టార్థవ్యంజకశబ్దప్రయోగములో నాగేశ్వరరాయకవి సిద్ధహస్తుఁడనుటకు క్రింది పద్యము పరిశీలింపవచ్చును. పోతులూరయ్య గురుదేవు నిట్లు ప్రశ్నించెను.

**"కంబు గళంబు, తప్తకనకంబు శరీరము, వారిజప్రతీ**
**కంబు ముఖంబు, వజ్రఫలకంబు కపోల, ముదీర్ణచంచరీ**
**కంబు కటాక్ష, మబ్దగమకంబు కచంబు. సుధారసానుపా**
**కంబు రదచ్ఛదంబు —తమకంబు వహింపని చిత్త ముండునే ?**

—3—104

అనుప్రాససుభగమై, 'సమతా' సుందరమైన కవితారీతి ఇట్లుండును.

కాంతాకనకములలో కాంతకుఁ గల అయస్కాంతశక్తి కనకమునకు లేదు గురుదేవు నంతికమున నాసీనుఁడై పోతులూరయ్య వేసిన ప్రశ్న ఆలోచనా రమణీయముగ నున్నది. అర్థగాంభీర్యము గల ఈక్రిందివద్యములు సహృదయులకు చర్వణసహములుగా నుండును.

i) కాంచిన కోయిలమ్మ తన గాదిలిగ్రుడ్డు నొకళ్ళ కీయఁగా (1-45)
ii) ఈమాఘంబున నింటనింటఁ గననౌనే పెండ్లిపేరంటముల్ (2-9)
iii) అలరారెం బొరుగిండ్లు పెండ్లిపసతో నల్లుండ్రతో (2-5)
iv) పొలయలక్కం గలుషించి బాల పెడమోముం బెట్టి (2-4)
v) కరులా, గుఱ్ఱములా, రథోత్కరములా, కాల్బంటులా ? మంత్రిశేఖరులా ? (3-227)

ఇందు కొన్ని ధారాశుద్ధికిని సంభాషణచమత్కృతికిని నుదాహార్యములే.

"పొట్టకు నంగలార్చుచు నభూతపుఁగూతలు గూయనేర్చి" అను పద్యములోని (2-173) 'బట్టు' శబ్దసామర్థ్యముచే 'కళాద' శబ్దము ననుచితార్థమున ప్రయోగించి, వ్యాఖ్యానించిన కవివ్యాఖ్యాతల నేరినో ఈకవి మందలించు తీరు తోఁచుచున్నది, ఇట్లు నిగూఢరమణీయముగ భావమును ప్రపంచించుశక్తి అసాధారణము. ధ్వనికావ్యముల లక్షణ మిట్లే యుండును. కాని ప్రధానకథతో వీనికిఁ గల సంబంధమును పట్టి వీని యౌచిత్యము భాసించును. ఈకవి యిట్టి జాగరూకత సర్వత్ర చూపెను (2-152)

## సంస్కృతసూక్తులు : లోకోక్తులు

తెలుఁగు కావ్యములో సంస్కృతసూక్తులను లోకోక్తులను యథాతథముగా చెక్కుచెదరకుండ ఛందములో నొదిగించుట పద్యరచనలో చేయితిరిగిన కవు

లకుఁ గాని సాధ్యము కాదు. ధారాశుద్ధి కొఱవడకుండ వీనిని ప్రయోగించుటలో పద్యరచనాశిల్పము భాసించును. ఈక్రింది సూక్తులు గల పద్యసందర్భములు తజ్ఞుల కానందసంధాయకములు కాగలవు.

i) పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్ (3-61)
ii) తమసోమాజ్యోతిర్గమయ (3-128)
iii) బ్రాహ్మణోస్యముఖమాసీత్ (4-100)
iv) వినాశకాలేవిపరీతబుద్ధి (4-111)
v) ఉదరనిమిత్తంబహుకృతవేషమ్ (4-168)
vi) రాజ్యాంతేనరకంధ్రువమ్ (4-197)

(ధర్మేచ-అర్థేచ-కామేచ) నాతిచరామి, తుభ్యమహంసంప్రదదే-న మమ-అనెడు వైవాహికమంత్రోక్తు లీక్రింది పద్యమున నెంత సుఖముగా నొదిగింపఁబడినవో చూడుడు.

"సుముఖాంతఃకరణంబుతో వరుఁడు నచ్చో నాగమోక్తప్రమా
ణములన్ 'నాతిచరామి' పల్కఁగను గన్యాదానముం జేసి "తు
భ్యమహం సంప్రదదే" యనున్; "న మమ" చెప్పం డా వధూదాత; రు
క్మమహీదానము నాది కా దనుకొనంగాఁ గన్నకూఁతుర్గదా!" (2-57)

గోవిందమ్మతండ్రి, ఆమెను బ్రహ్మేంద్రునకు కన్యాదాన మొనర్చుచు "తుభ్యమహం సంప్రదదే" అన్నాఁడఁట! కాని "న మమ" అనలే దఁట! "నీకొఱకు నేను కన్యను దానము చేయుచున్నా నన్నాఁడట కాని "ఈమె ఇక ముందు 'నాది కాదు' అన లేదఁట. కడుపున కన్నకూఁతురుకదా! ఇట్టి ఒక నాటితో నాది కాదని రాగబంధము త్రెంచికొనుట కిదేమి గోదానభూదానసువర్ణ దానములవంటిదా ?"-ఆగమోక్తిపై సాంఘికదృష్టితో సాఁగిన కవిగారి వ్యాఖ్యాన ధోరణి ఇది! సరసముగా నున్నది.

## లోకజ్ఞత : ఆలంకారికోక్తులు

కావ్యరచనకుఁ గడంగు కవి లోకవృత్తము కాఁచి వడపోసిన వాఁడుగా నుండవలె నన్నది ఎల్ల రంగీకరించు విషయమే. కాని తా నెఱిఁగిన లోకవృత్తమును కావ్యములో నొదిగించుటలో కవి పాటించిన కళాధర్మములు ప్రాముఖ్యము వహించును కావ్యలక్షణములను గూర్చి కవికి పెక్కు భావము లుండును. కాని వీనిని కావ్యములో యథాతథముగ చెప్పిన కావ్య మాలంకారికగ్రంథ మగును కావ్యము కాలేదు కనుక వానిని కథలో నంతర్లీనము గావించి ప్రౌఢ

ముగా సూచింపవలెను శ్రీనాగేశ్వరరాయకవి ఉపమాద్యలంకారముల నాశ్ర యించి కొంతకొంత కావ్యలక్షణపరామర్శ చేసెను.

i) శబ్దార్థముల మైత్రి సాధింపఁజాలని
కవివాచ్యుఁ డంటు వస్తువును బోలి (3-31)

ii) అతఁ డెంత కవివరుం డనికాదు; వాని కా
వ్యప్రయోజన మేమొ పలుకవలయు (3-236)

iii) అతఁ డెంత పండితుం డనికాదు; వాని పాం
డితి నైన మేలు చాటింపవలయు (2-236)

వీని నాలంకారికోక్తు లని యేల చెప్పవలసె ననఁగా ఇవి అలంకారము నాశ్రయించి కవి ఆలంకారికుని వలె చెప్పిన ఉక్తులుగా నున్నవి. వీనిని కథతో సమన్వయించుకొని చూచుటలో భావసౌందర్య మనుభూత మగును.

ఈకవి 'అల్లుని మంచితనము' నుభయకోణముల నుండి పరిశీలించెను (2–669,96) వయసుతోపాటు దంపతులకు ఎట్టి జ్ఞానవివేకము లావశ్యకములో స్పష్టీకరించెను (2-93) 'మగపొడికి కారణాంకము లయిన మగువ గుణాగుణము లను కాఁచి వడపోసెను (2-76) 'కపటకాముపిశాచి కైవసం బగునింతి మానవిత్త ముల దయనీయస్థితికి (4 34) కలఁత పడినాఁ డీకవి.

ప్రజల నేడ్పించు భూపాలుర తీరుతెన్ను లీయనకు తెలియును (3-122) వినువీధి నిప్పులు విడురుచు మాత్రాన హవ్యాయిచువ్వ బ్రహ్మోత్సవము కాలే దని (5-106) ఘంటాఘోషముగఁ జెప్పఁగలఁడు. "బలము లేకున్నను నిలబెట్టు వా రున్నచో మిన్నులు ప్రాకువా రున్నారని ఈయనకు తెలియును (3-37) లోకము తీరు ఇంకను ఇట్లున్నది "మందులో గుణ మెంతమాత్రము లేకున్న పయిపూఁత పూఁతలు మెండయినవి" (3-247) "ఆపద సూచి సంతాపంబు వెలివుచ్చ సమ యంబునకుఁ గాని సఖులు అసంఖ్యాకు లైనారు (5-95) 'తల్లిదండ్రులకు బాధ కలిగించు పుత్రులమాట (3-72) చెప్పనే అక్కఱలేదు 'పదినాళ్ళు పస్తుండి పదు నొకండవ నాఁడు పాయసంబు భుజించుటలో నెంత యానందము గలదో కొలిచి చెప్పగలఁ డీకవి (3-20) లోకము నిట్లు ఆపోఽశనము పట్టి చూడఁగల ఈకవి చెప్పన దొకే ఒక్కమాట అది యిది-

"పట్టువిడుపులు వలదె యేపనికి నైన?
లౌకిక మెఱిఁగి బ్రదుకుఁ డీలోక మందు" (4-192)

లోకవృత్తనిరూపణకై ఉపమారూపకములు, అర్థాంతరన్యాసములు యథేష్టముగా నుపయోగింపఁబడినవి ఎడనెడ ఉత్ప్రేక్షాదులును లేకపోలేదు.

ఈయన రాయలనాఁటి ప్రబంధపఙ్క్తికి పరవశు డైనవాఁ డగుటచే కాఁబోలు ఈకృతియందు యథోచితముగ శ్లేషయమకాదులును చోటు చేసికొన్నవి.

i) ప్రవిమలముల్ రసాతిమధురంబు లభీష్టఫలంబులు (పీఠిక - 63)

ii) నీవు దయాసముద్రుఁడవు నే నిహజీవననిమ్నగాకృతిన్ (3-83)

iii) గుణసముద్రులు లేరె ప్రణవనాదవినోది
సత్వజీవను లనంజనగు గాక (3-207)

ఇంతవఱకు శ్లేషము క్లేశకారణము కాదు; ఆలోచనామృతనుగ నున్నది. యమకగమకముల లోనికి జాలువాఱిన ఈక్రింది శ్లేషధోరణి పఠితృబుద్ధిని కొంత గిజగిజ లాడించును కవిత్రయభారతిలో కనరాని ధోరణి యిది.

i) గురుతరాంతరశుద్ధి గురువరాక్షరసిద్ధి
గురునిరంతరబుద్ధి గుస్తరింప (3-100)

ii) శ్రీసతీసుతసుఖశ్రీవినోదియె కాని
శ్రీసతీసుతసుఖశ్రీవిజేత (3-35)

శబ్దచమత్కృతితోఁగూడి శ్రావ్యతాపాదకము లైన ఈ సందర్భములు రసనిష్యందము లగుటకు కొంత యెడము కావలసివచ్చును.

"శ్లేషోఽక్లిష్టః' అని బాణభట్టు అక్లిష్టము లయిన శ్లేషములు సమాదరణీయము లనియే భావించెను. "శ్లేషః పుష్ణాతి సర్వాసు ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్" అన్న దండ్యాచార్యుని దృష్టిలో శ్లేషము సంభావ్యమే. కాని దుష్కరశబ్దభంగ శ్లేషయమకాదులు కవి శక్తిమంతుఁ డయ్యు ప్రయోగింపరా దనియే ఆనందవర్ధనులు భావించిరి

"యమకప్రకారాణాం విబంధనం దుష్కరశబ్దభంగశ్లేషాదీనాం
శక్తావపి ప్రమాదిత్వమితి" —ధ్వన్యాలోకము (కావ్యమాల) పుట 25

ధ్వనికారుఁ డిది శృంగారరసమును దృష్టి యందుంచుకొని చెప్పిన మాటయే యైనను శాంతాదుల కిది అంతకంటె నెక్కుడుగా నన్వయించును శాంతరసప్రధాన మగు వీరబ్రహ్మేంద్రచరిత్రములో కనవచ్చు శ్లేషయమ

యమకాదులు కేవలశబ్దభంగములు గావు; దుష్కరములును గావు, క్లిష్టములును గావు; కనుక వానిని పూర్తిగా నిరాదరింపవలసిన యావశ్యకము లేదు.

## కావ్యశైలి

సాహిత్యరచనలలో కావ్యశైలియే శైలీశిల్పమునకు పరమావధి యని భావింపవచ్చును. భావవ్యక్తీకరణమునకు సరళతాప్రసన్నతలు సర్వదా అభిలషణీయములు. అందును తత్త్వకావ్యముల కది జీవనాడి. వైయక్తికాభిరుచులు భేదింపవచ్చును. శబ్దము నతిమాత్రముగ నలంకరించినచో రసము ఘనీభవించు ప్రమాద మేర్పడఁగలదు. సర్వశబ్దములు సార్థకములై రసనిష్యందములు కావలయును. ఇది ఉత్తమకావ్యశైలి. ఇట్టి భావము లాంగ్లకావ్యశైలీపరామర్శకులును అంగీకరించినవే !

"It would seem that in literature atleast, the classic manner is the culmination of art. Precision in the wide sense, must be the highest virtue of expression; and it is this precision with perfect ease, that constitutes the classic manner".

"Individual tastes may Justly differ; but the ultimate verdict of approval will be given to that style in which there is no over colouring of Phrase, no straining of sentiment; which Knows how to be beautiful without being lavish, how to be exact without being bald; in which you never find a thicket of vague epithet".

—Winchester.

అనలంకృతము కానిది, అపరిమితాలంకృతము కానిది రసోదంచితమైనది రమణీయార్థవిభూషితమైనది అగు శబ్దమే కావ్యశైలిని నిర్ణయించును. తత్త్వరచనల విషయమునం దైనచో సరళతాప్రసన్నతలు ఆయువుపట్టు లగును. కనుకనే బుద్ధుఁడు, క్రీస్తు, వేమన, వీరబ్రహ్మేంద్రాదుల సూక్తులు సుప్రసన్నతా సుభగములై కన్పట్టును. అందు బ్రహ్మేంద్రుని తత్త్వగీతికలు రూపకాతిశయోక్తి సమన్వితములైనను అవి ప్రసన్నతాసుభగసుందరములుగ నుండును.

"మూడు కాల్వలు దాట లేరన్నా, ఈ మూఢజనులు-
మూడు కాల్వలు దాట లేరన్నా...." అను తత్త్వగీత మున్నది.

ఇచ్చట ఈషణత్రయము విషయము. ఈషణత్రయ మనఁగా ధనదారపుత్రేషణలు. అవి నిగరణము చేయఁబడినవి. విషయనిగరణముచే అతిశయోక్తి భాసించుచున్నది. స్త్రీసౌందర్యాదివర్ణనలలో చంద్రుఁ డనఁగనే ముఖము

స్ఫురించినంత సులభముగా మూఁడు కాల్వ లనఁగనే ఈషణత్రయము స్ఫురింపక పోవచ్చును. కొంత తాత్త్వికపరిభాషాజ్ఞాన మావశ్యకము కాని నిగూఢార్థబంధురము లగు తత్త్వగీతికల కిట్టి సంకేతార్థసమన్విత మైన శైలి ప్రాణతుల్యము బ్రహ్మేంద్రుని తత్త్వము లం దనేకము లీలక్షణము గలవే. ఇట్టి తత్త్వార్థములను ప్రబంధశైలికి మలచుట క్లేశముతోఁ గూడిన పని. రూపకమును విస్తరించి, భావమును ప్రపంచించినఁ గాని ప్రబంధకవి కృతకృత్యుఁడు కాలేఁడు. ఎంత చేసినను ప్రబంధశైలి ప్రబంధశైలియే!

"ఉరిత్రాడుంబురు లీషణత్రయముగా వ్యూహంబు మోహంబుగా
అరిషడ్వర్గము జాగిలంఃఖుగ మహాహంకార మస్త్రంబుగా
స్మరుఁ డన్ క్రూరకిరాతకుం దొడిచి సంసారాటవీభూమిఁ గ్రు
మ్మరు జీవుం డను లేడి నయ్యమునకుం బంపించుఁ జేకాన్కగన్." (3-114)

ప్రబంధదృష్టితోఁ జూచిన ఈశైలి ఉదాత్తరమణీయము.

బ్రహ్మముగారి కాలజ్ఞానాదితత్త్వగీతములు రాగలయాధీనములై జనపద ప్రచారమంఁదిన అచ్చపుదేశికవితానిక్షేపములు, అనుప్రాససుందరములు-చూడుఁడు

"మాయను నరికిన వాఁడు, గురురాయనితో జతగూడు"

మాయను తరింపలేని మనుజుని తత్త్వము శ్రీనాగేశ్వరరావుగారు దేశిచ్ఛంద మైన ఆటవెలదిలో అభివ్యక్తము చేయుట మెచ్చఁదగిన సంగతి.

"మొదల నేడ్చి యేడ్చి తుదిమొదల్ నిఖిలంబు
మాయ వలనఁ దగిలి మఱచిపోవు
తత్త్వ మరసి చూచి తన యే డ్పెఱుంగఁడు
పరుల కేడ్చుచుండు నరిది జనుఁడు" (1-57)

ఈ శైలికి వేమన్నశైలి వేలువిడిచిన మేనమామ! బ్రహ్మముగారి 'కాలజ్ఞాన'శైలి యింతకంటె విలక్షణము.

"హరి గోవింద గోవింద-శివ గోవింద గోవింద"

అను మకుటముతో కొన్ని గీతులు తాళలయాధీనములై తనువు మనసు రెండిటిని పరవశింపఁజేయును. ప్రబంధరచనలో అలక్షణము తేవలెనన్న త్రిస్ర చతురస్రమిశ్రగతులతో కదలిపోవు కందములను సృష్టించుట యొక పద్ధతి.

ఈకవి ఆపద్ధతినే పాటించెను. కనుక 'కాలజ్ఞాన'కందము లనేకములు తాళగతుల కొదుగుచు సాగినవి భావములు కూడ సుగమసుందరముగా నున్నవి. పదము లంతకంటె సుగమసుందరములు.

"నమ్మించి గొంతు కోయుదు
రిమ్ముగ బాధింత్రు పాప మెఱుఁగని వారిన్
దమ్మిడి కబద్ధ మాడుదు
"రమ్మా నీపుణ్య" మందు రాలికిఁ బురుషుల్" 1-181

## ఛందో (విని)యోగము

"కావ్యే రసానుసారేణ వర్ణనానుగుణేనచ
కుర్వీత సర్వవృత్తానాం వినియోగం విభాగవత్" —సువృత్తతిలకము 3-7

రసానుసారముగను వర్ణనానుగుణముగను సర్వవృత్తములు వినియోగింపఁ దగు నని క్షేమేంద్రుని భాషణము. ఈ దృష్టి తోనె తత్త్వోపదేశాదిసందర్భములలో దీర్ఘపాద రహితము లగు ఛందములను వినియోగింపఁ దగును. నిజమాడిన పురుషార్థసాధకము లగు శాస్త్రకావ్యములలో దీర్ఘవృత్తముల వలన ప్రయోజనము లేదు.

శాస్త్రకావ్యేతిదీర్ఘాణాం వృత్తానాం న ప్రయోజనమ్ — 3-8

తత్త్వప్రధానము లగు కావ్యములు శాస్త్రకావ్యతుల్యములే ఆనందవర్ధనుఁడు మహాభారతమున శాస్త్రకావ్యచ్ఛాయ గల దని పేర్కొనుట మఱవరాదు. ఇది సంస్కృతభారతమును గూర్చి చెప్పిన మాట తెనుగు కవులు ఛందోవినియోగవిషయమున క్రొత్త త్రోవ తొక్కిరి. సంస్కృతచ్ఛందములు దేశియచ్ఛందములు భిన్నములె యైనను, స్పష్ట మైనభావ భేదము సామాన్యచ్ఛందములు, విశేషచ్ఛందముల వలన తెలియుచున్నది. భావావేశవైవిధ్య మున్నచోట విశేషచ్ఛందములను వాడి ఉద్దిష్టార్థమును అభివ్యక్త మొనర్చిరి.

నాగేశ్వరరాయకవి కాలజ్ఞానతత్త్వోపదేశాదిసందర్భములలో దేశియచ్ఛందములనే ఎక్కుడుగ వినియోగించెను అందును దీర్ఘపాదరహితములగు వానినే ఎక్కువగా వినియోగించెను విశేషచ్ఛందములను మాత్రము భావావేశవైవిధ్యసూచకముగా వినియోగించుట విశేషము.

1. సిద్ధుఁడు శిల్పిబ్రహ్మలు పెట్టిన పుట్టెడన్నము పొట్టను బెట్టికొని ఎల్లరకుఁ దత్తరము పుట్ట ఆకటిపెల్లున నార్చుచు —

"ఉగ్రజ్వాలానృసింహాయుతగతి నతిభీమోద్ధతిం జూచు"ట (4-186)
స్రగ్ధరావృత్తములో వర్ణింపఁబడినది.

2. పుష్పగిర్యగ్రహారికులు బ్రహ్మేంద్రసిద్ధుల పలుకు లాలింపక క్రోధతామ్రేక్షణులై—

"గురుశిష్యుల్ వీర లౌరా కులమతములు చీకొట్టి ధర్మంబు పాటిం
పరు బ్రహ్మద్వేషదోషావలయితు లనుచుం గౌర్యభూయ స్త్వమొప్పన్"
(4-108)

పలికినపలుకులు మహాస్రగ్ధరలో నడచినవి.

3. అగ్రహారికులు బ్రహ్మేంద్రుని మహిమ తెలిసి భక్తిప్రపన్నులై

"శ్రీవీరయోగీశ్వరా ! భక్తమందార, గోవిందమాంబామనోనాథ !
సాక్షాజ్జగన్నాథ." (4-142)

యనుచు చేసిన సంప్రార్థనము దండకముగా దొరలినది.

4 కటకటపడి పూలుదెచ్చిన సిద్ధునకు కనపడకుండ గురుదేవుడు సమాధిగతుఁడు కాఁగా సిద్ధుని నిర్వేదము 'మత్తకోకిలము'లో నడచినది.
(5-198)

5. ప్రాణత్యాగమునకుఁ దలపడిన సిద్ధునకు బ్రహ్మేంద్రసాక్షాత్కారము జరుగుట 'భుజంగప్రయాతము'లో వర్ణింపబడెను (5-205)

6. సమాధిగతుఁ డగు బ్రహ్మమును గూర్చి సకలజనులు పాడిన మంగళగీతి 'మంగళమహాశ్రీ'వృత్త మైనది. (5-223)

వృత్తనామము లన్నియు సార్థకము లనుట సాహసముతోఁ గూడిన మాట. గురులఘునివేశననియమముచే సిద్ధించు గతివిశేషమే చందఃసౌందర్య నిర్ణాయకము. నాగేశ్వరరాయకవి ఇట్టి నిశ్చయము తోనె విశేషచ్ఛందములను సామాన్యచ్ఛందములను వినియోగించెను. ఛందోవినియోగము సర్వము యథాభావరసావస్థముగా సాఁగవలసినదే కదా ! ఈ సూత్రమును మన్నించియే ఈకవి ఛందో(విని)యోగము నెఱపెను.

## రసబ్రహ్మము

బ్రహ్మానందసబ్రహ్మచారి యని చెప్పఁబడిన రసానందము, బ్రహ్మమే నాయకుఁ డైన కావ్యములో సులభసాధ్య మనుకొన రాదు; గట్టిగా మాటాడిన

కష్టసాధ్య మనియే చెప్పవలెను. కారణ మేమనఁగా ఆత్మజ్ఞాననిరూపకము లయిన తత్త్వకావ్యములలో సాధారణముగా శాంతమే అంగిరస మగుచుండును. 'శాంతమును ఒక రస మగువా ?' అను ప్రశ్న మేనాఁడో పరాస్త మైనది. కాకున్న శమస్థాయిక మైన శాంతము రతిస్థాయిక మైన శృంగారము వలె సర్వోపభోగ్యము కాదు. తృష్ణాక్షయరూప మైన సుఖానుభూతి నూటికి కోటి కొక్కని కుండును. కనుక శమానుభూతి సర్వసాధారణము కానంతమాత్రమున నట్టి అనుభూతియే లేదనుట కూడదు. ఆనందవర్ధను లీదృష్టి తోనె శాంతమును వివక్షించిరి. సర్వోపభోగ్యము కాని శాంతమును నిర్వహించుట కష్టము కనుకనే 'శాంత'ప్రధాన మైన వీరబ్రహ్మేంద్రచరిత్రములో రసనిర్వహణము కష్ట మైన పని యంటిని. కష్ట మైన పని యైనను కవి ఆత్మానుభవపరిపాకము గలవాఁ డగుటచే సమర్థత తోనె రసనిర్వహణ మొనర్పఁగలిగెను.

శాంతమున కాలంబనము పరమాత్మస్వరూపము గాని, ప్రపంచ నిస్సారత గాని యగును. రాజయోగ మవలంబించిన బ్రహ్మేంద్రుఁడు గార్హస్థ్యము తిరస్కరింపలేదు. ప్రపంచ మసారమనియు చెప్పలేదు. పయిగా ప్రపంచము నందుండియే సారతమ మైన ఆత్మతత్త్వము దర్శింప నగు నని చాటి చెప్పెను. ఈకారణముచే ఈకావ్యమున పరమాత్మస్వరూపమే ఆలంబనము.

బ్రహ్మేంద్రుఁడు వైరాగ్యము పూని సన్యసించిన వాఁడు కాఁడు కనుక వైరాగ్య మిం దుద్దీపనము కానేరదు. ఆశయశుద్ధిమూలక మైన తత్త్వజ్ఞానమే ఉద్దీపనము. పుణ్యాశ్రమములు, మఠములు, క్షేత్రములు, వనములు, సత్పురుష సమాగమములు మొదలగు నవియు ఉద్దీపనములే. కావ్యములో వీనికి పరమ ప్రాధాన్య మియ్యఁబడెను గదా! భూతదయ, యమనియమధ్యానధారణోపాస నాదులు శాంతమున కనుభావములు. శక్తి కొలుపులలో జంతుబలులు కూడని పను లని చెప్పియొప్పించుట, పాతంజలయోగశాస్త్రానుసారముగ అష్టాంగయోగ మవలంబించుట మొదలయిన వానిచే శాంతమున కనుభావములు సిద్ధించినవి.

గురుబంధువియోగాదులచే నిర్వేద ముదయించును సమాధిగతు డగు గురుదేవుని కొఱకు సిద్ధుఁడు పొందిన నిర్వేదము సహృదయచిత్తమున ఉత్కట మైన నిర్వేద ముదయింపఁజేయును. గురుసాక్షాత్కారాది సన్నివేశములలో సహృదయుఁడు హర్షస్మరణధైర్యాదులతో స్తంభరోమాంచాదు లనుభవించును. ఇట్టి సంచారిభావములు గురుదేవుఁడు మహిమలు చూపి ఆపన్నివారణము గావించు ననేకసన్నివేశము లందును కలుగును. గురుదేవుని జీవితములో సర్వాశ్రమశౌచ మను లక్షణముకూడ సహృదయహృదయమున సంచారిభావమై

పురస్కారతిరస్కారము లందుచు తుదకు తత్త్వజ్ఞానరూప మైన 'శమము'గా స్థాయిత్వ మందును.

సుదూర మాలోచించిన ఆత్మసాక్షాత్కారము కాని దశకును, ఆత్మ సాక్షాత్కార మగు దశకును —ఉభయసాధారణ మయిన శమమే రసత్వ మందును. తృష్ణాక్షయముచే లభించు సుఖము, లోక మందలి కామసుఖముల కంటెను స్వర్గ మందలి దివ్యసుఖముల కంటెను ఎన్నో మడుగులు గొప్పది. కనుకనే తృష్ణాక్షయసుఖము పరమసుఖ మని ఆనందవర్ధను లభిభాషించిరి. ఇట్టి పరమసుఖమునకు తత్త్వజ్ఞానమే సుగమమార్గము. ఇందు సర్వలౌకిక ప్రవృత్తులు నిరహంకారత్వ మంద వలసినదే అట్టి దశలో ధర్మదయావీరాదులు సయితము శాంతములో సుఖముగా నంతర్భవించును.

ఈ కావ్యమునకు 'బ్రహ్మంగారిచరిత్ర' మని పేరు పెట్టిన చాలును. కాని కవి 'వీరబ్రహ్మేంద్రచరిత్ర' మని పేరు పెట్టెను. ఇట్లు పేరు పెట్టుటచే ధర్మదయావీరాదు లంతర్భవించిన శాంతమూర్తి యగు రాజయోగిలక్షణస్ఫూర్తి కలుగుచున్నది.

శాంతమున కధిదైవతము నారాయణుఁడు. ప్రస్తుత కావ్యమునకు నాయకుఁడు వీరనారాయణుఁడు. శాంతమున కాలంబనము పరమాత్మస్వరూపము. ఆ పరమాత్మ ఎవ్వరో కాదు. 'నేనే' యని వీరనారాయణుఁడు ఘంటాఘోషము చెప్పెను. ఇది అద్వైతభావనారహస్యము. 'అయమాత్మాబ్రహ్మ' 'ప్రజ్ఞానం బ్రహ్మ', 'అహం బ్రహ్మాస్మి' అను నీ మహావాక్యములను సంపుటీకరించి బ్రహ్మేంద్రుఁడు తేటతెలుగులో— "నేనే బ్రహ్మమురా, పామరులారా, నేనే బ్రహ్మమురా" అని సుగమసుందరముగ నొడివెను. ఈకారణముచే పరమాత్మ స్వరూప మాలంబన మైన శాంతమునకు కావ్యనాయకుఁ డగు బ్రహ్మమే ఆలంబన మగుచున్నాఁడు. సహృదయున కానందసిద్ధి దీనిచే సుగమ మైనది.

ఇట్టి ఆనందవిషయమున కేవలశాంతముతో తనివినొందని బ్రహ్మగ మియగు ఆలంకారికు డొకఁడు శాంతములో అవాంతరభేదములు భావించి, శాంత రస మనియు బ్రహరస మనియు ద్వివిధశాంతములు పేర్కొనెను. అతఁ డెవరో కాదు. సంగీతసుధాకరకర్త యగు హరిపాలుఁడు. అతని దృష్టిలో "శాంతరస మనిత్యము, అస్థిరము నిర్వేదస్థాయిక మగు శాంతము మోక్షసాధకము కాలేదు. మోక్షసాధక మైన దొక్క బ్రహ్మరసమే. అదియే నిత్యము; స్థిరము"

"బ్రహ్మోనామ రస స్సర్వప్రపంచో త్తీర్ణ రూపకః
నిత్యస్థిరోఽత ఏవాయం సార్థక్యేవ ప్రకీర్తితః"

హరిపాలుని బ్రహ్మరసావేశము మెచ్చఁదగినదే. బ్రహ్మరసము సైతము శాంతరసభేదమే కనుక బ్రహ్మరస మనఁగా శాంతరసమె యని మనము భావించు కొందము.

బ్రహ్మరసావిష్టుఁడై సిద్ధుఁడు కావ్యాంతమునఁ జేసిన "బ్రహ్మస్తవము" బ్రహ్మభావనకు పరకాష్ఠ సహృదయ హృదయములో శాంతమునకు రసనిష్ఠ.

"కోలం ద్రిప్పుచు నాల మేపుచు వనిన్ గోపాలబాలుండుగా
లీలల్ సూపుచునుండి భావితరముల్ మేల్కొఁగఁ దొల్కొడియై
కాలజ్ఞానము గల్గఁజేసి వెలుగుల్ కల్పించినాఁ డెవ్వఁ డా
బాలబ్రహ్మమహోదయంబు హృదయాబ్జాతంబు బోధించుతన్" (5-127)

ఈపద్యము మొదలుగా నీక్రింది పద్యము వఱకుఁ గల పద్యపంచకము బ్రహ్మేంద్రసాక్షాత్కారపరాయణములు—

రారాజన్నిజనిర్మలాశయముతో రంజించి లోకంబు సం
సారాబ్ధిం దరియించి బ్రహ్మరథసంచారక్రమోద్భాసిమ
ద్రారూఢిన్ సశరీరశాశ్వతపరబ్రహ్మంబునై యొప్పు శ్రీ
వీరబ్రహ్మసమాధిసన్నిధిసమావేశంబు నా కబ్బుతన్ (5-131)

నిజమే! బ్రహ్మము నందు రమించు చిత్తమునకు ఆనందములో కొఱత యేముండును? ఆదిశంకరు లూరక చెప్పినారా?

"యోగరతో వా భోగరతో వా సంగరతో వా సంగవిహీనః
యస్యబ్రహ్మణిరమతే చిత్తం నందతి నందతి నందత్యేవ"

## బ్రహ్మోపదేశము

బ్రహ్మేంద్రు నుపదేశము రెండు విధములుగా భావింపఁ దగియున్నది ఒకటి లౌకికదృష్టితోఁ జేయఁబడినది ఇంకొకటి అలౌకికదృష్టితోఁ జేయఁబడి నది. ఈరెండు విధము లగు నుపదేశములకును సమన్వయము కూడ సాధింపఁ బడినది ఏ యుపదేశమైనను చేసి చూపినవాఁడే కాని చెప్పిచూపిన వాఁడు కాఁడు.

చిన్ననాఁట పసులకాపరితన మాయన కోరి వరించిన వృత్తి పాపంబనే కాక అచ్చమాంబను కూడ 'అమ్మా' యని పిలిచెను (1-186) గోమాతృపూజ అవశ్యాచరణీయ మని చెప్పిన ట్లైనది. వీరభద్రునిమూర్తి శిలపై చెక్కి జీవము పోసి విడిచెను. శిల్పాదిపంచవృత్తులు ప్రాణకళ లవి చెప్పిన ట్లైనది. కుల

వృత్తుల మాన్యత స్పష్ట మైనది. మూర్త్యారాధన మాననీయ మనియు తెల్ల మైనది సిద్ధుని చేరదీసెను; కక్కని గారవించెను. భగవంతుని సృష్టిలో మ్లేచ్ఛుఁ డనఁ బడువాఁడు లేఁడు; అస్పృశ్యుఁ డనఁబడువాడు అంతకంటె లేఁడు. ఊరివాఁడకు వెలివాడకు భేద మక్కఱలేదు. వేదాధ్యయనమంత్రోచ్చారణాదుల విషయమున స్త్రీశూద్రద్విజాదుల కెల్లరికిని సమానాధికారము గలదు. మొదలు శూద్రత్వ మనున దెచ్చటిది ?

"అజ్ఞానమె శూద్రత్వము
సుజ్ఞానమె బ్రాహ్మణత్వశోభన్మము గదా ।
ప్రజ్ఞాచక్షువు లగు మీ
రజ్ఞానపునూతఁ బడుట లరయమి గాదే ?"  (4-104)

శక్తి కొలువుల పేరితో అమాయికజంతువులను బలి చేయుటకంటె అజ్ఞాన మేమున్నది ? అహింస కంటె పరమధర్మ మింకొకఁడు లేదు. దేశకాల పాత్రముల కతీతమై నిలుచు సత్యమే సర్వదా అనుసరణీయము.

"దేశకాలపాత్రముల కతీత మగుచు
నిలుచు సత్యంబ అనుసరణీయ మెపుడు:
ప్రాక్తనం బని చెడుగు చేపట్ట రాదు:
కాలదోషంబు లేదు సత్కార్యమునకు"  (3-153)

భాషాసారస్వతముల దృష్టితో చూచిన బ్రహ్మేంద్రసాహిత్యము నాఁటికి పరమనవీనము. సాంఘికముగ ఆయన చేసిన సంస్కరణ , మెట్టిదో సారస్వత విషయకముగ చేసిన సంస్కరణమును అట్టిదే తాను చెప్పిన తత్త్వగీత మెల్ల గుండెలు దూసికొనిపోవు కండగల కమ్మని తెనుఁగులో చెప్పెను అ తెనుఁగు వ్యావహారిక మైన జానుతెనుగు భావము నిగూఢ మైనను భాష సరసము, కోమలము. యోగవేదాంతవిషయములను కూడ సుగమసుందర మైన భాషలో చెప్పఁగలిగెను. ఈదృష్టితో బ్రహ్మేంద్రసాహిత్యము ప్రత్యేకముగ పరిశోధింపఁ దగినది.

"మూడారు వాకిళ్ల మూయవలె నన్నా"

మూఁడారు వాకిళ్ళనఁగా శరీర మందలి నవరంధ్రాలు. వానిని మూసి మనస్సును ప్రాణముతో లయింపఁజేయఁగా సిద్ధించు నానందము యోగి యగు వాని కనుభవైకవేద్యము.

"మనఃప్రాణలయే కశ్చిదానందః సంప్రవర్ధతే"

అని కదా శాస్త్రము! బ్రహ్మేంద్రుఁడు శాస్త్రము నాచరించి సొంత మాటలతో రమ్యముగా చెప్పఁగల దిట్ట. ఆచెప్పుటలో సాహిత్యశిల్పము కొఱవడదు.

"మేడమీదకు చేరవలెను, అచట
జోడు పాయక హంస గూడగా వలెను"

ఎక్కడి ది అందాలమేడ? అచ్చట నడయాడు ఆ రాజహంస లక్షణ మేమో! భాష సుందరముగా నున్నను భావము జనులకు బోధపడదేమో యను భావము బ్రహ్మేంద్రునకు లేకపోలేదు. కనుకనే మఱికొంచెము తెనుఁగు చేసి చెప్పినాఁడు. తెనుఁగు చేయుట యనఁగా ఆయన దృష్టిలో సంస్కృతసిద్ధ మైన యోగవేదాంత పరిభాషలో చెప్పుట. పైభావము నెట్లు విశదీకరించెనో చూడుఁడు.

"అవిరళయోగం బందిన వారికి
ఆఱిటి మీదనె చిద్రూపం"

అఖండయోగ సమాధిలో ఆధారాది షట్చక్రములను దాటిన గాని ఏడవ దగు సహస్రారము గోచరింపదు. సాధకునకు చిత్కళాసందర్శన మచ్చుటనే కదా! మేడ మీదకు చేరవలె ననఁగా సహస్రార మందు కొనుటయే. అచట హంసతో జతగూడుట యనఁగా చిత్కళాసందర్శన మొనర్చుటయే. ఎంత నిగూఢరమణీయ మగు మర్మమార్గమున (Mystic way) కవితాసృష్టి యొనర్చినాఁడు బ్రహ్మేంద్రుఁడు!

శ్రీ నాగేశ్వరరావుగారు, యోగవేదాంతవిషయము లింత నిగూఢమర్మ ధోరణిలో చెప్పరాదను భావముతో సాధ్య మైనంతవఱకు వాచ్యముగనే చెప్పి వైచిరి. అసలే అది వేదాంతము; దానికి మఱికొంత మర్మధోరణి తోడైన విషయము గహన మగునేమో యని వారి భయము కాబోలు! కనుక స్పష్ట ధోరణి నవలంబించిరి చూడుఁడు.

"బ్రహ్మరంధ్రం బనఁగ సహస్రార మొప్పుఁ
బ్రణవముం గూడి బుద్ధి కావాస మగుచు;
సచ్చిదానందమయ గురుస్థాన మదియ;
అచట చేరంగఁగనుటె బ్రహ్మానుభవము (3—140)

బ్రహ్మేంద్రుని రాజయోగము లౌకికాలౌకిక శక్తులు రెండిటిని సమన్వయించు కొన్న సమరసయోగము. కర్మజ్ఞానములు యోగరూపమున నందు సంయోగ

మొందినవి. రక్తిముక్తుల కది రమ్య మగు కూడలి. రాజయోగ మనునది మహర్షులు ఏండ్ల తరబడిగా అంతర్ముఖులై అవలోకించి అందుకొన్న ఆత్మ ఫలము. మతసూత్రము లాలంబనముగా సాధించిన యోగశాస్త్రఫలము రాజయోగము వివేకానందుని మాటలలో చెప్పవలె నన్న రాజయోగము యొక్క ఉదాత్తత ఇట్లుండును.

**"For thousands of years such Phenomena have been studied, investigated and generalised, the whole ground of the religious faculties of man has been analysed and the Practical result is the sceince of Rajayoga."**

ఇట్టి మహాశాస్త్రమును ఆచరణపూర్వకముగా అంతేవాసులకు అఖిల జనులకు బోధపఱిచిన ప్రజ్ఞాశాలి బ్రహ్మేంద్రుఁడు.

బ్రహ్మేంద్రుని శాస్త్రసాధనలలో చిన్ననాఁడే అలవఱుచుకొన్న 'కాలజ్ఞాన' మొక ముఖ్యాంశము. 'కాలజ్ఞాన మనునది లోకజ్ఞానమునకు ఆత్మజ్ఞానము జతచేర్చి, జ్యోతిశ్శాస్త్రబలముతో అనాగతవిషయము లరయు నొక మహాశాస్త్ర మనుకొందును. కాలము దైవస్వరూపము కాలజ్ఞాన మనఁగా దైవజ్ఞానము. దైవజ్ఞుఁ డనఁగా జ్యౌతిషికుఁ డనునది ప్రసిద్ధార్థమే కదా! ఇట్టి యొక శాస్త్రమును బ్రహ్మేంద్రుఁడు బాలయోగిగా నున్నప్పుడే సాధించెనన్నది గుర్తింపఁ దగిన యంశము.

బ్రహ్మేంద్రుఁడు ప్రదర్శించిన పెక్కు మహిమ లున్నవి. వీని మాట యేమి? నాదృష్టిలో నివి ప్రదర్శనము కొఱకుఁ జేయఁబడిన వీధివిద్యలు కావు. అణిమాదిసిద్ధులు యోగశాస్త్రములో చెప్పఁబడినవే, ఇవి ఓషధుల వలన కొందఱికి, మంత్రముల వలన కొందఱికి, తపస్సమాధులచే మఱికొందఱికి, జన్మసిద్ధములై ఒకకొందఱికి సాధ్యము లగుచుండును. బ్రహ్మేంద్రున కలవడిన సిద్ధులు జన్మసిద్ధము లనిపించును. వాని కొఱకాతఁడు తపస్సమాధులు వెచ్చింపలేదు. మూర్ఖలోకమునకు మంచిమాటలు పనిచేయవు. మహిమల కిట్టి జనులు మతులు మార్చుకొందురు. దొంగలున్నారు; దొరలున్నారు- రాక్షసు లున్నారు; బ్రహ్మరాక్షసు లున్నారు- వీరు మహిమలకు లొంగినట్లు మాటలకు లొంగుదురా? బ్రహ్మేంద్రుని మహిమ లన్నియు ఆధివ్యాధు లడంచి ఆపదలు నివారించుటకే కాని ఆత్మప్రజ్ఞ ప్రదర్శించుట కొఱకైనవి కావు. క్రీస్తుదేవుఁడు కుష్ఠవ్యాధి నివారించినాఁ డనుట, ఆదిశంకరులు పరకాయప్రవేశ మొనర్చినాఁ డనుట వట్టి కట్టుకథ లనఁజాలము. అందాక యెందుకు? అందఱు చూచు చుండఁగనే చేయిచాచి వలసిన వస్తువు లందుకొనఁగల స్వాములు నేఁడు మన

కట్టెదుట కనఁబడుచుండిరికదా! నరే మహిమ లున్నవా లేవా అనునది కాదు ప్రశ్నము. అవి సద్వినియోగము చేయఁబడెనా? దుర్వినియోగము చేయఁబడెనా అనునదిప్రశ్నము బ్రహ్మేంద్రుని మహిమలు నూటికి నూఱుపాళ్ళు సద్వినియోగమైనవే. కనుకనే లోకు లాయనను "జేజినాయన" యని భక్తిప్రేమములతో పిలుచుకొనిరి

శ్రీనాగేశ్వరరావుగారు 'జేజినాయన' అవతారప్రయోజనము నెంత జాగరూకముగ నిక్షేపించిరో చూడుఁడు

"హిందూమునల్మాను లేకీభవించుట
మే లని సిద్దుని నేలినాఁడొ
అస్పృశ్యతాజాడ్య మంతరింపంజేయఁ
దలఁచి కక్కని వీపు దట్టినాఁడొ
ప్రజ కహింసావ్రత రాజంబు బోధింప
నెంచి జంతుబలి వారించినాఁడొ
గోమాత నెలయించు గుణము పెంపొందింప
నచ్చమాంబిక యాల నరసినాఁడొ
భుక్తిముక్తులకు నమోఘకర్మజ్ఞాన
యోగములను జూప సాఁగినాఁడొ
అనుచు నఖిలజనము లైదంయుగీనావ
తారపురుషు నిన్నుఁ దలఁచుచుంద్రు." (4-12)

ఈ దృష్టితోఁ జూచిన బ్రహ్మేంద్రుఁడు వట్టి వేదాంతిగా కన్పట్టఁడు. కడవండ్లు వాపి లోకులను గట్టెక్కింపఁ దలపెట్టిన దయాశాలి యనిపించును. ఆయన నేలవిడిచి సాము చేయలేదు. అలిని కాదని అడవులు పట్టి పోలేదు. మన్ను కాదని మింటి కెగఁబ్రాకలేదు. జనపదము విడిచి పరమపదమున కెగఁబడలేదు. రాగ మందే యోగము. సంగము నందే నిస్సంగము సాధించుచు నేలకు నింగికి నిచ్చెన వేయుటకు ప్రయత్నించెను. లౌకికాలౌకికకూలంకష యైన జీవనదిపై యోగసేతువు నిర్మించి లోకుల నవ్వలియొడ్డు చేర్పింపఁ దలపెట్టిన రాజయోగి వీరబ్రహ్మేంద్రుఁడు!

అట్టి మహనీయుని జీవితచరిత్ర ప్రౌఢప్రబంధముగ నిబంధించి ఆంధ్రుల కొక బృహత్కావ్య మందించిన శ్రీనాగేశ్వరరావుగారిని హృదయపూర్వకముగ నభినందించుచున్నాను.

"ఈశ్వరు నంశ మందు జనియించి, కృతార్థ మొనర్చి లోకమున్,
శాశ్వతకీర్తికాంతి వెదచల్లిన చల్లనివాని రాజయో
గీశ్వరు చిత్సుధామధురవృత్తము వస్తువు: పూనపాటినా
గేశ్వరరావు కర్త; బళిరే, సరిక్రొత్త విభూష వాణికిన్ ।"     —పీఠిక-13

కవి తొలుదొల్త సుంత సోత్కర్షగా చెప్పికొన్నాఁ డనిపించిన ఈపద్య మిపు డెంతయు ఔచితీశోభితమై సహజసుందరముగా భాసించుట లేదా ?

మాచెర్ల
19-3-1973

(సం) వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావు
ఆంధ్రశాఖాధ్యక్షుఁడు: ప్రభుత్వకళాశాల.

—౦—

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము - పీఠిక



### బాలయోగము



## ద్వితీయాశ్వాసము - రాజయోగము

## తృతీయాశ్వాసము - సిద్ధయోగము



## చతుర్థాశ్వాసము - ఛత్రయోగము



## పంచమాశ్వాసము - సమాధియోగము

శ్రీరస్తు

శ్రీ లక్ష్మీగణపతిస్వామినే నమః

# శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్రము

## ప్రథమాశ్వాసము

### పీఠిక

#### ఇష్టదేవతాప్రార్థనాదికము

కం॥ శ్రీమద్వేంకటనరసాం
బామాన్యబ్రహ్మయార్యమంగళమూర్తుల్
నా మది నిల్పి కృతిప్రస
వామోదాంజలి ఘటింతు నభివాదంబుల్ 1

ఉ॥ శ్రీగురురాజమౌళిఁ బ్రియశిష్యమనస్సరసీజహేళి నా
నాగమధర్మవేద మహితాద్భుతకార్యవినోది నాగతా
నాగతసూక్తిభోగి సుజనస్తుతిభాజనరాజయోగి సు
స్వాగత మిచ్చి వేఁడెదను బ్రహ్మము బ్రహ్మపదార్థవాంఛతోన్ 2

మ॥ అతిలోకం బగు పుణ్యవర్తనముతో నత్యంతసంతుష్టిగాఁ
బతిచిత్తంబు వశీకరించి పరతత్త్వజ్ఞాననిధ్యానదీ
పితరేఖం బ్రదిజగంబు లోఁగొనిన గోవిందాంబ సర్థింతు నం
చితభక్తిప్రతిపత్తు లాత్మ నొలయన్ శ్రేయఃఫలప్రాప్తికిన్ 3

కం॥ గురుచరణారాధనత
త్పరు లగు గోవిందయాదితనయుల నఖిలే
శ్వరి యగు నీశ్వరిఁ దలఁతుం
బరమార్థము వలని ప్రజ్ఞ భాసించుటకున్ 4

ఉ॥ శ్రద్ధయు భక్తియుం గడుఁ దిరంబుగఁ బాదుకొనంగ నాత్మలో
నిద్ధచరిత్రుఁ డైన గురుఁడే సకలం బని నమ్మి జ్ఞానసం
సిద్ధినిఁ గాంచినట్టి గుణసిద్ధుని సిద్ధుని సుప్రసిద్ధునిన్
బుద్ధిఁ దలంతు నెప్పుడు నపూర్వసుఖాస్పదభావశుద్ధికిన్ 5

కం॥ ప్రత్యూహతిమిరభాస్కరు
నృత్యచమత్కారు శ్రీగణేశ్వరుఁ గొలుతున్
గృత్యాది నఖిలవిద్యా
ప్రత్యయసహకారు సుకవివరమందారున్ 6

గీ॥ సకలశబ్దాధిరూపమై సుకవిజనుల
మానసంబుల నెలకొని మధురవాక్సు
ధారసంబులు వెదఁజల్లు శారదాంబ
కృప దలిర్పంగ నన్నుఁ బల్కించుఁ గాక! 7

సీ॥ అమరుకకవి ముక్తకము లక్ష్యమై నిల్చుఁ
గాళిదాసాదుల కావ్యచర్చ
నలరుచుండు నథర్వణాచార్యు రచనలు
నన్నయప్రభృతుల వెన్నుఁ దగిలి
రామలింగని కృతుల్ రాలుగాయలు వోలె
నిల రామకృష్ణు మోసలను నిలుచు
భువనవిజయసభాభవనంబు నం దొప్పుఁ
గవిరుద్రుఁ డష్టదిగ్గజము లందు

సీ॥ గీ॥ నింతకంటెను వలసిన దేమి నాకు?
వారు వీరును లసదలంకారభరిత
కావ్యశిల్పులు గావునఁ గయి మొగుడ్తు
సంస్కృతాంధ్రవచోమృతాస్వాదబుద్ధి 8

వ॥ అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిజనాభివందనంబును గావించి
యే నొక్కనాఁ డాత్మగతంబు నందు— 9

కృతిప్రస్తావన

సీ॥ శ్రీ'విశ్వకర్మతారావళి' వ్రాసితి
భక్తిప్రవిష్టభావంబు తోడ
వివిధభావావేశవివృతిఁ గూర్చితి 'నవ
ఖండాలు' నవఖండమండితంబు
'శిల్పసుందరి' రచించితి శిల్పసంబంధి
కృతు లగ్రతాంబూల మిచ్చుకొనఁగఁ
బలికితి 'నాదర్శపద్మిని' కావ్యంబు
నొచితి మెయిఁ జరిత్రాత్మకంబు

గీ॥ నైనయేని మహాకావ్యసూనశోభ
నెనసి భాసింప కుండిన దింతదనుక
మామకానూనకవితాలతామతల్లి
యనుచుఁ దలపోసి పూనితి నందులకును 10

కం॥ భావస్వప్నము నందుఁ గ
భావస్తువు నరయు పట్లఁ దటుకునఁ దోఁచెన్
శ్రీవీరబ్రహ్మేంద్రుని
జీవితచరితంబు శుభవిశేషం బదియా ! 11

కం॥ బ్రహ్మమయుఁ డైన వీర
బ్రహ్మము నాయందు నున్న వాఁ డట! శబ్ద
బ్రహ్మోపాసన మిది యట!
బ్రహ్మానందానుభూతి ఫల మట తగదే! 12

ఉ॥ ఈశ్వరు వంశ మందు జనియించి కృతార్థ మొనర్చి లోకమున్
శాశ్వత కీర్తి కాంతి వెదఁజల్లిన చల్లని వాని రాజయో
గీశ్వరు చిత్సుధామధురవృత్తము వస్తువు ప్రాసపాటి నా
గేశ్వరరావు కర్త బళిరే! సరిక్రొత్త విభూష వాణికిన్! ౧

మ॥ వెలయించెం గడియాలవంశకరుఁ డా వీపూరయార్యుండు రా
గలయాధీనము యక్షగానము సుధాకందంబు, కందార్థముల్
వలికెన్ శ్రీశివరామయోగి, యితరుల్ వ్రాక్రుచ్చి రాఖ్యాయికా
దు, లపూర్వం బగు పద్యకావ్య మొనరింతున్ నేను దద్భక్తితోన్

శా॥ శ్రేయోదాయకుఁ డైన శ్రీగురునకున్ జేయొగ్గి చెల్లింపఁగా
నాయం దన్యపదార్థ మేమియును గానన్ బద్యముక్తామణుల్
వేయున్నాటపదార్లు పైకొసరు లర్పింతున్ జిరాయుస్సుఖ
శ్రీయోగైకనిధానసంతతులు నా చిత్తంబునం గోరుచున్ 15

మ॥ చిరవిఖ్యాతము లైన తత్కథల నౌచిత్యంబు పై వ్యత్యయాం
తరపూర్వాపరముల్ పరస్పరవిరోధంబుల్ నిరోధించుచున్
సరసాంతర్ముఖకావ్యదృష్టినిఁ బరిష్కారంబుఁ గావింతు నే
ర్పరు లెల్లం దిలకించి నా కృషికి హర్షంబున్ బ్రవర్షింపఁగన్ 16

గీ॥ సంస్కృతాంధ్రాంగ్లహిందీప్రశస్తసరస
కావ్యవీథీవిహారభాగ్యముఁ జేసి
నాఁటి యీనాఁటి శుభలక్షణంబు లెఱిఁగి
రచన సాగింతు ద్వివిధమిశ్రంబు గాఁగ 17

సీ॥ శ్రవణీయ మగు శబ్దసంస్కారమే గాక
యర్థానుగమనంబు నాదరించి
స్మరణీయ మగు కథాసంవిధానమె గాక
పాత్రౌచితీప్రగల్భత నెఱింగి
కమనీయ మగు నలంకార శోభయె గాక
యుక్తంబు లైన లోకోక్తు లరసి
రమణీయ మగు రసప్రాచుర్యమే గాక
యుపదేశయుతముగా నుద్ధరించి

గీ॥ తగిన రీతిని పాకపద్ధతు లమర్చి
వీరయోగీంద్రతత్త్వసుధారసంబు
కావ్యచషకంబు వం దిడి కలయఁ ద్రిప్పి
చవుల నూరిపింతు మఱపింతుఁ జపలురుచులు!

మ॥ విలసద్యోగ మదృష్టమూలము విరాడ్విఖ్యాతనానావిధో
జ్జ్వలశాఖారమణీయవృత్త ముపసేవానమ్రసిద్ధేంద్రహృ
త్కలికానందము సర్వకాలఫలితాంతస్సార మమ్లానభా
వలతాంతం బగు బ్రహ్మకల్ప మిది సంప్రార్థ్యంబు లోకాళికిన్ 19

వ॥ అని నిశ్చయించి తదీయనిర్మాణంబునకుం గడంగితి నప్పుడు—20

దాతృప్రశంస

సీ॥ నా శిల్పసుందరి నాశీర్వదించి మే
కా రంగ యుప్రావు గారవంబు
నమరించి నట్టి విద్యారణ్యుఁ డెట్లోజు
మాధవాచార్యుండు 'మఘువ'సుకవి

ననుఁ బ్రోత్సహించి పంచిన నాంధ్రసాహిత్య
పరిషత్సహాయసంపదకుఁ గాఁగ
నా గుణగ్రాహులు నలరి మత్కృతివతం
సమునకు వేయి నిష్కంబు లిడిరి ;

గీ॥ గురుని చరితంబు పండితపరిషదగ్ర
గణ్యగణ్య మయ్యె నటన్న గణుతిఁ గంటిఁ ;
గాళిదాసుని మెచ్చింపఁ గలిగి నపుడు
భోజు నాస్థానగౌరవంబునకుఁ గొఱయె ? 21

వ॥ అది యట్లుండె నంతట —— 22

శా॥ భద్రాచార్యతనూభవుండు కనకాంబాప్రాణనాథుం డిలన్
మాద్రిం గానని పుణ్యమూర్తి యగు రామబ్రహ్మ మిష్టార్థిక
ల్పద్రుమశ్రీ విలసిల్లుఁ దత్సుతఫలంబై యొప్పు విజ్ఞాన సం
పద్రూపం బవు సుబ్బరా వభినవస్వారాజ్యదేవేజ్యుఁడై 23

సీ॥ విశ్వకర్మాన్వయావిర్భూతికిఁ దగంగ
వాస్తువిద్యాపట్టభద్రుఁ డయ్యె
వాస్తువిద్యాపట్టభద్రతకుఁ దగంగ
స్వచ్ఛందజీవనోపాధి యయ్యె
స్వచ్ఛందజీవనవ్యావృత్తికిఁ దగంగ
ద్రవ్యంబు లార్జించె ధర్మసరణి
ద్రవ్యార్జనమునకుఁ దగఁగ నిష్టార్థులఁ
దనిపెఁ బుణ్యనిదానదానధార

గీ॥ నతఁడు సామాన్యుఁడే! సుధీనుతచరిత్రుఁ
డిందుశిశిరహృదంతరుఁ డిద్ధయశుఁడు
పండితారాధ్యవైభవాఖండలుండు
నల్లపాట్యన్వయకరుండు నయధనుండు. 24

సీ॥ చూచెనా! వెన్నెలసోగలై చూపులు
నిండారి చల్లని నీడ లిచ్చు.
చేచెనా! సురతరుశాఖలై కరములు
కామితార్థంబులు కనికరించుఁ
బలికెనా! కప్రంపుఁబలుకులై పలుకులు
విజ్ఞానవీథికి వెలుఁగు లిచ్చుఁ
జలికెనా! యమృతంపుఁజినుకులై నగవులు
చిద్విలాసంబులు చిలుకరించు
గీ॥ నాథునికవేమభావ లాధ్యాత్మికాధి
కరణపరిణతచిత్తసంస్కారపటిమ
రాశి గొనియున్న శ్రీసుబ్బరావు నన్ను
నాదరంబునఁ జూచుచు ననియె నిట్లు 25

మ॥ ఘనసాంసారికజీవయాత్ర నగు మార్గశ్రాంతిఁ దీర్పంగ సా
ధనమై యూఱటఁ గూర్చుచుండు నది కాంతాసమ్మితంబై తన
ర్చిన కావ్యం బుపదేశసంయుతముగాఁ జెల్వారు శాంతోపల
బ్ధిని; వైక్లబ్యనివృత్తిహేతువులు గావే? తద్రసానందముల్ 26

కం॥ గురుదేవచరిత్రం బిహ
పరసాధన మగుటఁ జేసి పరమార్థంబుం
బొరయించు నట్టిదానికిఁ
దొరకొనుటలు పుణ్యగతికిఁ దొరకొనుట గదా! 27

ఉ॥ కూరుతు వేయిపద్యములకుం బయిగాఁ గృతి కన్న నీకు నీ
నేరుతు వేయిరూప్యములు నే నని నవ్వుచు నాదరించె నా
మూరుత మెట్టిదో! కృతికి ముద్రణయోగము పట్టెఁ జాలదే?
పోరచిపుట్టువుల్ కృతులు ముద్రణభాగ్యము లేమి నోఁ గదా! 28

వ॥ అట్లుతం డాదరించి బహూకరింప నుత్సహించితి నప్పుడు— 29

సీ॥ మధురాశయోల్లాసిమంచమాంబాభ్రమ
రాచార్యపుణ్యాగర్భాంకురంబు
సురుచిరవేంకటసుబ్బాంబికాబుచ్చి
కోటార్యవర్ధితపాటవంబు
కమలాంబికావిలోకనపాళికలితోప
గూహనదోహదదోహలంబు
నవనవోన్మేషసుందరసప్తసంతాన
మంజరీపరిమళమంజులంబు

గీ॥ శనగపాట్యన్వయప్రకాశక ముదీర్ణ
కవిజనాభీష్టఫలదాయకంబు నగుచుఁ
గ్రాలు శ్రీమధుసూదనకల్పభూజ
మురుభుజాశాఖ సాఁచి శుకోక్తి ననియె: 30

మ॥ మును తారావళి భక్తిభావ మొలసెన్, మోదంబు నించెన్ బృథ
క్తనురేఖన్ నవఖండముల్, కళ కలంకారం బపూర్వంబుగా
ననుసంధించెను శిల్పసుందరియుఁ బాత్రౌచిత్య మొల్కించెఁ బ
ద్మని, నీ వియ్యది వ్రాయఁ బూనుటను బ్రాహ్మీదేవి
యుప్పొంగదే ! 31

చం॥ వలపులు గ్రుమ్మరించి పయిపైమురిపించి సుఖంబు లీని కాం
తల పరవళ్లు శబ్దకవితల్ గిలిగింతల పల్కు లేని కాం
తల మసకంబు లర్థకవితల్ పలుకుంబస కేళిచాతురిం
గల చెలు లట్లు శబ్దసుభగంభరితార్థవిశిష్టకావ్యముల్ ! 32

క॥ కనుక నది వలతు నను నా
తని రసికత కలరి నేను దాపోపశమం
బును శయ్యారుచిరార్థం
బునఁ గాంతు వనంగ నతఁడు ముగ్ధుం డగుచున్ 33

ఉ॥ మా పెదతండ్రి వెంకయ సమాజహితంబుగ ధర్మసత్రసం
స్థాపకుఁ డయ్యె మత్పితృపితామహు లీగిని సుప్రసిద్ధు లే
దో పరమార్థముం జలుప నువ్విళు లూరెడి నా మనంబు నా
యోపిన కానుకం గృతికి నొప్పన సేసి మనస్వి నయ్యెదన్ 34

కం॥ అదియును ననుఁ బెంచిన త
ల్లి దయారసరూపమున్ నిలిపి నెమ్మదిఁ ద
త్పదభక్తి సమర్పించెద
నిదె వేంకట సుబ్బమాంబ స్మృత్యర్థముగాన్ 35

కం॥ అని యర్థసహస్రాధిక
ధనమును గురియించి దానధారాధరమె
తన యీగి మెఱయఁ జేసినఁ
గనితిన్ నాకృషిఫలోన్ముఖం బగు తెరువున్ 36

వ॥ తదనంతరంబు— 37

సీ॥ ప్రాచీనశిల్పాంకురముల కావాసమై
వాసించు పెందోట వారి పడుచు
అనురాగభరిత సీతాంబికావేంకట
రత్నాఖ్యదంపతిప్రణయఫలము
హరిహరభక్తితత్పరుని సుతారివేం
కటసుబ్బయాచారి కలికికలికి
పాలును నీరు వేర్పఱచు వివేకంబు
రంజిల్లు రాజమరాళగమన

గీ॥ అచ్యుతాంబిక కీర్తిగంధానిలములు
పుట్టినిలు మెట్టినిలు పేర బుగులుకొనఁగ
బ్రహ్మగురుదేవభక్తితాత్పర్యపరత
రెండు నూర్లు పదారు లర్పించె నాకు 38

ఉ॥ పాయక యచ్చమాంబ తన పాలిటనుండి భవిష్యదర్థముల్
వ్రాయఁగఁ బూనుకొన్న గురువర్యుని నాదృతిఁ జూచి నట్టు లా
ప్యాయత నచ్యుతాంబ గురుపాదుని దివ్యకథావిధానముల్
వ్రాయఁగఁ బూనుకొన్న కవివర్యు ననుం దిలకించెఁ జాలదే? 39

వ॥ అటు పిమ్మట — 40

కం॥ వెలయించె నచ్చమాంబా
చలమార్యసుతుండు సత్యసంధుఁడు శ్రీరా
ములు చౌదరి నూటపదా
రులతో యలవర్తివంశరుచిరాశయముల్ 41

కం॥ ఉబ్బుచు శరణము వంశ్యుం
డబ్బడి నూఱారు లిడె మహాలక్ష్మాంబా
సుబ్బయ్యశ్రేష్ఠి సుతుఁడున్
దబ్బరనుడి లేని సత్యనారాయణ యహా! 42

గీ॥ యల్లమందాత్మజుఁడు కాగితాన్వయుండు
నిష్కళత మిచ్చె వీరాంజనేయబుధుఁడు
ప్రియసుతు సుమామహేశ్వరు పేరఁ గృతికిఁ
ద్యాగగుణశీలి యగు బహూత్తముఁ డతండు।

కం॥ విప్పర్లమల్లికార్జునుఁ
డప్పుడు తన సుతుఁడు కృష్ణమాచార్యుఁ డెడన్
గుప్పు మనఁ గోటయాత్మజు
డప్పించె శతంబు దుర్గమాంబాన్వితుఁడై 44

కం॥ బ్రహ్మయ కొమరుండు గురు
బ్రహ్మయ మా పూసపాటివంశకరుం డీ
బ్రహ్మేంద్రకృతికిఁ బరమ
బ్రహ్మణ్యుఁడు రౌప్యశతము పసదన మిచ్చెన్ 45

వ॥ అదియునుంగాక పలువురు పలు తెలుంగుల బహుమానించి కృతి ప్రయత్నంబు నభిమానించి రట్లగుటం జేసి మదీయవంశావతారాభి వర్ణనంబు గావింతు నెట్లనిన — 46

## కృతికర్తృవంశావతారాభివర్ణనము

కం॥ శ్రీపంచముఖబ్రహ్మకు
లాపాంపతి నత్రిఋషిమహాగోత్రయశ
శ్శ్రీపాదదేవనగ మై
వ్యాపించిన పూసపాటి వంగడ మందున్ 47

గీ॥ పొగడితకు నెక్క ముత్యంబు ముత్యమయ్య
మన్మథనిభుండు వీరమాంబావిభుండు
పరమసుఖజీవనుండు వంశవర్ధనుండు
ప్రస్తుతవారుండు కర్మసంపత్కరుండు 48

కం॥ అనఘులు తత్తనయులు బుధ
వినుతాత్ములు పెదశివయ్య పెదపేరయ్యల్
చినశివయ చిన్నపేరయ
లన నల్వురు నొప్పుదురు కులాభ్యుదయకరుల్ 49

ఉ॥ అందుఁ దృతీయుఁడౌ చినశివయ్యకుఁ బిచ్చమ యందుఁ గల్గి రె
న్నం దగు నట్టి ధీయుతులు నాగయ భద్రయ ముత్యమయ్య ల
ర్ధేందుకళాధరుం గొలుచు నిద్ధచరిత్రులు నిష్టబాంధవా
నందకరుల్ మహామహులు నందను లార్యజనాభినందనుల్ 50

మ॥ స్తుతిపాత్రుం డగు నందు శాంతగుణభద్రుం డైన భద్రయ్య సూ
నృతసంధామృదువాగ్మి వేదవిహితత్రేతాగ్నిహోత్రుండు వ
ర్ధితసత్కీర్తిలతాంకురుం డనుదినప్రీతార్థిబంధూత్కరుం
డితరుల్ పోలఁగ నేర్తురే కరణిఁ దాదృక్పుణ్యచూడామణిన్ ౹ 51

ఉ॥ పేర్చిన లౌకికప్రభను వెల్గిన యన్నకుఁ దమ్ముఁడై జనా
భ్యర్చిత మైన కార్తికము నందు సజప్రసహస్రశంభులిం
గార్చన చేసి పాదనతు లందిన తమ్ముని కన్నమై యుప
ర్వార్చన మైన భూతి శివభద్రయ భాసిలు బ్రహ్మభాతిమై! 52

కం॥ ఆ భద్రయ్యకు బసవాం
బా భవ్యగుణాఢ్య యందుఁ బ్రభవించిరి చే
తోభవనిభగాత్రులు ప్ర
జ్ఞాభరచారిత్రు లైన నలువురు పుత్రుల్ 53

సీ॥ బహుపురాణగ్రంథపఠనపాఠనచణ
వ్యాసంగచంగాత్ముఁ డగు శివయ్య
మనుచరిత్రాదికావ్యనిధానభావార్థ
పారంగతుఁ డగు పేరయార్యుఁ
డాగమపంచాంగభాగాతినైపుణ
బ్రహ్మణ్యమూర్తి యా బ్రహ్మయాఖ్యుఁ
డభిలష్యమానాంధ్రమీమాంసకవిన్యాస
ముదితాత్ముఁ డగు నాగభూషణుండు

గీ॥ దాశరథు లట్లు సుభ్రాతృతాప్రసక్తి
నన్యకాంతావిరక్తి ధర్మానురక్తిఁ
బరమపితృభక్తి సూనృతవ్రతనియుక్తి
శ్రితసమీహితశక్తి వర్తింతు రెపుడు ! 54

వ॥ అందు —

కం॥ సరసుఁడు బ్రహ్మయ వేంకట
నరసాంబిక యందు నన్ను నాగేశ్వరునిన్
నరసింహారావు నయని
ర్భరవైభవుఁ బూర్ణచంద్రరావుం గనియెన్ 56

చం॥ కలిమికి లేమికిం బురుషకారము దైవము మూల మన్న ని
ర్మలహృదయంబుతోఁ గడపు మా తలిదండ్రుల కూర్మిపాలవె
న్నెల గిలిగింత గా కొకటి నేరని బాల్యము నంద కారుమ
బ్బుల వికటాట్టహాసములు మోసల నిల్చె నకాలకాలిమల్ 57

ఉ॥ చక్కనివాఁడు సత్త్వగుణసంపద గల్గిన వాఁడు నెయ్యురన్
మక్కువఁ జూచువాఁడు నగు మా చినతమ్ముఁడు పూర్ణచంద్రరా
వొక్క దినావసానమున నుజ్జ్వలదగ్నిశిఖాచయంబులం
జిక్కి గతాసుఁ డయ్యె నని చెప్పఁగ నా మది తల్లడిల్లెడిన్ 58

మ॥ సుతదుఃఖవ్యథమానమానసముతో శోషిల్లి వర్షావధిన్
గతియించెన్ జనయిత్రి, గుండియలు చిక్కంబట్టి కొన్నాళ్లుగాఁ
బితృపాదుం డరిగెన్ సతీసుతసమావేశంబు నాశించి, ప్రా
క్కృతకర్మానుభవంబు లిట్టి వగుచో నెవ్వారి కెవ్వారలో! 59

గీ॥ తల్లిదండ్రుల మఱపించి దఱికిఁ దీసి
పేరయాచార్యమౌళి మా పెద్దతండ్రి
వాని గేహిని యీశ్వరాంబయును మాకుఁ
బుత్రవాత్సల్యపీయూషపాత్ర మిడిరి! 60

సీ॥ మాతృదుఃఖము నెల్ల మఱపించె నా యమ్మ
పితృదుఃఖ మెడలించెఁ బెద్దతండ్రి
లతకూన లట్లు నేలకు వ్రాలనున్న మా
కవలంబమై నిల్చె రనుదినంబు
గాయత్రిగా విశ్వకర్మగా వెన్నంటి
జ్ఞానవిజ్ఞానముల్ గలుగఁ జేసి
మా భవిష్యత్సుఖశోభావిశేషంబు
తమ లక్ష్యముగ నాత్మఁ దలఁచికొనిరి

సీ॥ గీ॥ వీరగురుదేవు నెడ భక్తి వారి వలన
నంకురించెను నాకు బాల్యమున యందుఁ
దత్కరుణ నాంధ్రపండితాధ్యాపకుండ
నైతి నాకూర్మి కవచ మాఁ గాత మాకు! 61

మ॥ ఇఁకఁ జింతించి ప్రయోజనంబు గలదే? యీనాఁడు గాన్పింతురే?
యకటా! నా తలిదండ్రు లీ మధుర కావ్యంబున్ దదీయార్ఘ్యపూ
జకు నర్పించి సుమంబుగా మనకు నాశ్వాసించికొందున్ నిజా
నకు నిద్ధాత్రిఁ బితౄణముక్తి వడయన్ సాధ్యంబె యెవ్వారికిన్!

చం॥ ప్రవిమలముల్ రసాతిమధురంబు లభీష్టఫలంబు లొప్పఁగా
నవహితవృత్తశాఖికల నందము చందము సత్త్వమిల్లఁగా
వివృతబుధాగమం బగుచు వీనుల విందయి యొప్పఁ గాక నా
కవనము మత్పితృప్రమదకారణమై సుమనోమనోజ్ఞమై 63

షష్ఠ్యంతము

సీ॥ ఏవంవిధానుయాయిప్రసూజనకుల
కాభిజాత్యమహాధనాధికులకుఁ
గరుణాకటాక్షవీక్షణసుధానిధులకు
ననవరతాభ్యర్థితాతిథులకు
నిత్యసత్యవ్రతనియమప్రవీణుల
కేనోహరగుణోపబృంహణులకుఁ
బురుషార్థసాధనబుద్ధిమత్తములకు
బాంధవసముదయోపఘ్నములకు

గీ॥ నాజవంజవసుఖభాజనాంతరులకుఁ
బరిణతజ్ఞానవిజ్ఞానభాస్కరులకు
ననుదినప్రార్థ్యమానవార్యంబకులకు
వేంకటనరసాంబాబ్రహ్మయాంకులకును 64

మ॥ సమర్పణంబుగా నా యొనర్పం బూనిన వీరబ్రహ్మేంద్రచరిత్రం
బను మహాకావ్యంబునకుం గథాక్రమం బెట్టి దనిన — 65

# శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్రము

---

## ప్రథమాశ్వాసము - బాలయోగము

### కథా ప్రారంభము

కం॥ శ్రీపరిపూర్ణము చిక్బ
ల్లాపుర మలరారు నంది కంతిక మందున్
దీపించు వీరభోజుం
డాపురి ననురూప పాపమాంబిక సతిగాన్ 1

మ॥ అతఁ డాచారపవిత్రుఁ డెన్నదలవంశాంభోధిశీతాంశుఁ డ
ప్రతిమానప్రతిభుండు పంచవదనబ్రహ్మాన్వయశ్రేష్ఠుఁ డం
చితపాపఘ్నమఠాధిపత్యవిభవశ్రీమంతుఁడై శిష్యసం
తతి కొల్వన్ సుఖ ముండు శంభుఁడు మునీంద్రశ్రేణి తోడం బలెన్

గీ॥ పాపమాంబిక సాక్షాదపర్ణ వోలె
భర్త్రు నర్ధాసనంబునఁ బరఁగుచుండు
దంపతుల కెల్ల నుత్తమాదర్శ మగుచు
వారి యనువర్తన మ్మొజ్జబంతి యయ్యె ! 3

సీ॥ ఐనను గాని సంతానంబు లేమికి
నాల్మగ లాత్మలో నంగలార్చి
హంసపోతము లేని యంబుజాకర మట్లు
చెలు వేది యున్నింట నిలువ లేక

తీర్థాటనంబున దినములు పుచ్చుంగఁ
దలపోసి శుభముహూర్తమున యందు
వ్రతదానజపహోమతతులు నిర్వర్తించి
యిష్టబాంధవుల సంతుష్టపఱచి

గీ॥ బయలుదేరిరి శివునిపై భార మునిచి;
యెన్ని సుఖములు వడయుచు నున్నయేని
మహి నపత్యంబు లేని దంపతుల బ్రతుకు
సారహీనంబ యస్వస్థకారణంబ ! 4

వ॥ అంత నప్పుణ్యదంపతు లనేకోత్తాలసాలజాలం బైన శ్రీశైలంబు నకుఁ జని భ్రమరాంబామల్లికార్జునులం బూజించి, తిరుపతివేంక టేశ్వరునకు ముడుపులు సెల్లించి, కాళహస్తీశ్వరు నారాధించి, కంచికామాక్షి నుపలక్షించి, మధురమీనాక్షి కభివందనం బాచ రించి, చిదంబరరహస్యం బెఱింగి, రామలింగేశ్వరు నభిషేకించి, సేతుస్నానపవిత్రీకృతశరీరులై మఱలి చనిచని దక్షారామభీమేశ్వర చరణారవిందంబులు భజించి, సింహాచలంబు నుపలక్షించి యట మీఁదఁ బుణ్యరాశి యైన కాశీనగరంబున కరిగి రంత— 5

శా॥ రంగద్గాంగతరంగసంహతులఁ దీర్థం బాడి ఘట్టావళీ
శృంగారంబుల కుల్లసిల్లి మహితశ్రీ డుంఠివిఘ్నేశ్వరున్
గాంగేయాచలధన్వి నార్యను మదిం గైసేసి పూజించి స
ర్వాంగాలింగితభూతలంబుగ నమస్యల్ సల్పి రిష్టార్థులై 6

## వీరబ్రహ్మేంద్రుని జన్మవృత్తాంతాదికము

వ॥ అనంతరం బయ్యింతియు నతండు గయాప్రయాగాదిపుణ్యస్థలంబు లరసి త్రివేణీసంగమంబున యోగవిద్యావిశేషంబు లవధరించి బద

రికా వనంబున నరనారాయణులం గీర్తించి హరిద్వారంబు సేరి యటనుండి మఱలి దక్షిణాభిముఖులై చనిచని కర్ణాటాంధ్రమర్యాదాభిరక్షితం బైన దక్షిణత్రివేణికాతీరప్రాంతంబుల కంతరంగంబులు రసార్ద్రింబులు గాఁగ సంచరించుచు నుండి యొక్కెడ— 7

సీ॥ కుసుమితవల్లికా విసరపరీవృత
  వితతావనీజాతవిలసనములు
ఫలరసకిసల పుష్పరసాతిలాలస
  శుకపికభ్రమరికా వికసనములు
సవిధస్రవంతికాచల దూర్మికాసీక
  నవసుగంధిల మరున్నందనములు
వర్ణిసంవర్ధిత ప్రాంగణ నీవార
  కణఖాదిహరిణ దృక్ప్రసరణములు

గీ॥ మదిఁ గరంపఁగ నిది యాశ్రమం బటంచుఁ
జెప్పకయ చెప్పుచునికి కచ్చెరువు నంది
ప్రకృతిపరిపూర్ణ యోగాభిరామలీల
నెసఁగు పుణ్యస్థలం బని యెఱిఁగికొనిరి. 8

వ॥ మఱియు నాదంపతులు- 9

సీ॥ ఇదికదా! మనపాలి కిష్టబాంధవు లైన
  పోతులూర్వంశ్యుల పుణ్యశాల
ఇదికదా ! ప్రకృతి నాత్మేశ్వరి నలరించు
  పరిపూర్ణభద్రాఖ్య పర్ణశాల
ఇదికదా ! చౌవంచవృత్తులతో విశ్వ
  కళ్యాణ మాసించు కర్మశాల
ఇదికదా ! యుపనిషద్వాదిత సూత్రార్థముల్
  వల్లించి చర్చించు పాఠశాల

సీ॥ గీ॥ జ్ఞానకర్మయోగాభ్యాసు లైన వారి
కాశ్రమంబయి యాశ్రయంబై తనర్చు
నిదియకాదె! మనోవ్యథ లెడలు నిచటి
గాలి సోఁకినఁజాలు నొం డేల యనుచు. 10

కం॥ మునుకొన నొక్కవిపణ్ణా
ననుఁ డాశ్రమవాసి యెదురు నడతెంచి నమో
యని చేతులొగ్గి స్వాగత
మనియెన్ దంపతుల కభినవాగంతులకున్ 11

వ॥ వారు నతని వదనం బారసి 'అయ్యా! యియ్యాశ్రమంబు సుఖా శ్రయంబై యానందాశ్రమం బన నొప్పుఁగదా? నేఁ డిట్లు వివర్ణమై విషణ్ణమై యున్కకుం గారణం బేమి? ప్రకృతాంబాపరిపూర్ణయా చార్యులకుం గుశలంబే?' యన నతం డెలుంగు రాల్పడ ని ట్లనియె-

సీ॥ ప్రసవవేదనఁ బొందు భార్య కుత్తేజంబు
కలిగింపనో యనఁ గడఁగి గురుఁడు
పరశివధ్యానతత్పర మైన బుద్ధితో
సిద్ధాసనమున నాసీనుఁ డయ్యె
నంతలోఁ బ్రకృతాంబ యర్కబింబముఁ బ్రాచి
గాంచిన చందానఁ గనెను సుతుని
నది యెఱింగింప నే మరిగి చూచితి మా మ
హాత్ముండు బ్రహ్మైక్య మంది యునికి

గీ॥ నిది యెఱింగిన సతి గుండె లుదిలగొనఁగ
బాలు మోమైనఁ జూడక వందుచుండె
నేమిసేయుదు మూఱడ దేమిభంగి
నామె నోదార్చి మీరు పుణ్యమునఁ బొందు 13

కం॥ అన విని పరిపూర్ణాచా
ర్యుని యంతిమయాత్ర వినఁగ నోపితి మకటా !
యని చింతించుచు లోనికిఁ
జని యామిథునంబు ప్రకృతిసన్నిధి నిలువన్ 14

చం॥ కని ప్రకృతాంబ బాష్పకళికాతరళీకృతనేత్ర యయ్యు నం
తన యొకయింత వంత దిగఁద్రావుచు గద్గదఖిన్నకంఠియై
నను విడనాడి పోయె నధినాథు డిసీ ! సయిరింప నోప నా
తని యెడఁబాటు లే నతని దాయఁగ నేఁగుదు నిప్పు డియ్యెడన్ 15

ఉ॥ మున్న యెఱింగి జ్ఞానపరిపూర్ణుఁడు శ్రీపరిపూర్ణయార్యుఁ డా
సన్ననిమిత్తకాలము, నచంచలయోగసమాధిముద్రలో
నున్నటు లుండి బంధముల నుండి విముక్తినిఁ బొందె నేను ని
య్యన్నుల బిడ్డ నెవ్వరికి నప్పన సేయుదు నంచుఁ గుందుదున్ 16

గీ॥ కీడులో మేలు పోలెను నేఁడు మీరు
పిలిచి నట్లను వచ్చితి రలఘుమతులు
నాకు నిఁక నెట్టి రాగబంధంబు లేదు
ప్రీతిమై నిక్కుమారునిఁ బెంచికొనుఁడు 17

కం॥ అని పలుకు నామె మాటలఁ
గనుఁగొలఁకులు చెమ్మగిల్ల గళవళపడి యి
ట్లని రా దంపతు లమ్మా !
జననివినా సుతుల కొండు స్వర్గము లున్నే ! 18

ఆ॥ వె॥ ప్రాణవిభునిఁ దలఁచి ప్రాణంబు విడిచిన
సుతుని బ్రతుకుఁదెరువు సూతు రెవరు ?
తల్లి లేని బిడ్డ ధరణికి భారంబు
కన్నతల్లి సుతుని కల్పవల్లి ! 19

ఉ॥ నీవును దత్త్వమార్గములు నేర్చిన దానవు నీకుఁ దెల్పఁగా
మావశమా ! కుమారముఖమండల మారసి ప్రొద్దు వుచ్చవే
చావును బుట్టువున్ జనికి సాజము లెప్పటి కెట్టు లట్టులన్
దైవవశంబునం గలుగు దాన స్వధర్మము నుజ్జగింతురే ? 29

చం॥ అనవుడు వారి గన్గొని దయారసరాసులు మీర లాత్మలన్
గనకర మూని నాసుతునిఁ గావఁగ నంతియ చాలు నింక నేఁ
జనియెద భర్తృసన్నిధికి; సాధ్వులకుం బతితోడిదే జగం
బని నిగమంబులుం బలుకు టారయరే ? యెఱిఁగింప నేటికిన్ ! 21

సీ॥ పెండ్లిపీఁటల మీఁదఁ బెద్దల సన్నిధి
నగ్నిసాక్షిగ సమయంబు నడపి
యర్థదేహముగ సర్వావస్థ లందును
గనుబ్రామ కుండను గాచుచుండి
ప్రాణాధికం బగు వస్తువు తన కింత
కంటెను లే దని కలువరించి
యెనలేని ప్రేముడి ఋున నిచ్చి యనుకూల
భావసౌరభము లావహిలఁ జేసి

గీ॥ యిహము స్వర్గము గావించె నెవ్వఁ డట్టి
పోతులూర్యన్వయాంభోధిపూర్ణచంద్రు
ననుగమింపక యేతదర్థాంగ మెట్లు
నిలువనేర్చును ! బ్రతుకంగనేర్చు నెట్లు ! 22

కం॥ నిలుపుకొని పసపుఁగుంకుమ
లెలమిం బతి ననుసరించి యేగుదు నిపుడే
గెలవేసినఁనఁటిచెట్టుం
బలెఁ గాలము తీఱె నాకు భవలిఖితంబై 23

వ॥ అని పల్కి కల్కి మొగిళ్ల నడుమ నడరు బాలభాస్కరుం దిరస్కరించుచుం జొత్తిళ్ల నొదిఁగియున్న నిసుంగు నెత్తి ముద్దాడి మఱు క్షణంబ నిర్నిమేషా నిరీక్షణంబులు ప్రసరించుచు నయ్యాలుమగల నుద్దేశించి వెండియు—— 24

గీ॥ కాశికావిశ్వనాథుని కరుణ వలనఁ
గలిగిన ఫలంబు మా కిది కలువరించి
పరితపించిన యన్నాళ్లు పట్టలేదు
మధుర మైన పుత్రోత్సాహమహము మాకు. 25

వ॥ అని సుతు నప్పగించి ప్రకృతి యోగాసీనయై మనం బాత్మేశ్వర సమాయత్తంబుగా సమాధి వహించి సహస్రారద్వారంబున నుప్పరంబున కెగసె. నప్పు డాశ్రమంబున హాహాకారంబు లెగసె నంత నప్పుణ్యదంపతులు విధివిలాసంబునకు వెఱఁగంది యాశ్రమవాసుల నూరార్చి తదనంతరంబు—— 26

సీ॥ విసిగి వేసారి మార్గ్నసలు నిరుద్యోగి
కనుకోని పదవి పి ల్చంది నపుడు
గ్రాసవాసోదైన్య కష్టాత్మునకుఁ బెన్ని
ధానంబు కాళ్లకుఁ దగిలి నపుడు
ఇసుకయెడారిలో దెసమాలిన తృషార్తు
నకు సుధాసరసి కన్పడిన యపుడు
జపతపస్స్వాధ్యాయసమయశీలికిఁ బర
బ్రహ్మదర్శనము చేపడిన యపుడు

గీ॥ కలుగు సంభ్రమ మాశ్చర్య మలఘుకౌతు
కోత్సహానము బ్రహ్మానంద మొక్కమొగిని
బిచ్చలింపఁగ నడ్డాల బిడ్డ తోడ
నిల్లు సేరిరి పురవాసు లెదురుకొనఁగ ! 27

వ॥ అంతట నక్కుమారుని 'వీరప్ప, వీరాచార్య' యని పిల్చుచు నుప
లాలించుచు నాలుమగలు పుత్రోత్సాహంబు ననుభవించు చుండి
రదియునుం గాక— 28

సీ॥ ఏడుపు దిగఁద్రావి యిగురాకుఁ బొత్తుల
నొదిఁగి యుయ్యాలలో నూఁగు వాని
నుంగరంబులు సుట్టి ముంగురుల్ నొసలిపైఁ
గూడిమాడఁగ ముద్దుగొలుపు వాని
బొటనవ్రేలినిఁ దన బోసినోటను బెట్టి
జిలిబిలి చిఱునవ్వు లొలయు వాని
గిలకబొమ్మను జూచి నిలిపి తదేకత్వ
మానందపరవశుం డైన వాని

గీ॥ నడుగుఁ దమ్ములు సాఁచి యోగాసనాదు
లభ్యసించుచు నున్నట్లు లలరు వాని
నరసికొంచును మురియుదు రంతె కాని
కన్నబిడ్డలు లే రని కలఁగ రెపుడు 29

వ॥ ఇ ట్లిత్తువారి చేతి బిడ్డం డగుచు దినదినప్రవర్ధమానుండై - 30

సీ॥ తడఁబాటుతోఁ డప్పు టడుగుఁదమ్ములు నిల్పి
పడుచు లేచుచు సాఁగి నడచు టెఱిఁగి
ఆకతాయితనంపు టల్లరి చెయ్వితో
విసిగించి కొసరి నవ్వించు టెఱిఁగి
వలకారి మాటల గిలిగింతతో మనం
బులు చూఱగొని ప్రొద్దుపుచ్చు టెఱిఁగి
అల్లాడుముద్దుగా నభిమతంబులు తెల్పి
కొని బతిమాలించుకొను టెఱింగి

సీ॥ గీ॥ బాల్యలీలల నాపరబ్రహ్మమూర్తి
వింతనాటక మా గృహాభ్యంతరమున
నాడుచుండెను బ్రాకృతు నట్టి డగుచు
వింతకంటెను భాగ్య మొం డేమి గలదు ? 31

ఆ॥ వె॥ వర్ష పంచకంబు పైకొని నప్పుడ
తల్లిదండ్రు లాజ్ఞ తలను దాల్చి
చదువసాఁగె నతఁడు చదువుల మర్మంబు
లిట్టి కడిమి సూచి కట్టు వడవా ! 32

వ॥ అదియట్లుండె నంతఁ గొంతకాలంబునకు వీరభోజాచార్యుఁడు బ్రహ్మైక్యంబు నందె, నప్పుడు— 33

ఆ॥ వె॥ విభుని పోక కడలి వీరపాపాంబిక
సుతుని చిన్నతనము సూచి పొక్కి
ప్రాణ మొడిసిపట్టి పాపఘ్నిపీఠంబు
మంచిచెడ్డ లరసికొంచు నుండె. 34

చం॥ తపనసమానతేజుఁ డగు తత్సుతమాళికి నెన్మిదేండ్లు రా
నుపనయనం బొనర్చి నిగమాదితపద్ధతి నింతి తత్క్రియా
నిపుణవినోదముల్ గనుచు నెవ్వగపుల్ దిగఁద్రావుచుండె; ము
ద్దు పనులతోడ దుఃఖములు దూర మొనర్తురు గాదె పుత్రకుల్! 35

వీరప్పయ్య తల్లి యనుమతి వడసి యరణ్యంబున కరుగుట

వ॥ అంత నొక్కనాఁడు వీరప్పయ్య తపశ్చర్యాకుతూహలంబునై నర ణ్యంబున కరుగ నిశ్చయించి తల్లింజూచి 'అమ్మా ! నా దొక్క విన్నపం బవధరింతువే' యనఁ గనుఁగొలంకుల నలంతినవ్వు దొలం కాడ నతిసిం జూచి 'యింతగా నర్థించు క్రొత్త లేమి ! నిన్ను నిరాకరింతునే' యడుగు మన నతం డాకె యడుగులంబడి— 36

ఉ॥ అభ్యుదయ ప్రశాంత నియమాచరణంబునఁ జేసి జ్ఞానయో
గాభ్యసనంబులం బరఁగి యంధతమిస్రసజగత్ప్రబోధ వా
ల్లభ్యము సంతరించు నభిలాషముమై వని కేగఁగా నమ
స్తుభ్య మటంచు వేఁడుకొనుదున్ నను దీవన లిచ్చి పంపవే! 37

కం॥ అను కొడుకు మాట కచ్చెరు
వును భయమును గల్గఁగాఁ గవుంగిటఁ గొనుచున్
వనితాతిలకం బి ట్లనుఁ
దనయా! నీ కిట్టి తలఁపు తగునట వోయీ! 38

శా॥ నీ కీ బుద్ధి జనించు టేమి? యితరుల్ నెక్కొల్పి బోధించిరో
నాకుం దెల్పుము నవ్వటాల కనెదో నాయన్న! నీ కేల యో
గైకాభ్యాసవిచారముల్! మృగశరణ్యారణ్యవాసప్రయా
సాకాంక్షల్ చెలికాండ్రతోఁ జదువుసంధ్యల్ నేర్వఁ బోవంగదే!

వ॥ అను తల్లికిం బ్రియనందనుం డంజలి ఘటించి యి ట్లనియె— 40

గీ॥ ఆడిబొంకంగఁ జూతు వే మమ్మ! నీవు
ధ్రువుఁడు చిన్నప్పుడే మహాటవికిఁ జనఁడె?
కాలము నిరర్థకంబుగాఁ గడపు నతఁడు
పొందఁ గలుగునె యైహికాముష్మికములు? 41

గీ॥ ఈశరీరము భౌతిక మెప్పు డేని
మట్టిలో మాయ మై పోవు మాట నిజము
చిరసమీహితకీర్తి నార్జించు కొఱకు
బాల్య మాదిగఁ బ్రయతింప వలయు జనుఁడు 42

ఉ॥ ఎందఱు భూమి మీఁద జనియించి నశించిరి పుర్వు లట్లు వా
రిం దలపోయు వారు గలరే? సుఖభోగము లంది చచ్చిరో
యందఱ చచ్చిరో తెలయు, దన్యహితోపకృతుల్ ఘటించి పే
రందిన వారు ధన్యులు మహాత్ములు శాశ్వతజీవనుల్ గదా! 43

గీ॥ బ్రతికినందాఁక ఘనతమైఁ బరఁగు నొకఁడు
చచ్చినంతట గణనకు వచ్చు నొకఁడు
ఘనయశోలబ్ధి తాత్కాలికంబు గాదు
సత్కృతులు సల్పు సుకృతికిఁ జావు లేదు. 44

ఉ॥ కాంచిన కోయిలమ్మ తన గాదిలి గ్రుడ్డు నొకళ్ళ కీయఁగాఁ
బెంచిన కాకియుం దఱిమివేయఁగ వచ్చియు రాని ఱెక్క లా
డించుచు బిక్కచూపు నిగుడించుచుఁ బ్రొద్దులు పుచ్చు మంచు శా
సించినవాఁడె సుస్వరముఁ జేకుఱఁజేసి యశంబుఁ గూర్పఁడే ? 45

కం॥ పరువడి నమృతమునకుఁ జను
గరుడుని దీవించు వినత కై వడిఁ బరమా
ర్థరమాస్యసుధాహరణ
త్వరమాణుని నన్నుఁ బ్రీతిఁ బనుపం గదవే 46

కం॥ అను వాని మనోనిశ్చయ
మునకు భయము గలుగ నశ్రుపూరము లురలన్
గనుఁగొని వనితారత్నం
బను నీ కిటువంటి మాట లర్హము లగునే ? 47

ఉ॥ పెద్దఱికంపు మాటలను బెద్దయుఁ బల్కెదు పెద్ద వోలె నా
ముద్దులపట్టి ? నీకుఁ దలముక్కలు వేసినఁ దొమ్మి దేండ్లు లే
వద్దిర ! యిట్టిబుద్ధి తగునా ? యులికింపగఁ బల్కఁ జూతువా ?
పెద్దను నన్నుఁ దల్లి వెఱపించిన నింతుక లాభ మున్నదా ? 48

కం॥ నినుఁ జూచికొనుచు మీపిత
చనినప్పటి నుండి బ్రదుకఁజాలితి నయ్యో !
నను నడిసంద్రంబున నిడి
చనియెదవా ? నీవు వని కసంగతమతితోన్ 49

కం॥ ఏ పుణ్యముహూర్తంబునఁ
బాపఘ్నమఠాధిపత్యభారంబును నీ
మూఁపున నిడ నగునో యని
తేపులు మాపులును గలవరించుచు నుందున్ 50

కం॥ బిడ్డలు లేని కొలంతను
గొడ్డేఱిన నాకుఁ బ్రకృతి కోకొమ్మని ని
న్నడ్డాల బిడ్డ నిచ్చెను
వడ్డింతువె వగపుఁగూడు వార్థక మందున్ ! 51

ఉ॥ కాంచిన తల్లిదండ్రు లెడగాఁగ నెఱుంగరు, ముద్దుముచ్చటల్
పెంచిన నాకుఁ జూపి మఱపింతువె ? కానకు నిప్పు డేను బం
పించినచోఁ బ్రజావతులు బిడ్డలబాధ లెఱుంగ నేర్తు రీ
పెంచిన గొడ్డురాండ్రు వెఱపింపక మాన రటంచుఁ దిట్టరే ? 52

ఉ॥ నా యభిలాషముల్ చివికి నన్నెడఁబాసి చనంగఁజూచుటల్
న్యాయమె ? పెంచినట్టి మరు లగ్గలముల్ నిరసింపఁజూచుటల్
న్యాయమె ? తెల్పు, మింతకును నా దురదృష్టము పాడుగాను దీ
ర్ఘాయువు పోసినాఁ, డిడుమ లందుటకున్ భగవానుఁ డక్కటా! 53

గీ॥ బుద్ధి యెఱిఁగినకొలె దివుళ్ళతోడ
నొరసి యవసానదశకు రానున్న నన్ను
నిపుడు విడనాడఁ జెల్లునే ? యిన్ని నీళ్ళు
నెత్తిపైఁ జల్లి పీదారి నీవు చనుము 54

వ॥ అని వెక్కసం బగు మక్కువ నుక్కఱం బల్కి వెక్కుచున్న తన
దిక్కై పక్కననవ్వు కుమారు నారసి 'యేమీ ! నాయేడ్పు నీకు
న వ్వయ్యెనే ?' యన నతండు— 55

ఉ॥ ఎవ్వరి కేడ్తు నీవు జననీ! జగ మంతయు నేడ్పుగొట్టుదే
గవ్వరుఁ జేతగాక వుసిగార్చుచు నున్నది, స్వార్థబుద్ధియై
నవ్విషయం బెఱుంగక నిజాప్తుల కై విలపింతు, రింతకుం
బువ్వులు పూఁచు నప్పటి ప్రమోదము లుండవు రాలి పోవుచోన్

ఆ॥ వె॥ మొదల నేడ్చి యేడ్చి తుదిమొదల్ నిఖిలంబు
మాయ వలనఁ దగిలి మఱచిపోవుఁ
దత్వ మరసి చూచి తన యే డ్పెఱుంగఁడు
పరుల కేడ్చుచుండు నరిది జనుఁడు! 57

కం॥ ఎక్కడి చుట్టఱికం బిది
యెక్కడి ఛాందసము నీవు నే నరయంగా
నొక్కటఁ బ్రవాహజలమునఁ
జిక్కిన కట్టెయల యట్ల సేరితిమి గదే? 58

మ॥ ఘనతాపత్రయజాల మం దొలయుచున్ గాఢాంధకూపస్థభే
కనిరూఢిన్ బరచింత మాని దురహంకారంబు మైఁ ద్రెళ్లుచున్
జననం బందుచు వెండియున్ సుడిసి నానాయోనిజుండౌ జనుం
దనవాఁ డంచు భ్రమించి చూచుట ప్రమాదం బౌను సాధ్వీమణీ!

చం॥ విడువఁగఁజాల ని న్ననుచు వేదన పొందుదు వీ శరీరమున్
విడిచిననాఁడు బందుగులు వెంబడి వత్తురె? యగ్గలంపుఁ బ్రే
ముడి నటియించి తుట్టతుది బూది యొనర్తురు చేతిమీఁదుగా
విడుమర లెవ్వడైనఁ గలవే! మమకారముఁ ద్రెంపి చూడవే! 60

సీ॥ ఇతరుల భావంబు లేకరువెట్టి స్వ
ప్రతిభగాఁ బ్రకటించు వాని పోలె
ఇతరుల ఋణధనం బెగవేసి తనదు సం
పదను బెంపొందించు వాని పోలె

ఇతరుల ప్రాప్తంబు లతకరించి స్వకీయ
వైభవ మెలయించు వాని పోలె
ఇతరుల ధర్మంబు లెరఁజేసి తన పేర
వసతులు నెలకొల్పు వాని పోలె

గీ॥ ఇతరకర్మంబు నెత్తికి నెత్తుకొనుచు
నింతదాన నటంచు వచింతు వీవు
సొంత మేమైన నున్నచోఁ జూచుకొనవె
దివ్వె గలుగంగ నిలు చక్కదిద్దవలయు! 61

కం॥ ఆత్మజ్ఞానంబునఁ బర
మాత్మను శోధించి విడు మనర్థం బగు భూ
తాత్మిక దేహప్రేరణ
మాత్మానందాధిరాజ్య మబ్బును నీకున్ 62

కం॥ జ్ఞాన మను కొడుకుఁ బడసిన
మానవతీ! నీకు ముక్తిమార్గము దక్కుం
గాని తనూభవు లెందఱు
నేని భవాంధానుబంధ మెడపంగలరే! 63

కం॥ మాంసాస్థిస్నాయువసా
సంసక్తంబైన తనువు క్షణమాత్రన వి
ధ్వంసం బగు మమకారజి
ఘాంస నుపాసించి నిన్నుఁ గనికొను మీవే! 64

ఉ॥ నీవు ననేకశిష్యులకు నేర్పుచు నుందువు తత్వశాస్త్రపుం
ద్రోవలు నీవ యిట్టి పెడత్రోవలు ద్రొక్కిన నింక నెవ్వ రీ
భూవలయంబునం బరమపుణ్యపథంబును జేర నేర్తురో
భావమునం దలంచి నగుఁబా టగు బాట గమింపఁ బోతువే! 65

వ॥ అను మాటలకుం దేటి యతనిం బరిశీలించి చూచుచు— 66

చ॥ ఇతఁడు వసుంధరాహితసమీహితబుద్ధి జనించి నట్టి య
చ్యుతుఁ డగుఁగాక లేనియెడ నోపెడు నెట్లతిలోకతైజసం
బితని ముఖస్థమై వెలయు నెట్లు చరాచరలోకవృత్తముల్
సుతుఁ డను భ్రాంతితో ముదుఁగఁ జూచిన నాకనువిచ్చె నేఁటికిన్

గీ॥ అని తలంచి చిదానంద మనుభవించు
నామె దృష్టినిఁ జిఱునవ్వుతో మరల్చి
లోకసామాన్య లీలావలోకనములు
గ్రుమ్మరించుచు ని ట్లనుఁ గొడుకుఁగుఱ్ఱ 68

గీ॥ నీవు వాంఛించి నట్ల నా భావ మందు
నెందు నుండిన నరయుచు నుందు నిన్ను
నవసరం బగు నాఁటికి నరుగుదెంచి
తీర్తు నీకోర్కి నిజము సాధ్వీమతల్లి ! 69

ఉ॥ తల్లి మొగం బెఱుంగనుగదా ! నను సాఁకిన తల్లి వైన నీ
కెల్లగతిన్ యశోవిభవ మేర్పడుఁ దావకపాదపీఠికిన్
జెల్లుచునుండు నూడిద లశేషముగాఁ బ్రతివత్సరంబు నా
తల్లి ! యథార్థ మీపలుకు తప్పదు నాకిఁక నాజ్ఞ వెట్టవే. 70

గీ॥ అంబ యానతి గైకొని యట్టి జనున
కెంతవానికి లభియింప విహాపరంబు
లా చరిత్ర మపాత్రమా నదియుఁగనుక
వేగ నాశీర్వదించి పంపింపవమ్మ ! 71

ఉ॥ కొందఱు జ్ఞానయోగమునకుం దలయొగ్గి చరింతు రెప్పుడున్
గొందఱు కర్మయోగమునకుం గమకింతురు, జ్ఞానకర్మముల్
డెందము లందుఁ బొందుకొను టే పరమావధి యంచుఁ దెల్పి నా
ముందటివారి కెల్ల నవబోధ మొనర్తును మీఁదిచందముల్ 72

## వీరభద్రప్రభావము

వ॥ అని సాష్టాంగదండప్రమాణంబు లాచరింపఁ జరాచరంబు మిథ్యగా నెఱింగిన యయ్యంగనామణి 'యిష్టావాప్తిసిద్ధిర' స్తని యాశీర్వదించి పరమాదరంబున వీడ్కొల్పె. వీరప్పయ్యయు వరణ్యాభిముఖుండై చనిచని నానాలతావితానంబులయు దిశాక్రమ్యమానశాఖావిశేషాభిరామంబులగు భూమీరుహంబులయు సింహశరభశార్దూలసరీసృపవరాహస్తంబేరమాదికంబు లగు క్రూరసత్వంబులయు ప్రకృతి నభినందించుచు నొక్క మనోజ్ఞప్రదేశంబు చేరి లీలామాత్రంబుగా నొక్క శిలాఫలకంబును వీరభద్రస్వామిగా మలంచి ప్రాణప్రతిష్ఠ గావించి పరిసరానుసారికాజలంబుల నిడి తీర్థాటనాభిలాషంబున రామేశ్వరాదిపుణ్యక్షేత్రంబుల కరిగె నట వీరభద్రశిలావిగ్రహంబు విజ్ఞానవంతుండు సంసారసాగరంబు నిస్తరించి పరమపదంబున కరుగు కరణి నిర్ఝరీజలతరంగంబులం దేలి యాడుచుం జని మెట్టకేలకు నల్లాడుపల్లె యను జనపదంబు సమీపంబున నడంగి యుండి తీరంబునం దాడు గోపాలబాలురం దొక్కరుండై నిల్చె— 73

ఉ॥ ఆటలఁ బాట లందుఁ జెఱ లాడుచు నద్భుతలీల దోఁపఁగా
నోటమిఁగూర్చె గోపకుల కొక్కట దానికి నొచ్చికొంచుఁ బో
రాటలు దక్కి వారు సుకరంబుగ నందఱ మొక్కఁడై నిరా
ఘాటముగా జయింత మని కచ్చ బిగించిరి మచ్చరిల్లుచున్ 74

ఉ॥ అంతటఁ బ్రొద్దు గ్రుంకినది యాలకు నూరిమొగంబు లయ్యె దే
శాంతర మేగినట్టి విహగావళి గూండ్లకుఁ జేరె నార్చుచున్
భ్రాంతనదీజలంబుల నవశ్యము దూఁకెను వీరభద్రుఁ డా
వింతను జూచి గోపకులు విస్మయ మందిరి విభ్రమంబుతోన్ 75

వ॥ అనంతర మయ్యాలకాపరు లా సమాచారంబు నూరి పెద్దల కెఱింగింప నది పరిభ్రాంతి యని వా రపహసించి, రప్పు డబ్బాలు

రిమాఙ్మాటలు బూటకంబులు గా వెల్లి మమ్మనుసరింపుఁ డతండు మొఱంగ కుండెడునో యన వా రంగీకరించి మఱునాఁడు కుఱ్ఱలం దోడ్కొని చని యెడఁగలుగ నుండి రప్పుడు వీరభద్రుండు యథావిధి నిర్ఘరి నిర్గమించి గోపబాలురం గూడిమాడు చునికి కచ్చెరు వంది సమీపించుటయు నాసామి యాపగాపయస్సుల నదృశ్యుం డయ్యె— 76

ఉ॥ అప్పుడ యీఁతగాం డ్రయిన యట్టి బలాఢ్యులు కొంద ఱుక్కుమై నప్పెనువాఁకలో దుమికి యీరసి యీరసి పెద్దకాల మా చొప్పరయంగ రామిఁ గడు స్రుక్కుచు సోలుచు నిల్చి; రంతలో నప్పరతత్త్వవేదిఁ గను నంతటి పెద్దతికంబు లబ్బునే ? 77

వ॥ అంతటఁ గర్తవ్యతావిమూఢులై వా రిండ్లకుం జేరి రా రేయి నూరి పెద్దలం దొక్కరుం డక్కుమారుఁ డెవండా ? యని పెద్ద యుం బొద్దు చింతించి నిద్రించుటయు నాతని స్వప్నంబున వీరభద్రుండు సాక్షాత్కరించి— 78

ఆ॥ వె॥ నన్నుఁ దలఁచు నట్టి నరుల కవశ్యంబు
గానిపింతు నయ్య ! కరుణ నొడమి
యీప్సితార్థసమితి నెల్లను సమకూర్తు
నెఱుక లేని వార లెఱుఁగ లేరు. 79

ఉ॥ నిశ్చితబుద్ధివై ననుఁ దృణీకృతశాత్రవునిన్ గుముద్వతీ
పశ్చిమవారిపూరముల భాసిలు వానిని వీరభద్రునిన్
నిశ్చలుఁ దోడితెచ్చి పురి నిల్పి ప్రతిష్ఠ యొనర్పుమీ చిరా
యుశ్చిరసౌఖ్యముల్ గలుగు నుల్లమునం దలకంగ నేటికిన్ ? 80

వ॥ అని యదృశ్యుం డయ్యె. నప్పు డతండు మేల్కాని గోపాలురం గూడిమాడిన బాలుండు స్వప్నంబున సాక్షాత్కరించిన వీరభద్ర

స్వామి గానోపు నని నిశ్చయించి గ్రామీణులం దోడ్కొని చని కుముద్వతీవారిపూరంబులం బశ్చిమభాగంబున నున్న శిలావిగ్రహంబు వెలువరించి తెచ్చి శిల్పాచార్యులం బిలిపించి తదాలయ నిర్మాణప్రతిష్ఠాదికంబులకుఁగా సువర్ణదక్షిణాతాంబూలాదిక మొసంగి పూజించిన వారును— 81

గీ॥ అనతికాలంబునను శాస్త్ర మనుసరించి
యాలయంబును నిర్మించి యద్భుతముగ
నొక శుభోదయవేళ వేదోక్తసరణి
వీరభద్రుఁ బ్రతిష్ఠించి వేడ్కఁజనిరి. 82

కం॥ అల్లాడుపల్లెఁ గల జన
మెల్లను దత్స్వామివిమలకృప మ్రొక్కుబడుల్
చెల్లించికొనుచు సుఖసం
పల్లాభ మెలర్ప నంత వర్తిలుచుండెన్ 83

కం॥ దూరగ్రామనివాసులు
నారూఢిగ నచటి మహిమ లాలించి మదిం
గూరఁగ శ్రద్ధాభక్తులు
సారెకు విచ్చేసి కొలువసాగిరి సామిన్ 84

వ॥ ఇది యిట్లుండె నటమీఁద దీర్ఘాటనంబున కరిగిన వీరప్పయ్య కతిపయప్రయాణంబుల నట కరుదెంచి వీరభద్రు నెడ గురుత్వంబు నిల్పి తపం బాచరించుటయు నమ్మహాభాగుండు సాక్షాత్కరించి యతనింజూచి— 85

ఉ॥ ఆదిభవాంశజుండవు మహామహితుండవు నన్నొకప్పుడీ
మాదిరి జాతఁజేసితివి మాయురె! యిప్పుడు నాపయిన్ గురు
త్వాదరణంబు నిల్పి తప మల్లనఁజేయఁదొడంగి తీ, వన
న్యాదృశతావకీన హృదయాశయ మెల్ల నెఱుంగఁ బల్కవే? 86

కం॥ అనుసరికి నమ్మహాత్మునిఁ
గని వీరప్పయ్య పలుకుఁ గమనీయమతిన్
నను నా లక్ష్య మెఱింగియుఁ
బనివడి యిపు డడుగ నేల భవ్యగుణాఢ్యా! 87

మ॥ సగుణబ్రహ్మపదాబ్జభక్తిపరుఁడై శ్రద్ధాళుఁడై జ్ఞానపా
రగుఁడై మానవుఁ డంత నిర్గుణపరబ్రహ్మానుసంధాన మొం
దఁగదా? విగ్రహపూజ చంచలమనోదోషంబు వారించి కూ
ర్చఁగదా నిగ్రహ? మిట్టి దివ్యపదవీసోపాన మొం డుండునే? 88

వ॥ అట్లగుటం జేసి గురుశిష్యన్యాయంబున భజింపం దలంచి నిన్నుం బ్రతిపాదించితి. నట్లు గానినాఁడు తరతమంబు లెఱుంగని యవివేకులు నా చరిత్రంబు లక్ష్యీకరింప నేర్తురే యన విని యతండు—

ఆ॥ వె॥ నీకు నీవ సాటి నిన్నొరు లెఱుఁగంగ
నేర్తు రయ్య జ్ఞాననేత్రరహితు
లిట్టి నీవ నాకు నిచ్చితి గౌరవం
బింతకంటె భాగ్య మేమి గలదు? 90

ఉ॥ ఏకడ నెప్పు డేని నెవఁ డేనియుఁ బల్కనిభంగి లోకపుం
బోకడ రాకడల్ నుడివి మున్నుగ మేల్కొలుపంగఁజాలు సు
శ్లోకివి నీవ చూడవె? బుధలోకము పామరలోకమున్ సదా
నీకు నమస్కృతుల్ సలుపు నిక్కము నిల్కడమై నెఱుంగుచున్

కం॥ నా కిట్టి ప్రభావోన్నతి
నాకల్పించిన తదీయ మగు ఋణబంధం
బేకరణి నీఁగ నగు నని
యేకాలముఁ దలఁచుచుందు నిద్ధచరిత్రా! 92

వ॥ కావున నీవు గృహస్థాశ్రమంబు స్వీకరించి నప్పు డేను బోతులూరయ్యాభిధానంబున సూనుండనై భవత్పాదపంకేరుహంబులు

గొల్చి ఋణవిముక్తుండ నగుదు. నీవును వీరబ్రహ్మాభిధానంబున విరాజిల్లం గలవాఁడ వని యాశీర్వదించి తదంగీకారంబు వడసి యంతర్హితుం డగుటయు వీరనారాయణుం డట వాసి హరిహర పురంబున కరిగి తపం బాచరించు చుండె నంత నొక్కనాఁడు—93

## సిద్ధుని పూర్వజన్మ వృత్తాంతము

ఉ॥ చక్కని రూపసంపదను జక్కెరవిల్తుని గెల్వఁజాలు వాఁ
డొక్కరుఁ డేగుదెంచి యచలోగ్రతపస్వికి బాలయోగికిన్
మ్రొక్కులు సల్పి నిల్చి ననుఁ బూతచరిత్రునిఁ జేయఁ జూడవే
దిక్కఱి యున్నవాఁడ నతిదీనుఁడ నోయమిలోకవల్లభా ! 94

వ॥ అని ప్రార్థింప నమ్మహానుభావుండు కన్నులు విచ్చిచూచి కూర్చుండ నేమించి 'యెవ్వరివాఁడ ? వేమి కతంబున నిట వచ్చితి' వనుటయు నతండు వినయవినమితోత్తమాంగుం డగుచుఁ దన చరిత్రంబు నిట్లు వలుకం దొడంగె— 95

కం॥ ఏ నొక క్షత్రియపుత్రుఁడ
నానందనిరూఢి బాల్య మాదిగ మను న
న్నానందభైరవుం డని
మానుసు లనియెద రధీతమాహాత్మ్యనిధీ! 96

కం॥ నిండారు దానశౌండిమ
భండాగారములు తఱుగు వడకుండు ధనం
బుండఁగఁ గొండొక కోమలిఁ
బెండిలి గావించి పితృఁడు పితరులఁ జేరెన్ 97

ఉ॥ ఇంటికి రాజ్యభాగమున కెల్లను బెద్దఱికంబు నంది వా
ల్గంటినిఁ గూడి యైహికసుఖంబులు తద్దయు నందుచున్ బ్రజం
గంటికి ఱెప్పపోలికను గావఁగనేర్చుచు సద్యశోంకముల్
గొంటిని క్రొమ్మెఱుంగులు కకుప్పుల కెల్లడ వెట్టుచుండఁగన్ 98

వ॥ ఇట్లుండియుండి యే నొక్కనాఁ డుద్భటాకారు లైన భటులం దోడ్కొని కాశీపరిసరారణ్యప్రదేశంబుల వేఁట వోయి—— 99

సీ॥ కలుద్రాగి మత్తిలి కనుల నిప్పులు రాల్చు
భల్లూకముల నెల్లఁ ద్రెళ్ళ నేసి
కొమ్ముల నెదురొడ్డి క్రుమ్మంగ నుంకించు
పోత్రిప్రతానంబుఁ బొలియఁ జేసి
కాండ్రించి తీండ్రించి కనలి పైకొనఁజూచు
శార్దూలనివహంబు జదియ నేసి
సమదమత్తములైన స్తంబేరమంబుల
కుంభస్థలంబులు గూల నేసి
గీ॥ సింహశరభాదికంబును జెనకఁజాలి
వేఁటతమకంబు తనివోక పెద్ద ప్రొద్దు
దుర్గమము లైన యారణ్యమార్గములను
మార్గణధనుర్ధరుండనై మసలు నెడను 100

వ॥ ఆకస్మికంబుగా నొక్క ధేనూత్తంసంబు వెన్కొని పైఁబడం గడంగు నుగ్రశ్వాపదంబు నారసి యేను నిశాతసాయకంబు నేయుటయు నది గుఱితప్పి పులికి మాఱుగా కపిల నాహరించుటంజేసి చేయునది లేక దాని పాలికిం జని—— 101

ఆ॥ వె॥ ఏమి వైపరీత్య మిది యేను బుణ్యంబు
సేయఁబోయి యఘము డాయఁగంటి
నింత కీశ్వరేచ్ఛ యెఱుఁగంగ రానిది
మానుషంబ యూఁది మసల రాదు ! 102

గీ॥ కుడిచి కూర్చుండఁజాలక యడవు లందు
వేఁట తమకానఁ దిరుగుట పెద్ద తప్పు
గోవధం బంతకంటెను – గోరుచుట్టు
మీఁది రోకటి పోటను మాది రయ్యె ! 103

కం॥ కాశీపట్టణపరిసర
దేశంబునఁ బాడియావుఁ దెగటార్చిన నా
కా శివసాయుజ్యపదం
బాశింపఁగ రాని పాప మబ్బినది గదా! 104

కం॥ అని పరిపరివిధముల నే
ననుతాపము నందుచునికి నారసి రాజా!
చనునే యిట్టి విచారము
కనికొని గోవధము నీవు గావించితివే? 105

కం॥ దైవప్రేరణ నిటువలెఁ
గావలసిన దాని కింతగాఁ జింతిలుచున్
నోవఁగ నేమిటి కయయో!
యేవేళకు నేమియగునో యెఱుఁగం గలమే! 106

వ॥ అనుచు నుచితవాక్యంబుల నూఱడం బల్కి లెంక లల్లనల్లన నన్నిల్లు చేర్చి, రైనను నామానసంబున గోవధాత్మకం బైన చింతాశల్యంబు వాయ కునికి నా రేయి పరమేశ్వరు నుద్దేశించి యేను— 107

కం॥ ఓ కారుణ్యపయోనిధి!
లోకత్రయజనక! నను విలోకింపఁగదే
పోకార్చి పాపపంకము
నాకుఁ బ్రసాదింప వయ్య! నాకసుఖంబుల్ 108

మ॥ నినుఁ గా దన్నది లే దొకప్పుడు. నినుం జిత్తంబునన్ నిల్పి ప్రా
ర్థన గావింపని వేళ లేదు, పరమార్థస్ఫూర్తినై శక్తివం
చన లేకుండఁ బరోపకారము నజస్రం బేను గావించు చుం
దును, నా కేల ఘటించె తయ్య! బలవద్దోషాభియోగవ్యథల్?

వ॥ అని చింతించుచు గనుమూసి నిద్రావస్థయందు— 110

మ॥ కల గంటిన్ గలలోనఁ గంటిఁ బ్రణవాకారున్ శ్రితాధారుఁ బా
పలతాదాత్రుఁ బవిత్రగాత్రు శతభాస్వద్బింబసంకాశు నీ
శు స్త్రలసత్కారుణికప్రసన్నతరశాక్షున్ లోకసంరక్షు ని
ర్మలకళ్యాణగుణాలయున్ నిరవధిబ్రహ్మణ్యభాగ్యోదయున్ 111

కం॥ కని హర్షంబును సాధ్వస
మును భక్తియు మనసు నందు ముప్పిరిగొనఁగాఁ
బ్రణమిల్లి నిలుచు నను నో
య్యన గని దేవాదిదేవుఁ డాదర మొప్పన్ 112

వ॥ నీ విప్పుడు హరిహరపురప్రాంతంబు నం దున్న వీరప్పయ్యను దరి
సింపు మని నిర్దేశించి తిరోహితుం డగుటయు నేను మేల్కని-113

గీ॥ స్వప్నవృత్తాంతమునకు హర్షంబు నంది
యిల్లు నిల్లాలి నిఖిలంబు నీసడించి
యిచటి కరుదెంచినాఁడ లోకేశు నతని
దర్శనము సేయుపొంటెను దమివరేణ్య ! 114

సీ॥ తన యీప్సితార్థంబు దార్చి యాశ్రయ మిచ్చు
సరసుఁ డబ్బిన శయ్యాసరుని సరణి
తన మనంబును జూఱఁగొనెడు చక్కఁదనాల
వరుఁడు లభించిన తరుణి కరణి
తన ధర్మసందేహమును బాచి యూరార్చు
నాచార్యుఁ డొదవు విద్యార్థి రీతిఁ
దన మనోరథము లెల్లను గొనసాగించు
స్వామి యబ్బిన భక్తజనుని భాతి

సీ॥ గీ॥ నేను నినుఁగాంచి మిగుల సంతృప్తి నెనసి
సంశయనివృత్తిఁ బడసి నిశ్చలత నుండఁ
దలఁతు నీపేరి యక్కరంబులు వచించి
కర్ణపర్వం బొనర్పవే కరుణ నిపుడు. 115

వ॥ అన విని తన యభిజ్ఞ వీరప్ప యని పల్క బాలయోగి మిన్నకుండు టయు నానందభైరవుఁ డద్భుతానందకందళహృదయారవిందుం డును, వినమ్రవదనుండును, కృతాంజలిపుటబంధురప్రశస్తహస్తుం డును నై నిల్చి— 116

కం॥ ఇందనుక నెఱుఁగ నట్టుల
విందువు నావృత్త మెల్ల వివరపడంగా
నెందుల కొప్పరికించుచు
నుందువొ తెలియంగ రాదు యోగనిధానా! 117

మ॥ నిను బ్రహ్మాదు లెఱుంగఁజాల రని వింటిన్ మంటి నావంటి వా
నినిఁ బేర్కొఁబనిలేదు లే దితరపాండిత్యంబు గోహత్య న
బ్బిన పాపంబు పిశాచముంబలె ననుం బీడించుచుం జూఁడుచుం
డిన దయ్యేన్ గరుణించి ప్రోవఁగదవే నిత్యానుకంపానిధీ!

కం॥ దోసఁ గని చూడక మృగయా
వ్యసనంబున నడవి కరిగి యావును వారా
ణసిఁ జంపినవాఁ డని నా
దెసఁ జూడవ? నీవు సదుపదేశము నీవా? 119

కం॥ భవదంఘ్రికమలసేవకుఁ
బ్రవిమలకరుణారసార్ద్రభావంబున న
న్నివినీతుఁ డనక కైకొని
వివేకవంతునిగఁ జేయ వేఁడుదు ననఘా! 120

కం॥ నా కొక వెరవుం జూపక
నీకుం జనరాదు ద్రోసి నిరసించిన నాఁ
డీ కాయంబుఁ దొఱంగుదు
నీకడఁ బ్రాయోపవేశ నిశ్చయమతి నై. 121

వ॥ అనుటయు నయ్యానందభైరవుం గటాక్షించి సదసద్వివేకి యైన వీరయోగి ప్రమాదవశంబున సంక్రమించిన దైన దేనియుం బాపఫలం బవశ్యభోక్తవ్యంబు. కావున జన్మాంతరంబు వడసి నన్నాశ్రయించి తరింతు వింక నింటికిం జని మదీయనామధ్యానంబు నేమర కుండునది. తదీయప్రభావంబునం జేసి నీ వప్పుడు పూర్వజ్ఞానంబు గలిగి న న్నెఱుంగుదు వన నతండు చేతులు మొగిడ్చి—

మ॥ ఇఁక జన్మాంతర మొక్కఁడా? యదియు నా కేవం పదాంభోజయుగ్మకముం గొల్చి తరింపనా? దురితముం గావించి యే నెంత సార్థకతం బొందినవాఁడ నై తిని! దయార్ద్రిం బైన త్వద్భావవీచిక నాపై నోలయం గొఱంత లనునే? సిద్ధత్వముం బొందనే! 

కం॥ నిను విశ్వసించి కొలిచిన
జనునకు లభ్యంబు గాని సౌభాగ్యం బే
మిని గానరాదు త్రిజగ
జ్జనకా! యోగావలంబి జనతాతిలకా! 124

వ॥ అని యనేక ప్రకారంబుల నభినుతించి ప్రదక్షిణనమస్కారంబు లొనరించి యానందభైరవుఁ డామంత్రణంబు వడసి నిజపురంబున కరిగి తదీయధ్యానారాధనంబులం బ్రొద్దు పుచ్చుచుండె. నంతట వీరయోగియు— 125

వీరప్పయ్య గోపాలుఁడై కాలజ్ఞానంబు వ్రాయుట

ఉ॥ కంటకసంకటంబు లగు కాననభూము లతిక్రమించి యా
గంటికి నేగియుం గొలఁదికాల మటన్ నివసించి పిమ్మటన్
బంటవలంతి పున్నముల పం టనఁగా బనగానపల్లెఁ జే
రొక్కంట కనంగఁ జేరె నటకుం బురవాసుల పున్నె మెట్టిదో !

సీ॥ ఏయింటి ముంగిట నేఁడుగాలంబును
నివ్వరిపాతఱల్ నిండియుండు
ఏయింటి వాకిట మృష్టాన్నదానంబు
నిఱుపేద జనులకు జరుగుచుండు
ఏ యింటి గృహమున నీశ్వరారాధన
సత్కథా గోష్ఠులు సాఁగుచుండు
ఏ యింటి గోష్ఠంబు లెనలేని గోవుల
మలమూత్రముల తోడ నలికియుండు

గీ॥ న య్యనన్య సామాన్య పుణ్యాత్ముఁగాలు
గరిమ రెడ్డి వేంకట రెడ్డి గరిత మిన్న
యన్నపూర్ణా సదృశ యంచు నచ్చమాంబ
యింటి మొగసాల నిలిచె న య్యొంటివాఁడు ! 127

చం॥ నిలిచినఁ జూచి యా పసిఁడి నిగ్గుల బాలకుఁ డెవ్వఁడో ప్రజా
సులభము గాని శాంతశివసుందరరేఖ ముఖంబునన్ విభా
సిలెడు నటంచుఁ జేరి తన చేరువ చక్కనిఁ గూరుచుండఁగాఁ
బలికియు నచ్చమాంబ మఱి వానికి ని ట్లను సాదరంబుగన్. 128

ఉ॥ ఎయ్యది యూరు! నిన్గను నదృష్టవిశేషము లేరి కబ్బె ? పే
రెయ్యది ? గోత్ర మెద్ది! కుల మెయ్యది? వాంఛిత కార్య మెద్ది? నీ
వియ్యెడఁ గర్ణపర్వముగ నెల్లను నా కెఱిఁగింప వయ్య ! వే
డ్కయ్యెడు నాగ నా గుణగణాఢ్యుఁడు పల్కె మృదుస్మితాస్యుఁడై

మ॥ ఇది నాయూ రన నేల? యీ జగతి నాదే! లోకసంచారు లి
య్యది వాకోఁ బని లేదు జే పిచటు మా పచ్చోటు గాఁగా మెలం
గుదు రీపాటి యెఱుంగవో వినుము నీకున్ దాఁచి పెట్టంగ నే
రదు నా బుద్ధి చరింతు నిప్పటికి వీరప్పయ్య పే రొప్పగన్. 130

కం॥ కులగోత్ర కథన మేటికిఁ?
గులము ప్రధానంబు గాదు గుణము ప్రధానం
బిల నిట్టి ప్రశ్నములు వ్యా
కుల హేతువు లైన వినుము కోరితి వగుటన్. 131

ఉ॥ ఏను మొగాలబమ్మకొల మీ భవమందున, శైశవంబు నం
దే ననుఁ జూసినారు జననీజనకుల్. దయ నింతవానిఁగాఁ
బానముతో సమానముగఁ జూపమ యన్ గుణరాశి పెంచె నా
పై ని భవద్గృహంబునకు వచ్చితి మాటలు వేయు నేటికిన్! 132

ఉ॥ ఆలు గలట్టి రెడ్డిమగనాలవు తాత్వికురాల వంచు నీ
పాలికి వచ్చినాఁడను, కృపాపరతంత్రత గోరు వెచ్చనాఁ
బా లిడఁజాలుఁ గాఅడవిపట్టుల గుట్టలఁ బచ్చబీళ్ళలో
నాలను మేపుచుండి పెనుపారఁగఁ జేయుదు నెల్ల వెంటలన్ 133

చం॥ అన విని వాని మాటలకు నచ్చెరు వంది యిదేమి చోద్య మీ
వనయము నింద యుండుము వరాంబరభోజనమజ్జనాది సా
ధనముల కే కొఱంతయును దారొక్కన నీ నతులప్రశాంతమా
హానసుకుమారబాలకుఁడ వాలకుఁ బాలకుఁ జేయలే నిసీ! 134

కం॥ అని యచ్చమాంబ పలికిన
విని యామె యుదాత్తగుణము పేర్మికి లోలో
నన సంతసిల్లి హాసితా
ననుఁడై కుహనావినోదనటుఁ డిట్లనియెన్ 135

ఉ॥ నా వ్రత మిట్టి దమ్మ! కరుణామతి నానతి యీఁగదమ్మ! సీ
గోవ్రజపాలనంబునకు; గోగణరక్షణ కంటె నొండు పు
ణ్యవ్రత మున్నదే ధరణి? నావచనమ్ములు నమ్మ మమ్మ! ము
న్నా వ్రజభామినీమదనుఁ డాహరి గోపరిరక్ష సల్పఁడే? 136

క॥ అని చూపిచెప్పి వెండియు
ననఘుం డారెడ్డిపడతి నారసి గోపా
లనవృత్తి నాకు నియమిం
పని నాఁ డిందేల? చనుదు వచ్చినదారిన్ 137

కం॥ అన విని యాఁగా దన నే
రని చిత్తముతో నితండు ప్రాకృతవేషం
బున నెవ్వఁడేని ఘనుఁడో
కనియెదఁ గాలంబు గడువఁగా నిమ్మనుచున్ 138

కం॥ తలపోసి యా సతీమణి
తలయూఁచెను వానినుడి కతండు సహోద్యో
గులఁ గలసి పసులఁగాయుచు
నలరించుచునుండెఁ గాననాంతరభూముల్ 139

మ॥ తలకుం బాగ నమర్చిచుట్టి కుడిచేతంబట్టి చోద్యంబుగా
ములుకోలన్ బడితప్పిపోవు పసిగుంపుం గూడఁగాఁ బట్టుచున్
గలయంబల్కుచు గోపడింభకులతోఁ గాంతారభూమీధర
స్థలులం జేరఁగఁబోవు నిచ్చలు పరంధాముండు లీలాగతిన్ 140

గీ॥ అట్లు చనిచని యేకాంత మైన చోట
వటతరుచ్ఛాయ వలయ మొక్కటి రచించి
యావులను నిల్పి తత్సమీపాగ్రశిఖరి
కందరము సొచ్చు నతఁ డేమి కారణంబొ! 141

ఉ॥ ఆవలయంబుఁ దాఁటి కదలాడఁగ నేర వొకప్పు డేని సం
ధ్యావసరంబులన్ గిరిగుహాంతరభాగము నిర్గమించి మా
యావి యతండు వచ్చుసరి కావులు డొక్కలు నిండి నిల్చు మే
లీవుల వేల్పుటావు సరియే మఱి మా కని మూఁపు లూపుచున్

చం॥ తొడుకులఁ దోలికొంచుఁ దనతోడి కుమారులఁ గూడి చీఁకటుల్
పడుసరి కిల్లు సేరు నల పాపమ ముద్దులబిడ్డఁ డిమ్మెయిన్
గడచె నొకింత కాల, మొకనాఁడు యథావిధి నాతఁ డాలతో
నడవినిఁ దమ్ముఁ బాసి చను టారసి తక్కటి గోపడింభకుల్ 143

కం॥ వీరప్పయ్య రహస్యపు
దారినిఁ జనుచున్నవాఁడు తప్పక నేఁడా
తీ రెఱిఁగి తిరిగి వత్తము
రారం డని పిలిచికొని పరస్పరమైత్రిన్ 144

వ॥ వెనుకొని కుమారానటుండు వటావనీరుహచ్ఛాయాప్రదేశంబున గిఱిగీసి గవోత్కరంబునిల్పి పరిసరగిరిగుహాంతరమ్ము సొచ్చుట లరసి భయవిస్మయంబులు మల్లడిగొన మందకాపులు ముం దంజ వేయ నోడి మందచేష్టులై నిలంబడి కొండొకవడికిం దేఱి — 145

కం॥ గిఱి దాఁటి యవలి కరుగక
కర మరుదుగ నిలిచి ధేనుకాండం బెల్లన్
బరు లుబ్బి నెమరు వేయుట
లరసి ప్రభావంబు కలిమి కచ్చెరు వడుచున్. 146

ఉ॥ చూచితిరే! ప్రభావ మిది సుందరశాద్వలభూమి కా దిసీ!
వాచవి గొల్పఁగా; నెమరు వైచుచు నున్నవి పొట్టనిండి న
ల్లే చదు రేర్పడన్ గదుపు, లిట్టి మహామహితుండు చెల్మికాఁ
డై చరియించుచుండ మన యట్టి ఘనుల్ చరితార్థు లుందు రే!

వ॥ అని కదుపుం గదల్చి చూత మని వలయంబుఁ జొరంబాఱ నాత్మ
ణంబ యత్కీర్గోళంబులఁ జీఁక ట్లావరించె. నప్పుడు భయవిహ్వల
మనస్కు లై 'వీరప్ప! మా నేరమి సయిరించి కాపాడ రావే'
యని దీనాలాపంబుల నెలుం గెత్తి పిల్చి వెలువడి యెప్ప టట్ల
దృష్టు లచ్చుటకుం బ్రమోదంబు నంది తమతమ మందల పాలికిం
జని తత్తద్విశేషంబులు వితర్కించుచుం గూర్చుండి రంత నస్త
మయం బగుడు వీరప్పయ్య వారి చెంగటి కరుగుదెంచి 'అన్న
లార! నన్న చీఁకటి కప్పుచున్నను బరాధీనుల రై మిన్నకున్న వా
రే' మనుటయు నవ్వుఁగా దననేరని చిత్తంబులతో 'నేమియు లే'
దని యుత్తరం బిచ్చి కుఱ్ఱలు కుఱ్ఱలుం దోడ్కొని చని యచ్చ
మాంబ నేకతం బరసి — 148

శా॥ అమ్మా! యే మని చెప్ప నోపుదుము వీరప్పయ్య మాహాత్మ్యముల్
మ మ్మెల్లన్ గికురించి దుర్గమవనీమార్గంబు సొత్తెంచి ని
త్యమ్మున్ గోవులఁ గాయుచుండు నతి చిత్రప్రక్రియన్ దత్ప్రకా
ర మ్మెమ్మారసి వచ్చినార మతిమాత్రం బైన యాత్రంబుతోన్.

గీ॥ అనుడు నేమేమి? మన క్రొత్తయాలకాపు
వింత లేమేమి గాన్పించె విశదపఱుపుఁ
డేను దొలుతన యొక్క మహానుభావుఁ
డితఁడు గానోపు నని సంశయించి యుంటి! 150

సీ॥ పనికిమాలిన గొడ్డుఁదనమునఁ జెడ్డపడి
తూలిన యూపడ్డ చూలు మోసెఁ
దెవులుగొంటుఁదనంబు తీఱి వెల్లా వొక్కఁ
డల్లనల్లన నడయాడ నేర్చెఁ

జాఁగ రెక్క తిరుగు నాపొట్టికొమ్ముల గిడ్డి
యపరతిమాదేవి యనఁగ నొప్పు
నొకపూఁట యిచ్చు వే ఱొకపూఁట పా లీని
పుల్లావు పిదికె ముప్పూఁట లందు

ఆ॥ వె॥ నితని పాలనమున నెల్ల గోవర్గంబు
కనులపండు వగుచు మనెడు ననుచుఁ
దలఁచు టేమి నేను దత్తద్విధానంబు
లరసి వెఱఁగు పడుదు నప్పు డపుడు ! 151

కం॥ కావున నానడవడి వినఁ
గా వేగురపడు మనంబు గ్రక్కునఁ జెపుడీ
నావుడు గోపకుమారకు
లావనితకు నిట్లు పల్కి రంచితఫణితిన్ 152

సీ॥ అక్కజం బగు నాతఁ డడవికి నేతెంచి
మాతోడ నెప్పటిమాడ్కి నేఁడు
కనుఁ బ్రామి యొండుత్రోవను బోవుచూఁ జూచి
జుట్టేటి యొడ్డున మట్టినీడ
వలయంబు గీసి గోవులనెల్ల నట నిల్పి
యాగంటి కొండలోయలను దటిసి
యొక బిలంబును జొచ్చు చునికికి వెఱఁ గంది
ముందంజ వేయక యంద నిలిచి

ఆ॥ వె॥ మొదవుపిండు నెడకుఁ గదలుపం దలపోసి
కదియఁజేరి కనులు గానరామి
వానిఁ దలఁచి బైటఁ బడితిమి బ్రతికితి
మే మనంగ నేర్తు మీా విధంబు ! 153

ఉ॥ అంతట నుద్యమించి మఱి యచ్చోటు నిల్వాను వానిచన్న గి
ర్యంతికభూమికిం జనను నచ్చటి వార్త లెఱింగిరా నిసీ!
స్వాంతము లందు బీరములు సాలమి మా పసిగుంపు డాసి వి
శ్రాంతిగ నవ్విచిత్రగుణచర్చయ సల్పుచుఁ బొద్దుపుచ్చుచోన్

వ॥ వీరప్పయ్య విజయంచేసె నతనింగూడి యిటువచ్చితి' మని తమ
కన్న వృత్తాంతంబు విన్నవించుటయు నచ్చెరువడి మనంబు నం
దొక్కింతతడ వేదియో వితర్కించి నిట్టూర్చి వారింబుచ్చి మఱు
నాఁడు మజ్జనభోజనాదికంబులు నిర్వర్తించి మార్గదర్శకు లైన
మందడీలంగూడి చనిచని వర్షీయసీవతంసంబు—

మ॥ అవలోకించె నగాగ్రగణ్యసవిధన్యగ్రోధభూమీరుహ
ప్రవరచ్ఛాయ నిజోదరంబులు ప్రపూర్ణ శ్రీ విరాజిల్లఁగా
నవసీ దేవత మాఱురూపు లనఁగా నజ్ఞాడు గోవర్గమున్
సవిమర్శం బగు చూడ్కితో నభినవాశ్చర్యంబు దైవారఁగన్

గీ॥ చూచి భయభక్తివినయవిస్ఫూర్తిగరిమ
నాలమందకు వలగొని యవలి తెఱఁగు
నెఱుఁగు కౌతుక మురియాడఁ దెఱవమిన్న
య య్యహార్యబిలంబు ధైర్యమునఁ జొచ్చె 157

శా॥ పోవంబోవ వసుంధరాధరదరీభూర్యంధకారచ్ఛటల్
పోవంబోవఁ గ్రమక్రమంబుగ సితామోఘప్రభల్ పైకొనం
గా వాతాశిఫణంబు నీడ నతిలోకగ్రంథనిర్మాణయో
గా వేగంబున గంటమున్ నడపు మాయాబాలయోగిం గనెన్

చ॥ కని వెఱఁ గంది వింతకల గాదుగదా యని తమ్మిచేతులుం
గనులు మొగుడ్చుచున్ దన సకాశమునన్ నిలువంగ నింతిమి
న్నను గని యామహాత్ముఁ డెలన వ్వొలయన్ వెఱవంగ నేటికిన్
గనుగొనఁ మమ్మ! నన్నుఁ బసికాపరిఁ గూరిమిపాలపెంపరిన్

కం॥ అని కరుణాజనకంబుగ
నను మాటలు చెవికి నాట నల్లన మొగుడుం
గనుదోవలు విచ్చి సాష్టాం
గ నమస్కృతి సల్పి కలికి గారవ మొప్పన్ 160

ఉ॥ ఇంకను గప్పిపుచ్చి యలయించు తలంపులు మాన వయ్యా! నో
కింకరుఁ డీవు కావు నిజకింకరకిల్బిషమాలి కావినా
శంకరుఁ డైన యాపరమశంకరుఁ డౌదువు గాని యీ విచి
త్రాంకిత నాటకంబునకు నక్కట! హేతువు తెల్పు మోప్రభూ !

కం॥ ఇచట రహస్యముగా నీ
వచలమనస్ఫూర్తి వ్రాయునట్టి దదేమో !
వచియింప వయ్యా! సదస
త్ప్రచురజనశ్రేణి జాబితా కాదుగదా ? 162

కం॥ నేరక మును నాచేసిన
నేరమి సయిరించి నిత్యనిర్భరకరుణా
వారిధి ! నా సంశయములు
దీఱిచి ప్రోవం గదయ్యా ! దీనశరణ్యా ! 163

వ॥ అని యనేకభంగిఁ బ్రార్థించు నంగనామణి నుపలక్షించి వీరనారా
యణుం డల్లన ని ట్లనియె—— 164

ఉ॥ నీవు సదాశ్రయం బగుట నే నిటు లిచ్చట నుండి యాలకుం
గావలివాఁడనై సుఖముగాఁ గృతులన్ వెలయింపసాఁగితిన్
భావితరంబు మేల్కొలుపు వాంఛ దలిర్పఁగ నెంతయేనిఁ ద
ల్లీ! విలసిల్లు నొక్కొ కృతు లెందు సదాశ్రయ మబ్బ కున్నచోన్

మ॥ లసదాగామిఫలానుమేయ మగు కాలజ్ఞాన మేవంకృతి
ప్రసవం బే నలరింపసాఁగితిఁ గృపాపారీణచిత్తంబువై
వ్యసనంబుల్ వెడఁబాసి శ్రోతృపరితృప్తవ్రాతంబు మోక్షప్రియా
వ్యసనోల్లాసచమత్క్రియాపరిణతిన్ వర్తింతు రిద్దానిచేన్ 166

చం॥ అనవుడు నచ్చమాంబ సకలాంగకముల్ గరుదాల్పఁగా నయం
బును వినయంబు భక్తియును ముప్పిరిగొన్న మనంబుతోఁ బ్రద
క్షిణ మొనరించి యో పరమకింకరవత్సల ! నా యదృష్ట మే
మనఁ బనిఁగొంటి నిన్ను భువనాత్మకు నచ్యుతుఁ బూరుషోత్తమున్!

క॥ ఓ కారుణ్యపయోనిధి !
నా కిఁక భవబంధమోక్షణము సేయఁగదే
నీ కిదియ ప్రార్థనాంజలి
కైకొమ్మా ! యనుడు నతఁడు కరుణాపరుఁడై 168

ఉ॥ మోక్షఫలంబు నందుట కమోఘమహత్తరసాధనంబు పం
చాక్షర మంచుఁ దద్విధిరహస్యము లెల్ల ననుగ్రహించి నీ
వక్షయలోకసౌఖ్యముల నందుదు గా కన నింతి మ్రొక్కి ప్ర
త్యక్షజగద్గురూ ! గురుఁడ వైతివి నాకుఁ గొఱంత లుండునే? 169

వ॥ అని ప్రస్తుతించి నిజాగారంబునకుం గొని చని తదనుమతంబునం గతిపయదినంబుల కొక్క రమణీయప్రదేశంబున నివేశంబు గల్పించి యిచ్చిన నమ్మహాభాగుఁ డంధుండైన తత్కుమారు బ్రహ్మానంద రెడ్డి ననుగ్రహించి దృష్టి ప్రసాదించి మఱియు ననేకమహిమంబులు సూపుచుఁ గాలజ్ఞానవిశేషంబులు యోగవిద్యారహస్యంబులు నెఱింగించుచుండె నంత— 170

ఉ॥ ఆ గురుమూర్తి కీర్తిరుచిరాద్భుతలేఖల కుల్లసిల్లి రా
సాఁగిరి వందలాదిగఁ బ్రజల్ నలుదిక్కుల నుండి జోస్యముల్
యోగరహస్యముల్ తెలియు నుల్లముతో; నివి రెండు యాతనా
రోగుల చిత్తశాంతి కనురూపగుణౌషధరాజముల్ గదా! 171

## కాలజ్ఞాన విశేషములు

వ॥ ఇట్లుండ నొకనాఁడు పరిసరగ్రామనివాసియు విప్రకులోద్భాసియు
నగు వేంకటాద్రిభట్టతనూజుం డన్నాజయ్య యను వాఁ డటవచ్చి
కాలజ్ఞానరచనానివిష్టనిష్ఠాపరుం డైన వీరప్పయ్య నవలోకించి
నమస్కరించుటయు నమ్మహానుభావుఁ డక్షిభ్రువవిక్షేపమాత్రం
బునఁ గూరుచుండం బల్కి నీ వెవ్వండ వేమిప్రయోజనం బపే
క్షించి వచ్చితి వనుటయు నతండు— 172

మ॥ తన వృత్తాంత మెఱుంగఁబల్కి పిదపన్ దద్గ్రంథ మే మంచు న
ల్లన ప్రశ్నించి ప్రజాప్రబోధ మగు కాలజ్ఞాన మంచున్ మునీం
ద్రుని నోటన్ విని విస్మయంపడి దయార్ణోరాశి! యా భావివ
ర్తనముల్ నా కెఱిఁగింపవే యనుచు శ్రద్ధాబుద్ధి నర్థించుడున్

వ॥ వీరప్పయ్య విప్రకుమారుని వినయవివేకంబుల కంతరంగంబున నలరి
కాలజ్ఞానవిశేషంబు లెఱిఁగింతు సావధానాంతరంగంబువై
నాకర్ణింపు మనియె. నయ్యవసరంబున నచ్చమాంబయుఁ దక్కిన
శ్రోతృజనంబును బ్రహ్మాష్టాత్ము లై సవిధోపవిష్టు లై రంతట
నమ్మహానుభావుండు మృదుమధురగంభీరస్వరంబున నిట్లు చెప్పం
దొడంగె— 174

ఉ॥ దుర్మతు లై మదాంధు లయి దోషమలీమసమూర్తు లై యస
త్కర్మము లాచరింతురు వృథానశియింతు రనేకమానవుల్
మర్మము లేఁచు రోగము లలంప నగ ర్తుదు సాధుబోధవా
గూర్మిక లింపుగావు పెనుపొందఁగలేవు యథార్థవాదముల్! 175

ఆ॥ వె॥ సకలజాతిజనులు నొకచో భుజింతురు,
తరుణి పురుషుఁ డగును ధరణి యందు
నీచజాతిజనులు నెలకొంద్రు గురువులై
యీఁత కమరు వింత చేతనములు ! 176

కం॥ సంకరులు యశోబలజి
చ్ఛంకరు లై మెప్పుగంద్రు సత్కుల జన్మల్
కింకరు లగుదురు పాతక
పంకిల మగు దేశ మెల్ల వైదికముఖ్యా ! 177

కం॥ జననీజనకులు విషమం
భనిభులు, పీయూషనిధులు కాంచనగంధుల్
మనుజులకు సత్తమాముల
వినుకొను కోడండ్రు గానిపించుట లరుదే ! 178

చం॥ పరమపతివ్రతామణుల పాలికి నోటమి గల్గు, వట్టిది
మ్మరి వగలాడిచేడియల మాటలు పాటికి వచ్చు రచ్చలన్
గరకరి చిత్తకార్తె శునకంబుల కైవడి గూడిమాడి స్త్రీ
పురుషు లొకళ్లొకళ్లు పలుపోకలు పోవుదు రేమి సెప్పుదున్ ! 179

కం॥ విధవలకు మఱలఁ బెండ్లియు
సధవలకున్ మాఱుపెండ్లి జరుగును, విధవా
సధవా యను భేదం బే
విధమునఁ గానంగరాదు వెలఁదుల లోనన్ 180

కం॥ నమ్మించి గొంతు గోయుదు
రిమ్ముగ బాధింత్రు పాప మెఱుఁగని వారిన్ !
దమ్మిడి కబద్ధ మాడుదు
రమ్మా ! నీపుణ్య మందు రాలికిఁ బురుషుల్ ! 181

వ॥ ఇట్లు దేశం బెట్టకేని పీరభోగవసంతాధీనం బగు మఱియు నసే
కోత్పాతంబులు విచిత్రంబులు వుట్టు నెట్లం చేని— 182

కం॥ మైత్రికి భంగము వాటిల
క్షత్రియులు పరస్పరంబు గలహింతు, రహో
రాత్రములు దేశజను లతి
మాత్రం బగు భీతిఁగూరి ప్రమందుదు రనఘా ! 183

కం॥ పరదేశీయుల పాలన
మరమర లేకుండ సాఁగు నబలారత్నం
బిర నేలుఁ బెక్కు లేడులు
తిరుగున్ మరబండ్లు దేశదేశము లందున్ 184

కం॥ ఉత్తరదేశంబున లో
కోత్తరచరితుండు గంధి యుదయించును వై
శ్యోత్తముఁ డేకుం జేకొని
చిత్తము లలరించు నేకసిద్ధాంతముతోన్ 185

కం॥ హిందూమహమ్మదీయులు
కొందఱు మతమతఁ గొట్టుకొని చత్తురు రా
కేందు నమావాస్యనిశిం
గందురు, పగలింటఁ దారకంబులు వోడుచున్ 186

కం॥ మాడకు మానెడు గింజలు
వాడకు వాడకును సత్రిపంపులు విననౌఁ
జూడనగు నదీనదములు
కూడంబాఱుటలు నెత్తు కురియుట లుర్విన్ 187

కం॥ పలపల మని కృష్ణాజల
ములు దుర్గాదేవి ముక్కుముంగఱ కెగయున్
మెలఁగఁగ మొసళ్లు శ్రీగిరి
జలమయ మగు, నందికొండ సన్నుతి కెక్కున్ 188

కం॥ ఆకాశ మెట్టుఁ బోలును,
మూఁకలు మూఁకలుగఁ దిరుగు ముంగిట నక్కల్
పైకొను నీశాన్యదిశం
గాఁకలు మీసాలులేని ఘనముఖుల బడిన్ 189

కం॥ పలనాఁటిసీమ నొకరుఁడు
కల ధనములు సూచుచుండఁగా దోఁచుకొనున్
దెలుపును భవిష్య దర్థము
లలరఁగ నద్దంకిసీమ నర్భకుఁ డొకఁడున్ 190

కం॥ ఆసింతురు కశ్మీరని
వాసులు నిరపాయ మైన బ్రదుకుం దెరువుల్
గాసింతురు రాకాసులు
వాసింతురు జనులు గ్రాసవాసోలిప్సన్ 191

కం॥ ఒక్కమొగి నౌత్తరాహులు
దక్కినమున కరుగుదెంత్రు దక్కఁగ నసువుల్
మిక్కిలి నిప్పులు రాలును
రిక్కలగమి రాలు బమ్మరిల్లును దిక్కుల్ 192

కం॥ పత్తనము లగును బల్లెలు
బొత్తిగఁ బాతాళగాంగపూరము లింకున్
జత్తురు ద్రావిడు లధికవి
పత్తిం బడి, మూలఁబడును బంచాంగంబుల్ 193

కం॥ ఇల నేఁడూళ్ళను నొక్కఁడు
నిలుచును, రాజ్యంబు నడచు నృపశూన్యంబై
జలదీపంబులు వెలుఁగును,
గెలయున్ బలువైన ధూమకేతువు లనఘా! 194

ఆ॥వె॥ బ్రహ్మసృష్టి నిలుచు బహుభంగి భంగమై,
కిరికిఁ గరిజనించు ధరణి యందు
హీనుఁ డేలు రాజ్య మెంతేని కడిమితోఁ
బంగళాకు గల్గు భంగపాటు 195

గీ॥ నింబఫలములు తాళవృక్షంబు నందుఁ
జింతకాయలు కాఁకరచెట్టు నందు
జాజిపూవులు తింత్రిణీపద్మజ మందుఁ
గాచుఁ బూచును జిత్రంబు గాఁగఁ బ్రజకు! 196

కం॥ శ్రీశిఖరిం బొగ లెగయును
గాశీపుర మందుఁ బెక్కు-కలఁతలు పుట్టున్
నాశిల్లు నలహాబాదును
క్లేశం బగు నమెరికాకు లిబ్బులచెలికిన్ 197

వ॥ అని యుశేషభవిష్యద్విశేషంబు లెఱింగించిన మీఁదట నానంద పారవశ్యంబునం బొదలి యన్నాజయ్య మహాత్మా! వీరభోగ వసంతాధీనంబై నక్షయనంతర మిలాతలం బెట్టి సుఖడోలికలం దూఁగు నదియు విశదీకరించి తెల్పవే యనుటయు నతండు—198

సీ॥ నెల మూఁడువానలు నిండారఁ గురియును
బాడిపంటలకు లోపంబు రాదు
పంచబంగాళమై పాఱుదు రహితులు
కలుగదు కర్మనిష్ఠలకుఁ జెఱుపు

తలిదండ్రులకు సేవ సలుపుదు రాత్మజు
లన్యోన్యముగ నుందు రాలుమగలు
సాధుసజ్జనకోటి సంతోషమును బొందు
ధర్మంబు నాల్గుపాదముల నడచు

గీ॥ షణ్మతము లేకముఖమున జరుగుచుండు
నట చతుష్షష్టికళలు సొంపారుచుండు
సర్వజనముల కబ్బు ధర్మాసనములు
భువన మెల్లను స్వర్గంబు వోలె నుండు! 199

వ॥ అనుటయు నన్నాజయ్యయు నచ్చమాంబయుఁ దక్కటిశ్రోతృజనంబును హర్షాశ్రునిచితనేత్రులును, ముకుళితకరశతపత్రులు నగుచుం బ్రదక్షిణనమస్కారంబు లాచరించి— 200

కం॥ ఏము కృతార్థుల మైతిమి
స్వామీ! మావంటి ప్రజకు జాగృతి గూర్పన్
భూమిఁ జరించు త్రిలోక
స్వామివిగాఁ దలఁతు మయ్య! సంయమివర్యా! 201

ఉ॥ భామలు చాలునే? నినుఁ బ్రభావనిధిం గొనియాడి పాడఁగా
శేషున కేనిఁ; బూర్వముని శేఖరు లిట్లు భవిష్యదర్థమం
జూషల లోని మర్మములు చూపినవారె? ప్రజాకవిత్వసం
శ్లేషముతోఁ బ్రబోధములు సేసి జగత్కథ నుద్ధరించితే? 202

వ॥ అని పరిపరివిధంబుల నభినుతించి సేవించి, రంతట నమ్మఠాధిపత్య మన్నాజయ్య కొప్పగించి వీరాచార్యుండు దువ్వూరి కరిగి యందుండి పాపాంబికాచరమావస్థ నెఱింగి చిక్కబళ్లాపురంబున కరిగి తదంత్యక్రియాకలాపాదికంబు నిర్వర్తించి కందిమల్లయ

పల్లెం జేరి యిల్లువాకిలేర్పఱచుకొని కర్మజ్ఞాన యోగావలంబియై వీరబ్రహ్మాభిధానంబున విరాజిల్లుచుండె నంత—

## యోగఫలము

కం॥ మది నిల్పి బాలయోగము
చదివిన చెవియొగ్గి వినిన జనునకు నబ్బున్
సదసద్వివేకగుణసం
పద గోధనవృద్ధి భావిభాగ్యోదయముల్ 204

## ఆశ్వాసాంతము

మ॥ అనిశధ్యాతసుధాంశుబింబమకుటాభ్యంచత్తుసారాద్రిరా
ట్తనయాధీశ్వరదివ్యతత్త్వమహితత్రయ్యంతతేజోధికుల్
జనరాజీభజమానపూజ్యగుణవజ్జాంపత్యజీవాతుజీ
వనచారిత్రకు లిష్టబంధుజనజీవంజీవజైవాతృకుల్ 205

కం॥ పరమార్థతత్పరహ్లాదం
తరు లాశ్రితపారిజాతతరు లఘుదూరుల్
పరసాధారులు వేంకట
నరసాంబాబ్రహ్మయాభినవసంస్కారుల్ 206

గద్యము॥ ఇది శ్రీపూసపాట్యన్వవాయపయఃపారావారరాకా కురంగలాంఛన సహజకవిపంచానన, కవిశేఖర నాగేశ్వరప్రణీతంబైన శ్రీవీరబ్రహ్మేంద్ర చరిత్రంబు నందు బాలయోగం బను ప్రథమాశ్వాసము—

# శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్రము

## ద్వితీయాశ్వాసము - రాజయోగము

కం॥ శ్రీమన్మంగళగిరిశ
స్వామిపదాంభోజయుగళభక్తిశ్రద్ధా
శ్రీముఖవేంకటసరసాం
బామహితబ్రహ్మయార్యమత్పితృపాదుల్ 1

గీ॥ అవధరింపుఁడు లోకకళ్యాణకరుఁడు
భావికాలజ్ఞుఁడైన యా బాలయోగి
కందిమల్లయ్యపల్లె నేకాకి యగుచుఁ
గర్మయోగావలంబియై గడుపుచుండ 2

### శిశిరర్తు వర్ణనము

కం॥ హేమంతము తుహినకణ
శ్రీమంతము గడవఁ దెప్పటిలి హారిదశ్వ
స్వామిరథాశ్వము లుత్తర
భూమీయాత్రాభిలాష మూరింబోయెన్ 3

మ॥ పొలయల్కం గలుపించి బాల పెడమోముం బెట్టి త్రోపాడినన్
జలికిన్ నాలవజామునన్ దన పరిష్వంగంబు మన్నించి చెం
పల కొత్తిల్లి కవోష్ణకుంభకుచముల్ వక్షంబు సంధింపఁగా
నలరుం బ్రాణవిభుండు తత్సుఖరహఃప్రారంభవిస్రంభుఁడై 4

మ॥ అలరారెం బోరుగిండ్లు పెండ్లిపసతో నల్లుండ్రతో నంచు భ
ర్తలకుం గూఁతుల ముద్దుముచ్చటలు ప్రస్తావించి ప్రౌఢాంగనల్
చలికిన్ బావురు మంచు వారలయు పజ్జంజేరి కవ్వించి రా
త్రుల నోలార్తు రనంగరంగరతిచాతుర్యం బవార్యంబుగన్ 5

మ॥ చదువుల్ సంధ్యలు కత్తిసాముగరిడీ సాలించి నాజూకుగాఁ
బదపద్యంబులు వాడుచుం దిరుగుచున్ బాజారులం బ్రొద్దుపొ
చ్చి దెసల్ సూచుచు బ్రహ్మచారులు నిశాశేషంబు దుప్పట్లలో
నొదుఁగం దీఱనిబాధతోఁ గొలుతు రయ్యో!యంచు నిట్టూర్పులన్

సీ॥ మంచుదెబ్బకు సంచలించి సరోజిని
రవిని స్మరించుచు నవసి పోయె
నమలజీవనరేఖ నప్సరోనికరంబు
తరణి ముందఱఁ దళత్తళల మెఱసెఁ
గ్రమముగా దివసరాత్రములు సత్యాసత్య
ములు వోలెఁ బెంపుదెంపులను గనియె
ననిలుని తాఁకున నాకురాలిన తీవ
యరుదారు నగ్నసుందరిని దెగడెఁ

గీ॥ బాడిపంటలు విరివిగాఁ బరిఢవిల్లె
రాజవీథులు తడిపొడి రాళ్ళు లయ్యె
సామ్యశీతోష్ణభావంబు సంపతిల్లె
శిశిరహృదయంబు మనుజుల వశము నయ్యె ! 7

సీ॥ క్రొత్తబియ్యము దంచుకొని తిన్నయటుకులు
గజ్జునఁ ద్రేఁచె మాగాణిమగువ
మిరెపకళ్ళంబుల మేల్కోని కాంతునిఁ
గసరి చూచెను మెట్టకాఁపుఁబడఁతి

పరమమాఘస్నానపరిశుభ్రదేహమై
హరునిఁగీర్తించె బ్రాహ్మణవధూటి
కళ్యాణతిలకాదికముల సింగారంబు
వెల సెప్పకుండిరి పెండ్లికూఁతు

గీ॥ లింత తీటిక మఱియింత హెచ్చుటికయు
నింత పరమార్థచింతన మింత సొబగు
గానిపించునె తక్కినకాల మందు ?
విమలతర మగు శిశిరకాలమునఁ గాక ! 8

శా॥ ఈమాఘంబున నింటనింటఁ గన నౌనే పెండ్లిపేరంటముల్ !
కామద్వేషికథాసుధామథనకాలక్షేపముల్ ? భవ్యమై
యీమాసంబు సమాస మయ్యెను గదా? యీరక్తి నాముక్తి నా
హా ! మాఘం బుభయోపభోగ్య మగు నిష్టావాప్తి దృష్టాంతమై!

ఉ॥ వేణువినోదగోష్ఠు లలివేణుల నోముల సంబరాలు గా
మీణుల యాటపాటలు సమీపజనంబుల మెచ్చికోళ్ళు క
ళ్యాణమహంబులుం బోలుచు నా శిశిరర్తువు నందు నిత్యక
ళ్యాణము పచ్చతోరణము నై విలసిల్లెను వాడవాడలున్ 10

ఉ॥ ఆశుభకాల మందు నవయౌవనరూపకళావిలాసపం
చాశుగమూర్తి తానును గృహస్థుఁడు గాఁగఁ దలంచి వీరయో
గీశుఁడు దివ్యదృష్టిఁ బరికించె నొకానొక కన్యకామణిన్
శ్రీశుభలక్షణాంగి గుణసింధువు సాధుజనైకబంధువున్ 11

కం॥ పరికించి తద్వధూమణిఁ
బరిణయ మాడంగఁ దలఁచి పయనం బయ్యెన్;
బరమేశ్వరుండె యైనను
జరుగునె పరువంబు నందు సతి లేకున్నన్ ? 12

## గోవిందాంబ స్వప్నసుందరు నపేక్షించుట

వ॥ పెదకోమిర్ల గ్రామవాసియు, విశ్వకర్మకులోద్భాసియు నగు శివ
కోటయ్య కూఁతురు గోవిందాంబ నాఁటిరేయి స్వప్నంబునం
దవ్విశ్వాత్మునకు నాత్మార్పణ మొనర్చి మేల్కొని సమస్తస్వప్న
వృత్తాంతంబును గన్నవారికి విన్నవించి వెండియు నమందమందాక్ష
భరంబున మృదుమందస్వరంబునం దనడెందంబు తదీయస్వప్న
సుందరు నెడ లగ్నం బగు టెఱింగింప నచ్చెరువడి కన్నతండ్రి
గారాలకూఁతున కిట్లనియె— 13

కం॥ తల్లీ! యిదేమి చోద్యము
కల్లగదా! స్వప్నగాథ కాంక్షింపంగాఁ
జెల్లదిది బుద్ధిబలమది
యెల్లను నేఁ డెందుఁ బోయె నెఱుఁగం జెపుమా? 14

కం॥ కలఁ దోఁచినట్టి పురుషుం
డొలికించునె కూర్మిపేర్మ లూరా? పేరా?
వలపు మఱొక్కనిఁ గాలికి
బలపము గట్టికొని తిరిగి వానిం దెత్తున్ 15

ఉ॥ ఎందఱు నిన్నుఁ గోరి మనయింటికి వచ్చిరి? వారిలో నొకం
డుం దగఁ డన్నో నీకు నిపుడో మఱియాతఁడు స్వప్నసుందరుం
డెందుల నున్నవాఁ డనుచు నే నరయించెద నమ్మ! చెప్పుమా!
యందని మ్రానిపం డిది సుమా! పరిహాసము పాలు గాకుమా!

కం॥ అను నంత తల్లి యిట్లనుఁ
దనయను జేరంగఁ జీరి తగుమాటలతో
ననుచితవాంఛిత మేటికి?
వినుఁగొనుఁ మతిసౌఖ్యదములు పితృవాక్యంబుల్ 17

వ॥ అని పలుకుచున్న కన్నవారిం జూచి కన్యకాలలామంబు— 18

క॥ నను ని ట్లాడిన మీ కే
మని యు త్తర మిచ్చుదాన నా సుందరుఁడే
చనుదెంచు నిటకు ననుఁ గా
వను బ్రోవను జూడుఁ డిది యబద్ధం బగునో! 19

క॥ వినఁదగని మాట లాడుదు
రనుచితముగ వేఱ యొకని యర్థింపు మటం
చు నిదేమి సమంజస మొ
క్కానికిన్ మన సిచ్చి పుచ్చుకొనుటలు తగునే! 20

వ॥ అని నిశ్చితంబుగాఁ దన మనోభిప్రాయంబు వెలివుచ్చు సుత
కితరంబు వల్కనోడి 'భవదభీష్టంబు సిద్ధించుఁ గావుత' మని
యయ్యాలుమగలు తదీయస్వప్నసుందరు నాగమనంబు ప్రతీక్షించు
చుండి రప్పుడు— 21

మ॥ కలలోఁ దోఁచిన వాని రూపు మదిలోఁ గ్గై సేసి ధ్యానించుచున్
దలిదండ్రుల్ తనకోర్కి తీర్తు రను నుత్కంఠామతిన్ వాని రా
కలకున్ దిక్కులు సూచుచున్ గడపు నా కన్యాలలామంబు; ని
క్కల యానే యిది ! యెందు నిట్టి వలపుల్ కళ్యాణమూలంబులే!

వ॥ అంత నొక్కనాఁడు— 22

సీ॥ మేలిమి కెనయైన మేనిచాయల వాఁడు
పూర్ణ చంద్రుని గేరు మొగము వాఁడు
నీలాలకము లొప్పు ఫాలభాగము వాఁడు
కమలసంకాశనేత్రముల వాఁడు

తరుణరేఖఁ దనర్చు నొఅపుమీసల వాఁడు
దరము నిర్జించు కంధరము వాఁడు
ఆజానుదీర్ఘంబు లైన చేతుల వాఁడు
పఱపైన చక్కని యురము వాఁడు

గీ॥ శాంతశృంగారవిశదవేదాంతకళలు
చేరి కొలువైన యట్లు భాసించువాఁడు
గొడుగు పావలు ధరియించి వడు గొకండు
వచ్చి నిలిచెను గృహముఖద్వారవీథి 24

వ॥ అదిచూచి శివకోటయ్య స్వాగతంబు పలికి సమంచితమంచాసీనుఁ జేసి యతనిం బోతులూరివంశపయఃపారావారరాకాసుధాకరుండును,వీరబ్రహ్మాభిధానవిరాజమానుండును. గందిమల్లయపల్లీనివాసుండును, గాలజ్ఞానకర్తయుంగా నెఱిఁగికొని యుచితాలాపంబు లాడుచు న్నెడ—— 25

చం॥ ఎడనెడఁ బుల్కుపుల్కున సితేక్షణముల్ పఱఁగించి తల్పు చా టిడుకొని చూచుచున్న చెలి యించుక మున్కొని బేలయై బయ ల్పడె, నతఁ డింతి నెమ్మొగముపై నునుఁజూడ్కులు గ్రుమ్మరించె;న ప్పుడ గృహమేధి యిర్వుర సముత్సుకతల్ గని యేఁగ లోనికిన్

వ॥ అంతట నతఁ డానాఁటి స్వప్నంబున సాక్షాత్కరించిన మనోహరుండని కుమారికానతంసంబు గుఱుతించి తల్లిదండ్రుల కెఱింగించి నిజమనోరథంబు చెల్లింపుఁ డని వేఁడుకొనుటయు నొక్కింత తడ వాలోచించి శివకోటయ్య గారాలకూఁతుం జూచి యి ట్లనియె——

గీ॥ గోత్రసూత్రాదికంబు తద్గాత్రరేఖ
పాత్ర మైనది గాని యీ బాలకంబు
కేవలదరిద్రనారాయణావతార
మనక తప్పదు మన సొప్పదమ్మ! నాకు 28

గీ॥ కంటి కింపైన వాఁ డని కలువరింతు
వంతియే కాని యితరంబు నరయ నేర
వా దరిద్రపుసంసార మీఁద లేవు
వినుము నామాట చింతింపఁజనదు పిదప 29

గీ॥ తల్లిదండ్రులు లేరు సోదరులు లేరు
కందిమల్లయపల్లె నేకాకి యగుచు
బ్రతుకు నీతనితో నను వ్రతనిరూఢి
నీకు ననుదినగండంబు గాక యున్నె ? 30

గీ॥ లలి నయోదారుతామ్రశిలాసువర్ణ
సృష్టికర్తలు మనమయత్వష్టృసములు
శిల్పివిశ్వజ్ఞసదృశు లనల్పవేద
వేదు లెందును నీకుఁ గాన్పింప రేమి ? 31

సీ॥ నీరాశి సేతువు నిర్మింపఁ జాలిన
నలు నీసడించు కౌశలము వారు
బౌద్ధగాథావళి పాలరాపలకపైఁ
గూర్చు నాగార్జును నోర్చు వారు
హంపీపురంబు శిల్పాంగ మాడించిన
టెంకణాచార్యు నోడించు వారు
దక్షిణాపథమున సాక్షాత్కరించిన
జక్కన నొల్లని చదురు వారు

గీ॥ వేదవేదాంగవిద్యల విశ్వరూపు
నధిగమింపంగఁ జాలిన యట్టి వారు
నిన్నుఁ గోరుచునుండ నే తెన్ను లేని
యీ దరిద్రుని నాసింతు వేమి తల్లి ! 32

సీ॥ ఆకాశసంచార మభిమతంబా ? పుష్ప
కరహస్యవేత్త గంగాధరుండు
జలధిసంచారంబు సమ్మతంబా? జలాం
తర్గామినిర్మాత తారకుండు
భువనసంచారంబు బుద్ధియా? యేకాశ్మ
రథరహస్యజ్ఞుండు రాజలింగ
మద్భుతసౌధవిహారంబు గోర్కియా ?
మయసభావిజ్ఞుఁ డుమామహేశుఁ

గీ॥ డింత యేమిటి కిల నయస్కాంతదుర్గ
మిష్టమా ? భవన్మాతులుఁ డెట్టయెదుటఁ
గూర్పఁగానేర్చు; నిది యేమి కొండద్రవ్వి
యెలుక నొక్కండు పట్టంగఁ దలఁతు విభుఁడు ! 33

వ॥ అని నప్పుడు కన్నతల్లియుం గుమారి ముంగురులు సవరించుచు-34

కం॥ ఒకనాఁటి దగునె వైవా
హిక మన ? వేయేండ్ల పంట యింతటఁ జనునే ?
నకనక లాడుచుఁ బుట్టిం
టి కటాక్షము నోరు లేని డెప్పరము గదా ! 35

సీ॥ కరణీక మమరు నక్షయలింగము సుతుండు
చూడఁజక్కని వాఁడు గాఁడె నీకు ?
నగరంబులో షరాబుగిరి చెలాయించు
నాచారి తెలి వింత యన వశంబె ?
నైగమాధ్యాపనోద్యోగి మన్వాచార్య
శివశర్మ వాగ్ధాటి కెవరు సాటి ?
ఆస్థానశిల్పీంద్రుఁ డైన కామాచార్యుఁ
డనుభవించు సుఖంబు లలఁతి వగునె ?

సీ॥ గీ॥ వారి నెవ్వరి నొల్లక దారి నరుగు
వెఱ్ఱిబాగుల జోగిని వేఁడుకొందు
వక్కటా! యింత మతిహీన వని మెఱుంగ
నేమి గానున్నదో మీఁద నీశ్వరేచ్ఛ! 36

వ॥ అని నిట్టూర్పుం గటకటంపడి చిరంటికాలలామ మమ్మాటలు నిరాకరించి సముచితాలాపంబుల నిట్లనియె— 37

ఉ॥ లౌకికదృష్టి విద్యలు విలాసములుం బరికించి యీ జయ
శ్లోకు నిరాకరించి నను లోఁకువ చేయన చూతు రేల? మీ
వాకొని నట్టివార లటువంటి మహామహు లైరి గాక! స్వ
ర్లోకసుఖంబు లొల్లక నలున్ దమయంతి పరిగ్రహింపదే? 38

గీ॥ కేవలదరిద్రనారాయణావతార
మని వగర్తురు నాదు భాగ్యమునఁ జేసి
కలిసి రాఁగూడదా? యట్లు కలిసి రాక
తక్కుటయు మేల యగుఁ దల్లిదండ్రులార! 39

గీ॥ ఏమిటఁ గొఱంత లేనినాఁ డిందువదన
సాధ్వి యనిపించుకొనుట కష్టంబు గాదు
లోపభూయిష్ఠ మగు నట్టి కాఁపురంబు
దిద్దికొని పేరు నిలుపుట దెప్పరంబు! 40

మ॥ మును సావిత్రి నిజేశుతోఁ గలసి సమ్మోదంబుతో జీవయా
త్రను సాఁగింపదె కాననంబులను? మత్ప్రారబ్ధదోషంబు లె
ల్లను బోకార్పఁగ నేర్తురే! ప్రథితకాలజ్ఞాననిష్ణాతుఁ జే
కొని జామాతగఁ బేర్మిఁ గాంచుటకు సంకోచింతురే యెవ్వరున్?

మ॥ పతి కష్టార్జిత మైన యంబలియ త్రావంజూచుఁ గాకే పతి
వ్రత యాసింపదు పుట్టినింటి బ్రతుకున్ బ్రాణేశు నోనాడినన్
బిత నైనన్ సయిరింప లేదు, పతి నిర్వేదంచు దక్షప్రజా
పతి పాలం బడెనే ? భవాని పతి నోవంబల్క సైరించెనే ? 42

మ॥ వినుఁడీ నాదు ప్రతిజ్ఞ రిత్తపలుకుల్ వేయేల ? చిద్రూపమో
హనరేఖాఖని వీని నాడుదు వివాహం బట్లు గాదేనిఁ గ
న్యనుగా నుండుదుఁ దత్పదాబ్జయుగళధ్యానంబు గావించుచున్
జొనుపన్నేరను నాదు చూడ్కి నొరుపై జొబ్బిల్లు మోహంబునన్

వ॥ అని పురపురంబొక్కి సీత్కారంబు సలుపు కుమారిం జూచి శివ
కోటయ్య 'భవన్మనోరథంబ నెరవేర్తు విచారింపకు. మూఅడు'
మని పల్కి శిల్పాచార్యులైన కులవృద్ధుల రావించి తత్సమ
క్షంబు నం దితనికి మత్తనూజ నీఁ దలంచితి నని పల్కిన విని వెడ
నవ్వు మొగంబున న వ్వాడు గి ట్లనియె— 44

ఆ॥వె॥ పేదవాని కేల పెండ్లి పేరటములు ?
భార్యఁ దనుపు కలిమి బలిమి వలదె ?
దారి నరుగు నన్ను దయఁ జూచినారలు
చాలు నొండు వలదు చనఁగ నిండు ! 45

ఆ॥వె॥ వియ్యమునకు నేని కయ్యంబునకు నేని
సమత వలయు నండ్రు సరసజనులు
దిక్కు మొక్కు లేని దీనుండ నేనెడ !
కలిమిపంట యైన కన్నె యెడ ! 46

కం॥ అన విని కులపతి యిట్లను
నినసన్నిభ ! పిలిచి పిల్ల నిత్తు మనంగా
వెనుకొనుదు రేమి ? ప్రజ్ఞా
ధనుఁడవు నీసాటి యెవరు ధనవంతులలోన్ ? 47

శా॥ కాలజ్ఞానవివేకివై దశదిశాకంబైన విఖ్యాతితో
నాలం గాచిన నీవ దిక్కగుదు వన్నా! మా కిసీ! దిక్కెవ్వ
కేక్క లే దయ్యెనె నీకు? నేమిటికి నీ విట్లాడి యూడింపఁగా
బాలారత్నము నిచ్చగించి మది సైఁపంజాడు మమ్మెల్లరన్ 48

వ॥ అని తదంగీకారసూచకదరస్మితంబు నతని వలనం బడసి శుభ
ముహూర్తంబు నిశ్చయించి పంచి రంత— 49

## వివాహ మహోత్సవము

చం॥ అరుదుగఁ దీర్చి దిద్దిరి గృహంబును దోరణపాళు లొప్పఁగా
నరుగు లమర్చి ముగ్గు లిడి రంతటఁ జక్కని పెండ్లిపంది రే
ర్పఱచిరి కమ్మనైన బలువంటకముల్ పచరించి రింపుఁగాఁ
బరిజనయుక్తి బాంధవులు వచ్చి రపూర్వవిలాస మేర్పడన్ 50

సీ॥ ఒకచోటఁ దరుణుల ప్రకటసల్లాపంబు
లొకచోట బాలబాలికల గోల
లొకచోట వృద్ధజనోచితాలాపంబు
లొకచోటఁ బండితనికరగోష్ఠు
లొకచోటఁ బొరుగువారికిఁ జూపు పారియూద
లొకచోట మధురగాయకుల చెణుకు
లొకచోటఁ బనివాండ్ర చకచక మను పోక
లొకచోటఁ బిండివంటకపు గొడవ

గీ॥ లొకట లోకాభిరామాయణోపపాద
నమ్ము లొకట బంధువిమర్శనంబు లొకటఁ
బరమమాహూర్తికుల హడావడులు గాఁగఁ
బెల్లు కోలాహలం బయ్యెఁ బెండ్లి యిల్లు ! 51

ఉ॥ స్నాతక మాచరించుకొని సంభ్రమతో మురజాదివాద్యముల్
చేతములం గరంప నిరుచెంతల నాప్తులు నిల్వ రూపరే
ఖాతిశయుండు పెండ్లికొడు కంతట రా నెదురేఁగి కన్యకా
దాతలు తోడితెచ్చి రుపధాసుభగంబుగ నర్ఘ్యపాద్యముల్. 52

వ॥ అంతట సుముహూర్తం బాసన్నం బగుటయు వరుం డవికల్ప
సంకల్ప పరుండై — 53

కం॥ కింజల్క శోభికంజ మ
నంజాలు నల క్తకాభినవపద మునిచెన్
రంజిల్లు పెండ్లి చవికెను
మంజులవాద్యములు నిగమమంత్రము లెసఁగన్ 54

గీ॥ కన్యకాదాత మధుపర్క ధన్యుఁ జేసి
ధవళవస్త్రంబు లిచ్చి నంతన వరుండు
వానిఁ గైసేసికొని భాసమానుఁ డయ్యెఁ
జంద్రికాలంకృతుం డైన చంద్రు నట్లు ! 55

కం॥ మంగళగౌరీవ్రతనియ
తాంగినిఁ దెరబట్టి నిల్పి రావలి పీఠిన్
మంగళదేవతయో యని
రంగన లవ్వధువుఁ జూచి యబ్బురపడుచున్ 56

మ॥ సుముఖాంతఃకరణంబుతో వరుఁడు నచ్చో నాగమోక్తప్రమా
ణములన్ 'నాతిచరామి' పల్కఁగను గన్యాదానముం జేసి 'తు
భ్యమహం సంప్రదదే' యనున్ 'నమమ' చెప్పం డా వధూదాత, రు
క్మమహీదానమ ? నాది కా దనుకొనంగాఁ గన్నకూఁతుర్గదా !

క॥ తెర వంప నప్పు డిద్దఱ
తరతమభేదంబు లెన్నఁ దరమే యని చూ
పఱు నిర్నిమేషదృష్టులు
వఱపిరి చోద్యముగ ముక్కుపై వ్రేళ్లిడుచున్ 58

సీ॥ బాలికామణి చూడ్కి పతిపాదముల వ్రాలి
యల్లనల్లన మీఁది కధిగమించు
వరుని చూపులు బాలవదనంబుపై వ్రాలి
పయ్యెద కెగఁబ్రాకి పట్టు దప్పి
నడుమ నొండొరు చూడ్కు లొడఁగూడి తడఁబడి
మందాక్షభరమునఁ గ్రిందు లగును
బునరపేక్షాదృష్టి కొనసాఁగి సోగలై
చిఱునవ్వుఁదొలకరి చిత్తగించు

గీ॥ నవ్వధూవరనవకటాక్షాంచలముల
జాలువాఱు కుతూహలసంభ్రమములు
సూచి యబ్బురపాటునఁ జూప తెల్ల
నల్లసిల్లి దీవనఁబ్రాలు సల్లి రపుడు ! 59

ఉ॥ మంగళవాద్యఘోషములు మ్రోగ్గలయంగఁ బురోహితోక్తులన్
బొంగుచు నవ్వరుండు కరముల్ జడక్రిందికిఁ బోవనిచ్చి వే
డ్కం గనకాంగికంఠమునఁ గట్టెను మంగళసూత్ర ; మాపసన్
దొంగలిఱెప్ప లెత్తి జరిత్రోకు చుఁ జూడఁ గురంగలోచనల్ !

గీ॥ జంపతులు వారివారి హెచ్చరిక కలరి
పోసి రొండొరు శిరసుల సేసఁబ్రాలు
అమ్మలక్కలు మిగులు చే యనిరి చెలినిఁ
జాలతో బెట్టుకొని యొర్వఁగలరె మగలు ! 61

చం॥ కిసలయపాణిపాణిఁ దనకేల గ్రహించి వరుండు రిక్కతో
వసుమతిఁ జుట్టివచ్చు శశిభంగిఁ గృశానునకుం బ్రదక్షిణం
బు సలుపు పట్లు నాకబలిముఖ్యము లైన క్రియాకలాపముల్
రసభరితంబులై మది గరంప నివాళులు పట్టి రైదువల్ ! 62

వ॥ ఇట్లు నయనోత్సవంబుగాఁ బరిణయోత్సవంబు ప్రవర్తిల్ల నిష్టబాంధవకోటి సంతుష్టపఱచి యుల్లు నెల్లభంగి బహూకరించి గృహిణీ సహితుండై గృహమేధి దుహితం జేరి కవుంగిట గ్రుచ్చి బుజ్జగించుచు నుచితవాక్యంబుల నూఱడం బల్కి వరునికరంబు లందించుచు— 63

ఉ॥ కంటను వత్తిఁ బెట్టుకొని కాచిన కూరిమిపంట నీవశం
బంటిమి వెన్నవంటి దిది యన్యులఁ బంటిది గా దెదిర్చి వా
కొంట యెఱుంగ దిర్వు రనుకూలముగాఁ బదికాలముల్ సుఖం
బుంటయ మా యభీష్ట మెటనుండిన నే మది వింటకే కదా ! 64

ఆ॥ వె॥ అనుచు నుమ్మగిల్లు నయ్యాల్మగలఁ జూచి
సుతలఁ గన్నవారు కుతిలపడిరి
సుతలఁ గన్నవారి వెత లించుకేనియు
నెఱుఁగ నేర్తు రెట్లు లితరజనులు ! 65

సీ॥ ఇచ్చిన దానితోఁ దృప్తినందక తెమ్ము
తెమ్మని పీడించు దేబె యొకఁడు
ఎంత తెచ్చిన యేని నిల్లాలు తిన్న ఖ
రై పోవు నని యేడ్చు నాఁప యొకఁడు
పెడమొగం బెడమొగం బిడుకొని స్వేచ్ఛావి
హారధీరుం డగు వ్యర్థుఁ డొకఁడు
నిర్హేతుకముగ నిందార్హను గావించి
భార్యను బాధించు భ్రష్టుఁ డొకఁడు

సీ॥ ఆ॥ వె॥ కాఁగ నల్లు రొక్కొకరి పాలఁ బడుచుంద్రు
పాతకంబు కొలఁది రాత కొలఁది
పెంచి పెద్ద చేసి ప్రీతి నొకయ్యకు
నప్పగించు వఱకె యోఁడుపడుచు ! 66

చం॥ అపు డుచితో క్తులం బలికి యుత్తకు మామకు నుత్తమోత్తమ
స్థపతులకున్ వరుండు ప్రమదాసహితంబ నమస్కరించి క
ప్రపుఁ జమికీ సరంబుల నురంబులు గ్రాలఁగ మేళతాళముల్
విపుల విరావముం జలుప వేఁడుక నెక్కెను బూలపాలకిన్. 67

శా॥ ఊరేగింపును జూడ వచ్చి రతిమాత్రోత్సాహ సంరంభతన్
సారంగాక్షులు కాంచికాకనకఘంటారావమున్ మంజు మం
జీరారావము కంకణక్వణనమున్ జెల్వార మైఁదీఁగలన్
భారంబై కచముల్ కుచంబులు నితంబంబుల్ వడంకింపఁగన్. 68

శా॥ ఆకర్ణాయతలోచనంబులు ప్రసన్నాలోక చిహ్నంబులై
యాకర్షించుచు నుండ, వేణి ఫణిరాజందంబు మై శ్రోణిపైఁ
దోఁ కాడించుచు నుండఁ జిన్నగవు చిందుల్ ద్రొక్కఁ జెక్కిళ్లపై
రాకాచంద్రనిభాస్య యొూర్తు మనసుల్ రంజించెఁ బ్రత్యక్షమై. 69

సీ॥ వట్టువ జడచుట్టు పైని బంగరు లేడి
పూదండతోఁ బ్రొద్దు వుచ్చుచుండఁ
జిఱుచొట్టఁ బుగ్గపైఁ జిఱునవ్వు దొంతర
తాటంకమణి కాంతిఁ దఱుముచుండ
బిగువైన పూపైక నిగుడుచు మొనచూపు
చనుదోయి పయి పైఁట జాఱుచుండఁ
దొడలరాయిడికి నాగడమైన కుచ్చెళ్లు
లడుగుల నంటి జీరాడుచుండ

సీ॥ గీ॥ గంధగజయాన యోర్తు వేగముగ నరిగి
దృష్టి సారించి యిద్దఱి యీడు జోడు
లందచందంబు లారసి యాడు గఱచెఁ
జూపఱ మనంబు జుబ్బనచూఱ గాఁగ ! 70

చం॥ విరిసిన క్రొవ్విరిం బరిభవించిన బిత్తరి లేఁత పాలకో
బ్బరి బిగిచన్నుదోయి గరువంబున నిక్క నొయారి పోడుముల్
గఱచిన మాటకారి యొక కన్నెమిటారి కటారి చూపులం
బఱపుచు నవ్వధూమణికి వాయన మిచ్చె వరప్రసాదముల్. 71

చం॥ వనిత యొకర్తు దృష్టి వఱుపన్ బరదా తొలఁగించి వీథికిన్
వినుకలి దానిఁ జూడఁగను వేచిన యాతని కన్నులం బడెన్
జెనకి పరస్పరంబు నడిచెన్ గనుచూపులు రాయబారులై
తనువు లొకండు గాఁగఁ బరదా బిగుమానము లడ్డు వచ్చెనే ! 72

చం॥ పతి తనకాంత కవ్వధువు వైఖరిఁ జూపుచు నిట్టి కోమలిన్
సతి యనఁ జెల్లు నా, వరుని చందము మెచ్చుచు నిట్టి పూరుషున్
బతి యనఁజెల్లు నంచు నది పల్కెను, నాల్క నడంచె భర్త; దం
పతులు వినూత్నదంపతులపై వెదఁ జల్లిరి రాగమంజరుల్ ! 73

సీ॥ చూచితిరే ! మనస్ఫూర్తిగ వరియించి
కోరిక లీడేర్చుకొనిన బాలఁ
గనుఁగొంటిరే ! బాలికా మనోధన మెల్ల
నాఁచికొన్నట్టి సుందరకుమారు
నాలింతురే ! యీమె యధిపు నంతర్దృష్టి
సాక్షాత్కరించిన జ్ఞానలక్ష్మి
వింటిరే ! రాఁగల వృత్తాంతములు పూస
గ్రుచ్చిన రీతి వాక్రుచ్చె నితఁడు

గీ॥ ప్రకృత వేషంబు మై రతిప్రసవశరులు
ప్రకృతిపురుషులు వచ్చిరో! యొకట నిట్టి
సారసౌందర్య వినుత విజ్ఞాన రేఖ
లమరునే? యని యెల్లవా రబ్బపడిరి! 74

వ॥ ఇట్లు జగన్మోహనంబుగా నుత్సవంబు ప్రవర్తిల్లఁ గంది మల్లయ పల్లెం జేరి సతీసమేతంబుగా గృహప్రవేశం బై వీరబ్రహ్మంబు గార్హస్థ్యంబు నడపుచుం బరబ్రహ్మ తత్త్వోపాసన మాచరించు చుండె నప్పు డద్దాంపత్యంబు ప్రశాంత వాతావరణంబు నాఁటి నదీప్రవాహంబున సుధాంశు మరీచికలం దోఁగుచుం బోవు పూఁదెప్పం బోలె నభినుత్యం బయ్యె నట్లు గాదె! — 75

చం॥ మగని మనోగతం బెఱిఁగి మక్కువతో మసలంగఁ జాలు నా
మగువయె భార్య, యట్టి గుణమాన్య లభించిన వాని భాగ్యమే
మిగులఁ బ్రశస్త, మా బ్రదిమి మెచ్చి లయించుట సాజ మెప్పుడున్
మగువ గుణాగుణంబులు సుమా! మగపాడికిఁ గారణాంకముల్!

రాజయోగి నిజవల్లభకుం బిండోత్పత్తిక్రమంబు సెప్పుట

శా॥ ఆయిల్లాలు మనోజరాజ్యరమయై యాత్మేశ్వరప్రేమ డో
లాయోగానుభవంబులం బడసి చూలా లయ్యె వేవిళ్లు మెం
డాయెం జెక్కులు పాలిపోయె గమనాయాసంబు హెచ్చాయెఁ బెం
పాయెన్ నెన్నడు మెక్కడాయె నెదలో నాశాలతాంకూరముల్

వ॥ అంత నొక్కనాఁ డాత్మేశ్వరిం జూచి రాజయోగీశ్వరుండు— 78

ఉ॥ ఎన్నడు నబ్జసన్నిభముఖి! నను నియ్యది తెమ్మటంచు వా
కొన్నది లేదు నీ విప్పుడు గుర్విణి వాస లపారముల్ గదా?
క్రన్నన నీ మనోరథ పరంపర దీర్పఁగఁ జూతు వేఁడు మా
యన్న నెలంతమిన్న వినయంబున భర్తను జూచి యిట్లనున్. 79

ఉ॥ సాధుజనాగ్రగణ్యుఁడవు సంయమశీలివి నీవు నా మనో
నాథుఁడ వైతి విట్టియెడ నాకుఁ గొఱంతలు గల్గ నేర్చునే
యీధర నింతకంటెఁ గలదే పరమార్థము ? తావకీనవా
క్సీధువు గ్రోలఁగా నభిలషింతును నామది మాటిమాటికిన్. 80

కం॥ పిండోత్పత్తి క్రమమును
బిండము గర్భమునఁ బెరుగు విధమును నాకున్
నిండు మనంబునఁ దెల్పుము
పండువు గా వీనుఁగవకుఁ బరతత్త్వ నిధీ ! 81

కం॥ అన విని యధీశుఁ డిట్లను
వనితా ! గర్భవతి ప్రియునిఁ బ్రార్థించుఁ గదా ?
ధనకనక వస్తు లాదిగ
మనసున నది నీవు గోన వుమాసతి వోలెన్, 82

ఆ॥వె॥ ఇట్టి నీవు నాకు నిల్లాలి వగుటను
సాఁగుచుండె రాజయోగ, మింకఁ
గోమలాంగి ! నీవు కోరిన యర్థంబు
వలుక కునికి నాకుఁ బాడి యగునె ! 83

కం॥ వినుకొనుము నీ మనంబున
ననుమానము వాయనో ప్రియా ! యజ్ఞానం
బను కారణదేహము గా
దె నిమిత్తము ? స్థూల సూక్ష్మదేహంబులకున్. 84

కం॥ కవచిన యజ్ఞానముచే
నవివేకము, దానివలన నభిమానము నం
దు వలన రాగాదికమును
గవియఁగ జీవుం డనేకకర్మవశుం డౌ ! 85

గీ॥ తాను జేసిన పాపకృత్యముల వలనఁ
జచ్చి పుట్టుచు నుండు విశ్రాంతి విడిచి
ప్రాగ్భవంబున ఋణపడ్డ వారి యింట
నట్టి తెఱఁగెల్ల వివరింతు నదియు వినుము. 86

కం॥ అన్నమునఁ జేసి మేదో
త్పన్నం బగు దానివలనఁ బలలము పుట్టున్
గ్రొన్నెత్తు రందు వలనను
జెన్నగు రేతంబు దాన శీతాంశుముఖీ! 87

కం॥ దానం జేసి సతీపతు
లానందం బనుభవింప నంగజకేళిన్
బూనికమై ఋతుకాలా
నూనస్థితు లందుఁ బిండ ముత్పత్తి యగున్. 88

సీ॥ పురుషుని శుక్లంబు తరుణి శోణితముతో
నెగడు నైదుదినాలు నీటిమీఁది
బుగ్గనాఁ; బది దినంబుల కండముంబోలు
నెలకు దార్ఢ్యము కల్మి గలుగు శిరసు
పొలుపారుఁ గాలుసేతులు రెండు నెలలకు
మూఁడగు మాసానఁ బొడము కుక్షి
పార్శ్వయుగ్మంబు నేర్పడు నాల్గు నెలలకు
నైదవనెల వ్రేళ్లు పాదములును

గీ॥ నమరు, నాసాదిరంధ్రావయనము లొప్పు
నెలలు నాఱింటి, కేఁడగు నెలను జేరుఁ
గర్మబద్ధుఁడై మును ఋణగ్రస్తుఁడైన
జీవుఁ డా మాంస-పిండాంతసీమ నుందు? 89

కం॥ ఎనిమిది తొమ్మిది నెలలం
దన వచ్చిన తెఱఁగు దొల్లి తనచేసిన తీ
ఱని పాపకృత్యములు నె
మ్మనమునఁ దలపోసి కొనుచు మనికిత పడుచున్. 90

చం. తుది నొకనాఁడు మున్కొని యధోముఖుఁడై జనయిత్రికిన్ మహా
పద గలిగించుచున్ బుడమిపైఁబడి కెవ్వరు మంచు నేడ్చుచున్
వదలని పూర్వసంస్మృతిని, పైఁ గలి నీళ్లు విదిర్చి నంతనే
మొదలికి వచ్చు నాతఁ డిఁక ముద్దియ! సుద్దులు వేయు నేటికిన్!

వ॥ అనుటయు నంజలి ఘటించి కృతార్థతం బొరసితి నని నమస్కరిం
చిన యిల్లాలిని నిజవల్లభుం డాశీర్వదించె. ని ట్లనేక వేదాంత
రహస్యంబులు సమయోచితంబుగా నెఱింగికొనుచు నయ్యంగనా
మణి సర్వవిధంబుల నతని కరాంగి యునం బరంగె. నట్ల కాదె? 92

గీ॥ వయసు పెరిగిన కొలఁది దంపతుల యందు
జ్ఞాన జిజ్ఞాస పెంపొందఁ గలుగు నేని
కరగతం బగు సౌఖ్యంబు, కామతృష్ణ
పెరిగి నట్లైనఁ దలమీఱు నరకబాధ! 93

-: గోవిందాంబ సంతానంబు వడయుట :-

వ॥ తదనంతరంబు — 94

మ॥ నవమాసంబులు మోసి పుత్రుఁ గనియెన్ నారీలలామంబు బాం
ధవ సంతుష్టిగ జాతకర్మ మను వొందన్ సిద్ధిలింగయ్య నా
భువనశ్లాఘ్య గురుండు నామకరణంబుం జేసె; నెప్పట్ల పు
ణ్య విశేషంబు గదా? వయస్సున సుతుండన్ పెన్నిధిం గాంచుటల్

గీ॥ తనకు దౌహిత్రు నతని నిమ్మనుచు నర్థి
నల్లు నర్థించె శివకోటయార్య వర్యుఁ
డా దయానిధి మన్నించె నతని కోర్కి;
నల్లురకు మంచితన ముండ దందు రేల? 96

సీ॥ పిమ్మటఁ గలిగె నా ప్రియసతీపతులకు
నయనోత్సవకరుండు నందనుండు
మునుపు దా నొకనాఁడు చనుచుండఁగా వనాం
తరభూమి మట్టమధ్యాహ్న వేళఁ
బ్రాణావశిష్టుఁడై పడియుండి మూల్గుచు
దప్పిక తీర్చినఁ దెప్పతిల్లి
కను విచ్చి మ్రొక్కి నీ కడుపునఁ బుట్టుదు
ననుచు గోవిందనామాక్షరంబు
గీ॥ లుచ్చరించుచుఁ బ్రాణంబు లుడిగి నట్టి
విప్రుఁ డితఁ' డని యెఱిఁగి గోవింద యాఖ్య
యిడెను వానికి వీరయోగీశ్వరుండు!
ప్రాప్తము ఋణానుబంధరూపంబు గాదె! 97

వ॥ శిశువును శుక్లపక్షశశాంకబింబంబు ననువున దినదినప్రవర్థమానుం డగుచుం దల్లిదండ్రుల యుల్లంబు రంజించు చుండె నంతఁ గాల క్రమంబున నక్కల పాలికావతంసంబునకు నోంకారశివరామయ్యలును, వీరభద్రు నంశంబునఁ బోతులూరయ్యయు వీరనారాయణమ్మ యను కూఁతురును జనించి రప్పు డయ్యిల్లు మరాళసంచార సుందరం బైన సరోవరంబు వోలె మనోహరం బయ్యె— 98

ఉ॥ దానము లేని కల్మి ప్రణిధానము లేని వ్రతంబు లౌకిక
జ్ఞానము లేని విద్య మృదుగానము లేని వివాహ మార్యస
మ్మానము లేని కొల్వు బిగిమానము లేని కవిత్వకాంత సం
తానము లేని యిల్లు వినుతంబులు గా వవి నామమాత్రముల్!

కం॥ జాయాసుతసహితంబుగ
నాయింటఁ జరించు గేస్తుఁ డంతర్విద్యా
శ్రీయుతుఁడు దుర్వికారప
రాయణమానసుఁడు గాక ప్రజ్ఞాపరుఁడై 100

రాజయోగి ద్విజకుష్ఠవ్యాధి నివారించుట

కం॥ ఆరీతి సుఖస్థితి సం
సారము గడపుచును జూడఁజనియెను బరమో
దార క్షేత్రమ్ములకున్
వీరబ్రహ్మేంద్రుఁ డాలుబిడ్డల తోడన్ 101

మ॥ అలరంబల్కుచు మార్గమధ్యమున నాయాదృశ్యముల్ సూపుచున్
జెలువంబుల్ వివరించుచున్ జెలియతో శ్రీశైలముం జేరి యా
యలఘుం డీశుని మల్లికార్జునుని నిధ్యానించి యాపై నహో
బిలలక్ష్మీనరసింహదర్శనఫలాపేక్షామతిం బోవుచోన్ 102

గీ॥ ఒకట నొక విప్రకాంత పత్యుత్తమాంగ
మూరుతలమున నిడుకొని యో మహాత్ము
లార! తైర్థికులార! నాప్రాణవిభునిఁ
బ్రోవరారే! యటంచు వాపోవుచుండె. 103

కం॥ అదిగని గోవిందాంబిక
ముదితా! నీవేల యిట్లు పొగులుదు వయ్యో!
తుదిమొదలు దెలుపు మనఁగా
నది యిట్లను నమ్మహాత్మురాలిం గనుచున్ 104

చం॥ అనయము నా మనోవిభుని నక్కట! యేర్చుచు నున్న రోగముం
గని విలపించుచుందు నొకానొకనాఁటికి నే మహాత్ముఁడో
మనుపఁగఁ జూడఁడే యనుచు మందులు మాఁకులు వ్యర్థమయ్యె నో
జనని! సమస్తసౌఖ్యములు సాధ్వులకుం బతితోడివే గదా! 105

వ॥ అన విని గోవిందాంబిక జాలిగొని నిజవల్లభుం జూచి— 106

కం॥ దీనికిఁ దరణోపాయ మె
దేనియుఁ గలదేనిఁ గూర్మి నెఱిఁగింపఁగదే
మానవతీతిలకంబు మ
నోనాథుని చెట్ట కోర్చునో ప్రియనాథా ! 107

చం॥ అన విని బ్రహ్మవాది పరమాదరభావము తోడ మానినీ !
వినుము పురాకృతం బనుభవింపక తీఱదు దేహధారి కై
నను గరుణించి నీవు గనినన్ దురితంబు నశింపకుండునే ?
యనుచు ద్విజాంగనన్ దఱిసి యల్లన నూఱడఁ బల్కి యంతటన్

గీ॥ తత్పతిశరీర మాత్మహస్తమునఁ బుఁణుక
నతఁడు లేచె నపాస్తరోగార్తుఁ డగుచు
నూబిలోనుండి బైటికి నుఱికి నట్లు;
వ్యాజరహితోపకారులు బ్రహ్మమయులు ! 109

ఉ॥ అప్పుడు విప్రదంపతులు హస్తయుగంబులు మోడ్చి భక్తితో
నప్పరమార్థవేదికిఁ దదంగనకుం బ్రణమిల్లి చెప్పరే !
యిప్పటి కిప్పుడే తనువు నేర్చుచునుండిన కుష్ఠరుగ్వ్యథం
దప్పఁగఁ ద్రోఁచినట్టి కరుణాపరు లింతకు మీఁక లెవ్వరో ! 110

కం॥ శ్రీశైలభ్రమరాంబా
పాశుపతాయుధులు గాక బలవద్రుగ్బా
ధాశమనంబు నొనర్పం
గా శక్యమె యొరుల కేని తుణికము నందున్ 111

వ॥ అని పెక్కు తెఱంగులం బ్రస్తుతింప గురుం డేము కందిమల్లయ్య
పల్లీ నివాసుల మని నిజనామధేయాదికంబు లెఱింగించిన వారు
వెండియు— 112

గీ॥ ఏమొ పల్కితి గాక మా హృదయవీథి
మిమ్ము నస్మాదృశుల నేలు మిథునముగను
దలఁచి స్మరియించు చుందుమో దమివరేణ్య!
యనుచుఁ బ్రార్థనాపూర్వకం బైన చూడ్కి 113

కం॥ మాపురికిఁ బుష్పగిరికిఁ గృ
పాపర! విచ్చేయు మొక్క పర్యాయ మటం
చా పుణ్యుని వేడ్కొని చని
రా పాఱుఁడు పాఱుతయు మహానందముతోన్ 114

కం॥ వీరగురుండును బ్రియతో
మాఱట రత్నంబు లగు కుమారులతోడన్
జేరె నహోబిల మందుల
నారాధించెను నృసింహు నాదిమలక్ష్మిన్ 115

బ్రహ్మరాక్షసి నిబంధనము

ఉ॥ అచ్చటి నుండి కంచికిఁ బ్రయాణ మొనర్చుచు నుండి దారిలోఁ
బచ్చని యాకుజొంపములు పంబిన కొమ్మల విస్తరిల్లి క
న్నిచ్చకు నెక్కినట్టి వటవృక్షముఁ గన్గొని సేదఁదేఱఁగాఁ
జెచ్చెర దాని నీడలకుఁ జేరెఁ గుటుంబకుఁ డప్పు డయ్యెడన్ 116

శా॥ ఓరీ! యెవ్వఁడ వీవు? క్రొవ్వున మదీయోపాంతముం జేరినా
వా? రారమ్ము కుటుంబయుక్తముగ నాహారమ్ము గమ్మంచు ఘో
రారావ మ్మనుబంధ మైన వికటవ్యాహారముల్ వెల్వడెన్
భూరుట్శాఖల నుండి యెల్లర మనంబుల్ తల్లడిల్లం గడున్ 117

మ॥ కనిపించెన్ వికటాట్టహాసరుచిమద్గర్జాపరిభ్రాంతభూ
తనవాసృగ్విసరత్తనూగరగరత్కంకాలమాలావల
గ్ననటద్ధూమ్రశిరోజధూసరవసాగంధానుబంధప్రభా
ఘనసంఛన్నదిశావకాశభయదక్రవ్యాదభూతం బటన్ 118

కం॥ భయవిహ్వలులై కువఁగొను
ప్రియసుతులను దరికిఁ జీరి వెలఁదుకయును ని
ర్భయుఁడై యుండిన పతి దెస
కయయో ! యిదియేమి పాప మనుచుం జూచెన్ 119

వ॥ అప్పుడు— 120

కం॥ బేలా! నేఁ గలుగఁగ నీ
కేలా భయ ? ముడుగు మని యధీశుఁడు మృదుహా
సాలోలకపోలుం డయి
లీలగ నావంక దృష్టిలేఖలు నిలిపెన్ 121

సీ॥ ప్రజల నేడ్పించు భూపాలుండు విప్లవ
జ్వాలాముఖుని కంటఁబడిన యట్లు
ఇలుదోచి కన్నాన వెలల నుండిన దొంగ
ప్రభుసేవకుని కంటఁబడిన యట్లు
గాలివిద్దెలు మూఁటగట్టి నిక్కిన నీచు
పండితేంద్రుని కంటఁబడిన యట్లు
నడువీథిఁ జిచ్చుఅపిడు గైన బడిదొంగ
గడుసు పంతులు కంటఁబడిన యట్లు

గీ॥ గుండె లవిసి, కాలాడక, బెండువాఱి,
గ్రుడ్లు రెం డప్పగించి యా గురుని ద్రోల
బ్రహ్మరాక్షసి బాలరూపమున నిలిచి
వినయవినమితఫణితి ని ట్లనియె నపుడు. 122

ఉ॥ ఏ నొక బ్రహ్మరాక్షసిని యీ వటవృక్షమునన్ వసించుచున్
గానసీమ నేఁగు జనకాండము గుండెలు వ్రచ్చి నెత్తురుల్
పానము సేయుచుండుదు నపాయ మెఱుంగక యింతకాల మే
గానికిఁ జెల్లనైతి ననఘా ! యిపు డేమన మీ ప్రభావముల్ 123

గీ॥ నన్ను విడిపింపు మిఁకమీఁద నరుల నోడిచి
బాధ వెట్టంగఁ జూడ నెప్పట్ల ననిన
నోసి రాకాసి! నీ వెంతలేసి దాన
వుఱక విడిపింతునే నిన్ను నెఱిఁగి యెఱిఁగి 124

కం॥ ఎందనుకఁ బ్రజను జిందర
వందర గావించి నీవు బాధించితివో
యందనుక క్షుత్పిపాసలఁ
గుందుచు నిట నుండు మనుచు గురుఁ డను నంతన్ 125

సీ॥ కబళింతు రం డని కలఁగింతువే యంచు
జ్యేష్ఠుఁ డా భూతంబు చెవులు పిండె
నట్టహాసము సేసి పాడలఁ గొట్టితి వంచు
తరువాతివాఁడు ముందఱికిఁ ద్రోచె
నమ్మాయి పని యయ్యె ననుచుఁ దృతీయుండు
ఫక్కున నవ్వి చప్పట్లు చఱచె
బూచివా! యిటనుండి పోవేల నీ వని
కడగొట్టుబిడ్డఁ డాగడము సేసె
గీ॥ ముక్కుగీఱుచుఁ గూఁతురు వెక్కిరించి
తొత్తుకోవే యటంచు జేయెత్తె నపుడు
తండ్రి సామర్థ్య మొక్కొక్క తరుణ మందుఁ
గన్నబిడ్డల కంగరక్షణము గాదె! 126

వ॥ అప్పు డా బ్రహ్మరాక్షసి గురుబ్రహ్మంబు నుపలక్షించి— 127

గీ॥ పాదముల మీఁద వ్రాలి దేవాదిదేవ!
నన్ను సైరింపుమా యని సన్నుతింప
దమివరుఁడు నా వచస్సు వ్యర్థమ్ము గాదు
కర్మమోచన మొకటఁ గాఁగలదు లెమ్ము. 128

కం॥ ఈశ్వరి యన సాకూత్వర
మేశ్వరి మత్పౌత్రి వచ్చు నిచ్చటి కపుడా
విశ్వజ్ఞురాలిఁ గొలిచిన
శాశ్వతికవిమోచనంబు సంప్రాప్తించున్ 129

ఆ॥వె॥ అనుచు నమ్మహాత్ముఁ డా బ్రహ్మరాక్షసి
కాలు సేయి నోరు గట్టివైచి
యధ్వగుల భయంబు లడఁగించి పయనమై
కాంచికాపురంబు గాంచ నరిగె. 130

గీ॥ అరిగి యేకామ్రనాథుఁ గామాక్షిఁ గొలిచి
హరిని దరిసించి వామను హరతనూజు
మదిఁ దెలఁచి ప్రశస్తస్తంభమంటపంబు
మొదలుగాఁగల శిల్పసంపదల కలరి 131

గీ॥ కొంత కాలంబు గడపి యా వింత లెల్ల
లలనకుం జూపి చెప్పి యల్లాడు పల్లె
వీరభద్రుని సేవించు వేడ్కతోడఁ
బయన మయ్యెను వేగ మా బ్రహ్మవిదుఁడు 132

గురు నను గ్రహంబున జగ్గయ్య సంతానభిక్ష వడయుట

వ॥ అట్లు చనిచని మార్గమధ్యంబున నగరపా డను కుగ్రామంబున కరుగు సరి కస్తమయం బగుడు నాఁటి కట నిలువ నిశ్చయించి జగ్గయ్యపేరి క్షత్రియు నింట విడిది సేసె నయ్యవసరంబున జగ్గయ్యయు వీరేశ్వరు నుపలక్షించి యెయ్యేని మహానుభావునింగాఁ దలంచి నమస్కరించి యి ట్లనియె— 133

ఉ॥ ఇచ్చియు బ్రాయపుం గొమరు లింతట నంతటఁ జంక కెక్కఁగా
నెచ్చటి నుండి యెచ్చటికి నేఁగుచు నీరలు పుణ్య దంపతుల్
వచ్చినవార లిచ్చటికిఁ బ్రాక్కృతపుణ్యఫలంబు లిట్టివే
యిచ్చని మా నివేశమున వీచెను జల్లని పిల్లగాడుపుల్ ! 134

కం॥ అన విని గోవిందాంబిక
కనికరమున నతనిఁ జూచి కలుగరె నీకుం
దనయు ? లన నెచ్చనూర్చుచు
జననీ ! నా కట్టి భాగ్యసంపద గలదే ! 135

ఉ॥ చేసితి దానధర్మములు; చేసితిఁ బెద్దలసేవ తీర్థసం
వాసుఁడనై చరించి బహువాసరముల్, శ్రమ మందితిన్ నిధి
ధ్యాసలు విస్తరించి, పరదైవతకోటికి నర్చనాదు లా
సాసలఁ జేసి చేసి పరిహాసము పా లయితిన్ సువాసినీ ! 136

సీ॥ తొమ్మిది నిధులతోఁ దులఁదూఁగు ద్రవిణేశు
విలిచి తేఁగలను నా కలిమి తోడఁ
బని గొనుచుండుదు ననిశంబు సుఖలీల
దాసదాసీజనతతుల వలనఁ
బతిదేవత యనంగఁ బరఁగు నిల్లాలితో
నొసపరి కాఁపుర మొప్పుచుండుఁ
బ్రతిదినం బింట నభ్యాగతారాధన
సంతర్పణంబులు జరుగుచుండు

గీ॥ నగునయే నాకుఁ గొమ్మల నతిశయిల్లి
నిలుచు నీడయి యాశ్రితనికరమునకుఁ
గాయ గాయని దొడ్డ వృక్షంబు వోలె
నాత్మజులు లేక చెలు వార దయ్యె నిల్లు ! 137

వ॥ అని వీరబ్రహ్మంబు దెస నవలోకించి తదనుగ్రహంబున నతని యాంగమనప్రకారంబును గ్రామనామాదికంబు నెఱింగికొని భయభక్తివినయవిభ్రమపురస్సరంబుగా నతనింజూచి వెండియు నిట్లనియె— 138

కం॥ ఇంత తడ వాలకింతువు
వింతలు వినుచున్న వాని విధమున నా వృ
త్తాంతములు భవిష్యద్వృ
త్తాంతము లెఱుఁగంగఁ జాలు తజ్జ్ఞుఁడ వయ్యున్ 139

కం॥ కాలజ్ఞానవిశేషము
లాలించుచు మీ యనుగ్రహమ్మును బడయం
జాలుదునే యని యుండుదు
నీలీల ఘటిల్లె నాకు నిష్టార్థంబుల్ 140

కం॥ నాపైఁ గూరిమి నిల్పుము
కాపాడుము నన్నొకానొక యభాగ్యుని సం
తాపానలంబు నార్పుము
నీపాదము లాశ్రయింతు నిత్యము దేవా! 141

చం॥ అన విని వాని కిట్లను మహాత్ముఁడు వీరగురుండు ప్రాక్కృతం
బనుభవనీయ మెంతటి గుణాఢ్యున కైనను దానిఁ ద్రోవఁగాఁ
జన దగుఁగాక నీ విఁక విచారము దక్కు మనుగ్రహించితిన్
ఘనగుణశాలి! నీ కచిరకాలమునం దనయుండు గల్గెడున్ 142

వ॥ అతనికి రంగరా జను నామం బిడు మతండు బ్రహ్మవిదుం డయి సకలజనమనోరంజకుం డగు నంతియు కాక శుభలశుభావహం బగు నొక్క మహామంత్రంబు నుపదేశించెద నది యనుష్ఠించుచుండుమని వీరనారాయణమహామంత్రంబు నుపదేశింప నతండు కృతా

ర్థుండ నైతి నని నమస్కరించి సముచితసత్కారంబు నడపుటయు నాఁడు గడపి మఱునాఁడు వీరనారాయణుండు సతీసుతసమేతం బుగా నల్లాడుపల్లెకుం జని— 143

## సూర్యాస్తమయాదివర్ణనము

కం॥ గురుబుద్ధి వీరభద్రుని
చరణారాధనము సల్పి స్వపురోన్ముఖుఁ డై
తరుగుల్మలతాగహనాం
తరసీమల నరుగుచున్న తఱి సత్వరుఁడై 144

గీ॥ దారిదొంగల కిరవు లీ దారు లనక
బయలు దేరిరి పుణ్యదంపతులు నేఁడు
కీడుపా టయ్యె నేనియుఁ జూడఁ జాల
ననుచు నస్తాద్రిఁ జేరె నహస్కరుండు! 145

మ॥ తన యిల్లాండ్రురు చాయయుం బ్రభయుఁ దాత్పర్యంబు పోనాడి పో
యిన సంసారపుభ్రాంతి వీడి తప మెంతేఁ జేయ మున్నిటి యో
డ్డున నస్తాచల మందుఁ దమ్మిచెలికాఁడున్ నాఁడు గోసాయిరీ
తినిఁ గాషాయము లూనెనో యనఁగ సందీపించె శోణద్యుతిన్

సీ॥ పతి వచ్చు టెఱిఁగి సంభ్రమత సంజ్ఞాదేవి
వెలయించు నివ్వాళి వెలుఁగు లనఁగఁ
దొగగొంగబలి నంటఁద్రొక్క నెత్తిన కాల
వామను పదకాంతిపంక్తు లనఁగఁ
బాశ్చాత్యకామినీపల్లవాధరముల
గమకించు లత్తుకకాంతు లనఁగఁ
జరమాబ్ధి సమయశాస్త్రజ్ఞుండు వ్రేల్చిన
దినకరదివ్యాస్త్రదీప్తు లనఁగఁ

గీ॥ గాలదైవతశిల్పిసంకల్పమాత్రఁ
బశ్చిమదిశాపటంబునఁ బరిధవిల్లు
రంగురంగుల చిత్రవిక్రాంతు లనఁగ
నాక్రమించెను. దెసల సంధ్యామరీచి 147

మ॥ క్రుంకెం బంకజబాంధవుండు చరమాబ్ధోరాశిఁ బంకేజముల్
డొంకెం బోఁడుము; లంగవిల్లు విరహాటోపంబుమై జక్కవల్
జంకెం; బక్షులు గూండ్లఁ జేర నరిగెం జాలించి దేశాటనల్;
శంకల్ వాసిరి జారచోరులు నిజోత్సాహక్రియారంభులై 148

మ॥ జర ప్రాపించి జగత్త్రియావనుఁడు సంజ్ఞానాథుఁడే కాలక
ర్మరతిం జేసి జగంబు వాసి చన నీశ్యామండలిం బ్రాణు లె
ల్లరు కర్మంబునకున్ వినమ్రు లయి నిల్వందప్పనే యన్న త
త్త్వరహాస్యంబు గ్రహించి లోకము ప్రశాంతం బయ్యె నప్పట్టునన్

ఉ॥ చీఁకటు లావరించె సరసీజభవాండము పేరి భాండమున్
మూఁకుట మూసినట్లు నలుమూలలు, గన్నులు గల్గియుండి యా
లోక మొనర్ప లేని జనలోకముఁ జూచి హసించు చందమై
యాకస మం దొకానొకటిదై పొడసూపుచు నుండెఁ దారకల్

సీ॥ ఆకాశ మను నొక్క యుపనీరుహాంబునఁ
బూచిన పుష్పసమూహ మనఁగ
క్షితిమీఁద నావరించిన యిర్ల దయ్యాల
రుచిరంబు లగు కను గ్రుడ్డు లనఁగఁ
దఱిశిల్పి మినుగూఁట నిరులకాటుక వెట్టి
తాపిన నూత్నరత్నంబు లనఁగ
బలిమి నిశారంభఁ గలయఁ గాలసురారి
రాలిన సిగపూల చా లనంగ

సీ॥ గీ॥ యామినీచంద్రులకు వివాహంబు గానఁ
బప్పుకూటికి వచ్చిన బంధు లనఁగ
గగనతలమునఁ జుక్కల గములు మెఱసెఁ
తళుకుతళుకునఁ జిత్రచిత్రములు గాఁగ ! 151

శా॥ ఆకాశంబునఁ బెక్కు తారలు మనోజ్ఞాకారవిస్ఫార రే
ఖాకాంతుల్ వెదఁజల్లుచుండ నసమగ్రజ్ఞాని పేర్కొన్నవే
కా కన్యంబు లనామకంబులు గదా! కానంగలే కెవ్వఁడో
వాకోకున్నను దత్కళావశములై వర్తిల్లు లోకస్థితుల్ ! 152

## తస్కర పరాజయము

వ॥ అట్టి సమయంబు నందు— 153

ఆ॥ వె॥ శకటచోదకుండు సర్వజ్ఞు నీక్షించి
కనులు వొడుచుకొన్నఁ గానరాదు
వినఁగ నొల్ల మవలి వీటివారలు సెప్పి
నట్టి హితమితోక్తు లక్కటకట ! 154

కం॥ అన విని గోవిందాంబిక
తనుజన్ముల దరికిఁ జేరి ధవునిం గని యి
ట్లను భూతంబై చీఁకటి
మనపాలిటఁ బడెను దలఁగు మార్గము గలదే? 155

కం॥ అనుసరికి నీశుఁ డిట్లను
వనితా ! జీఁకటికి వెఱచి పాఱం జనునే
మనుజుండు సర్వకాలం
బును వెన్నెల తీపి బ్రతుకు పుచ్చఁగ వసమే ! 156

గీ॥ కాలచక్రభ్రమణహేతుకములు గాఁగ
జిమ్మచీఁకట్లు వెన్నెలల్ చిగురుఁబోఁడి !
కీడుమేళుల కైవడి వాఁడి సూపుఁ
జీఁకటిఁ దరించి వెన్నెలఁ జేరవలయు ! 157

కం॥ చీఁకటిలో నక్షత్రము
లాకటిలో నార్తముఖము లగపడును గదా !
చీఁకట్లు దుర్మదాంధుల
కూకట్లను గొలిచి యూలిగొను వాకట్లై ! 158

గీ॥ అని యథాలాపముగ సంగ్రహార్థ మెల్ల
నంధకారంబు మిహతోడ నాడుచుండ
నంతకాకారు లగు చోరు లవల నివల
బండి కడ్డంబు నిలిచి రుద్దండలీల ! 159

కం॥ అమ్మో ! చచ్చితి మని శక
టమ్మును దోలెడు నతఁడు పడంతియు బిడ్డల్
కి మ్మనరు మఱియు వారల
హుమ్మను ధిక్కృతుల కడలి యూర్పులు నిలిచెన్ 160

గీ॥ అప్పు డది సూచి గురుఁడు రం డయ్యలార!
మాకడ లభించు వస్తువుల్ సేకొనుండు
పాప మింతకు వట్టి నిప్పచ్చరంపుఁ
దెరువరుల పాలఁబడితి రిందఱును నేఁడు! 161

కం॥ అను మాటలు విని యోహో !
ఘనతరసన్న్యాసి వోలెఁ గలిగిన వస్తుల్
గొనుఁడనుచుఁ దా నభాగ్యుఁడ
నను చున్నాఁ డితని దర్ప మణచుం డిపుడే ! 162

వ॥ అని కూడం బలికికొని పరిక్రమించి కాలదండంబులు వోని దండంబు లెత్తి రప్పుడు— 163

ఉ॥ ఎత్తిన చేతు లెత్తి నటులే మొట నుంచిన కాళ్లు లచ్చటే
హత్తుకొనంగ నొండొరువు లారసికొంచుఁ గృతప్రయత్నులై
బిత్తరవోయి తస్కరులు భీతిలి దీనస మొల్లఁ దక్కి వా
రొత్తి మహాప్రభావనిధి వెవ్వఁడ వీవు క్షమింపు మయ్యయో!

గీ॥ కడుపుఁగక్కుర్తితో నింతకాల మిట్లు
తెరువరులఁ గొట్టి బాధించి తినుచు నుందు
మట్టి వాఁడవ యని యెంచి తుట్టతుదకుఁ
గట్టు వడితిమి యుడిగె మా కావరంబు 165

మ॥ నిను నేరీతి భజింపఁగా వలయునో నిన్నెట్టి నామంబులన్
వినుతింపందగునో యెఱుంగము సుమా! విజ్ఞానసంపన్నధీ!
ఘనకారుణ్య మెలర్ప మమ్ములఁ దులన్ గాపాడు మీ బంధమో
చనముం జేసి భరింపఁజాలము నమస్కారంబు నీ శక్తికిన్ 166

గీ॥ మా నెపం బిది మన్నింపరాని దైన
నిదియ భవదీయదర్శనాభ్యుదయగతికిఁ
గారణం బయ్యె నిఁక నిట్టి దారుణములు
సలుప మీ శిక్ష చాలు మోక్షంబు నీవె! 167

కం॥ అని భయభక్తులతో వే
డ్కొనిన దివాభీతసమితి గురుఁ డాదరదృ
ష్టిఁ దెలచి బంధ మోక్షణ
మొనరిచి వచనీయహితమితోక్తుల తోడన్ 168

ఆ॥వె॥ బిడ్డలార! చౌర్యవృత్తి విసర్జించి
కష్టపడి తినుండు కడుపు నిండు
నడఁపఁబోకుఁ డొరునిఁ గడుపుఁగకూర్తితోఁ
గష్టపడని తిండి పుష్టి నీదు 169

చంద్రోదయాదివర్ణనము

కం॥ దైవము నమ్మికొనుం డని
దీపించిన వారి మనసు తిమిరము దీఱెన్
ద్యోవీథిఁ దోఁచెఁ జంద్రుఁడు
జీవంజీవంబు లలరెఁ జొందొవ విరిసెన్ 170

సీ॥ భూప్రదక్షిణపుణ్యమున విష్ణుపద మంటి
హరశిరోభూషణం బైన సుకృతి
పక్షద్వయీప్రతిపాదకం బగు కళా
భాగధేయమునకుఁ బట్టుఁగొమ్మ
దరహాసలాస్యసుందర కామినీజన
తోయజాస్యములకుఁ ద్రోసిరాజు
ప్రద్యోతనాతపవ్యథితభూదేవికిఁ
జల్లఁదనం బిచ్చు వెల్లగొడుగు
గీ॥ కడలిరాయని ముద్దుల కొడుకు, గుజ్జు
మీనకేతను నాడించు మేనమామ
సత్పురుషకీర్తిపరివేషసదృశమూర్తి
కలువ చెలికాని రాకతో నలరె జగము! 171

చం॥ ఇతఁడు నిశాచరుం డనుచు నించుక కొంకరు చంద్రురాకకున్
మతినిఁ గళంకమూర్తి యని మచ్చరికింపరు మెచ్చుకొందు రా
యతులకళారతిన్ గువలయాధిపతిత్వము; నెప్పు డేనియున్
జతురిమ యున్నతస్థితియుఁ జక్కని చుక్కల లోఁగొనుం గదా! 172

ఉ॥ పొట్టకు నంగలార్చుచు నభూతపుఁ గూఁతలు గూయనేర్చి తోఁ
బుట్టుల నంటి నిల్చి యినభోగజిఘృక్షను బట్టు చక్ర మే
తట్టునఁ దూలిచన్నఁ బెడదారులు ద్రొక్కిన నర్థసంగ్రహుల్
గట్టి కళాదు చున్నతియుఁ గ్రమకళాపదరూఢి యూడునే! 173

వ॥ అ య్యవసరంబు నందు— 174

ఉ॥ చుక్కల రాణివాసములు చూఱలు వుచ్చి నిశావధూటికిం
జక్కలిగింత వెట్టి తొగచానకుఁ జేతులు సాఁచు చందురున్
ధిక్కృతి సల్పు జ్ఞానరవితేజము సూచి నమస్కరించి 'రే
యిక్కడ విశ్రమించి చనుఁడీ' యని చోరులు వేఁడి రాయెడన్

ఉ॥ సమ్మతిఁ జూపి వీరగురుచంద్రుఁడు దారసుతప్రయుక్తి న
య్యిమ్ముల విశ్రమించి కృతకృత్యులఁ జేసె నరణ్యవాసులన్
నెమ్మని; భాగ్యవంతులు వనీస్థలి నున్నను భాగ్యవంతులే
యిమ్మహి మేడలం బరఁగనేమి యభాగ్య లభాగ్యులే కదా!

ఆ॥వె॥ వేఁగుఁజుక్క వొడిచె వినువీథి నంతట
నినరథంబు వచ్చు టెఱుక పఱచు
నట్టి భటుఁ డనంగ నచటి చక్కని చుక్క
లది గ్రహించి తొలఁగె నొదిఁగి యొదిఁగి 177

మ॥ సురతోత్సాహసమాహితాంగనల గాజుల్ మేఖలల్ మేలినూ
పురముల్ మ్రోయుచునుండ నారవళు లా పుణ్యాత్ము కర్ణంబులం
జొరకుండం జరణాయుధంబు మిథునస్తోమంబు వారించి తొం
దరవెట్టెన్; చెవి కెక్కునే యసమయోద్యద్బోధ మెవ్వారికిన్!

గీ॥ ప్రాఙ్మహీధరరంగాంతమున వెలఁగ
నరుణనీరాజనము మబ్బుఁదెరల నడుమ
రమ్యఖగరావనాందిఁ బ్రారంభ మయ్యె
నవనవోన్మేషమై జగన్నాటకంబు! 179

వ॥ గురుండును గల్యంబులు దీర్చి వార్చి యనుష్ఠానాదికంబు ముగించు
కొని యనంతరంబు— 180

గీ॥ ఆటవికు లైన వారి మర్యాద కలరి
దీవన లొసంగి వీడ్కొని దేవితోడఁ
బయనమై కందిమల్లయపల్లెఁ జేరి
సౌఖ్యమున నుండె నిజనివాసంబు నందు 181

యువజన పరాభవము

వ॥ అంతట నటవచ్చిన శివకోటయ్య తీర్థాటనాదిసంఘటనంబు లవధ
రించి యల్లునిం జూచి 'సకుటుంబముగాఁ దనయింట నాల్గు దినంబు
లుండి రం' డని యర్థించిన గురుం డియ్యకొని సతీసుతసమేతం
బుగాఁ బెదకొమిర్లకుం జని వానిచేయు సత్కారంబుల కలరుచుం
బెక్కు మహిమంబులు సూపుచుండ నప్పురవాసు లాచిద్విలాసు
నారాధించుచుండి రప్పుడు— 182

సీ॥ బంధురసితవర్ణగంధంబు లైనను
నుల్లిపూ మల్లెపూ వొకఁడు గావు
వనజాకరోపాంతవాసంబు లైనను
బకరాజహంసంబు లొకఁడు గావు
ద్రవరూపఘనరూపధర్మంబు లైనను
కాంస్యకాంచనము లొక్కండు గావు
భారవాహకశక్తిసారంబు లైనను
గర్దభాశ్వంబు లొక్కండు గావు
గీ॥ ఆలుబిడ్డలతో నోల లాడుచుండు
కావితాల్పుఁడు సర్వసంగములు విడిచి
తపము గావించు బ్రహ్మవిద్యావిదుండు
నొకఁడు గానేర్చునే పుయిలోట గాక ! 183

కం॥ ఇది యెఱుఁగ కెల్ల జనములు
చెద లట్లున్నాది గురునిఁ జేరుచు నున్నా
రది మానిపింత మనుచున్
మదులం దలపోసి యువజనంబులు కడఁకన్ 184

మ॥ తమలో నొక్కని నియ్యకొల్పుకొని ప్రేతం బట్లు గావించి పా
శములం బాడె బిగించి మోయుచు 'వయస్యా ! నీ వకస్మాత్తుగా
మముఁ బాయం జనునయ్య! బాంధవుల సమ్మానింప రావయ్య!న్యా
య్యము గాదయ్య! యొకింత పల్కు' మని మిథ్యాశోక
[భారంబుతోన్ 185

గీ॥ చనుచు నొకచో నమోఘవచస్కుఁడైన
గురునిఁ గనుఁగొని 'యోసామి ! కరుణఁ జూపి
చెలిని బ్రతికింపవే' యని చేతు లొగ్గి
కపటనాటక మాడినఁ గని గురుండు 186

మ॥ అయయో! చచ్చినవాఁడు రాఁడు మఱలన్ బ్రాప్తంబు దీఱెన్
(ద్వాదా
శయముల్ మానిసి వక్కటా ! దహనసంస్కారంబు గావింపఁగా
రయితం బొం' డని పల్క మిట్టిపడి వారల్ 'తావకోన్మాదవా
క్చయముల్ మాకడ సాఁగిరావు పలుపోకల్ పోకు మిప్పట్టునన్ 187

కం॥ రాఁడా? యింతకుఁ జచ్చిన
వాఁడా? నీనోటిమాట వజ్రపుమూఁటా?
కీ డాడినంతఁ బోవునె ?
చూడుము మా ప్రాణసఖుని సుందరతనునిన్ 188

గీ॥ అనుచు రజ్జువు విప్పి నెయ్యంపు సఖుని
లేవరా! యని పిల్చిన లేవఁ డయ్యెఁ
గదలఁ డయ్యెను దేహంబు కట్టె యయ్యె
నెప్పుడో పెద్దనిద్దుర నెనసె నతఁడు ! 189

క॥ తడఁబడి గుండెలు సెదరఁగఁ
గడుకొని ప్రయతించి ఫలము గానమి మిగులన్
బడలుపడి గొల్లు మని రా
బడుగులు గ్రామీణు లెల్ల వలగొని చూడన్ 190

గీ॥ ఎట్టకేలకు నూల్కొల్పి హృత్తటములు
మందభాగ్యులు పరమయోగీంద్రుమౌళి
పాదపద్మద్వయము ముట్టి పలికి రిట్లు
మమ్ము సయిరించి నెచ్చెలి మనుపు మనఘ ! 191

ఆ॥ వె॥ తన్నుఁ గట్టఁ ద్రాళ్లు తాఁదెచ్చుకొన్నట్లు
బ్రతికి యున్న చెలికిఁ బాడె గట్టి
వంచన మొనరింప వచ్చి నీ మహిమంబు
వలనఁ గట్టు పడితి మలఘుచరిత ! 192

క॥ అనుసరికి వీరగురుఁ డి
ట్లనుఁ జచ్చినవాఁడు బ్రతుకునా? మఱి మీరల్
ఘనులరు నే నున్నాఁదిని
జనుఁడీ నాతోడి తర్కసంకట మేలా ? 193

క॥ అనుటయు ధూర్తులు సిగ్గిలి
మనసున భయభక్తివినయమాధుర్యరుచుల్
దనుకంగఁ జూచి యిట్లని
రనఘా ! యడికింప నేల యంధుల మయయో ! 194

గీ॥ బిడ్డ లొనరించు దోసఁగులు విస్మరించి
మంచి మార్గంబు సూపి రక్షించుఁ దండ్రి
తనయులము మేము మాపాలి తండ్రి వీవు
విగతగర్వాంధులము బ్రోవవే మహాత్మ ! 195

కం॥ అనరాని కాఱు లాడుచు
మనసును నోవంగఁ జేసి క్రమ్మందితి మయయో!
కనికరము పూని మాచెలి
మనఁజేయుము సర్వలోకమాన్యచరిత్రా! 196

గీ॥ నీవు మృత్యుంజయుండవు నీవు హరివి
నీవు పద్మాసనుండవు నిఖల మీావు
కానినాఁ డిట్టి దివ్యసంకల్పమహిమ
మొరుల కబ్బంగ నేర్చునే? పరమమౌని! 197

వ॥ అని బహుప్రకారంబుల సాగిలంబడి విలపించుచుండ రప్పుడు—198

సీ॥ ఈ ధూర్తులకు నేల యిమ్మహామహితాత్మ
వంచింప నుంకించు వాంఛితములు?
గర్వాంధతిమిరంబు కన్నుల కెగదట్టి
యట్టి చెయ్యికిఁ జొచ్చి యిట్టులైరి:
ఇంతటి పాపాత్ము లెంతేసి పనులకు
వెఱతురే? బలుశాస్తి జరుగవలయుఁ:
బరమపశ్చాత్తాపభరసమగ్రత నట్టు
లరసచ్చి రింకేమి యవమతింతు

గీ॥ రనుచుఁ జూపఱు తనదెస నరయుచుండ
భక్తిఁ గొలిచిన వా రని వారి మీఁద
విమలకరుణాకటాక్షంబు విస్తరించి
మృతుని బ్రతికించె రాజయోగీశ్వరుండు! 199

ఉ॥ ఆతఁడు నిద్ర మేల్కనిన యట్టుల లేచి హితప్రబోధితుం
డై తనచెంతనున్న మహితాత్ముని పాదము లాశ్రయించి దు
ర్నీతుల నుద్ధరింప నవనీస్థలికిం బఱతెంచినాఁడ వో
పూతచరిత్ర! నా కిహసముద్యమ మేఁటికి? మోక్ష మీయవే! 200

కం॥ అనుమాటకుఁ జెఱుపవ్వం
జనకులు దనుకంగ గురుఁ డిసీ! యిది తగునే?
జనుఁ డిహాపరసాధనప
ర్థనుఁ డై చరియింప నైన ధన్యుఁడు డిత్థా! **201**

వ॥ కావున నీవు సన్నిహితులం గూడి ధర్మపరుండ వై సుఖం బుండు మని హితం బుపదేశించి యచ్చటి జనంబు వీడ్కొని శ్వశురాల యంబున కరిగి యుచితాసనోపవిష్టుం డై యుండె నప్పు డా మహాత్ముని మహత్వంబు లరసిన బ్రహ్మయ్య పేరి శివార్చకుం డటవచ్చి సాష్టాంగనమస్కారంబు లాచరించి నిల్చిన వాఁడై—**202**

సీ॥ భార్యావియోగాగ్నిపరితాపభరముతోఁ
జెయి గాల్చుకొనక తిండియును లేదు.
చేతి కందిన జ్యేష్ఠసూతికి నిల్లాలు
పడకిల్లు గా కొండు పలుకు లేదు
తెక్క లాడని యట్టి తక్కు సంతానంబు
కాళ్ళకు బంధమై కదల నీదు
పెట్టుపోఁతలు లేని చుట్టపక్కాలకు
నా యింటిపట్టు గానంగ రాదు

గీ॥ శివశివా! యని ముక్కు మూసికొన నైన
క్షణము తీఱిక లే దిట్టి జనుని నన్నుఁ
దేర్పవే యన్న నతనినిఁ దేర్చె నపుడు
ప్రాప్తరూపుండు వీరనారాయణుండు: **203**

వ॥ ఇట్లనేకజనాభీష్టంబులు దీర్చుచు వారి చేయు సత్కారంబుల కలరుచుఁ కాలజ్ఞానవిశేషంబు లెఱింగించుచు మాముకుఁ దుష్టి నించుచు నుండి సకుటుంబంబుగా నిజపురంబున కరిగె నంత కాల క్రమంబున— **204**

రాజయోగి నిజాత్మజుల వివాహాదికంబులు నిర్వర్తించుట

చం॥ చదువులు నేర్చి ధర్మముల జాడ లెఱింగి వయోవిలాసులై
చదురు లెఱింగి నట్టి తనుజన్ములు నల్వురు నమ్మహోదయ
ప్రదుని యనుగ్రహంబునఁ గరగ్రహణంబులు సేసి రంచితా
భ్యుదయగుణాఢ్యలన్ జిగురుఁబోణులఁ బున్నమి చందమామలన్

సీ॥ గోవిందయాచార్యు కోమలి గిరిదేవి
పతిదేవత యనంగఁ బరఁగు సాధ్వి
ఓంకారయాచార్యు నుగ్మలి కామాక్షి
యపరవిశాలాక్షి యతిథిపాల
శివరామయాచార్యు చెలువ బుచ్చాంబిక
పరమతుమాబుద్ధి పంటవలఁతి
పోతులూరాచార్యు పొలఁతుక పార్వతి
పార్వతీదేవి సౌభాగ్యగరిమ
గీ॥ అత్తమామల యాజ్ఞల ననధరించి
బావమఱఁదుల మరియాదవల నెఱింగి
యిష్టబాంధవకోటి సంతుష్టిఁ బొదల
నింట నలువురు కోడండ్రు రెలమి నుండ్రు ! 206

గీ॥ నలుగు రన్నల వదినెల నడుమ మెలఁగు
ముద్దుమాటల చెయ్యాల మోహనముగ
రతన మనఁజాలు వీరనారాయణమ్మ
కళుకుఁదేఱిన మేల్మిబంగారుబొమ్మ ! 207

కం॥ తన సుతను దిరుమలార్యుం
డను వానికి నిచ్చి పరిణయం బభిరతితో
నొనరింప నా గృహస్థునిఁ
గొనియాడిరి ధర్మమర్మకోవిదజనముల్ 208

వ॥ ఇట్లతివైభవంబుగా వివాహంబు నెఱవేర్చి కూఁతు నత్తవారింటి కనుపు నవసరంబున వీరయోగీశ్వరుం డా కెను దన యంకతలంబున నిడుకొని బుజ్జగించుచు నిట్లనియె— 209

కం॥ పతియే దైవము భారత
సతికిం బతితోడి బ్రతుకు చరితార్థంబౌఁ
బతిసుఖమె సుఖము మగువకుఁ
బతిదేవత యనఁగ బరఁగవలయు కుమారీ! 210

చం॥ మఱఁదుల కత్తమామలకు మాన్యచరిత్రుల కిష్టబాంధవో
త్కరముల కాత్మభర్తృవిహితంబు మెయిం జరియించి యింపుఁగాఁ
బరువు ప్రతిష్ఠ లెల్ల నిలుపందగుఁ బుట్టిన మెట్టి నిండ్లకుం
బరువు నశింపఁజేయు చెలి బండయె మొండిశిఖండియౌ యగున్!

కం॥ అన్నిటికి మిన్న యోరిమి
యెన్నఁడు విడనాడఁబోకు మీ వది మదిలోఁ
గన్నియకు నింతకంటెను
వన్నియ కూర్పంగఁజాలు వస్తువు గలదే! 212

సీ॥ ఒకచోటఁ గాలూన కుండు నుదగ్రత్వ
షాంపతి సేవించు సంజ్ఞ పోలె
మరుభూము లందుఁ గాఁపుర ముండు జడధారి
స్థాణు నర్చించు శర్వాణి పోలెఁ
గుష్ఠరోగవ్యథాకుంఠితతనుఁ డైన
కుమతిఁ గాశికుఁ గొల్చు సుమతి పోలెఁ
గడజాతివాని కమ్ముడు వోయిన త్రిశంకు
తనయు మన్నించు చంద్రమతి పోలెఁ

గీ॥ ప్రాణవిభుఁ డుగ్రుఁ డైన నిర్భాగ్యుఁ డైనఁ
ప్రబలరోగార్తుఁ డైనను భ్రష్టుఁ డైన
సమానశీలంబు తోడఁపుగా సమాచరించు
నతివ కరచేతి భాగ్య మత్యాయతంబు! 213

వ॥ అని పతివ్రతాధర్మంబు లుపన్యసించిన విని యాకన్యక— 214

కం॥ మీ చెప్పిన చందంబునఁ
దూచా తప్పక మెలంగుదుం బుణ్యనిధీ!
మీ చరణాంబుజసేవకు
నోఁచఁగదా యనుచు మిగుల నోవుదు జనకా! 2₁5

వ॥ అని పల్కి వెంఙియు 'నా కేమి సెలవిత్తు' వని కన్నీరొత్తుకొను కూఁతుం జూచి సర్వజ్ఞుం డైన గురుండు రహస్యంబుగా నిట్లనియె—

కం॥ నీ కేమిటఁ గొదవ గలుగదు
శోకింపకు తావకీన సుతసంతతియే
చేకొని మఠాధిపత్యము
నాకుం బ్రియ మాచరించు నమ్మము తల్లీ! 217

గీ॥ వారి నెప్పుడు నేను గాపాడుచుందు
వ్యాకులత్వంబు విడనాడి ప్రాణవిభుని
వెన్కొనఁగదమ్మ! యనుచు దీవింప నలరి
వినయపరతంత్రబుద్ధియై వనజనేత్ర 21

గీ॥ తల్లిదండ్రుల పాదపద్మముల కెఱఁగి
వదినెలకు నన్నలకు మ్రొక్కి హృదయనాథు
ననుగమించెను రాయంచ నపహసించు
లలితగతి మానుషీరూపలక్ష్మివోలె! 219

వ॥ తదనంతరంబు గురుం డూరిబయల నొక్క రమణీయప్రదేశంబునం దాశ్రమంబు నేర్పఱించి సతీసుతశిష్యసమేతంబుగా నం దధివసించుచు నధ్యాత్మవిద్య నుపాసించుచుండె నప్పుడు— 220

సీ॥ వినుతకాలజ్ఞానవిదుఁ డని కొందఱు
కుహనానటుం డని కొంతమంది
బ్రహ్మరాక్షసి గర్వభంజనుం డని కొంద
రంతర్ముఖుం డంచుఁ గొంతమంది
ఘోరవ్యథానాశకుం డని కొందఱు
దాంతిశేఖరుఁ డని కొంతమంది
సంసారబాధాపహరుఁ డంచు గొందఱు
గురుదేవుఁ డని కొంతకొంతమంది

గీ॥ దూరవాస్తవ్యులెల్ల ప్రొద్దులును గురుని
చరణదాస్యంబు గావించి చనుచు నుండ
వెఱ్ఱిబాగుల వాఁ డని విస్మయముగఁ
జూడఁ జొచ్చిరి పురిలోని క్షుద్రజనులు ! 221

కం॥ అది యట్టిద యెవ్వారును
మదిఁగొని తమ యూరి తబిసి మన్నింతు రొకో !
తుది గడియకు వచ్చిన నాఁ
డది యిది యని యంగలార్తు రంతియ కాదే ? 222

యోగఫలము

కం॥ మనసైన రాజయోగము
వినినను బఠియించినను లభించును సుఖజీ
వనదాంపత్యఫలంబులు,
చను నాధివ్యాధిమృత్యుసంశయభయముల్ ! 223

ఆశ్వాసాంతము

మ॥ సరసాలాపకలాపమోహనులు సాక్షాత్కార్మదీక్షాధురం
ధర తేజఃపరిపూర్ణ జీవనులు సత్త్వశ్రీనిధానుల్ చతుః
పురుషార్థప్రతిపాద్యవర్తనులు సంపూర్ణానుసంధానవి
స్తరభావార్ద్రగుణైకవర్ధనులు రాజద్రాజబింబాననుల్ **224**

కం॥ కింకింపురుషగజాంకుశ
శంకావహకీర్తిజితశశాంకులు విలస
ద్వేంకటవరసాంబాబ్ర
హ్మాంకులు హృదయోపవిష్టహరచరణాంకుల్ **225**

గద్యము॥ ఇది శ్రీపూసపాట్యన్వవాయపయఃపారావారరాకాకురంగ
లాంఛన సమాజకవిపంచానన, కవిశేఖర నాగేశ్వరప్రణీతం
బైన శ్రీవీరబ్రహ్మేంద్రచరిత్రంబునందు రాజయోగం బను
ద్వితీయాశ్వాసము—

# శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్రము

## తృతీయాశ్వాసము - సిద్ధయోగము

కం॥ శ్రీయుత వేంకటనరసాం
బాయోగ్యబ్రహ్మయార్యవర్యులు మనుధ
ర్మాయితచర్యు లపాకృత
మాయావరణప్రమేయమహితాచార్యుల్ 1

సీ॥ అవధరింపుఁడు ముక్తికాంతానురక్తుఁ
డైన యా గృహమేధి గంపంత బలగ
మంటికొని యుండి లవలేశ మంట కుండు
నది యటుండంగ నా ప్రాంత మందు నొకట 2

సిద్ధుని జననము

కం॥ ముడుమాల పేరి పుర మొ
క్కఁడు భాసిలు నందు నీతిఘనుఁ డాదంబీ
నిడువాలుఁగంటి కొలువఁగ
సడి చప్పుడు లేక పీరుసాహెబుఁ డుండున్ 3

చం॥ కలిగిన దానితో బ్రతుకఁ గల్గుచు నాశ్రితకోటిఁ దన్పుచున్
నిలిపి ఖుదాపయిన్ మనసు నిచ్చలు సత్క్రియ లాచరించుచున్
బలువుర సుప్రశంసలకుఁ బాత్రము లైరి తురుష్కదంపతుల్
కులము మతంబు వన్నియను గూర్చునె? సద్గుణరాశి తక్కఁగన్ 4

సీ॥ అట్టి దాంపత్యలతికకు నలమ దయ్యెఁ
గుసుమసౌభాగ్య మలరంగఁ గులవనంబు
వారి మది కది కంటకప్రాయ మయ్యె
దైవకృపఁ గాక కలుగునే తత్ఫలంబు? 5

సీ॥ ప్రతిదినంబును ఖుదాపయి బుద్ధి నిల్పి ఖు
రాను గ్రంథాంతమంత్రములు సదువుఁ
బ్రతిశుక్రవారంబు పరమభక్తినియుక్తి
మస్జీదు లోన నమాజు సలుపు
హుస్సేను మొదలైన యోగ్యుల చరితంబు
లాదర్శములు గాఁగ నగ్గి దూఁకు
రంజానుపండువు ప్రారంభమున నుండి
ముప్పదినాళ్ళొక్కప్రొద్దు లుండుఁ

గీ॥ తత్తదనుగుణవర్తనాయత్తయైన
భార్యతోఁగూడి సాహెబు భ్రాంతి నిలుపు
వారి పాటులు సూచిన వార లెల్ల
జాలి పడుదురు దైవంబు జాలిఁ గొనఁడు ! 6

వ॥ ఇది యిట్లుండె నంత నొక్కనాఁ డా జనపదంబున కణిమాది సిద్ధులు వడసిన సిద్ధపురుషుం డొక్కరుం డరుదెంచినాఁ డని విని తురుష్కాంగన యతని పాలికిం జని తన మనోరథం బెఱింగింప నతండు కరుణించి రక్షాబంధ మొం డనుగ్రహించె నది ధరించి సముచితకాలంబున గర్భవతియై సత్వసంపన్నుఁ డైన కుమారుం గనియె నప్పుడు—— 7

కం॥ సిద్ధుని కారుణ్యంబున
సిద్ధించిన సుతఫలంబు సిద్ధుం డని రా
సిద్ధుఁడు క్రమాభివృద్ధిన్
శుద్ధేందుకళామనోజ్ఞశోభ నెసంగన్ 8

సీ॥ నాకును మీకు నేనాఁటి సంబంధంబు
లని మిత్రసంతతి నడుగుచుండు
నుదరంబులో బిడ్డఁ డొదిఁగి యేచందాన
నలయు చుండు నటంచు నమ్మ నడుగు
దృశ్యమానం బగు నీజ్జగంబు భరించు
తండ్రి యెవం డని తండ్రి నడుగుఁ
బరమేశ్వరుం డెట్టి పెరవున వాఁ డంచు
నధ్యాపకునిఁ జేరి యడుగుచుండు

గీ॥ ముద్దుమాటల భ్రాంతిలో మునుకు లాడి
వాని నైజంబు నరయుదు వార లెవరు !
భావిజీవనసూచికాప్రాయ మగుచుఁ
బూవు పుట్టినతోడనే తావి గొలుపు ! 9

సిద్ధుండు గురుదేవు నాశ్రయించి ప్రియశిష్యుం డగుట

గీ॥ ద్వాదశశరద్వయస్కుఁ డా బాలకుండు
వీరగురుదేవు మహిమంబు వినుటఁ జేసి
బ్రతుకు తత్పాదసేవ కంకిత మొనర్చి
భవమహాసాగరము తరింపంగఁ దలఁచె 10

గీ॥ తలఁచి తలిదండ్రులకు నేని దెలుప కుండఁ
బరమవైరాగ్యబుద్ధితోఁ బయన మయ్యె
బాలకుం డేడ ? వైరాగ్యభావ మేడ ?
పూర్వజన్మసంస్కారానుభూతి గాక !

ఉ॥ అమ్మయి భక్తియే నిజసహాయముగా నతఁ డాపగాప్రవా
హమ్ములు పర్వతమ్ములు మహాగహనమ్ములు దాఁటుచున్ సుతా
రమ్ముగఁ గందిమల్లయ పురంబును జేరె; ననేకభంగపా
తమ్ముల కిక్కయా నుదధి దాఁటి బయల్పడు నావికుం బలెన్ 12

సీ॥ వామభాగంబున వరలక్ష్మి పోలిక
గోవిందమాంబిక కూరుచుండఁ
గొడుకు లందఱును గింకర్వాణులై నిల్చి
వలసిన యవి సిద్ధపఱచుచుండ
నంజలిపుటశ స్తహస్తులై శిష్యులు
నుడితేనె జడి కాస పడుచునుండ
దర్శనాపేక్ష నుత్సాహించి వచ్చుచుం
డిన వారి సందడి యినుమడింప

గీ॥ నాశ్రమంబునఁ గొలువున్న యట్టి గురుని
చరణపీఠి సమీపించి శరణ మనుచు
వ్రాలె సిద్ధుండు శిబి మ్రోల వ్రాలి నట్టి
పావురము వోలె నక్కజంపడెను గొలువు ! 13

శా॥ వానిం జూచి కృపాకటాక్షమున సర్వజ్ఞుఁడు 'లేలెమ్ము బి
డ్డా ! నీకేల భయంబు చూడు, మనినన్ హర్షాశ్రువుల్ జాఱ న
య్యానందాంశభవుండు 'బాలుఁడను దేవా ! నన్నుఁ గాపాడవే
యే నార్తిం బడి వచ్చినాఁడ నభయం బీయంగదే !' నావుడున్ 14

మ॥ కడగంటన్ జఱునవ్వుఁజిన్కు లొలయంగాఁ జూచి వీరేశ్వరుం
డిడితిన్ నీ కభయంబు లె' మ్మన నతం డెంతేని సంతృప్తితో
నడుగుందమ్ములు వట్టి కెప్పిఱినవాఁడై లేచి కూర్చుండి 'నా
జడజన్మంబు తరించె నొండు వలదో స్వామీ ! మహాధన్యుఁడన్' 15

వ॥ అనుటయును— 16

ఉ॥ ఏమి వినమ్రభావ మిది యేమి మహత్తరతేజ మర్భకుం
డీ మహనీయు పాదముల నేమి కతంబున వచ్చి వ్రాలెనో
యే మని పల్కెనో వినుద మీతని వృత్త మటంచు మాట లొం
డేమియుఁ దక్క చూడ్కి వెలయించిరి సభ్యులు వాని వంకకున్ 17

కం॥ అప్పుడు గోవిందాంబిక
యప్పాపని వంకఁ జూచి యాదరదృష్టిన్
జెప్పుము నీమది నేమిటి
కిప్పగిది భయంబు పుట్టె నేర్పడ' ననుడున్ 18

శా॥ తల్లీ ! యేమని చెప్ప నోపుదు నవిద్యావంతుఁడన్ నేను మే
నల్లాడన్ నను వెంట నంటు నొక మాయాభూత మెల్లప్పుడున్
దల్లిందండ్రియుఁ బోని మిమ్ములను సందర్శింపగా నంతయుం
జెల్లెంబో మటుమాయ మయ్యె నెదలోఁ జింతాభయాందోళనల్.

కం॥ అన నతనిం గనికరమునఁ
గని గోవిందయ్య 'యెంతకాలం బయ్యెన్
నినుఁ బట్టి భూత మది యే
యనువున బాధించుఁ దెల్పుమా' యన నతఁడున్ 20

శా॥ 'అన్నా ! పుట్టిన దాదిగా నది మహాహంకార రూపంబునన్
నన్నుం ద్రోసి పరార్థముం దలఁపకుండం జేసి యొక్కుమ్మడిన్
వెన్నాడం దొడఁగెన్ దదీయవిరసావేశంబు మాన్పించి నా
కి న్నిర్ణద్రదయాపయోధి సుఖ మీఁడే యంచు నే తెంచితిన్' 21

కం॥ అనుసరికిఁ దన్నిగూఢా
ర్థనిపుణవాక్యముల కంతరంగము లలరం
గనికొని రొండురు మొగములు
జననీనందనులు ప్రియము సందడికొనఁగాన్ 22

కం॥ అంతట గురుదేవుం గని
యింతకు నన్నేమి సేయ నెంచితివి ? భయ
భ్రాంతుని బాలుని బహుజ
న్మాంతరకృతపాపపరిణతాతిశయార్తున్ 23

చం॥ నను భవదీయదివ్యచరణంబుల సన్నిధి నిల్పఁ జూడవే
యని దయ పుట్టఁ బల్కి వినయంబున వేఁడ్కొనుచున్న సిద్ధునిం
గని తదభీష్టముం దెలియఁగా నను నిట్లని పోతులూరు నీ
కు నెగడెనే జగద్గురుని గొల్చు తలంపులు చోద్య మయ్యెడిన్ 24

కం॥ తలిదండ్రు లెవ్వ? రెచ్చోటఁ
గల? రిటఁ జేరంగ నాన గైకొంటివె? నీ
కుల మేమి? గోత్ర మేమిటి?
పలుకుము నీ వింతవట్టు పలుకవు వానిన్. 25

మ॥ అనుడున్ సిద్ధుఁడు వానిఁజూచి యిటుఁ బ్రత్యక్షంబుగా నిజ్జగ
జ్జనకుల్ నిల్వఁగఁ దల్లిఁదండ్రి నడుగం జన్నే? యసారంపుజీ
వనముం బుచ్చి పురాకృతం బనుభవింపం బుట్టుచుం జచ్చుచుం
డు నరుం డిప్పటి మాటఁ దెల్ప నగుఁ బాటుల్గావె ముమ్మాటికిన్? 26

కం॥ కుల మేమి? గోత్ర మే మని
పలుకుదు విది యేమి? యిట్లు వ్యాకులపెట్టం
గల వేమి పంచభూతం
బుల నిర్మితి నైన తోలుబొమ్మకుఁ గులముల్? 27

కం॥ అని తన్ముఖలక్షణముల్
గనుఁగొని 'ప్రత్యుత్తరంబు నా కిది యగునే'
యని నట్ల యున్న తీరును
మనసున గుఱుతించి యతఁడు మఱి యి ట్లనియెన్ 28

కం॥ నను సిద్ధుఁ డండ్రు జననీ
జనకుల నాదంబి పీరుసాహెబు లండ్రే
ననఘ చరిత్ర! తురుష్కుఁడ
నను నాతనిఁ బోతులూర యాస్యుఁడు గనుచున్ 29

శా॥ ఏమీ ! నీవు తురుష్క బాలకుఁడవా ? యిచ్చోటికి కేతెంచి యా
జ్ఞామాత్రం గయికొనక యంటితివి పూజ్యశ్రీపదాంభోజముల్
నామం దిట్టివి సాఁగిరా విఁక నుపన్యాసంబు చాలించి లె
మ్మా! మా యాశ్రమభూములం గడచిపొమ్మా! నీవు వేవేగమే 30

సీ॥ శబ్దార్థముల మైత్రి సాధింపఁ జాలని
కవివాచ్యుఁ డంటు వస్తువును బోలి
కవిహృదయం బెఱుఁగని పండితంమన్యుఁ
డంటిన సత్కృతివ్యాఖ్య మట్లు
జన్మసంస్కారవాసన లేని గుణహీనుఁ
డంటిన రాజ్యతంత్రాంగ మట్లు
వంశానుగతమైన యాశ మబ్బని శిల్పి
చేయి సోఁకిన పాలరాయి యట్లు

గీ॥ పూజ్యపద మీవు ముట్టుటఁ బొలుప ముడిగె
నెట్టి కట్టిండి పని కొడిగట్టె నావు !
పిన్నవాఁడవు గావున మన్నవాఁడ
వింకఁ బంకింప కరుగుము బింక ముడిగి 31

కం॥ అనుటయుఁ గటకటపడి యి
ట్లను గోవిందయ్య తమ్ముఁడా ! యిది యే మి
ట్లనుచున్నాఁడవు నీకుం
జనునే కులమతవిభేదసంకోచంబుల్ ? 32

మ॥ ఇతనిం జూడఁగ నాకు జ్ఞాననిధిగా నెంతేనిఁ గాన్పించుఁ బ్రా
కృత పుణ్యంబునఁ జేసి యీ వయసునందే యింతవాఁ డయ్యెఁ గా
కితరుల్ నేర్తురె యిట్టిమాట ! లెదలో నిప్పాటి నూహింపవో
పితృపాదుల్ వల దన్నఁ బోవు నితఁ డీ విభ్రాంతి నీ కేటికిన్ ! 33

వ॥ అదియునుంగాక ——

సీ॥ శ్రీ సతీసుత సుఖశ్రీ వినోదియె కాని
శ్రీ సతీసుత సుఖశ్రీ విజేత
ప్రత్యక్ష పరిచిత బ్రహ్మోత్కరుఁడె కాని
ప్రత్యక్ష పరిచిత బ్రహ్మభాతి
ప్రణుత నానాదేశ రాజహంసుఁడె కాని
ప్రణుత నానాదేశ రాజ హంస
గోపాల ఖేలనా కుశలాశయుఁడె కాని
గోపాల ఖేలనా కుశల మూర్తి

గీ॥ కాల ధర్మ రహస్య సంగ్రహుఁడె కాని
కాల ధర్మ రహస్య ప్రకాశకుండు
కన్న తండ్రి గదా యని గండరించి
యీ జగత్పిత నెదుర నో రెత్త కెపుడు! 35

కం॥ అనుటయు నవరజుఁ డగ్రజు
నను నన్నా! చదువఁ జదువ నవివేకముపై
కొను నే మిటు వాకొందువు?
చనునే మన కితని వలని సడి కేరడముల్! 36

సీ॥ బలము లేకున్నను నిలఁ బెట్టు వారున్న
నతఁ డన్యదుర్జయుఁ డగున యేమి?
సరకు లేకున్నను బిరు దిచ్చు వారున్న
నతఁడు మహామహుఁ డగున యేమి?
గుణము లేకున్నను గొనియాడు వారున్న
నతఁడు యశస్వంతుఁ డగున యేమి?
ప్రతిభ లేకున్నను బయి కీడ్చు వారున్న
నతఁడు క్రియావంతుఁ డగున యేమి?

సీ॥ గీ॥ చిలుక పలుకుల కీవును జెప్పులు సేర్తు
వంతమాత్రనె మేటివాఁ డగునె యితఁడు ?
వంతపాటల బిగు వొప్పు వాని కెపుడు
బలికిఁ బాతాళ మట్లధఃపతనగతియె ! 37

కం॥ అన విని గోవిందాంబిక
తన చిన్నకుమారుఁ జూచి 'తామసి వగుచుం
గనికొనక తారతమ్యము
లనుచితవాచికలఁ దూల నాడుట సనునే ! 38

కం॥ అను తల్లి కెదురు వలుకఁగ
మునుకొను తనుజన్మఁ జూచి భువనగురుం డి
ట్లను నీకు నిట్టి వేఱిమి
సనునే యొక్కింత తడవు సైరణ గొనవే ? 39

కం॥ కులగోత్రంబుల యెన్నిక
వలని ప్రయోజనము లేమి ? ప్రాజ్ఞు లనేకుల్
కులహీను లుండరే ? వ్యా
కులతం బొరయంగ నేల కులతత్త్వముతోన్ ! 40

కం॥ నిలువెల్ల నిఖిల మెఱిఁగిన
పొలుపున దీపించుఁ దోలుబొమ్మకుఁ గులముల్
గలవే ? యను నిబ్బాలుని
పలుకుల కీ వొసఁగఁగల జవాబుం గలదే ! 41

వ॥ కావున నిట్టి జడస్వభావంబు నెడయు మని ప్రతిషేధించి పల్కి-
మిన్నకుండె నపుడు—— 42

సీ॥ న న్నుద్ధరింపవే నాపాలి దైవంబ
శరణంటి నో వీరగురువరేణ్యా !
నీ కుమారులలోన నే నొక్కరుండను
సాదరంబునఁ జూడ వమ్మ ! నన్నుఁ
గరుణాకటాక్షవీక్షణము నాపయి నిల్పి
యగ్రజా ! కాపాడు మహరహంబు
నేర్చి నేరక నేను నీచెంత నాడిన
పలుకులు చిన్నన్న ! తలఁపఁబోకు

గీ. మనుచుఁ జేర్పెర దీనుఁడై యచట నున్న
వారి మనసులు గరఁగఁ గన్నీరు గార
వేఁడికొనుచున్న సిద్ధుని విన్నపంబు
నాదరింపక వీరనారాయణుండు 43

ఉ॥ బాలుఁడ వీవు పెద్ద లగు వారల కేని నసాధ్య మైన మో
క్షాలయవాటికిం జనఁగ నాస యొనర్తువు చాలుఁజాలు ! నీ
కేల వృథాప్రయాసము ? పితౄణ విముక్తినిఁ గాంచు మార్గ మా
మూలముగా నెఱింగి పరిపూర్ణ సుఖస్థితి నుండు మింటిలోన్ 44

కం॥ అనుచుండ నట్ల వానిం
బనుపుము నిలయమునకుం గృపాపరతంత్రా !
యనుచున్ సిద్ధుని జననీ
జనకులు సనుదెంచి రటకు సంభ్రమ పడుచున్ 45

కం॥ చనుదెంచి పోయిన ధనం
బును మఱలం గాంచి నట్లు పుత్రునిఁ గని నీ
కునయి విచారించుచు ని
య్యనువున దిక్కుమొగంబు లైతిమి తనయా ! 46

గీ॥ అడ్డ మైనట్టి వారల నడిగి యడిగి
మెట్టకేనియు నిట నున్కి మెఱిఁగికొనుచు
వచ్చినారము కన్నట్టి వారి నిట్టి
యిడుమ గుడుపంగఁ జెల్లునే కొడుక ! నీకు 47

కం॥ ముకుపచ్చ లార వింకను
నకటా ! మాతోడఁ జెప్ప కటురా నిచ్చో
టికి నెవ రుద్బోధించిరి !
మొక మోడక చెపుము గొడ్డుఁ బోతుల వారల్ ? 48

కం॥ అనుటయును దల్లిదండ్రులఁ
గని సిద్ధుఁడు వల్కె లౌకికం బగు బుద్ధిన్
నను రోయుచు రానేటికి ?
ఘనుఁ డీ గురుదేవుఁ జూడఁగా మన సిడరే ! 49

కం॥ ఒరు లెవ్వరో ప్రబోధిం
చి రనుచుఁ గలగంగ వలదు చిత్తము లందున్
గురుచరణసేవ కస్మ
త్పూర్వాకృతవిశేష మే ప్రబోధించె ననున్ 50

సీ॥ మాయాతమిస్ర సంబాధంబు లెందాఁక ?
జ్ఞాన ప్రకాశంబు గలుగు దాఁక !
నీవు నే నను భేదభావంబు లెందాఁక ?
తనుఁ దా విచారించుకొనిన దాఁక !
సంబంధ బాంధవ్య సంరంభ మెందాఁక ?
పుట్టుక తలపోఁత పుట్టు దాఁక !
కామాది రిపు వర్గ కలహంబు లెందాఁక ?
యింద్రియ సాధన మెఱుఁగు దాఁక !

సీ॥ గీ॥ మృత్యుభయభీతు లెందాఁక? శ్రీగురూప
దేశభాగ్యంబు వడసి వర్తిల్లు దాఁక!
కాక నాకేల యితర సంకల్పబలము?
బ్రహ్మవిద్యా ప్రబోధంబు వలయుఁ గాక! 51

శా॥ ఎన్నో జన్మము లెత్తిమెత్తి తుద కే నిచ్చోట నిర్దేశికుం
గన్నారం గనుఁగొంటి ఘోరభవదుఃఖజ్వాల చల్లార నా
పన్నుండై శరణంటి నిట్టితఱి నాప్రాప్తంబు మన్నింప కి
ట్లన్నన్నా! తలిదండ్రులై పలుకుటల్ న్యాయంబు గానేర్చునే!

గీ॥ అనుడు జనయిత్రి వాని యాననము సూచి
తావకవచస్సు లర్థంబు గావు నాకు
నిన్న మొన్నటి వాఁడ వీ విన్ని సుద్దు
లెచట నేర్చితి? వింట నో రెత్త వెపుడు! 53

చం॥ తనయుఁడు లేఁ డటంచుఁ బరితాపము నందితి నప్పు డిప్పు డా
తనయుఁ డుపన్యసించు పరతత్త్వవిచారము విన్నమీఁదటం
బనవఁగ నవ్వఁగా ననుభవం బది చాలక యున్న, దప్పుడే
మనసున కెక్కునే గురుల మార్గము లొల్లని నాకు నీ నుడుల్

కం॥ కడుపునఁ బుట్టిన బిడ్డఁడు
మిడిమిడి జ్ఞానమున సర్వమిథ్యావాదం
బడరించి వెడల నడిచినఁ
గొడుకా! మఱి యెవ్వఁ డాదుకోఁగల డిలలోన్ 55

సీ॥ నవమాసములు మోసి నానాశ్రమము లోర్చి
కనిన నెత్తురుగందు ననిచి కొనుచు
మలమూత్రములు పాచి మందు మాఁకులు తెచ్చి
ప్రాణాధికముగఁ గాపాడికొనుచుఁ

జనుఁబాలతోఁ బ్రేమసారంబు ద్రావించి
తన గుండెకాయలో దాఁచికొనుచు
నాటపాటలతో సదభ్యాసములు నేర్పి
వెరవరి గాఁగ దీవించికొనుచు

ఆ॥వె॥ పెంచి పెద్దఁ జేయు ప్రేమరూపిణి యైన
తల్లి నీసడించు తనయులకును
సత్ఫలంబు లిడునె జపములు తపములు?
మాతృఋణము తలఁగు మార్గ మేమి! 56

మ॥ చనునే సర్వము నుజ్జగించి చరమస్థాయిం బ్రవేశించు వృ
ద్ధుని చందంబునఁ బల్కఁ జూచుట లపాత్రుల్ బాలు రీ విద్యకుం
దనయా! పెద్దల సేవ బిడ్డలకుఁ గర్తవ్యంబు కర్తవ్యధ
ర్మనిరూఢిన్ నిరసించు నాతఁ డుభయభ్రష్టుండు గాకుండునే? 57

వ॥ అని కవుంగిలించి కన్నీటఁ దడుపు నమ్మ నుపలక్షింప కచంచల యోగనిద్రాపరవశుం డైన యట్లు సిద్ధుం డుండుటంజూచి యచ్చటి వారు నిరాశులై నిట్టూర్చి రప్పుడు— 58

కం॥ మనసున గోవిందాంబిక
కనికరపడి కన్నతల్లిఁ గానని సిద్ధుం
గని పల్కె నీకుఁ దగునే
జననీజనకుల విచారజలనిధిఁ ద్రోయన్? 59

గీ॥ తల్లిదండ్రులు ప్రత్యక్ష దైవతములు
వారి సేవించు వారికిఁ బ్రాప్త మగును
బుణ్యధనరాసు లైహికాముష్మికంబు
లింటికిం జని సుఖయింపు మిదియుఁ గనుక 60

క౦॥ మఱియుదురు జనకు లాత్మజు
లరుదుగఁ దమకంటె నధికు లగుచో నిటుగా
నరయరు 'పుత్రాదిచ్ఛే
త్పరాజయం' బనఁగ నిట్టి పట్టిం గనియే ? 61

వ॥ అన విని పోతులూరయ్య యులికి పడియె. నప్పుడు సిద్దప్ప దీనా
ననుం డగుచు నాకె వలనం జూచి — 62

క౦॥ జననీ ! దయార్ద్రహృదయవు
చనునే గురుచరణసేవ సలుపఁగ నాకీ
వసుమతి జూపక యింటికిఁ
జను మనుట ? తరింతు నెట్లు సంసరణాబ్ధిన్ ! 63

క౦॥ తలిదండ్రు లెవరు ? తనుజ
న్మ లెవారు ? ఋణానుబంధములు గాక నదీ
జలములఁ గూడిన కట్టెల
పొలుపునఁ జూపట్టు పుట్టు పూర్వోత్తరముల్ 64

క౦॥ అన విని వీరగురుం డి
ట్లను నోయి కుమార ! నీ కనర్హము లీ వ
ర్తనము లసాధ్యము లింటికిఁ
జని సమ్మదపఱుపు మాత్మజనకుల మనసుల్ 65

ఉ॥ అంతటి తత్త్వవాంఛ విడనాడవ యేని మనం బందు న
త్యంతము రాజయోగమున నందఁగ వచ్చు నభీష్టముల్ గృ
భ్యంతర మందు నుండియు భవాంబునిధిం దరియింప వాను
ప్టాంతము గాఁగ నన్నుఁ గనుమా పలుమాటలు పల్కనేటికిన్

క॥ అనుటయును సిద్ధుఁ డుల్కుచు
నను నమ్మహితాత్ముఁ జూచి యశ్రువు లురలన్
నిను నాశ్రయించి భవవా
రినిధిం దరియింప నెంతు శ్రీగురునాథా! 67

క॥ కారణజన్ముఁడవై యి
ద్ధారుణి నలరారు నీకుఁ దగుఁగా కిఁక నేఁ
నేరుతునె రాజయోగము
నారూఢిగ ననుసరింప నాల్బిడ్డలతోన్ 68

క॥ గురుశుశ్రూషలు సలుపక
పరమార్థము సాధ్య మగునె? బాలుఁడ నగుటన్
గుఱు తెఱుఁగ కిట్లు పలికితిఁ
గరుణారసదృష్టి సైఁపఁగాఁ దగు ననఘా 69

క॥ అనుచుండ నడ్డుకొని నిజ
జనకుం డను నతనిఁ జూచి చాలుఁజాలున్
నినుఁ బట్టెనే పిశాచము
కనుఁగొన్నం గులము వారు కాఫకుఁ డనరే! 70

చ॥ జనులకుఁ జావుఁ బుట్టువులు సాజము లెప్పటి కైన దూరమై
చనుటలు తప్ప దం చెఱుఁగఁ జాలుదు రెల్లరు నైన నిమ్మెయిం
బనివడి దూర మౌచుఁ దమవారలు గా దనుకొన్న యేనియుం
మనసుల నుమ్మగిల్లుటలు మానవమాత్రుల సాజముల్ గదా!

సీ॥ తలిదండ్రులకు బాధ గలిగించు పుత్రుండు
భర్తృ గౌరవము గీడ్పఱచు భార్య
గురుదేవునకు నెగ్గు గూర్చు నంతేవాసి
స్వామికి నపకృతి సలుపు భటుఁడు

జనులను సుఖపెట్టఁ జాలని భూపాలుఁ
డనుజుల నేడ్పించు నగ్రజుండు
చెలికాని కొంపకుఁ జిచ్చిడు దుష్టుండు
చేరఁదీసిన వానిఁ జెఱచు ఖలుఁడు

గీ॥ ముచ్చముఁడుఁగుడు రూబిలో ముక్తి గాంచు
చున్నఁడో గాని, యిట్టింక నెడఁదలోఁడ
నాయనా ! సర్వసాధారణంబు లైన
ధర్మము లెఱుంగ వైతి వీ తత్త్వ మేమొ ! 72

గీ॥ వలదురా ! నీకు వైరాగ్యవర్తనములు
తగదురా ! కన్న కడుపులు రగులు కొలుపు
చెల్ల కులవృద్ధు లలరంగ నిల్లు సేరి
కంటి వెలుఁగుగ నిలువరా ! కన్నతండ్రి ! 73

కం॥ లెమ్మా ! బిగ్గ కవుంగిలి
నిమ్మా ! తడయఁగ నేల ? యింటికి నిఁక రా
రమ్మా ! యని బాష్పోద్గమ
నమ్మున బతిమాలెఁ దండ్రి నఁదను నంచున్ 74

కం॥ అది సూచి యచటి జనములు
మది నుమ్మలికంబు పుట్ట ప్రమాన్పడిరి, తదీ
యదృగంతంబుల నశ్రులు
ప్రిదిలెం దమయంత నెంత వెక్కసమొ కదా ! 75

సీ॥ భవసాగరము తరింపఁగ నెంచి గురుదేవు
పజకు సిద్ధుండు వచ్చు టొప్పుఁ
బుత్రవాత్సల్యంబు పొంపిరి వోవంగఁ
దలిదండ్రు లింటికిఁ బిలుచు టొప్పుఁ

దల్లిదండ్రుల నీడఁ దనరు వాఁ డని బాలుఁ
డని దేశికుండు పో మ్మనుట లొప్పఁ
జేఁజిక్కిన యమూల్యచింతామణిని జార్చు
కో నొల్లకుండు టవ్వాని కొప్పఁ
గీ॥ దప్పు లెవ్వరి ? విందు వాతప్పు లెవరి ?
వింత కీశ్వరనిర్ణయ మెట్టు లుండె
నదియుఁ దుదయుఁ గనుగొంద మనుచు వారు
తెప్ప వాల్పక కను లప్పఁ జెప్పినారు ! 76

కం॥ అప్పుడు నిజజనకుం గని
చిప్పిలు నగ వాఁగికొనుచు సిద్ధుం డను నీ
విప్పగిదిఁ జీఁకటింటను
మెప్పులు గల వనుచుఁ బిలువ మేలము గాదే ! 77

శా॥ నీకు న్నేను సుతుండ నైన యటులే నీ తండ్రికిన్ నీ; వతం
డాకాంక్షించిన యట్ల తండ్రి వయి; తీ వాసింతు వట్లే తగ
యాకాంక్షాపరిపూరణంబునను సౌఖ్యం బేమి తండ్రీ ! నమో
వాకంబుల్ కడలేని ముచ్చటలకుం బ్రాయంబు చెల్లింతురే ? 78

కం॥ ఎందఱకో కొమరుఁడనై
యెందఱకో తండ్రి నగుచు నిటఁ జేరితి నిం
కెందుకు జన్మాంతరముం
బొందఁగఁ జూచుటలు విసువు పుట్టెను జనకా ! 79

గీ॥ కులము వారలు నన్నుఁ బేరలుకఁ దెగడి
పరిహసింతురె ? సద్గురుపాదసేవ
వలవ దందురె ? మతపక్షపాతబుద్ధి
సకలమతముల కీశ్వరుఁ డొకఁడు గాఁడె ? 80

క॥ ఒక్కొక్కతతికి నొక్కొక్కని
క్కొక దెస మసలు నుల్ల ముల్లాసముతో
ధిక్కృతి సలుపంగ నేమిటి?
కెక్కువ తక్కువలు గాంగ నితరేతరముల్ 81

వ॥ అని తండ్రిని నిరాకరించి పలికి దృఢస్థిరసంకల్పంబు నిరూపణంబు
గాంగ గురుదేవు దెస నవలోకించి యతండు— 82

ఉ॥ నీవు దయాసముద్రుండవు నే నిహజీవననిమ్నగాకృతిన్
గావలె నంచు సన్నిధికిం గానలు కోనలు దాంటి వచ్చితిన్
ద్రోవకు ముద్రసోత్తర కుతూహలదోహలబుద్ధి నే న దీ
నావనమూర్తి! సాధ్య మగునా? యింక నాకుం దిరోగమించుటల్

శా॥ పాలన్ ముంచిన నీళ్ళ ముంచినను నా భారంబు నీదే! యుపే
క్షాలీలన్ గను దేని నాశిరము వ్రక్కల్గాంగం దద్రక్తధా
రాలిప్తం బొనరింతుం దావకపదప్రాచుర్యపీఠస్థలిన్
జాలం బేమిటి కాదరింపం గదవే జ్ఞానైకతేజోనిధీ! 84

క॥ అన విని గుండెలు జల్లన
జననీజనకులు నిజాత్మజున్మనిం గని యే
మని పల్కినాండ వయయో!
తనయా! నీ కిట్టి చలము తగు నట వోయీ! 85

క॥ ని న్ననుకొన నే మగు మా
పున్నెపు భాండంబు పగిలి పోయిన దింక మా
కన్నుల యెదుట మెలంగక
యున్నను బదివేలు బ్రదికియున్న కుమారా! 86

చం॥ అపు డపు డేమ వచ్చి కుశలాదికముల్ విని పోవుచుందు మా
రుపు గలయట్టి దాఁక, నవరోధము లుండ వనంతరంబు నీ
కిపు డిది యేల మాను మని యెవ్వఁడెరల్ దిగఁద్రావిఁగొంచు వా
రపు డని రిట్లు వీరగురు నారసి గద్గదఖిన్నకంఠులై 87

క॥ ఇఁక నిక్కుమారు భారము
సకలము మీయదియ మేమ సనియెద మనఘా!
ప్రకటకృప మీ కుమారుల
నొకనిగఁ బ్రియశిష్యకోటి నొకనిగఁ గొనవే! 88

చం॥ ఇతఁ డిటనైనఁ బెంపుఁ గని యీప్సితసిద్ధిఁ బ్రసిద్ధుఁడై సుధీం
ద్రతతిపురస్కృతుల్ వడసినం బదివే లది మాకుఁ జాలు నే
మితరము పల్కలేము సెల విమ్మని మ్రొక్కినవారిఁ జూచి యం
చితకరుణామయుండు గురుశేఖరుఁ డిట్లను నాదరంబునై 89

క॥ శ్రద్ధాభక్తులు గల యీ
సిద్ధుని ప్రార్థనము మీ వచించిన విధమున్
బుద్ధి నెఱింగితి నిఁక నీ
సిద్ధుని శిష్యునిగఁ జేసి సేవలు గొనుదున్ 90

చం॥ ఇతఁడు మదాశ్రమంబున నభీప్సితసిద్ధికిఁ గాఁగ నుండి యం
చితమతి నా యనుజ్ఞ నిలుసేరఁగ వచ్చి వివాహ మాడి సం
తతమును శిష్యసంతతి మనంబులు దన్పుచు రాజయోగియై
యతులయశంబుఁ గాంచు విడనాడుఁడు మీమది శోకమోహ
[ముల్!

క॥ అని తన పదసన్నిధి నుం
డిన సిద్ధుని శిరము నిమిరి నిను శిష్యునిగాఁ
గొనితిని వత్సా! యిఁక లె
మ్మన నాతఁడు లేచి సమ్మదాశ్రువు లురలన్ 92

కం॥ దేవీసహితుం డగు గురు
దేవునకుఁ బ్రదక్షిణంబు దిరిగి నమస్సుల్
గావించి శుభోదయ మిది
దైవికమునఁ జేసి నాకు దక్కినది గదా ! 93

కం॥ అని పల్కి తల్లి దండ్రులఁ
గనుఁగొని మీ కడుపుఁబంటఁ గావుట నవురా!
కనుఁగొంటి నిట్టి భాగ్యం
బని మ్రొక్కిన నిష్టసిద్ధి యయ్యెడు మనుచున్ 94

కం॥ ఆశీర్వదించి వారలు
దేశికు వాక్యముల వలనఁ దేఱిన మనసుల్
రాశిగొన శిలాకృతిగ ని
వేశోన్ముఖులై చనిరి భవిష్యద్భ్రమతోన్ 95

గీ॥ వాన కురిసిన నాఁ డున్న వారి యింకి
తేమ గిల్లిన పఱినేల తీరు గాఁగ
వారి యెడఁదలు సుతదుఃఖభరము లయ్యె
నెపుడు మొలకెత్తునో సుఖం బెఱుఁగ రాదు 96

వ॥ అంత నిక్కడ—— 97

సీ॥ గురుదేవు నానతి శిరసావహించుచు
గురుపత్ని పలికిన సరణి నడచు
గురుపుత్రు లేయది గోరిన నది సేసి
యాశ్రమవ్యవహార మరసి చూచుఁ
దన తోడి శిష్యుల తగవులు సవరించి
సోదరభావంబు సూపుచుండు
గురుదర్శనాపేక్ష నరుదెంచు వారల
మంచిచెడ్డలు విచారించుచుండు

సీ॥ గీ॥ జపతపంబులు నియమనిష్ఠలును నడపు
సకలగతులను గురుపదాబ్జములు నిలుపు
సిద్ధుఁ డకలంకబుద్ధి సమృద్ధి కలిమిఁ
బరమగురుదేవునకుఁ బ్రీతి పాత్రుఁ డయ్యె ! 98

వ॥ అదియునుం గాక— 99

సీ॥ గురుతరాంతరశుద్ధి గురువరాత్మరసిద్ధి
గురునిరంతరబుద్ధి గుస్తరింప
హంసవివేకంబు హంసప్రభాకంబు
హంసానలోకంబు నవఘుళింప
నచలయోగాభ్యాస మచలధన్విలాస
మచలకమోల్లాస మతిశయింప
హరిమనోవేగంబు హరిభయత్యాగంబు
హరియశోభోగంబు నంకురింపఁ

గీ॥ గడమ శిష్యుల తలమానికంబు గాఁగఁ
గుడిభుజం బయ్యె గురునకుఁ గుర్జుఁ డయ్యె
సిద్ధుఁడే లేని బ్రహ్మంబు చెలువు లేదు
బ్రహ్మమే లేని సిద్ధుని బ్రతుకు లేదు ! 100

గురుదేవుండు సుతాంతేవాసుల కాధ్యాత్మిక తత్త్వోపదేశంబు గావించుట

వ॥ అంత నొక్కనాఁడు— 101

సీ॥ పాదసంవాహంబు వాటించు నిల్లాలి
మృదుకరస్పర్శచే మేలుకాంచి
వాసరోచిత మైన స్వరము ప్రసారంబు
నారసి కాలకృత్యములు దీర్చి

మజ్జన మొనరించి మడుఁగుదోవతి గట్టి
రుద్రాక్షమాలికారూఢి మెఱసి
బూదిరేకలు మెయిం బులిమి సంధ్యావంద
న మొనర్చి పద్మాసనమున నుండి

గీ॥ ప్రియసతీసుతాంతేవాసి నయనములకు
బోధసుముఖోన్ముఖముఖంబు మురువుతోడఁ
గానిపించిన గురుని సంకల్ప మెఱిఁగి
పోతులూరయ్య పలికెఁ గై మోడ్పుతోడ 102

గీ॥ కళ్లియము లేని తురగంబు గతి భ్రమించు
మనసు నరికట్టి సముచితమార్గ మందుఁ
జనవలయు నంచుఁ ద్వన్ముఖంబునను వింటిఁ
బలుమఱు నదెట్లు సాధ్యమౌఁ దెలుప వయ్యా! 103

ఉ॥ కంబు గళంబు, తప్తకనకంబు శరీరము, వారిజప్రతీ
కంబు ముఖంబు, వజ్రఫలకంబు కపోల, ముదీర్ణ చంచరీ
కంబు కటాక్షు, మబ్దగమకంబు కచంబు, సుధారసానుపా
కంబు రదచ్ఛదంబు తమకంబు వహింపని చిత్తముండునే! 104

కం॥ దారసుతాదులతో సం
సారము భరియించు నతని స్వాంతము నందుం
గోరికి తరగలు తర మిడి
పారమ్ము నతిక్రమించి పడఁబాఱుఁ గదా! 105

ఉ॥ రాగవతీదృగంచలదరస్మితముల్ వలవేసి క్రిందికిన్
భాగవతప్రబోధితసుభాషితముల్ పయి కీడ్చుచుండఁగా
రాగవిరాగశూన్యశిఖరంబులపై విహరించు టెట్లు? నీ
తో గిరవాట్లు వేసి తులఁదూఁగఁగ లేము రహస్య మేమొకో!

చం॥ అనుటయు నోరగంట దరహాసమరీచిక పుక్కిలించి యి
ట్లనుఁ బిత్రుపాదుఁ డాతనికి నాంతరసంయమనంబు లేక యే
జనునకు మోక్షముం బడయ సాధ్యము గాదు, గృహస్థుఁ డయ్యు దా
సినిఁ బడయంగ వచ్చు నది నేరకయున్న సుఖంబు శూన్యమే!

కం॥ మాంసాస్థిస్నాయువసా
సంస్పృష్టనికృష్టతనువుఁ జాంపేయముతో
శంసించి నృశంసుం డయి
సంసర్గసుఖంబ కోర సద్గతు లున్నే? 108

గీ॥ అర్థకామంబు లొకభంగి నాదరించి
యాత్మజిజ్ఞాస మనికి శ్రేయస్కరంబ
యాజ్యమే లేక రుచియింప దన్న మనుచు
నమితముగఁ గొన్న డప్పి పెల్లార్చుఁ జూవె! 109

కం॥ కాంతాకనకంబులపై
భ్రాంతిని బడఁబొఱ కున్న వానికిఁ బాదా
క్రాంతం బగు మోక్షశ్రీ
శాంతదయాసత్యశౌచసన్నిధిఁ దానై 110

కం॥ దారసుతాదులు తిర మని
కోరెదవే మింటి కెగయు కోరిక? లవి చే
కూఱని నాఁ డేడ్చెదవే?
వారు పురాకృతఋణానుబంధములు గదా? 111

గీ॥ ఈ శరీరశతాంగంబు నీడ్చుచుండు
నింద్రియోచ్చైశ్శ్రవంబు లనేకభంగి
బుద్ధిసారథ్యమునఁ జేసి పుణ్యగతికి
మానసప్రగ్రహం బూని మఱల వలయు 112

ఉ॥ ఎవ్వఁ డనాత్మ మైన తనువే తిర మంచును గర్మబద్ధుఁడై
క్రొవ్వి మనంబునం బొడము కోర్కుల సందడి గాలిమేడలన్
నివ్వటిలుం బ్రమోదరసనిర్భరసౌఖ్యము లంచు నుండునో
యవ్వాఁడు గక్కటా! నరకయాతనలం బడుఁ జచ్చి పుట్టుచున్

మ॥ ఉరిత్రాడుం బురు లీషణాత్రయముగా వ్యూహంబు మోహంబుగా
నరిషడ్వర్గము జాగిలంబుగ మహాహంకార మస్త్రంబుగా
స్మరుఁడన్ క్రూరకిరాతకుం డోడిచి సంసారాటవీభూమిఁ గ్రు
మ్మరు జీవుం డను లేడి నయ్యమునకుం బంపించుఁ జీకాకుగన్

వ॥ కావున సుస్థిరం బగు బ్రహ్మపదార్థంబు నాసించి యుపాసింప వలయు నట్టిదాని కవశ్యంబు మనోనిగ్రహం బది గృహమేధి కెట్లు సాధ్యం బగు నందు వేనిం జెప్పెద నాకర్ణింపుము— 115

సీ॥ ఋతుకాలముల యంద సతిని సంతసపెట్టి
బ్రహ్మచర్యంబును బాయకుండి
యిల్లువాకిలి పసు లిల్లాలు బిడ్డలు
ఋణమూలకము లంచు నెద నెఱింగి
యవ్వారి కతమున నగు కష్టసుఖముల
బ్రుంగుడువడ కంతరంగ మందుఁ
బరమార్థ మగు 'నాత్మవత్సర్వభూతాని'
యను వేదవచనంబు ననుసరించి

గీ॥ యమము మొదలుగ నష్టాంగ మభ్యసించి
యాత్మనిగ్రహ మెనయంగ నగుఁ గుమార!
దాన సకలార్థసిద్ధి యా మానవునకు
నిదియ మార్గంబు జన్మరాహిత్యమునకు 116

వ॥ అదియునుంగాక— 117

గీ॥ ఆలుబిడ్డల నెడసి కాఱడవి నుండి
సంగసన్న్యాసి ననుట విస్మయము చూవె !
గృహము నందుండి తన్ను జయించు వాఁడు
సత్వసంపన్నుఁ డైన ప్రజ్ఞాపరుండు: 118

ఉ॥ విశ్రుతులై విముక్తిపదవిం జనరేమి ? కళత్రపుత్రమి
త్రాశ్రితబంధుకోటికి నుపాశ్రయులై విలసిల్లుచున్ గృహ
స్థాశ్రమధర్మదీక్ష నలరారు ముముక్షువు లైన వార: లా
త్మాశ్రయుఁ డైనవానికి గృహప్రతిబంధము నామమాత్రమే !

గీ॥ జనకరాజర్షి నిజభుజాస్కంధ మందు
రాజ్యభారంబు పూని సువ్రతుఁడు నయ్యె
వని మసలువార లట వ్రతభ్రష్టు లైరి
మానసికసంయమంబు ప్రధాన మెందు 120

చం॥ అన విని రోమహర్షణము లంగములం బొడమంగఁ దండ్రికిం
దనయుఁడు కేలు మోడ్చి పరతత్వనిధీ ! మును వింటిఁ దారకం
బనునది యోగమూల మని యయ్యది నాకు ననుగ్రహింపవే
యనఁ బితృపాదుఁ డిట్లను దయారసదృష్టి ననుగ్రహించుచున్

మ॥ అల పద్మాసన మందు నిశ్చలతనుండై యుండి యేకాగ్రతన్
దలఁపున్ నిల్పుచుఁ బంచముద్రల ప్రయత్నం బార ముబ్భంగిగాఁ
గల లక్ష్యంబుల లక్షణం బరసి యోంకారంబునం బుట్టు స
ద్దులు వించున్ మనుజుండు తారకము నందుం బొందు నిష్టార్థముల్

కం॥ అది దై నందినసాధనఁ
బదిలముగా సిద్ధిఁ బొందు భావజ్ఞులకున్
దుదిమొదలు లేని బ్రహ్మముఁ
గదియఁగ నిది దారి యనుచు గ్రహియింప వయా ! 123

కం॥ గురుమంత్రాక్షరదీపికఁ
బరిశోధన మాచరించి పరమేశ్వరునిన్
దరిసింపు మనుచు నయ్యో
తెఱఁగులు వివరింప నతఁడు తృప్తిం బొరసెన్ 124

వ॥ ఇట్లు పతంజలియోగభాగధేయంబును జ్ఞానవాసిష్ఠంబును సమీకరించి శుకాలాపంబుల నెలుంగెత్తి ప్రకృతిలోకంబున నుపనిషద్బీజంబులు వెదఁజల్లు జనకుని పాదరజంబు నంటి జ్యేష్ఠాత్మజుండు 'పరమేశ్వరుం డెట్టివాఁ డెండుండు? నది యెఱింగింపవే' యని ప్రార్థింప నమ్మహానుభావుం డిట్లనియె— 125

కం॥ సచరాచర మగు జగతీ
ప్రచయము గూలినను నంతరాళము నందున్
రుచిరాకృతి వెలుఁగు నెవం
డచలుం డవ్యయుఁడు బ్రహ్మ మాతఁడు పుత్రా! 126

ఉ॥ ఆతని కుక్షిలోఁ బ్రకృతి యావరణం బఖిలంబు నిల్చు మా
యాతిమిరంబు గప్పుకొని యంద జనించు నడంగు భూతసం
ఘాతము; జ్ఞాననేత్రములు గల్గిన ధన్యులు గాంతు రా పరం
జ్యోతిని సర్వభూతనిలయున్ దమలోని తమంబు పాచుచున్ 127

కం॥ కాతరుఁడు గాక నిజదృ
గ్జాతము భ్రూకుటిని నిలుపఁ గని 'తమసోమా
జ్యోతిర్గమయ' యని పరం
జ్యోతిని సేవింపవలయు నోయి కుమారా! 128

చం॥ అన విని యుత్సుకత్వమున నప్పరమార్థవిచారుఁ జూచి యి
ట్లనుఁ బ్రియనందనుండు 'మహితాత్మక! సృష్టివిధాన మెట్టి? దే
యనువున భూతముల్ గలుగు? నాత్మ కనాత్మకు భేద మేమి? నా
కు నెఱుఁగఁ జెప్పవే' యనివఁ గూరిమి నగ్గురుదేవుఁ డిట్లనున్

సీ॥ సృష్టికి నభిముఖాకృతి నొప్పు నీశ్వరు
నందు నాభాసించు నదియు ప్రకృతి
యదియు ముఖ్యాంగిగా నమరు సత్త్వరజ_స్త
మోగుణభాగంబు మూలకముగఁ
దద్గుణంబుల వల్ల నుద్గతంబులు నయ్యె
శబ్దాది తన్మాత్రసంచయములు
వానివల్ల జనించెఁ బంచభూతంబులు
భౌతికప్రేరణ వలన నెల్ల

ఆ॥వె॥ జగతి నడచుచుండు సముచితఫణితిమై
నిట్టి దివ్యసృష్టి నెసక మొసఁగి
స్థూలసూక్ష్మరూపలీలాపరం బయ్యె
నేమి చెప్ప వచ్చు నీశ్వరేచ్ఛ ! 180

సీ॥ అంతరింద్రియము లయ్యైదు జ్ఞానాదులు
ప్రాణంబు లగు సమానాదు లైదు
జ్ఞానేంద్రియంబు లయ్యేను శ్రోత్రాదులు
కర్మేంద్రియములు వాక్ప్రభృతు లేను
పంచతన్మాత్రలై పరఁగు శబ్దాదులు
సేరంగ స్థూలశరీర మొప్పు ;
నల జ్ఞానకర్మేంద్రియములు పంచప్రాణ
ములు మనోబుద్ధులు గలయ నొప్పు

గీ॥ సూక్ష్మదేహంబు పుత్రకా ! స్థూలసూక్ష్మ
దేహములు రెండుఁ గారణదేహ మైన
యట్టి యజ్ఞానమునఁ బుట్టి నట్టి వగుటఁ
గార్యరూపంబు లని యెఱుఁగంగఁ దగును. 181

వ॥ అసజ్జడదుఃఖానురూపం బైన స్థూలదేహంబ యనాత్మ. అనాత్మ యైన దేహంబుఁ దా ననుకొను టజ్ఞానంబు. దేహంబు కంటె విలక్షణం బైన యాత్మ నెఱుంగుటయ జీవన్ముక్తి నాఁబడుం గావున నజ్ఞానం బను కారణశరీరంబు నశింపంజేసి తరింపం జూడవే యన నతండు ప్రీతుండై తదీయాక్షరధ్యానమననతత్పరుండై యుండె నప్పుడు ప్రియశిష్యుం డైన సిద్ధుం డాచార్యునకు నమస్క రించి యి ట్లనియె— 132

మ॥ మును నాకున్ వివరింపఁగా వినితి నిప్పుణ్యాత్ము లర్థించి వేఁ
డిన యర్థంబులు శ్రద్ధతో నిపుడు వింటిం గాని యీదేహ మం
దున షట్చక్రము లున్నెడల్ తదధినాథుల్ వొల్చు చందంబులున్
వినఁ గౌతూహల మయ్యెఁ దెల్పఁగదవే విజ్ఞానవారాన్నిధీ ? 133

చం॥ అను ప్రియశిష్యు నాదరసమన్వితదృష్టిని జూచి నీకు నె
మ్మనమునఁ గల్గినట్టి యనుమానము వాయఁగ సుప్రబోధ మే
నొనరుతు నాలకింపు మన నుత్సుకుఁ డయ్యె నతండు వానితో
డన వెలివారలున్ శ్రుతిపుటంబులు సేర్చి రనన్యబుద్ధితోన్ 134

వ॥ అట్టియెడం బోలేరుజాతర సమకట్టియున్న యూరిపెద్ద లగ్గురుదేవు నాలుబిడ్డల తోడి వికటవేదాంతిగాఁ దలంచుచునికిం జేసి యిత రుల కట్ల విధించిన చందాగొని తేరఁ గక్కం డను వెట్టివాని ని యోగింప నతం డరుగుదెంచి గురుశిష్యసంభాషణంబులు సెవిం బడఁ బురాకృతపుణ్యవిశేషంబు నిమిత్తంబుగా నాధ్యాత్మిక వాసనాభిలాషంబు గలిమి 'మదీయభాగ్యం బనన్యసామాన్య మంతర్వాటి కరిగి యంతరాయంబు పుట్టింప నేల ? యింద యుండి యీ రహస్యార్థంబు లవధరింతు గా' కని యాశ్రమ కుడ్యంబున కవల నిల్చి చెవియొగ్గ నపుడు గురుండు సిద్ధున కి ట్లనియె— 135

కం॥ వావిరి నూర్ధ్వారోహణ
భావికి నుపయోగిపట్టభంగము లమ్మై
దేవతలు వొలుచు చక్రము
లీ వెఱుఁగుము జ్ఞానదృష్టి నిష్టావాప్తిన్ 186

కం॥ అన విని కక్కం డోహో!
తనువున దేవతలు గలరె! తత్తద్విధముల్
విను భాగ్య మబ్బె ననుకొని
వినుచుండఁగ గురుని బోధ వినిపించె నిటుల్ 187

సీ॥ అలరు మూలాధారవలయ మా గుహ్యంబు
నందు విఘ్నేశ్వరుఁ డధివసించు
నొప్పు స్వాధిష్ఠాన ముపరిభాగంబున
బ్రహ్మదేవుం డందుఁ బరఁగుచుండు
నాభిని నీలవర్ణంబున నొప్పారు
మణిపూరకం బందు మాధవుండు
హృదయంబు నం దొప్పునది యనాహతచక్ర
మందు రుద్రుఁడు మాన్యుఁ డగుచునుండు

గీ॥ కంఠసీమ విశుద్ధచక్రంబు నమరు
జీవుఁ డందు విరాజిల్లుఁ జెలువ మమర
భ్రుకుటి నాజ్ఞాభిధానంబు వొలుచు నందు
నీశుఁ డు త్తేజితుం డగు టెఱిఁగికొనుము. 188

కం॥ ఎడపక యీచక్రంబుల
నడుమ నిడాపింగళాఖ్యనాడులఁ గూడం
బడఁ వెడలుఁ బ్రాణవాయువు
నడచు సుషుమ్నాభిధాననాడిక కొసకున్ 189

గీ॥ బ్రహ్మరంధ్రం బనఁగ సహస్రార మొప్పుఁ
బ్రణవముం గూడి బుద్ధి కావాస మగుచు
సచ్చిదానందమయగురుస్థాన మదియ 140
యచటు చేరంగఁ గనుటె బ్రహ్మానుభవము

మ॥ నరు లజ్ఞానతమోవృతాత్మ లగుచున్ నైరాశ్యముం బొంది యీ
శ్వరు నస్తిత్వము సంశయింతురు స్థితప్రజ్ఞాపరిష్కారసు
స్థిరయోగైకసమాధిఁ గుండలికి దీప్తింగూర్చి లోఁజూడ్కితో
దరిసింపంగల రస్తినాస్తివిచికిత్సాహేతుమద్బ్రహ్మమున్ 141

కం॥ కావున నెవఁడే నిది సం
భావించి క్రమక్రమానుభవమున నడువం
గావలయును వేగిరపడి
దైవతసాక్షాత్కృతికిఁ బ్రధావింపఁ జెడున్ 142

గీ॥ అనుడు నచ్చటి జనులు తదర్థములను
శక్తి కొలఁదిగ గ్రహియింపఁ జాలి రపుడు
గురుల బోధలు శిష్యు లందఱకు సమమె
పాత్రమును బట్టి గ్రహియింత్రు ఛాత్రజనులు ! 143

వ॥ కక్కండు నంత దేహాంతస్థితు లైన దేవతల తెఱం గెఱింగితి నని సంతసిల్లి గురుని తుదిమాట పటింపక చివుక్కున నింటికిం జనియె నప్పుడు మఱొక్కరుం డరుదెంచి కక్కనిలేమి కచ్చెరువడి దేశికు నరసి గ్రామాధికారుల నిదేశం బెఱింగింప నమ్మహానుభావుఁ 'డేన వచ్చి మాటాడెదఁగాక పొ' మ్మని వానిం బుచ్చి సుతశిష్యపరివృతుండై పాదచారియై యచ్చటికిం జనె నప్పుడు— 144

గురుం డూరిపెద్దల దురహంకారంబు వెడల్చి యాదరించుట

సీ॥ అతఁ డాతఁడే సుఁడీ! యరుదెంచుచున్నాఁడు
డంబారు వింతవేసంబు గనుఁడు
తండ్రికి నెంతమాత్రము తీసిపోని ఛాం
దసు లైన సుతుల చందములు గనుఁడు
తలయూఁచి యింతలంతలు గాఁగ నబ్బుచు
వెనుకొనుచున్న శిష్యుని జూఁడుఁ
డాశ్రమ మెడఁ బాసి యడుఁగిడఁ జెడుదుమో
యను మాడ్కి నడఁగొను ననువుఁ జూడుఁ

గీ॥ అనుచు నొకనొక్క మాడుచు నంత నంత
నరసి తమ బుద్ధి తామ కొండాడికొనుచుఁ
గొలువు దీర్చిరి పోలేరుగుడికి నెదుర
నూరిపెద్దలు పెద్ద లైరి వారు? 145

శా॥ కాలజ్ఞానము సెప్పినాఁ డని సమగ్రబ్రహ్మవిద్యావివే
కాలంబం బని పెక్కు రన్యపుటభేదావాసు లేతేరఁగా
నాలోకింపరొ! యాలకింపరొ! దినం; బవ్వారి కీగిల్లుక
జ్వాలం బూనికి యేల? చివ్వకుఁ దపస్యాశక్తిఁ గవ్వింతురే! 146

క॥ అంతట వీరబ్రహ్మం
బంతేవాసియును దనయు లనుయాయులుగా
నంతికము సేరఁ గనియును
పంతములోఁ గూరుచుండఁ బలుకం డొకఁడున్ 147

ఉ॥ ఆగతి నిల్చియున్న గురు నారసి పెద్దలలో నొకండు 'నీ
యాగమనంబు లేమిటి కయా! పురిపెద్దలు నిర్ణయించి చం
దా గొని తేరఁ బంపిరి గదా? యొక రిద్దఱ నిచ్చి పంప లే
వా? గత మెందు కిప్డు గొనివచ్చితివా?' యన దేశికేంద్రుఁడున్

శా॥ చందా యిమ్మనుచుం బురప్రముఖు లాజ్ఞాపించి యుండంగ నే
మందుండైన నధఃకరింపఁ గలఁడా? మాకేల ధిక్కారముల్
సందేహాస్పద మైన యంశమును బ్రస్తావించి పోనుంటి మే
మిం దీ పెద్దల మ్రోల నాఁ గరణ మేమే మంచు రెట్టించుచున్

గీ॥ తనపయిం జూడ్కి నిగుడింప దమివరేణ్యుఁ
డో వివేకివ సమ! జీవకోటి
దేవతల పేరఁ బరిమార్చి తినెడు పనికి
నర్థ మిచ్చుట పాతక మగును గాదె! 150

కం॥ అన విని కరణం బగురా!
మునుపటి ధార్మికులు వట్టి మూర్ఖులె? తగ దీ
పని యని వార లెఱుంగరె?
ఘన మగు నాచార మిట్లు గాదనఁ జనునే? 151

వ॥ అనుడు గురుండు— 152

గీ॥ దేశకాలపాత్రముల కతీత మగుచు
నిలుచు సత్యంబ యనుసరణీయ మెపుడు
ప్రాక్తనం బని చెడుగు చేపట్ట రాదు
కాలదోషంబు లేదు సత్కార్యమునకు 153

కం॥ జాంతవబలికర్మము చే
సంతసపడి శక్తి శక్తిసంపద లిడు నం
చెంతయు భావించుటయే
వింతగదా? సుగతి కది వివేకం బగునే! 154

కం॥ మఱి శాకాహారుల దే
వర లెల్లరు నారికేళఫలముల నాసిం
తు రదేమి? వేఁడినెత్తురు
వఱదలు వలదేమి? శాకపాకప్రియుఁడా! 155

చం॥ అన విని మిన్నకుండి బదులాడక యోడక యున్కి లౌకికం
బని కరణం బెఱింగి వినవట్లు దెసల్ పరికింప సాఁగె నొం
డనక; మఱొక్కరుండు గురు నారసి యింతకు దేవతాబలుల్
ఘనతరపాపకర్మములుగాఁ దలపోయుదు వే? దయానిధీ! 156

క॥ అని సాపహాస్యముగ నా
డిన విని గురుదేవుఁ డుగ్గడించితి నొక్కో?
ఘనదైవతబలికర్మము
చన దని, చన దంటిఁ గాక జంతువధంబుల్ 157

మ॥ మన ప్రాణంబుల వంటి ప్రాణములె సుమ్మా! వాని ప్రాణంబులున్
మనకుం బ్రాప్తిలు బాధ వానికిని సంప్రాప్తింప కున్నే తెగం
గొనుచో? యింతకు దేవతాబలు లనన్ ఘోరంబు లౌ పాపపుం
బనులే? యిట్టిపనుల్ దురంతనరకద్వారంబులం జేర్పవే? 158

గీ॥ నోరు లేని జంతువులు కఠోరఖడ్గ
ధారఁ దెగటారఁ దద్రక్తధార తోడ
నంజలి ఘటించి శివమెత్తి యాడి పాడ
నంబ మెచ్చునె? యిచ్చునే యభిమతంబు? 159

సీ॥ మెడఁబట్టి యీడ్చి లాగెడు నెడ వెన్నాడు
బిడ్డను గని యేడ్చి, విడువలేక
విడుచుచు, గుండెలు దడదడ లాడంగ
డిల్పడి వెనుక కీడిగలఁ బడుచు,
వధ్యస్థలంబునఁ బడవైచి నప్పుడు
న్యాయమా? మీ కనినట్లు గనుచుఁ
గత్తి గొంతునఁ బెట్టఁ గన్నీరు గార్చుచు
నఱచుట కైన సాధ్యంబు గాక

సీ॥ గీ॥ కొట్టుకొని తల్లడిల్లుచు నెట్టకేని
ప్రాణ మర్పించు జంతువు వఱను జూచి
తత్కఠోరక్రియాపరత్వమున నున్న
వానిఁ జూచి దేవత శపింపకయ పోదు 160

కం॥ దయయును సత్యము మనుజుని
వియదున్నతపదవి నిల్పు, విమలాత్మకు లీ
ద్వయ మాదరించి భగవ
త్ప్రియకరులై సద్యశశ్శరీరులు గారే ? 161

వ॥ అని యుపదేశించి నంత 162

శా॥ ఆవాగ్ధోరణి నాలకించి బళిరా! యాచార్యుఁ డెంతేనియున్
జీవింబట్టి వధింప రా దనికదా! చీకొట్టెఁ బ్రత్యుత్తరం
బీ వీ రింక వలంతు లెట్లగుదురో! యెట్లంతముం బొందునో
యీ వాదం బని వింజ మాఁ కిడి నటయ్యేన్ దత్సదం బయ్యెడన్

చం॥ పొగయుచు నొక్కరుండు పొగచుట్టను నోటను బట్టి మోసలన్
నెగడిన బాలకుం గనుచు నిప్పును దెమ్మని యాన పెట్టి పై
కెగచుచు మీస లాసుకృతి నెక్కటి మేలపుఁజూడ్కిఁ జూచి లో
కగతి నదల్చి జంతుబలి కర్జము గా దనఁ జూతు వే మయా!

గీ॥ ఒడలు వెఱిగి గణాచారు లొక్కొకప్డు
జంతుబలి జంతుబలి యంచు గంతు లిడుచు
నూరి నడికించుచుందురే ? నారికేళ
ఫలములం దీఱుచో నట్లు పలుక రేల 165

గీ॥ అనవుడు గురుండు వారు మాంసాశు లగుట
జంతువధ మిచ్ఛగించి వ ర్తింతు రట్లు
సాత్వికాహారు లగు గణాచారు లేని
నట్లు వలుకంగ నేర్తురే? యనిన నతఁడు 166

గీ॥ క్రోధతామ్రాక్షుఁడై పొగ గ్రుక్క వేసి
పిదప నీపనిఁ బట్టుదు నిదె యటన్న
పగిదిఁ జూచుచు నచ్చటు వాయకున్న
బాలు గద్దించె నిప్పు తే వేల? యనుచు 167

ఉ॥ దానికి సంచలించి రటఁ దక్కటి వారలు, యోగిధీరుఁ డా
హ్వానము సేసి దేవళము నందలి శక్తినిఁ జూచి నిప్పు నీ
వైనను దెచ్చి పెట్టఁ జనదా? యటు సూచుచు మిన్నకుందు వే
లా? నను వంటివా రితని యాగ్రహదృష్టి భరింప నేర్తురే? 168

కం॥ అనఁ బోలే రోక బాలిక
గొనబుం గొని చేత నిప్పుఁ గొఱవిం గొనుచున్
జనుచెంచెఁ జెంగుచెంగున
ననఘా! యిది యిప్పు డెవరి కవసర మనుచున్ 169

ఉ॥ మించు గమించినట్లు మనుమిన్నను నేకముగా నొనర్ప నుం
కించిన యట్లు గుండె లుడికించి దురాశయబాష్పవారి వా
రించిన యట్లు సద్గురువరేణ్యుని శాసన మాదరించి వ
ర్తించిన యట్లు శక్తి చనుదెంచిన భీతిఁ జలించి రెల్లరున్ 170

గీ॥ అపుడు గురుదేవుఁ డా దురితాత్ముఁ జూచి
చుట్ట ముట్టించుకొను మట్లు చూతు వేల!
యనుడు నానీచు నిలువుగ్రుడ్లప్పగించి
యొండు వలుకంగఁ జాలక యుండి యుండి 171

గీ॥ ఒక్క మొగి లేచి ననుఁ గావు మో మహాత్మ!
యనుచు వ్రాలెఁ దదీయపాదాబ్జములను
గావుమీ నన్ను ననుఁ గావు కావు మనుచు
వేఁడికొనెఁ దోడుతో నెల్లవాఁడు నపుడు! 172

క॥ అది చూచి పరమకరుణా
సదనుం డగు వీరగురుఁడు శక్తిం జనఁగా
ముదల యిడి పంచి లేలెం
డిది యేలని వారి మేను లెంతయు నిమిరేఁ 173

గీ॥ తత్కరస్పర్శసుఖమును దనికి తేఱి
భయము భ్రాంతియు విడనాడి కయిమొగిడ్చి
శ్రీగురుస్వామి వలగొని వాగతీత
భక్తివిశ్వాసపరిణతిఁ బౌరజనులు 174

సీ॥ సామాన్యునకు నట్ల చందా విధించి మీ
యొద్దకుఁ బంపుట యొక్కతప్పు !
సహశిష్యసుతుఁడవై చనుదెంచు నినుఁ గాంచి
యెకసక్కెము లాడు టొక్క తప్పు !
వచ్చిన నిను గౌరవంబునఁ జూడక
యుల్లస మాడుట యొక్కతప్పు !
త్వద్వచోమృతధారఁ దనియ కసూయతో
నొప్పరికించుట యొక్కతప్పు !

గీ॥ తప్పు లన్నియు సైరించి తండ్రి వోలె
మమ్ముఁ గాపాడినాఁడవు మందమతుల
జేజినాయన ! యిట్టి చేతఁ గలాఁడె !
మాకుఁ బనియేమి సెప్పవే లోకనాథ ! 175

క॥ అన విని భూతదయాపర
త నితాంతగురుప్రవృద్ధతాత్పర్యముతో
మనుఁ డని దీవించిన వా
రనయము శిరసావహింతు మని రయ్యెడలన్ 176

## గురుండు కక్కనిం గటాక్షించుట

మ॥ అవురా ! మొందటఁ గొంప లార్పెదవు నీ వాధ్యాత్మికజ్ఞానబో
ధవుగా నొప్పుచు మోసగింతువె ? దురాత్మా ! నిల్వు మచ్చోటనే
శవముం జేయుదు మత్ప్రియారుధిర మాస్వాదించి కాడాడుచుం
గవియం జూచు కరాసితో ననుచు నుగ్రంపశ్యదస్యాకృతిన్ 177

గీ॥ రక్తసిక్తశరీరవస్త్రముల తోడఁ
గక్కఁ డాకస్మికముగ నక్కడకుఁ జేరి
చాఁగి లంఘించి బ్రహ్మవర్చస్సు నెదిరి
నిలువ లేఁ డయ్యె నసి చేత నిలువ దయ్యె ! 178

గీ॥ అప్పు డూఱడఁ బలికి యే మయ్యె ననిన
యూరిపెద్దకుఁ గక్కఁ డయ్యో ! యధీశ !
యేమి సెప్పుదు గురుదేవు నితని మాట
చందముం గొని భార్యను జంపుకొంటి 179

కం॥ అన విని యెల్లరు గురుదే
వుని దిక్కై తద్గభీరపూజ్యముఖంబుం
గని యేమన నేమగునో
యని మిన్నకయుంఁడి రప్పు డతనిం గనుచున్ 180

కం॥ గ్రామాధికారి నీ వీ
స్వామిని నిట్లాడు చునికి పాపము గాదే ?
యే మయ్యె నేమి చెపుమా
యామూలాగ్రముగ మాకు నవితథఘణితిన్ 181

కం॥ అనుటయు నా కక్కం డి
ట్లను నతనికిఁ దావకాజ్ఞ నప్పుడు చందా
గొని తేఁజని చాటుగ విం
టిని సిద్ధునితో గురుం డనిన యర్థంబుల్ 182

గీ॥ అద్భుతానందకందళ మయ్యె మనసు
దేహమున దేవతలు కొల్వు దీర్తు రనెడి
మాట చెవి నాటి నంత మైమఱచి పఱచి
యింటికిం జని కత్తి చేకొంటి నేను. 183

కం॥ నా కా సమయంబున నిది
నా కోమలి యీ గృహంబు నాదను భ్రమయే
లేకుండఁ బోయె దైవవి
లోకనకౌతూహలంబ లోకం బయ్యెన్ 184

గీ॥ మగువ యుదరంబుఁ జీల్పంగఁ దెగితి నందుఁ
బ్రేవులంగాక దేవతాకృతులఁ గనను
నన్ను నవిమృశ్యకారిగా నెన్నఁ గలరె!
గురుని బోధల నయథార్థ మరసి నపుడు. 185

వ॥ అని నిట్టూర్చి వెండియు నగ్గలం బగు దుఃఖం బపనయించుకొనం జాలక జాయాహంతకుండు—— 186

సీ॥ వెలిపోయినది నా వలపుఁబంజర మందు
రాణించు కలికి పారావతంబు!
సురిగిపోయినది నా పరువంపు టెలదోటఁ
బుష్పాళ్లతో నించు పుష్పవల్లి!
ఆరిపోయినది నా యానందగేహాళి
దీపించు శృంగారదీపకళిక!
మునిఁగిపోయినది నాఘనతరసంసార
జలరాశిఁ గడతేర్పఁ గలుగు నావ!

సీ॥ గీ॥ గుండియల మీఁద నొక ఱాతిగుండు పెట్టి
సమ్మెటలతోడ మోదిన చంద మాయె!
నెట్లు గడుపంగ నోపుదు నింక మీఁదఁ
బ్రాణవల్లభ లేని యీ పాడు బ్రతుకు! 187

మ॥ అది యిల్లాలు మహాపతివ్రత యొకండైనన్ ననుం గోలుపు
చ్చదు నా తెచ్చినదానితోఁ గడపు సంసారంబు సొంపారఁగా
బ్రదుకన్ నేర్తు నిఁకెట్లు? బిడ్డలకు నోరా! తెక్కలున్ రావు నా
కది చేసేఁత నొనర్చుకొన్న దురితం బెప్పాటఁ దీఱుం గటా! 188

సీ॥ ఏను గ్రామాంతర మేఁగి రాకుండిన
గువ్వచందమున డొదవ్వ లరయుఁ
చలిగాలి చెలరేఁగి జలుబు చేసినఁజాలుఁ
దల్లడిల్లుచు నుండుఁ దగ్గువఱకుఁ
దల తోఁక లేని పిల్లల నెట్లు పోషింతు
నని దిగుల్పడిన ధైర్యంబు సెప్పు
నినుఁ దృప్తి పఱుప నేరని వాఁడ నని యన్న
నాకేమి లోటని నవ్వుచుండు

గీ॥ నట్టి యిల్లాలిఁ బట్టి ఘోరాసిదూసి
చీల్చివేసిన చండాలచిత్తు నొడలఁ
గ్రిమిసమూహంబు లుకలుక గెరలు ననుచు
నెగులుఁగన్నీరు గార్చె మున్నీరు గాఁగ. 189

వ॥ అది విని 'యయ్యో!' యనువారును, మొఱకుఁదనం బింత కఱుకైనదే' యనువారును, వేగురపాటు వలని భంగపా టిట్టి దను వారును నై యచ్చటివారు జాలిచూపులు నిగుడ్చి రప్పు డతని వీఁపు దట్టి యూఱార్చుచు— 190

గీ॥ 'సాహసంపడి యిట్టి కష్టంబు గంటి
వెలఁదుక కళేబరంబుఁ జూపింతు గాక
ర' మ్మనుచు బ్రహ్మసమ్మితుఁ డిమ్ము సేర
నుద్యతుం డైన నది సూచి యూరిపెద్ద. 191

కం॥ 'గురుదేవ! తత్కళేబర
మరయం దెప్పింత మిటకు, నట కిప్పుడు మీ
రరుగంగ నేల?' నావుడు
నెఱఁగి తదాంతర్య మతని కిట్లను గురుఁడున్ 192

మ॥ వెలివాడం జొరఁగూడ దన్న నియమంబే యిట్లు పల్కించెనే?
కలదా వారికి నస్యవర్ణ జుల కొక్కండేని భేదంబు పు
ట్టుల? నాఁకట్టి కులాభిమానమున నంటుందీఁటతోఁ దోడివా
రల నన్యాయ మొనర్ప దేశమునకుం బ్రాపించునే సౌఖ్యముల్?

మ॥ అది యెట్లైన నటయ్యెఁ గాక! ప్రబలవ్యాపన్న భక్తావళిన్
గదియం బోవకయుండ, వారి వగు శంకాపంకముల్ దీర్పకుం
డఁ దదిష్టంబులు గూర్పకుండ కుణదిష్టం బేని నాయిష్ట మె
ప్పదు, కష్టం డగుఁ గాక! కక్కఁడు మహాభక్తుండు ముమ్మాటికిన్

చం॥ అన విని బుద్ధిఁ దెచ్చుకొని యందలి పెద్దలు పిన్న లేకమై
మనసులఁ బాదుకొన్న యభిమానములన్ దిగఁద్రావి యోగితో
డను వెలివాడలోనికి హుటాహుటి నేఁగిరి; మాఱుమాట చె
ప్పను గలదా? ప్రబోధకుని- బట్టిగదా మునుకొంద్రు భూప్రజల్?

వ॥ అ ల్లెల్లరుం గక్కని యిల్లు సమీపించి రప్పుడు గురుం డతనిం దోడ్కొని లోనికిం జని 'భవద్భార్యాకళేబరంబు సూపు' మనుటయు నతండు తదాచ్ఛాదనపటంబు తొలంగించి బావురు మనియె నది సూచి గురుం డనునయించుచు నతని కి ట్లనియె— 196

గీ॥ ఇట్టి బెట్టిదపుంబను లెన్నఁ జేని
సలుపఁ జూతురె ? దేవతాసమితి నాత్మ
దేహమునఁ జూడ నగు జ్ఞానదృష్టి తోడఁ
గడఁగి పరదేహములు సీల్పఁ గానఁ గాదు. 197

కం॥ ఇదె నీకుఁ బ్రసాదించితి
సదయామతి జ్ఞానదృష్టి చక్కఁగనుమా
తుదిమొదలుగఁ జక్రాకృతి
సదనంబులఁ బొలుచు దైవసంతతి జూడల్ 198

సీ॥ అతఁడు విఘ్నేశ్వరుఁ డాధారచక్రంబు
నందు భాసిలుచుండు నరసి చూడు
మితఁడు శతానందుఁ డెలుక గు ర్తింపు స్వా
ధిష్ఠానమునకు నధిష్ఠమూ ర్తి
వాఁడుగో ! విష్ణుఁ డపార తేజస్కుఁడై
మణిపూరకము నందు మలయుచుండు
వీఁడు రుద్రుఁడు తీఱిచూడు మనాహత
మధ్యమస్థలి భాసమానుఁ డయ్యె
గీ॥ జీవుఁ డతఁడు విశుద్ధచక్రావృతుండు
భ్రుకుటి నాజ్ఞాఖ్యఁ గను మీశ్వరుని వెలుంగు
సద్గురుబ్రహ్మ మది సహస్రార మందు
ననుచుఁ దెలుపఁ జిదానంద మొనసె నతఁడు, 199

సీ॥ పదినాళ్లు పస్తుండి పదునొకండవ నాఁడు
పాయసంబు భుజించు పగిదిఁ గాఁగ
దేశాంతరం బేఁగి తిరిగి యింటికి వచ్చి
తమిదీఱ సుఖయించు క్రమము గాఁగఁ

ప్రతిభశూన్యం బయ్యుఁ బ్రాప్తంబు మంచిదై
శాసకుం డగు నట్టి సరణి గాఁగఁ
బిల్లి కి బిచ్చంబు వెట్టని లోభియై
తుగి సీగి నుతి కెక్కు నుదుటు గాఁగ

గీ॥ కక్కఁ డున్నట్టు లుండి యాకస్మికముగ
జ్ఞాననేత్రంబు వడసి దివ్యానుభవము
నంది యాత్మాధికారియై యభినుతార్హుఁ
డయ్యె నిదికదా ! పూర్వపుణ్యానుభూతి ! 200

వ॥ అనంతర మతండు గురుదేవునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి తదేకదృష్టినిబద్ధాత్ముఁ డగుచుఁ గయిమొగిచి— 201

ఉ॥ నీవు జగన్నియంత విది నిశ్చయ మే నొక పాపకర్మపుర్
జీవిని, పూర్వజన్మమునఁ జేసిన పుణ్యఫలంబు నిట్లు దే
వా ! వెల కట్టి యిచ్చుటకునై దయచేసిన వాఁడ, విప్ప డీ
సేవకు ముక్తి నిచ్చి ఋణశేషము లే దనిపింపఁ జెల్ల దే ? 202

వ॥ అనిన వాని యింగిత మ్మెఱింగి బ్రహ్మసమ్మితుం డగు గురుండు చిఱునగవుంజూడ్కి నెలయించి 'సంసారనివర్తనం బిప్పుడు కర్తవ్యంబు గాదు. మదుపాసన మాచరించి తరింపం జూడు' మని యుపదేశించి తదనంతరంబు— 203

చం॥ గరిత కళేబరంబు పయిఁ గప్పి పటంబును మంత్రపూతపు
ష్కరములు సల్ల మేల్కనిన కైవడి లేచె లతాంగి; దాని క
బ్బురపడి సంతసంపడి ప్రభూ ! పరదైవతమూర్తి వంచుఁ ద
చ్చరణము లందు వ్రాలి నతి సల్పి నుతించెను గక్కఁ డయ్యెడన్

కం॥ మదవతియు నిశని మహిమన్
బ్రదికితిఁ గావలయు ననెడి భావనతోఁ ద
త్పదములకు నెఱఁగె, గురుఁ డ
భ్యుదయోపాదకము లగు శుభోక్తులఁ దనిపెన్ 205

వ॥ అంత నమ్మువ్వు రగ్నిత్రయంబు వోలెం బ్రకాశించుచు గృహంబు వెల్వడినం జూచి 'యోహో! యేమి? యిమ్మగువ యిమ్మహాత్ముని మహాత్వంబునం జేసి పునర్జీవిత యయ్యెనే? యిట్టి దశ్రుతపూర్వం బని యందలి వా రెల్లరు— 206

సీ॥ గుణసముద్రులు లేరె? ప్రణవనాదవినోది
సత్వజీవను లనం జనరు గాక!
అర్కోపములు లేరె? యాధిభౌతికజాత
వాతార్తిహరులు గన్పడరు గాక!
పుణ్యజనులు లేరె? భువనతమశ్చార
పరిహారకులు గానఁబడరు గాక!
ధర్మరాజులు లేరె? దారహితైషిమా
యాతోధిగములు గారైరి గాక!

గీ॥ బుధగురులు లేరె? కవిరాజముఖ్యయోగ
భాగ్యరాజ్యాధిపతులు గన్పడరు గాక!
యీ మహాత్మునిఁ గొనియాట కెవరు నేర్తు?
రంజలి ఘటించి దాసోహ మనుట మేలు! 207

సీ॥ బోధించి పలికిన భూతదయాసృష్టి
దారుణబలినిషేధంబు సలుపఁ
గనుఁజూడ్కి పఱగించి కదలి ర మ్మనిపిల్వఁ
గొఱవితో గుడిసత్తి పఱచిరాఁగ

గడగడ లాడుచు గ్రామాధికారులు
ప్రార్థనాంజలు లెత్తి ప్రస్తుతింప
నమ్మితి బేలనై నాయిల్లు గూల్చితి
విఁకఁజాలు నని కక్కఁ డెదిరి నడువ

గీ॥ బెట్టిదంబుల కొడిగట్టి బేల నైతి
చాలు లేలెమ్ము రమ్మని కేల నిమిరి
జ్ఞానదృష్టి ప్రసాదించి సర్వసమతఁ
దేజరిల్లిన బ్రహ్మంబు దిక్కు మాకు ! 208

వ॥ అని ప్రస్తుతించి రప్పుడు సిద్ధుండు కక్కనిం జూచి— 209

మ॥ తలమే యెవ్వని కైన నీదృశభవద్భాగ్యంబు చేపట్టఁగాఁ
దలక్రిందైన మునీంద్రు లేఫలము నందంజాల రద్దాని నీ
వలవోకం గయికొన్న వాఁడవు గదన్నా! రమ్ము రమ్మంచుఁ గౌఁ
గిలి మన్నించి తదుత్తమాంగ మభిషేకించెం బ్రమోదాశ్రులన్ !

వ॥ అంత నప్పురవాసులు గురు నాశ్రమంబున కనిచి యుపనిషద్ర
హస్యంబులు భవిష్యద్విశేషంబు లెఱింగికొనుచు ననుదినం బనుప
మానభక్తిశ్రద్ధాభరంబుల నారాధించుచుండి రంత నొక్కనాఁడు-

సిద్ధుండు కడపనవాబు క్రౌర్యంబు నిర్మూలించుట

చం॥ ఉడుగక పీరుసాహెబు సుతోద్యమ మెల్లను విన్నవించుటన్
'జడనిధి సిద్ధుఁ డన్యమతసంగతిఁ బూనుట యేమొ! యా గురుం
డడపక చేరఁ దీయుటయు నేమొ! కనుంగొను వాఁడ' నం చిసీ!
కడపనవాబు శ్రీగురుశిఖామణిఁ దేరఁగఁ బంచె సేవకున్ 212

చం॥ పనిచిన వాఁడు వచ్చి తనవచ్చిన కార్యము విన్నవించుడుఀ
గని గురుమూర్తి సిద్ధుని మొగంబు 'బళా! వినుకొంటివే భవ
జ్జనకుని వజ్రపాతసదృశం బభియోగము చేని క్రోధముఀ
నిను వలదంటి ని ట్లనుచు నీ వది కైకొన కుంటి వక్కటా! 213

కం॥ అన నులికి సిద్ధుఁ డిట్లను
వినయానతశీర్షుఁ డగుచు వీరేశునితో
నను వెలుపింపఁగ నేమిటి?
కనఘా! నాహృదయ మింక ననభిహితంబే! 214

కం॥ ఎందఱు నవాబు లైనను
మందుకుఁ గొఱగారు దివ్యమహితాత్మక! మీ
ముందఱ, నవ్వారికి నా
డెందము మఱలింపఁగల పటిష్ఠత వలదే? 215

కం॥ న న్ననుపుఁ డటకు నృపతిం
బన్నుగ శాంతింపఁ జేసి వచ్చెద నిపుడే
చిన్నిపని కింత యేమిటి?
కన్న గురుం డతని బుద్ధి కామోదించెఀ 216

వ॥ సిద్ధుండును సాష్టాంగనమస్కారంబు లాచరించి తదాశీర్వచన శిరస్త్రాణంబు వహించి రాజభటు ననుసరించి చనుచు మధ్యే మార్గంబున నంతర్హితుం డయ్యె. నంత 'నిబ్బాఁపండు భయవిహ్వ లుండై కను మొఱంగి పాఱంజూపినాఁ' డని భ్రమించి భటుండు పరివృఢున కెఱింగింప నతిత్వరితగమనంబునఁ గడపకుం జని యట ఘంటాపథంబునఁ దురుష్కపౌరులం గూడి సంభాషించుచున్న సిద్ధునిం గని స్తంభించి నిలిచె నప్పు డప్పురవాసు లారాజసేవకున కతనిం జూపి— 217

గీ॥ కాఫరీతఁడు నగరోపకంఠసీమఁ
జిక్కె మము లోఁగొనంగ వాంఛించె నేమొ!
యితనిఁ దోడ్తోన కొనిపొమ్ము నృపతి కడకు
ననుడు వెడనవ్వు నగి సిద్ధు నరసి వాఁడు   218

శా॥ పాటిం జూపినవాఁడవై పురము నబ్బంగిం బ్రవేశించి నా
వారా! ఘట్టకుటీప్రభాతముగ నీ ప్రారబ్ధ మిట్లయ్యెనే!
రార మ్మింక నృపాలు పాలి కన మార్మాటాడ కాలెంకతోఁ
జేరెన్ సిద్ధుఁడు రాజు నోలగ మలక్ష్యీభూతచిత్తంబుతోన్   219

గీ॥ చేరి పాదుషాకు సలాము సేయకుండి
గురుని నామంబు స్మరియించుకొనుచు నున్న
వానిఁ బొడసూపి వివరించెఁ బార్థివునకు
భృత్యుఁడు సలాము సేసి తద్వృత్త మవుడు   220

శా॥ హుక్కా పీల్చుచు నోరగంటఁ గని యాయుర్వీశుఁ 'డున్మాదమా!
నిక్కా! నాకు సలామలేకు మన కే నిల్చెం బరధ్యానతన్
బక్కా హైంధవపాదదాసుఁ డగు నిప్పాపాత్ముఁ బోనిచ్చినన్
దక్కంబోవదు గౌరవం బనుచుఁ గ్రోధం బారఁగా నిట్లనున్   221

గీ॥ పీరుసాహాబు కొడుకవు వీరయోగి
పాదదాసుండ వీవు భూపాలసభల
నెట్లు మెలఁగంగ వలయునో యెఱుఁగ వొక్కొ!
యెంత సన్యాసి వైనను సుంత యేని!   222

గీ॥ తురకబిడ్డఁడవై మతాంతరునిఁ గొలుచు
సాహసుఁడ వీవు మా రాజసంబు నేము
లెక్కయా నీకు! నగుఁగాక లేశ మేనిఁ
దలఁప మది నిన్నుఁ జూచినఁ గలఁగు మనసు   223

సీ॥ అలికభాగము నందు నవఘుళించుచు నున్న
భూతిరేఖల కుపోద్ఘాత మేమి ?
గరగరలాడుచు గళమున వ్రేలాడు
రుద్రాక్షమాలల రూఢి యేమి !
కటిభుజంబుల మీఁదఁ గప్పిన కాషాయ
వసనంబు వలని తాత్పర్య మేమి !
పెదవులు కదలించి కదలింపక జపించు
మంత్రాక్షరంబుల మహిమ మేమి ?

గీ॥ స్త్రీయ మెడఁబాసి యన్యంబు స్వీకరించి
వింత వేసంబుమైఁ గొన్న విజయ మేమి ?
మాకు నెఱుఁగంగఁ జెపుము నీ మార్గ మెల్ల
నిది మదోన్మాద మనుటకుఁ గొదువ యేమి ? 224

కం॥ ఏఁడీ నీ గురుదేవుఁడు ?
రాఁడిచటికి మాకుఁ గానరాఁడా యెపుడున్
వేఁడికొను వారి పాలిటి
వాఁడై మము నోల్లకున్న బ్రతుకం గలమే ! 225

కం॥ అన విని కటకటపడి యి
ట్లను సిద్ధుఁడు నృపతిఁ జూచి యద్భుతఫణితిన్
జననాథ ! కంటగింతువు
నను నిష్కారణము నీకు న్యాయం బగునే ! 226

మ॥ కరులా? గుఱ్ఱములా! రథోత్కరములా! శాల్బంటులా! మంత్రిశే
ఖరులా భూరివిలాసమందిరములా! కాంతామణీబృందమా?
నరనాథాగ్రణీ! మాకు నేటికి మదోన్మాదంబు పుట్టున్ నిరం
తర యోగాభ్యసనంబె జీవికకు నాధారంబు మా కెప్పుడున్ 227

ఆ॥ వె॥ వేషధారి వోలె వింతవింతగ నీకుఁ
గానిపించు వాఁడనే నరేంద్ర!
భూతలంబు నందుఁ బుట్టిన వాఁ డెల్లఁ
దనువు తోడి వేషధారి గాఁడ! 228

ఉ॥ తొల్లి యనేక వేషములతో విహరించితి నిందు నిప్పుడీ
వల్లడిఁ జెంది శ్రీగురుని పాదయుగంబు భజించు వాఁడ నేఁ
డెల్లి మఱొక్క-రూపు ధరియింపఁగ నొల్లని బుద్ధి పుట్టిన
న్నల్లిద మాడఁగాఁ దగునె? యించుక తెల్పుము రాజవల్లభా!

సీ॥ భవసాగరము తరింపఁగ వచ్చునే వీర
నారాయణధ్యాననౌక లేక!
ఆశాలతాపాళి హరియింప వచ్చునే
బ్రహ్మపూజాలవిత్రంబు లేక!
షడ్వైరివర్గంబు సమయింప వచ్చునే
శ్రీగురుమంత్రాస్త్రసిద్ధి లేక!
జ్ఞాననిధానంబు గానంగ వచ్చునే
దేశికారాధనదీప్తి లేక!

గీ॥ సాహసుండ వంచు నొకమాట జాఱ విడిచి
నన్నుఁ దూఱాడఁ జెల్లునే నరవరేణ్య!
తత్త్వభావంబు నెఱిఁగిన తఱిని నీవు
పరుగు లిడకుందువే కట్టువాని పగిది! 230

సీ॥ వీరేశ్వరుని పాదనీరేజములు గొల్చు
భాగ్యమే భాగ్యంబు పార్థివేంద్ర!
బ్రహ్మవిద్యానిధి వాగమృతము గ్రోలు
పుణ్యమే పుణ్యంబు భూవరేణ్య!

రాజయోగీంద్రు నారాధింపఁ గయికొన్న
వేష మే వేష మూర్జితలేంద్ర !
కాలత్రయజ్ఞాత కైంకర్య మొనరించు
జన్మమే జన్మంబు జనవరేణ్య !

గీ॥ త్వాదృశుల దృష్టికిన్ మతాంతరుఁడ యేని
నెఱుక గలవారి కతఁడు లోకైకనాథుఁ
డింతయు గ్రహించి శాంతింపు మింక నైన
భక్తిభావంబు తోడ భూపాలముఖ్య ! 231

కం॥ 'ఏఁడీ వీగురుదేవుఁడు ?
రాఁ డిచటికి మాకుఁ గానరాఁడా ?' యని కా
ఱాడెదు బెబ్బులి కైవడి
రాడగ్రణి ! బోనులోఁ జొరంబడ వలతో ? 232

ఉ॥ నీ వొకకొంత మేర యగు నేలకు నేలిక వైన మద్గురుం
డీ విపులప్రపంచమున కేలిక వానికి నీకుఁ బోలికా ?
భావము నందు నీకుఁ బరిభావ మొనర్చు తలంపు పుట్టినన్
దావకసన్నిధానమును దప్పని సిద్ధుఁడు సిద్ధమే సుమా ! 233

ఉ॥ నేను సలాము సేయకయ నిల్చితి నంచును మానగర్వముం
బూనుదు గాని నాదు కయిమోడ్పు భరింప వలంతి వౌదువే ?
మానవనాథ ! దానికి సమర్థుఁడు నాగురుదేవుఁ డొక్కఁడే
నేను నమస్కరింప నవనీధ్రము బ్రద్దలు గాక పోవునే ? 234

కం॥ అన విని ద్విగుణీకృతకో
పనిరూఢి నరేంద్రుఁ డతనిఁ బరికించి భవ
ద్ఘనతయును గురుని ఘనతయుఁ
గనుఁగొని యే విడుతు నోరికావల మడఁతున్ 235

సీ॥ అతఁ డెంత కవివరుం డని కాదు, వాని కా
వ్యప్రయోజన మేమొ పలుకవలయు !
నతఁ డెంత పండితుం డనికాదు, వాని పాం
డితి నైన మేలు చాటింపవలయు !
నతఁ డెంత మహిపాలుఁ డని కాదు, వాని పా
లన లోని సుఖముఁ దెల్పంగవలయు !
నతఁ డెంత ధనవంతుఁ డని కాదు, వాని వి
శ్రాణనధారలు చాటవలయు !

గీ॥ నంతియే కాని యింతవాఁ డంత వాఁ డ
టంచు వినువీథి కెత్తిన నందు నిలుచు
నెంత కాలంబు ? కొండాడు దీవు గురుని
వాని పస యేమొ మాకుఁ జూపంగ వలయు ! 236

ఆ॥ వె॥ ముందు నీప్రభావమును జూపు మావల
గురుని మహిమ మెల్ల నెఱిఁగికొందు
మనుచు భటుల నంపి యప్పుడ తెప్పించె
నల్ల ఘాతిగుండు నరవరుండు 237

కం॥ తెప్పించి యేమి కాఁగల
దిప్పుడు సూచెదము కొండ లేమిటి కిది నీ
గొప్పందనంబు చాటుం
దప్పక యభివందనం బొనర్పం గదవే ! 238

చం॥ అనుడు జడస్వభావుఁ డగు నాతని బుద్ధికిఁ గంటగించుచున్
మనసున దేశికుం దలఁచి మాన్యుఁడు సిద్ధుఁడు మ్రొక్కె మ్రొక్కినం
తన యుపలంపు గుండు శతధాశకలంబులు నయ్యె భీషణ
ధ్వని వెలయించుచున్ శతశతఘ్నులు ప్రేలిన చంద మొప్పఁగన్

మ॥ కనుమూఁతల్ పడియెన్ సదస్యులకు నాకంపించె దేహాంగముల్
మునుమున్నన్ బయికొన్న గుండెదడ నేపుంజూపె నిట్టూరుపుల్
ఘనపాషాణము ఘోషభీషణముగా ఖండోపఖండంబులై
చెనకెం జిక్కని పాదుపాదిటవు నిశ్శేషంబుగా నయ్యెడన్ 240

ఉ॥ అంతటఁ గొంతసేపటికి నల్లన కన్నులు విచ్చి కాశ్యపీ
కాంతుఁ డజయ్య తేజమునఁ గ్రాలుచు నుండిన సిద్ధుఁ జూచుచున్
శాంతిలు మంచుఁ బాదముల సన్నిధి వ్రాలె, సభాజనుల్ తదీ
యాంతిక మందు వ్రాలి వినయంబున మ్రొక్కి రనన్యభక్తితోన్

కం॥ సిద్ధుం డది గని కరుణా
బుద్ధిఁ గటాక్షించె నపుడు భూపతి భక్తి
శ్రద్ధల నమ్మహితుని గుణ
వృద్ధుని నుచితాసనోపవిష్టునిఁ జేసెన్ 242

గీ॥ చేసి యిట్లను నీ పాదసేవఁ జేసి
బ్రతికెదను గాక యీ రాజ్యభార మేల!
వలదు వల దింక వాత్సల్యవర్షణమున
నన్ను వెలయించి యేలుకొనం గదయ్య! 243

గీ॥ నీ ప్రభావంబు నెఱుఁగక నిష్ఠురముగఁ
గాఱు లాడితి బలుకండకావరమున
నన్ను మన్నించి యో కరుణాపయోధి!
కావఁ గదవయ్య! శిష్యునిగా నొనర్చి 244

గీ॥ భటునితో వచ్చువాఁడవు పాఱఁజూపి
నట్లు నటియించి యోగవిద్యానిరూఢి
మున్న విచ్చేసి యుండితి వన్న భావ
మిపుడు గోచర మయ్యె నా హృదయమునకు 245

గీ॥ పరమకారుణ్యమున నాకుఁ బ్రాణభిక్ష
పెట్టిన వదాన్యగుణసమన్వితుఁడ వీవు
కరుణ విడనాడి యులుక క న్దెఱతు వేని
మాదృశుల భోగభాగ్యముల్ బూది గావొ! 246

సీ॥ మందులో గుణ మెంత మాత్రంబు లేకున్నఁ
బయి వ్రాఁత పూఁత మెం డయిన యట్లు
కావ్యంబులోఁ బస కఱ వైనఁ బండితా
భిప్రాయములు పెచ్చుపెరిగి నట్లు
అందచందములలోఁ జొందిక లేకున్న
మిలమిలఁ వలువతో మెఱసినట్లు
చేఁతల నొకపాటి చెల్లకుండిన నిండు
విగ్రహాపుష్టి దీపించి నట్లు

గీ॥ పయి పటాటోపములు సిజభటుల పేర్మి
నృత్తగీతవిలాసముల్ నిండుకొలువు
లెసక మెసఁగు నంతస్సారహీన మగుచు
మా బ్రదుకు లెంతవఱకు సమ్మాన్యచరిత! 247

చం॥ అన విని పిన్నన వ్వొలయ నాతనిఁ గన్గొని సిద్ధుఁ డిట్లనున్
నను భజియించు వాంఛ దగునా? యిల నెంతటివాఁడ నే నిసీ!
నిను నను నీ సమస్తధరణీవలయంబును నుద్ధరించు వాఁ
డనితరసాధ్యదివ్యమహిమాఢ్యుఁడు వీరగురుండు భూవరా! 248

క॥ నావిని నవాబు శ్రీగురు
దేవునిఁ గొన నైతి హృదయదేశము నందున్
నావంటి పాపకర్ముం
డీవసుమతి నింక నెవ్వఁ డేనిం గలఁడే? 249

క॥ మహి నుద్ధరింపఁ బూనిన
మహనీయుని నిజమతాభిమానము తోడన్
బహుదుర్భాషలఁ దెగడిన
బహుళానర్థములు గాక వలచునె శుభముల్ ? 250

గీ॥ నాకు జ్ఞానోదయం బయ్యె నీ కృపాక
టాక్షవీక్షణంబునఁ జేసి యీ క్షణంబ
సిద్ధపూరుష ! నను వానిఁ జేర్పు మయ్య !
బ్రతికెదను దత్పదధ్యానపరత నేను 251

గీ॥ అనుడు నించుక యోచించి యను నతండు
రాజచంద్రమ ! రాజ్యభారంబు విడిచి
నీవు రానేల ? యీ గురుదేవు నిటకు
నేన కొనివత్తు నొకనాఁడు నిశ్చయముగ 252

క॥ అందాఁ కోపిక పట్టుము
వందారుజనావనుండు బ్రహ్మేంద్రుఁడు నీ
వందెద వభీష్టఫలములు
వందురకుము నేను బోయి వచ్చెద ననుచున్ 253

వ॥ ప్రయాణసన్నద్ధుం డైన సిద్ధునింజూచి నవాబు భవదాజ్ఞాబద్ధుం డనై గురుదేవుతోడి పునర్దర్శనంబున కెదుళ్లు సూచుచుండు నని భయభక్తివినయవిభ్రమపురస్సరంబుగా నమస్కరించి వీడ్కొల్పె నప్పుడు— 254

మ॥ జయలక్ష్మీకిలికించితాననముతో సాష్టాంగ బ్రహ్మావా
దయుగీధ్యానముతో మనోజవము చేతం గందిమల్లయ్య ప
ల్లియ భాసిల్లిన స్వామిపాదముల వ్రాలెన్ సిద్ధుఁ డొక్కమ్మడిన్
నయనంబుల్ విరియించి పౌరజను లానందంబుమైఁ జూడఁగన్ 255

కం॥ అంతట నృపతిసభావృ
త్తాంతమ్ములు విన్నవించెఁ దన గురునకు వి
శ్రాంతిగ నాతం, డెంతయు
సంతసముం బొందె గురుఁడు స్వాంతము నందున్ 256

కం॥ గురు నంతవాఁడు సిద్ధుఁడు
గుఱుతెఱుఁగని శిష్యులేల కోకొల్లలుగా
సరి యగు గుణవంతుం డొ
క్కరుఁ డబ్బినఁ జాలు గురుని ఘనతకుఁ బ్రతిగాఁ 257

వ॥ అంత నొక్కనాఁడు గురుదేవుండు ప్రియశిష్యు నాననం బవలోకించి సంచారమున కుపక్రమింప వలయు సన్నహానం బొనర్పు మని యా దేశింప నతం డట్ల చేసె నంత— 258

## యోగఫలము

కం॥ గురుభక్తిశ్రద్ధలు త
త్పరహాస్యార్థములు భూతదయయును గలుగన్
బరికించి సిద్ధయోగము
స్మరియించిన నడఁగి మడఁగు మదమత్సరముల్ 259

## ఆశ్వాసాంతము

మ॥ గురువృద్ధాభిమతానుకూలగతిమత్యూలంకషాచారసి
ద్ధ్యరిణీమజ్జనమాన్యదేహులు దయాసత్యక్షమావిస్ఫుర
త్పరిశుద్ధదేహులు పారమార్థికగుణప్రజ్ఞాహృతప్రాకృతాం
తరసందేహులు ధర్మకర్మకరణద్రాఘిమనిపావహుల్ 260

కం॥ సౌఖ్యనిధానపరప్పర
సఖ్యులు శ్రీవేంకటనరసాంబాబ్రహ్మ
భిఖ్యులు పురుషార్థప్రా
ముఖ్యప్రతిభావిశేషపూర్ణసమాఖ్యుల్ 261

గద్యము : ఇది శ్రీపూసపాట్యన్వవాయపయఃపారావారరాకా కురంగ లాంఛన, సహజకవిపంచానన, కవిశేఖర, నాగేశ్వరప్రణీతం బైన శ్రీవీరబ్రహ్మేంద్రచరితంబు నందు సిద్ధయోగం బను తృతీయాశ్వాసము— 262

# శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్రము

## చతుర్థాశ్వాసము - ఛత్రయోగము

క॥ శ్రీబ్రాహ్మీవరనుతశి
ల్పిబ్రహ్మకళాతిశయులు వేంకటనరసాం
బాబ్రహ్మాంకమహోదయు
లబ్రాశిగభీరరసమయాంచితహృదయుల్ 1

గీ॥ అవధరింపుఁడు లోకహితార్థకరుఁడు
సకలధార్మికరూపుఁ డా స్వామి యపుడు
ఛాత్రులం గూడి వెడలె సంచారమునకు
బండి సాఁగెను బనగానపల్లె దెసకు 2

గురుండు శిష్యసమేతంబుగా బనగానపల్లె కరుగుట

వ॥ అప్పుడు గురుండు— 3

సీ॥ ఆకొండచఱుల నేకాంతంబు లైనుండి
యోగామివృత్తంబు లాడినాఁడ
నా పచ్చని బయళ్ల నచ్చమాంబిక సొమ్ము
మేఁపుచుఁ జెలులతో మెలఁగి నాఁడ
నా వటచ్ఛాయల నావుల నెల్లను
నెలకొల్పి కడుపు నిండించి నాఁడ
నా డొంకదారుల నంతర్హితుండనై
గోపాలురకు బ్రాంతి గొలిపి నాఁడఁ

సీ॥ గీ॥ గంటిరే! శిష్యులార! యీ గ్రామమునకుఁ
జేరు వగు చున్క చిననాఁటి చెప్పితములు
గోచరము లయ్యె నని శిష్యకోటి యడుగు
మాటలకు నుత్తరంబుగాఁ జూటుకొనుచు 4

వ॥ బనగానపల్లెకుం జేరె నప్పు డన్నాజయ్యయు నచ్చమాంబయుఁ దక్కటివారు నెదురు వచ్చి గురు నర్ఘ్యపాద్యాదివిధులం బూజించి సిద్ధాదిసోదరశిష్యవర్గంబు నభిమానించి తోడ్కొని చని రంతటఁ గొంత విశ్రాంతి గయి కొన్న మీఁదట నచ్చమాంబ గురునకు నమస్కరించి యి ట్లనియె— 5

కం॥ ఈయూరి జనుల మదులం
బాయక యిలువేల్పు వగుచుఁ బ్రతినిమిషంబున్
సాయంపడు చుందువు నీ
వేయెడ నుండినను గొదువ యేమి మహాత్మా! 6

సీ॥ అటు చూడు మయ్య! యెక్కటి పంగకట్టియ
చెలువున నొప్పారు చింతచెట్టు
కాయ లందలి గుజ్జు కాటు కల్లై యుండుఁ
జప్పఁగా నాకులు చవులు గొలుపు
నూర నుత్పాతంబు లొదవ నుండిన నొక్క
రాతిరి నాపూఁత రాలిపోవు
స్ఫోటకాదికరుజల్ వాటిల్లుటకు మున్న
పంగల నడుమ జాల్వాఱు నెత్రు
గీ॥ పిదప నది కుంకుమపుఁ బూఁత విధము నగును
ద్వాత్త్వభావంబు గాదె! యింతయు నెఱింగి
యెఱుఁగ నట్టుల వినుచుందు వేమి సెప్ప!
దాఁచిపెట్టిన దాఁగునే దాసు లెదుట? 7

శా॥ ఆలంగాయుచుఁ గొండలోయలను నీ వానాఁడు గూఢంబుగాఁ
గాలజ్ఞానము వ్రాసి దాని ప్రతులం గల్పించి మాపాతరన్
జాలన్ దాఁచితి వందులన్ మొలిచె నీసాలంబు మమ్మేలఁగా
నాలోచించి యెఱింగికొంటి మిది నీ ధ్యానైకమార్గంబునన్ 8

కం॥ అన్నాజయ్యాయు నేనును
గన్నారఁగ దీని మహిమఁ గాంచుచు నిచ్చో
నున్నారము పెక్కులు విను
చున్నారము మూల మెఱుఁగ నోపము తండ్రీ! 9

వ॥ అని యనేకప్రకారంబులం దదీయప్రభావంబు లుగ్గడించె నప్పు డ
న్నాజయ్యాయు గురుచరణంబు లంటి నమస్కరించి యి ట్లనియె-10

ఆ॥ వె॥ ఒక్క రూప కాని పెక్కు సిద్ధాంతంబు
లవగతంబు లయ్యె నద్భుతముగ
లెక్క యొక్కఁ డేనిఁ బెక్కు సూత్రాంశంబు
లవహితం బొనర్చు ననువు గాఁగ! 11

సీ॥ హిందూముసల్మాను లేకీభవించుట
మే లని సిద్ధుని నేలినాఁడో
అస్పృశ్యతాజాడ్య మంతరింపం జేయఁ
దలఁచి కక్కని వీఁపు దట్టినాఁడో
ప్రజ కహింసావ్రతరాజంబు బోధింప
నెంచి జంతుబలి వారించినాఁడో
గోమాత నెలయించు గుణము పెంపొందింప
నచ్చమాంబిక యాల నరసినాఁడో

గీ॥ భుక్తిముక్తులకు నమోఘకర్మజ్ఞాన
యోగములను జూప సాఁగినాఁడొ
యనుచు నఖిలజనము లైదంయుగీనావ
తారపురుషు నిన్నుఁ దలఁచుచుంద్రు ! 12

వ॥ అని పరిపరివిధంబులం బ్రస్తుతించె నప్పు డయ్యీరువుర నుచిత వాక్యంబుల నాదరించి గురుండు తత్పురాధీశ్వరు నాహ్వానంబు పురస్కరించుకొని యరుఁగ సమకట్టె నప్పు డక్కడ— 13

బనగానపల్లె నవాబు గురుని మతసామరస్యంబు పరీక్షించుట

సీ॥ కచకుచకటిభారకలన ముబ్బంగిగా
సుదతులు జమిలిపిచోపు లిడఁగఁ
గనుసన్న మెఱఁగి హుక్కా చేతి కందించు
నతఁ డప్రమత్తుఁడై యనుసరింప
విసువు పుట్టిన తఱి నెసఁగించు నాటక
త్తెలు తెరచాటున నిలిచియుండ
విచ్చుకత్తుల తోడి వీరభటావళి
పహారాహుషారుతోఁ బరఁగుచుండఁ

గీ॥ జతురుపాయప్రవీణులు సచివు లొప్పఁ
జెలువ మమరంగఁ గొలువు దీర్చెను నవాబు:
నాఁడు గురుదేవుఁ డరుదెంచు వాఁడు గనుక
నెల్లరకుఁ బ్రవేశార్హత నిచ్చెఁ గొలువు 14

గీ॥ అంతలోన గురుండు ప్రత్యక్ష మయ్యె
బ్రహ్మవర్చస్సుతో శిష్యరాజితోడ
నది గని సలాము చేసి తాఁ డాసనంబు
డిగ్గి తగు పీఠమున నధిష్ఠితునిఁ జేసె 15

గీ॥ చేసి బహుమాన వాక్యవిన్యాస మమర
నమ్మహాత్మునిఁ గని పల్కె నధిపమౌళి
యనఘబాల్యంబు నంద మీ రద్భుతముగఁ
బెక్కు మహిమలు సూపుట వింటి నేను 16

కం॥ సమరస సిద్ధాంతముతో
స్వమతముఁ బరమతము నొక్క భంగిన కనుచు
న్న మహాత్ముఁడ వందురు సి
ద్ధము సిద్ధునిఁ జేరఁ దీసి దయఁ గను చునికిన్ 17

కం॥ కావున నా కొక కోరికి
భావంబునఁ జిరము గాఁగ బాయక యుండున్
దేవర కటాక్ష మూంచిన
నా విన్నప మాలపింతు నవహితమతితోన్ 18

చం॥ అన విని నా నిమిత్తమె కదా ! నరపాలకుఁ డీ మహాత్మకున్
మనసును నోవకుండ విషమంపు సమస్యల పా లొనర్పఁగాఁ
గొనకొను వాఁ డటంచు మునుకొంచును దాఁ దలయొగ్గఁగా [గురుం
డను బెనుగొండఁ జూచి వెనుకాడెను సిద్ధగజేంద్ర మయ్యెడన్

చం॥ పరమగురుండు యావననృపాలునిఁ జూచి మృదుస్మితంబుతో
నరవర ! యేల సంశయమునం బొరలాడుదు దోషి వోలె ? ని
బ్బరముగ నీ యభీష్టమును బల్కుము దాన దోసంగు లేదు నా
నరసి నృపాలుఁ డిట్లను మహామహితాత్మక! యేను ధన్యుఁడన్ 20

గీ॥ సర్వసమదృష్టి గలిగిన స్వామి వగుట
నాకు మీతోడ నన్నపానములు గుడువఁ
బ్రావ నభిలాష వొడమె డెందమున యందు
నన్ను మన్నింపవే దయానందమూర్తి ! 21

గీ॥ అనుడు గురుదేవుఁడును నిరభ్యాంతరముగఁ
దానకీనాభిలాషంబు భూవరేణ్య !
తీర్చుకొను మన్న నిది యేమి దేశికుండు
తురకలింటను గుడుచునే తుట్టతుదకు ? 22

కం॥ అని యనుమానించుచు 'ని
య్యనఘుని మాహాత్మ్య మెఱుఁగ నగునే యనుచున్
జనతతి కిమ్మనఁ జాలక
కనువెట్టెను జరుగనున్న కర్జము లందున్ 23

చం॥ జనపతి కన్నుసన్నఁ బరిచారిక లంతట నేఁగి మాంసభో
జనములు ఛన్నవస్త్రవిలసన్మణికాంచనభాజనంబులన్
గొని చనుదెంచి ముం దిడిరి గొబ్బున నప్పరమార్థవేది క
య్యనఘుని శిష్యకోటికి ధరాధిపమాళికి సభ్యపాళికిన్ 24

కం॥ అది గని పిశితాశనముం
గొదుగక తెప్పించె నేమి కుధవుం డనుచున్
గుదిగుంపు లగుచు నుండిన
సదస్యులం జూచి గురుఁడు సాంత్వనఫణితిన్ 25

మ॥ మన కాహ్వానము లంపి కూడి భుజియింప గోరుచున్ గారవిం
చిన రాజుం గృతకృత్యుఁ జేయుట తగుం జిత్తంబు సందిగ్ధభా
వనలన్ నింపక స్వీకరింపుఁ డివి నాపైఁ బెట్టి భారంబు లె
ల్లను వాలాయముగా నభీష్టఫలముల్ ప్రాపించు మీ కియ్యెడన్

కం॥ అని పలుకు గురుని పలుకుల
కనుమానము లుడిగి యా మహాత్ముని దోడ్తో
మునుకొని పళ్లెరములపై
నినిచిన వలిపెము లెడల్చి నివ్వెఱ పడుచున్ 27

గీ॥ చకితులై సంభ్రమిల్లిరి సకలజనులు
పలలఖండంబు లెల్లను ఫలము లగుటఁ
దన్నుఁ దా విశ్వసింపక ధరణినాథుఁ
డట్టె వెలువెల్లనై క్రిందు లరయ సాఁగ! 28

మ॥ సకలాధీశ్వరుఁ డంతటం జతురవాచాప్రౌఢి నుర్వీశుతోఁ
నకటా! యెంతగ విన్నవించితి ఫలాహారంబు గైకోఁగ నీ
వకదా! మాన్యుఁడ వెంత తియ్యని ఫలంబుల్ సూడుమా!
[యున్న దొం
గకుఁ గన్నంబునఁ దేలు గుట్టి నటులై క్ష్మాపాలుఁ డొక్కుమ్మడిన్

గీ॥ గురుని చరణాల వ్రాలి యీశ్వరుఁడ వైన
ని న్నెఱుంగక చేసిన నేర మెల్ల
సైచి కాపాడవే దయాజలధి! యింక
నిట్టి మాటల నడికింప నేల నన్ను? 30

కం॥ చచ్చిన పామును గొట్టిన
వచ్చు ఫలం బేమి? నిన్నువంటి మహాత్మున్
దెచ్చుకొని కొలువఁ జూడక
గ్రుచ్చి పరీక్షించి రెచ్చగొట్టితి నయయో! 31

గీ॥ శ్రీజగన్నాథు నినుఁ బరీక్షించు నట్టి
నరుఁడనే నేను? దురభిమానమునఁ జేసి
యింత చేసితి నలవు గ్రహింప నైతిఁ
బరమగురుదేవ! నా కింక శరణ మీవ! 32

కం॥ సిరి సంపద లమరిన భూ
వరుఁడను నాకేమి యనుచు బలగర్వముతోఁ
బరికించితి నేనును నా
పరివారము నీకు గడ్డిపఱకలు గావే! 33

సీ॥ కపటకామపిపాసి కైవసం బగు నింతి
మానవిత్తంబుల మాడ్కి గాఁగ
లంచగొండి కరంబులం బడు వ్యాజ్యంపు
తీర్పు టుత్తరువుల తీరు గాఁగ
గట్లు దున్నెడి వాని కాడిగట్టు పొలాలఁ
బండిన పంటల పగిది గాఁగ
బడుగు జూదరి పాలఁబడిన తాతల నాఁటి
వస్తువాహనముల వడువు గాఁగఁ

గీ॥ బరము దలపింపఁ జాలని పరిజనంబు
వశములై యుండు మావంటి వారి బ్రదుకు
మూఁడునాళుల ముచ్చటై కీడు గొలిపి
నోటి కందక యడు గంటునో మహాత్మ! 34

శా॥ నా కీ రాజ్యము గీజ్యమున్ వలవ దానందంబుతోఁ దావక
శ్రీకంజాతపదంబులం గొలుచుచున్ జీవింతు శిష్యుండనై
రాకల్ పోకలు మాన్చి శాశ్వతపరబ్రహ్మైకముం జేర్పవే
నీకున్ మ్రొక్కెదు జ్ఞానకాంతిపరిధీ! నిత్యానుకంపానిధీ! 35

వ॥ అని పశ్చాత్తాపమానసంబు మోసలం బెట్టి భక్తిప్రపత్తులు మెఱ
యం బ్రార్థించుచున్న నరేంద్రుం జూచి దయార్ద్రహృదయుం
డైన గురుం డిట్లనియె— 36

చం॥ ఇటు వగవంగ నేటికిఁ బరీక్ష యొనర్చితి నంచు నాత్మలోఁ
బటిమ పరీక్ష వల్లఁ గనవచ్చు బయల్పడు శక్తిసారముల్
పుటమున కాఁగి నట్టిదియ భూరికదా నిను వంటివారు మి
క్కుటముగ నామనంబునకుఁ గూర్తురు వేలల వల్ల నే మగున్

శా॥ నీ వింకన్ మతసామరస్యమతితో నిర్ణిద్రధర్మప్రతి
ష్ఠావైఖర్యముతోఁ బ్రజావిహితవాత్సల్యంబుతో రాజ్యల
క్ష్మీవాల్లభ్యముతో మదీయపదసంసేవాపరాధీనభా
వావేశంబులతోఁ బ్రవర్తిలు మభీష్టావాప్తి నీ కయ్యెడున్ 38

కం॥ అన విని యనుశాసింతువు
పెనుఁజీఁకటి నూత ననుభవింపఁగ నిడుమల్
ననునయ్య ! యిట్టి దండన
నినుఁ గొల్చి తరింపఁగూడని యభాగ్యుఁడనే ? 39

కం॥ అని జాలిపుట్ట సంసా
రనివృత్తిం గోరు నిజనిరంజనబుద్ధిన్
జనవిభుఁడు వెల్లడింపం
గని యిట్లను గురువరుండు కలవాక్కులతోన్ 40

ఆ॥ వె॥ మంచిచెడ్డ లరసి మహి నేలు రాజన్య
వరుఁడు ప్రజకు నెపుడు వలసియుండు
నట్టి నిన్ను వెంటఁబెట్టుకొని చనంగ
నర్హ మగునె నాకు ? నవనినాథ ! 41

చం॥ ప్రవిమలబుద్ధి నెప్పుడు విపన్నజనంబుల పాల నిల్చు బాం
ధవుఁ డన నొప్పుచుం బరమతస్వమతంబుల నాదరించి వా
స్తవము గ్రహించు నా నృపుని దైవ మనుగ్రహదృష్టిఁ జూడదా ?
భవము తరింపదా ? తుదకుఁ బార్థివసత్తమ ! నీతివిత్తమా ! 42

కం॥ కావున నీవీ రాజ్య
శ్రీ పాలించుచు నెడందఁ జేర్పుము నన్నన్
నోవకు నిను శిష్యునిగా
భావింతు ననుగ్రహింతు వసుధాధీశా ! 43

గీ॥ అనుడు నెదురాడ నోప నింకను ద్వదీయ
శాసనాక్షరములు శిరసావహింతు
నని కటాక్షసంజ్ఞామాత్ర హైమపాత్ర
రత్నభరితంబుఁ దెప్పించి రాజమౌళి 44

గీ॥ గురుని మోసల నిలిపి యో పరమదేవ !
చిన్ని యీ కాన్క కరుణించి స్వీకరించి
నన్ను ధన్యునిఁ జేయవే యన్న గురుఁడు
విస్మయముతోడి చిఱునవ్వు వెలువరించి 45

కం॥ ఆపల్లెరము నవాబు స
మీపమునకుఁ ద్రోసి యిట్టి మేరలు సనునే
నాపాలికి నయమో ! ర
త్నోపద లేమిటికి ? హృదయ ముండినఁ జాలున్ 46

గీ॥ నేను గ్రహియింప లేదని నీ యెడంద
నార్తి గూరకు మంతగాఁ గూర్తు వేని
నొక్క విధ మాచరించి ధన్యుండ వగుము
ప్రాభవభవంబు లుభయతారకము గాఁగ 47

కం॥ ఈ యచ్చమాంబ మును దా
నీయూర మఠంబు నొక్కఁ డేర్పరచెఁ గదా ?
సాయ మొనర్పుము దానికి
నీయోపిన యంతవట్టు నిర్మలమతితోన్ 48

కం॥ అన విని యామోదముతో
మనుజేశ్వరుఁ డిచ్చెఁ బెక్కు మాన్యపుభూముల్
బనగానపల్లె మఠమున
కినుఁ డరసినచోఁ బ్రకాశ మినుమడి గాదే ! 49

## కడపనవాబు గురుని భవిష్యత్పరిజ్ఞానంబు నరయుట

వ॥ అనంతర మంతర్ముఖుం డవనీశ్వరు నభ్యర్థనంబు మన్నించి కాల జ్ఞానవిశేషంబు లెఱింగించుచు, సంశయపరంపరానివృత్తి గావించు చుం గొన్ని దినంబులు వుచ్చె నంతఁ గడపనవాబు తదీయదర్శన మపేక్షించి శ్రీముఖంబు వుత్తెంచె నది సూచి గురుం డటవోసి సిద్ధాదిశిష్యసమేతంబుగాఁ గడపకుం బ్రయాణంబు సాగించె నప్పు డచ్చట— 50

కం॥ భయభక్తులతోఁ బౌరులు
దయితుని మన సెఱిఁగి స్వాగతము వలుకంగా
మయిగొని యలంకరించిరి
నయనానందముగ నగరు నగరము నంతన్ 51

మ॥ భువనేశుండు దయామయుండు నగరంబుం జేర నేతెంచుటన్
యవనేశుం డెదురేఁగి మ్రొక్కి ప్రియశిష్యశ్రేణితోఁ దోడితె
చ్చె విరాజత్కుసుమాంజలిప్రకరముం జెల్లింపఁ బౌరుల్ సభా
భవనాంతస్థలి కజ్జగజ్జనకునిన్ బాజాభజంత్రీలతోన్ 52

వ॥ అట్లు తోడ్తెచ్చి మణిమయాసనంబుల నుపవిష్టులం జేసి తాను నొక్క సముచితాసనంబు నధిష్ఠించి నరేంద్రుండు బ్రహ్మేంద్రు నుపలక్షించి వినయవినమితోత్తమాంగుం డగుచు ని ట్లనియె 53

శా॥ సిద్ధుం జేగిన దాది నా మనమునం జింతించుచుండన్ సదా
శ్రద్ధాభక్తులతో గురూత్తమ ! భవత్సందర్శనం బెప్పుడా
సిద్ధింపం గల దంచు భాగ్యవశతన్ జేకూరె నీనాఁటికిన్
మద్ధామంబు పవిత్ర మయ్యె ననఘా ! మాన్యుండ నైతిం గదా 54

కం॥ పాపాత్ముఁ డెవ్వఁ డేనియు
నీ పాదాశ్రితుని నిన్ను నిరసనమతితో
నాపోవ కాడిపోయుచుఁ
జూపోపక యున్నఁ దాన స్రుక్కఁక యున్నే? 55

కం॥ లీలామానుషవిగ్రహ!
బాలప్రాయంబు నందె వ్రాసితి వట గో
పాలుఁడవై విహరించుచుఁ
గాలజ్ఞానంబు భావికాలజ్ఞుఁడవై! 56

కం॥ అది విన్ననాఁటి నుండియు
మది నొక కౌతుకము వుట్టి మల్లాడు భవ
త్పదసాక్షి పరీక్షార్థం
బిది గాదు మనోవ్యసననివృత్తికిఁ జూవే! 57

కం॥ తలఁచి భవన్నామము ని
ర్మలమతి సిద్ధుండు బండబద్దలు సేసెన్
నిలువెల్ల నీర నైతిమి
కలుగునె తద్గురునిఁ జెనకు కఱదు లటంచున్ 58

చం॥ వినయవివేకవైఖరుల వేఁడుచు నుండిన మానవేశ్వరుం
గని నగుమోముతో యమిశిఖామణి యిమ్మెయి సంశయింపగాఁ
జనునె నరేంద్ర! డెందమున సందడికొన్న నిజాభిలాష మొ
య్యన వివరింపవే యనిన నాతఁడు మానస మందు నుబ్బుచున్

కం॥ తెప్పించెఁ జూఁడి గుజ్జము
నప్పుడ భటు నంపి మందురాంతరమున యం
దొప్పిన దానిని సభకుం
దెప్పించి ప్రభూత్తముండు దేశికుఁ గనుచున్ 60

సీ॥ ఈ తురంగమమున కెట్టి బిడ్డ జనించు
నది వచింపఁగదే దయాపయోధి !
యన దాని వాలక మారసి గురుదేవుఁ
డిది పంచకళ్యాణి నీను ననియె
నామాట కతఁడు దేవా ! మాకు నిది యెట్లు
తెలియంగ నగు నని పలికె నపుడు
చిఱునవ్వు లొలయ దేశికముఖ్యుఁ డిది యీని
నంతటఁ గనవే యథార్థరూప

గీ॥ మనిన నిప్పుడ చూడంగ నభిలషింతు
ననుచుఁ గరములు మోడ్చిన మనుజనాథు
ప్రార్థనంబును మన్నించి పరమగురుఁడు
సైంధవంబును గొంపోయెఁ జాటునకును 61

శా॥ ఆలీలం జని దాని కుక్షి నిజమాహాత్మ్యంబునన్ వ్రచ్చి త
ద్బాలాశ్వంబును దెచ్చి చూపి సభకున్ వైళంబ కొంపోయి జే
జేలం బల్కఁగ నెప్పటట్ల యుదుదెంచెం జూఁడిగుజ్జంబుతో
లీలామానుషవిగ్రహుండు గురుఁ డాలేఖ్యప్రభావాఢ్యుఁడై 62

మ॥ కలయో! నిక్కపమో సభాభవనమో కాదో భ్రమోత్పన్నమో
తలమే యెవ్వరి కైన ఘోటకసముద్యత్కుక్షిగోళంబు లో
పలి బిడ్డం గొనితెచ్చి చూపి మఱలన్ వార్యంబుఁ గాపాడు వి
ద్య లటం చప్పుడు సంభ్రమిల్లిరి ధరాధ్యక్షుండు సభ్యప్రజల్ 63

కం॥ పరమాదరమున వారిం
బరికించి గురుండు తేర్చెఁ బార్థివుఁ డంతన్
గరములు మొగిడ్చి భక్తి
స్ఫురణం గీర్తించె నతనిఁ బురుషోత్తమునిన్ 64

కం॥ నీ మహిమ లమోఘంబులు
నీమాటలు సాటి లేని నిక్కపుమాటల్
నీ మార్గము లనుసార్యము
లే మనుజుల కైనఁ బెక్కు లేమిటి కనఘా ! 65

కం॥ మును సిద్ధునిఁ బ్రార్థించితి
నినుఁ జేర్చు మటంచు నతఁడు నిన్నిచ్చటికిం
గొని తెచ్చె నింక విడుతునె
యనఘా ! ననుఁ జూడ వేని నాదరదృష్టిన్ 66

కం॥ అని పరిపరివిధములఁ న
మ్మనుజేశుఁడు వేఁడుకొన సమంచితమతి నా
తనిఁ జూచి బ్రహ్మసమ్మితుఁ
డనియెం దనయాశయంబు లచ్చుపడంగన్ 67

శా॥ నా శుశ్రూష లొనర్చుదాన నగు పుణ్యం బబ్బెడున్ నీ కిలా
ధీశా ! దేశహితాభిలాషి వగుచున్ హిందూముసల్మానులన్
రాశీభూతము లైన మత్సరము లీర్ష్యాద్వేషముల్ తీర్చి మై
త్రీశీలం బలవర్చి నైతికజయోత్సేకంబు సాధించుచోన్ 68

కం॥ ధర్మపరాధీనుఁడవై
నర్మిలిఁ బ్రజ నేలికొనుచు నన్ను మనోవా
క్కర్మములఁ దలఁచుచుండుము
నిర్మమకారంబుతోడ నీ కగు శుభముల్ 69

వ॥ అను నాశీర్వాచికల కలరి భవదీయాదేశంబు శిరసావహింతు నని నమస్కరించి నరేశ్వరుండు వివిధసత్కారంబు లాచరింప ననేకనీతి మార్గంబులు భవనిస్తారకోపాయంబులు కాలజ్ఞానవిశేషంబులు నెఱింగించుచు నుండి యొక్కనాఁడు గురుండు— 70

మ॥ మును శ్రీశైలసమీపభూమి నొక విప్రున్ బుష్పగిర్యగ్రహా
రనివాసున్ బలు కుష్ఠరోగపిహితున్ రక్షించితిం గావుటన్
నను నర్థించిరి విప్రదంపతులు భూనాథా ! పునర్దర్శనం
బు నిడం గావున( బోయివత్తు నన(గా భూపాలు( డామాటకున్ 71

ఆ॥ వె॥ ఎదురు వలుక నోడి వదలిపెట్ట(గ నోడి
యెట్టకేని పయన మిచ్చగించె
వీడుకోలు సొబగు వేనోళ్ళ( గొనియాడ(
దగిన దయ్యె నపుడు నగరవీథి 72

పుష్పగిర్యగ్రహారద్విజపరాజయము

సీ॥ ఒకవంక రాజన్యు( డకలంకభక్తితో
నశ్వాధిరూఢు(డై యనుసరింప
నొకవంక నృపు నమాత్యులు ఛత్రములు వట్టి
జయజయధ్వానముల్ సలుపుచుండ
నొకవంక శిష్యులు ప్రకటతరాసక్తి
వింజామరంబులు వీచుచుండ
నొకవంక( బురవాసు లకుటిలమతి తోడ(
గుసుమవర్షంబులు గురియుచుండ

గీ॥ నేను(గంబారు మీ(ద నూరే(గి వీడు
కొనియె నప్పత్తనంబును గురువరేణ్యు(
డంత శకటంబు పుష్పగిర్యగ్రహార
దిఙ్ముఖం బయ్యె నతిరయోత్సేక మమర ! 73

వ॥ అప్పు డవ్వీరబ్రహ్మంబు బాలశిష్యు నవలోకించి సిద్ధా ! నీవు
మునుమున్న నేగి విప్రదంపతులకు నారాక నెఱింగింపు మనుటయు

నతండు నమస్కరించి హుటాహుటిం జని పుష్పగిరిం బ్రవేశించి
గురుమంత్రరాజంబు నుచ్చరించుచు నడుచక్కం జనుచుండ నట
లోకాభిరామాయణప్రసంగనిషంగులై యున్న భూసురులం
దొక్కరుండు వాని వాలకంబు నారసి— 74

కం॥ ఎవ్వఁడ వీ వెచ్చోటికి
రివ్వనఁ జనువాఁడ వుచ్చరించుచు నెదియో
యివ్వడువున నడు గిడఁగా
నెవ్వండు గవించె నిన్ను నెఱుఁగం జెపుమా ! 75

వ॥ అన విని గురుధ్యానతత్పరుం డైన సిద్ధుండు— 76

శా॥ శ్రీమద్వీరజగద్గురుప్రవిమలాంఘ్రిద్వంద్వనిధ్యానదీ
క్షామగ్నుండఁ దదు క్తమంత్రజపసంకల్పాతిరిక్తుండఁ జే
తోమార్గంబున నొం డెఱుంగ నెపుడున్ దూదేకు సిద్దప్ప యన్
నామం బొప్పుచునుండు నా నతనిపై నాటించి దృగ్బాణముల్ 77

కం॥ ఏమీ ! యేమను వాఁడవు
మాముందు జగద్గురుండు మఱియొకఁ డున్నే ?
యీ మెయిఁ జిందులు ద్రొక్కిన
స్వామీ ! యని కాళ్ల వ్రేళ్లఁ బడఁబూనుదు రే ! 78

కం॥ గురువుల మని కాషాయాం
బరములు ధరియించి పిచ్చి ప్రజ కొలువఁగఁ బా
ల్పొరుగులు ద్రాగుచు మత్తిలి
చరియింతురు నిన్ను వంటి జారులు చోరుల్ ! 79

కం॥ నగుఁబా టెఱుఁగక బిరుదుల
కెగఁబడుదురు శక్తిసారహీనులు నయ్యున్
జగబిరుదు ముండ మొట్టియు
నగురా బిరుదానుగుణసమాచరణంబుల్ ? 80

గీ॥ పుష్పగిర్యగ్రహారసంపూర్ణచరిత
మాలకింపవొ ? పిచ్చి యేమైనఁ గలదొ ?
దేశికోదంత మావలఁ దేలఁగలదు
ముందు నీమాట సెప్పుము మూర్ఖ ! మాకు 81

కం॥ తరుణీశూద్రాదుల క
క్షరయోగ్యత నీవు ధర్మశాస్త్రము లందుం
దురకఁడవు నీవు ప్రణవా
క్షరముం బలుకుటలు సాహసం బగుఁగాదే ? 82

కం॥ మానుకొను మింక నైనను
మానక పెనఁగినను మేము మాన్పింతుము నీ
పూనిక యెల్లను నిది మా
యానతి తలఁదాల్ప కవలి కడుగిడ నగునే ! 83

కం॥ అని తల కొక మాటయుగా
మనసును గలఁగించు విప్రమండలిఁ గని యి
ట్లను సాధుశిష్యశేఖరుఁ
డనవసరాక్షేపవాఙ్నియంతృత సనునే ? 84

ఉ॥ జారుఁడు గాఁడు మా గురుఁడు సంయమశీలి గృహస్థమాళియే
చోరుఁడు గాఁడు శూరు లగు సూరుల కోడని ధర్మవీరుఁడే
క్రూరుఁడు గాఁడు సర్వమతగుంభితసూక్తిసుధానిధానుఁడే
కారణజన్ముఁ డాతని జగద్గురుఁ డంటయు దోస మాయెనే ? 85

కం॥ కులమో స్థలమో బలమో
తలఁపునఁ బాఱంగ నెదిరి తలసీలంబుల్
వెల కట్టఁజూతు రింతియ
కల శక్తిని గౌరవింపఁ గలుగుదు రెవరో ! 86

మ॥ మును విద్యావతి యైన గార్గి నిగమంబుల్ దచ్చి యా యాజ్ఞవ
ల్క్యునితో వాద మొనర్చినట్లు విన మొక్కో! సూతునిన్ శూద్రుఁ
[డం
చు నిరాచారులు బ్రహ్మవంశ్యులు పరశ్యూలంబులం గుచ్చిరే?
యనుశాసించున దాగమార్థమొ? పురాణార్థంబా? వ్యాకుర్వరే?87

కం॥ అను వాణి వాచికములకు
మును బుట్టిన పుంట మంట పొంపిరి వోవన్
బెనుగారంపుంబోడి య
ద్దిన కైవడిఁ జుట్టు మనియె ద్విజుల మనంబుల్ 88

గీ॥ అంతలోన జయధ్వాన మతిశయిల్లఁ
గిరలు ముప్పదిరెండగు బిరుదములను
శిష్యు లెసకొల్పి యిరువంకఁ జేరి నడువ
స్వామిశకటంబు సేరంగవచ్చె నటకు 89

కం॥ అది గని యిర్ష్యాద్వేషము
లొదవఁగ 'నితఁ డెవ్వఁ' డనుచు నుద్ధతఫణితిన్
వదిరిన వైదికులం గని
మృదుమధురోక్తులను సిద్ధుఁ డిమ్మెయిఁ బలికెన్ 90

సీ॥ ఎఱుఁగరే? బహుపాపభరమును బోకార్చి
ప్రోవంగఁ జాలు కారుణ్యరాశి
నెఱుగరే! ఘోరసంసరణపాథోరాశిఁ
గడతేర్పఁ జాలిన కర్ణధారి
నెఱుఁగరే! మతమతాంతరసామరస్యంబు
సాధింప నెంచిన సామ్యవాది
నెఱుఁగరే! దుర్భరాస్పృశ్యతాజాడ్యంబు
నడఁగించు దేశకళ్యాణకాంక్షి

సీ॥ గీ॥ తెలుఁగరే! స్వార్థమానవ కృత నితాంత
కుటిల సిద్ధాంత కంటక కుంజ పుంజ
భేదనోపాయ మాయాలవిత్రమూర్తి
వీర గురుమూర్తి సుజనాభి వినుత కీర్తి! 91

కం॥ దీపంబు వెట్టి సూర్యునిఁ
జూపుటయా బ్రహ్మమయుని సుజనారాధ్యున్
గాపురుష గర్వభంజను
వ్యాపృతయశు నిట్టిఁ డనుచుఁ బలుకుట లుర్విన్ 92

వ॥ అని పలుకుచుండ బాడబు లాగ్రహించి చుఱచుఱ నతనిం జూచి -

చం॥ అవునవుఁ జాలు చాలు నిఁక నగ్గలమా నయప్రసంగముల్
మివులును గంతశోష మిడిమేలవుఁ బాటున కంగలార్తు వో
యువనకుమార! నీ వితని యంఘ్రులు వట్టిన వంది వందు మీ
చెవిచవి గాని మాటలు విచిత్రముగా వినిపింప నోర్తుమే! 94

సీ॥ అటనట నయిదారు పుటలైనఁ జూడక
కావ్య విమర్శకుఁ గడఁగు నట్లు
ఔషధ పట్టిక లందందుఁ బరికించి
వైద్యవృత్తినిఁ జేతఁ బట్టి నట్లు
పడికట్టు మాటలు పదినేర్చి సభ నిల్చి
శిష్టు లొద్ద నుపన్యసించు నట్లు
దర్పంబుతో బిరుదంబు సంపాదించి
గొప్పందనము చాటుకొనిన యట్లు

గీ॥ లోఁతు లెఱుఁగక యొక గురుం జేతఁ బట్టి
మా యెదుట నిల్చి భీష్మింతు వోయి నీవు
నిన్ను మన్నింప నేర్తు మే నీటు సేసి
పంపుదుము గాక! మాయూరి బయల దాఁక! 95

కం॥ అన విని వారిం గని గురుఁ
డనవసర వివాద మేటి కాతని పలుకుల్
గొనఁ జూడక మా దారిం
జన నిం డనఁ బాఱు లపహాసన్ముఖు లగుచున్ 96

కం॥ చల్లని మాటలతో న
ల్లల్లన మురిపించి చనఁగ నరయుదు నీ లా
వెల్లం జూడక విడుతుమె ?
యిల్లలికినఁ బండు వగునె ? యితరము లేదే ? 97

ఉ॥ ఇంతకు నిట్టి కట్టడకి హేతువు నీవుగదా ! మతాంతరం
బెంతకుఁ జేర్చి నేర్పితి విసీ ! ప్రణవాదిక ముచ్చరించుచున్
గంతులు వైవు మంచు నధికారము లే నధికార మిత్తువే ?
యంతటఁ దీఱె నంచు హృదయంబున నువ్విళు లూరుచుందువే ?

గీ॥ ప్రణవ సహితంబు లైన మంత్రములు నదువ
బ్రహ్మజాతికి బ్రహ్మ నిర్ణయము గాఁగ
నీచ కులజుల కించుకేనియును దగునె ?
గోవధాజీవి యగు తురుష్కునకుఁ దగవె ? 99

మ॥ చెవులన్ దూఱవె ? బ్రాహ్మణోస్యముఖమానీన్మఖ్యసిద్ధాంతముల్
స్తవనీయం బగు నట్టి బ్రాహ్మణకులస్వామ్యంబుఁ దక్కంపఁ జా
తువు తక్కంగల నీచజాతులకు నెందున్ శాస్త్రధర్మంబు లి
ట్టివి వాకొన్నవె ? ధర్మనిర్ణయ మనుష్ఠేయంబు గా దయ్యెనే? 100

గీ॥ అనుచు నెకసక్కె మాడుచు నగ్రహార
విప్రు లాత్మాతిశయముఁ జూపించుచుండ
నెంత మాత్రంబు చలియింప కిట్టు లనియె
సర్వసముఁ డైన గురుఁడు సుజ్ఞానపరుఁడు. 101

మ॥ పలుకం గూడునె యిట్టి మాటలు జడప్రాయంబు లామ్నాయవి
ద్యలు గాలించిన మీరు ? స్త్రీపురుష రేతస్సంప్రయోగక్రియా
ఫలరూపంబులు గారె సర్వజనముల్ ? వారేమి వీరేమి ప్రాం
బలుకుల్ వల్కఁగ నెల్లవారలు యథాస్వామ్యంబు వారే కదా ?

చం॥ కులము మతంబు పంచజనకోటికి మెచ్చుల బోనపుట్టెనే !
విలువలు కట్టఁజూతు రిది వేదము పుట్టిన కర్మభూమి యిం
దలి జను లేకులంబున మతంబున వారును ధర్మకర్మముల్
సలిపి తరింపఁజూచు టతిచారమె ? యార్షమతాపచారమే ? 103

కం॥ అజ్ఞానమె శూద్రత్వము
సుజ్ఞానమె బ్రాహ్మణత్వశోభనము గదా ?
ప్రజ్ఞాచక్షువు లగు మీ
రజ్ఞానపు నూతఁ బడుట లరయమి గాదే ? 104

వ॥ అదియునుంగాక— 105

ఉ॥ న న్నొకసక్కె మాడినను నష్టము గల్గదు గాని సోదరా
భ్యున్నతి కిచ్చగింపక మహోద్ధతిఁ జూపుచు నున్న యేని నా
పన్నము గాదె దేశ? మొకపట్టున విప్లవవహ్ని పుట్టదే ?
యన్ని యెఱింగి నట్టిరు గదా! సహజీవనసూత్ర మొల్లరే ? 106

కం॥ కావున నా వచనంబుల
కావేశము లుడిగి ధర్మ్య మరయుం డనఁగా
నా విప్రు లతని నెత్తురు
ద్రావుదు మన్నట్లు క్రోధ తామ్రేక్షణులై 107

మ॥స్ర॥ గురుశిష్యుల్ వీరలౌరా! కులమతములు చీకొట్టి ధర్మంబు పాటిం
పరు బ్రహ్మద్వేషదోషావలయితులు మహాపాపకర్ముల్ దురాత్ముల్
నరరూపాదిత్యవైరుల్ నయరహితశఠుల్ నాస్తికుల్ నీతిబాహ్యుల్
కరుణింపంగూడ దానాల్క లడపుఁడనుచుం గ్రౌర్యభూయిష్ఠ
మొప్పన్

చం॥ పయికొనఁగాఁ దలంచి తొలువాటముగా నభిచార తంత్రముల్
మొయికొనఁ జేసి యయ్యవి ఫలింపని పాటులు గాంగ రోసి వి
స్మయమున మత్సరంబు నతిమాత్రము గాఁగ శిలాసమూహముం
గయికొని రేమి సెప్ప ! కులగర్వము లెంతకుఁ దెచ్చె నెంతలోన్

చం॥ అది గని సిద్ధుఁ డాత్మహృదయంబు గలంగ మహాత్ముఁ జూచి బ
ల్మదమున నిద్దురాత్ములు శిలాశకలంబులు రువ్వనుండి రీ
యదనున సైఁపఁగాఁ దగునె ? యానతియే నొసఁగంగ రాదె? మీ
పదముల మ్రోలఁ దద్వృజిన భాండము పిండలివండు సేయుదున్

ఉ॥ నావుడు నవ్వి వీరగురునాయకుఁ డో తనయా ! 'వినాశ కా
లే విపరీతబుద్ధి' యన లేదె మహాత్ములు ? వారి పాప మే
పావకమై దహించు మనపాలిటి కా శ్రమ మేల? రాలు పూ
లై విలసిల్లు నోరిమి గలారల కీ తడఁబాటు లేటికిన్ ? 111

వ॥ అనె నప్పుడు — 112

గీ॥ అధికరయమున రిపురివ్వ మనుచు వచ్చి
రాలు గురుశిష్యకోటిపై వ్రాలుచుండి
పూవు లగుటలు సూడ నబ్బురము గొలిపె;
గురుల మహిమంబు లేరికి నెఱుఁగ వసమె ? 113

గీ॥ బాడబులు రాలు గురియంగఁ బరమగురుఁడు
పూలు గావింప నప్పు డప్పూవు లెల్ల
గిఱికొనుట జేసి యంతరాంతరము లందుఁ
బుష్పగిరి సార్థకాఖ్య మైఁ బొలుప మూనె 114

కం॥ ఆలోన నగ్రహారము
నాలుగు దిక్కులను నొక క్షణంబున నగ్ని
జ్వాలామాలిక లెగసెను
గూలారుచుఁ బౌరజనుల గుండియ లవిసెన్ 115

శా॥ అయ్యో! చచ్చితి మయ్యయో చెడితి మమ్మయ్యో! యిఁ
[కేమున్న దన్
కుయ్యాలించి జ్వలద్ధుతాశనశిఖాకోటీనిరాఘాటమై
యయ్యారొప్పటఁ జూచి పాఱి రటు హాహాకారముల్ సల్పుచున్
వ్రయ్యల్గాఁగ శిలాప్రయోగకుతుకవ్యాపార మా వైదికుల్ ! 116

కం॥ అది గని సిద్ధాదులు నె
మ్మది శ్రీగురుదేవు వాక్యమహిమం బౌనౌ
నిది యని గ్రహించి శకటము
నదలింపక చూడసాఁగి రా పరిభూతిన్ 117

వ॥ అప్పుడు— 118

శా॥ నాల్కల్ సాఁచుచు నగ్నిహోత్రుఁడు మహన్మైత్రీబలోపేతుఁడై
కుల్కన్ బావురు మంచుఁ బౌరజన మాక్రోశించుచున్ నీరముల్
సిల్కన్ దక్కు ప్రయత్నముల్ సలుప నుత్సేకించి చల్లార్ప లే
కల్కం బూనిన వాఁడు దేవుఁ డని పెల్లల్లాడి రొక్కుమ్మడిన్ 119

గీ॥ ఇండ్ల ముందఱ వృక్షంబు లెల్లఁ గమలి
కుమిలి రూపఱఁ జొచ్చెను గొడ్డు గోద
లలమటింపంగ సాఁగె నయ్యగ్రహార
మనలకీలాగ్రహారమై తనరుచుండ ! 120

సీ॥ ఉయ్యాలలో బిడ్డఁ డున్నాఁడు కొని తెండు
తెం డని వాపోవు తెఱవ గోడు
తనయుండు తన ప్రోల దగ్ధ మాచుండఁగఁ
గను లప్పగించిన జనకు గోడు

అగ్ని కాహుతి యగు నమ్మను బొడఁగాంచి
తల్లడిల్లుచు నున్న పిల్ల గోడు
ముద్దు టిల్లాలినిఁ బ్రోవంగ సమకట్టి
మల్లగుల్లా లైన మగని గోడు
గీ॥ వినుటయే కాని తప్పించు వెరవు లేక
దూరముగ నిల్చి కనుచున్న వారి గోడు
వెక్కసంబుగ విన నయ్యె నక్కటకట !
యగ్రహారంబు నలు దిక్కు లందు నపుడు 121

సీ॥ క్రొత్తగాఁ గట్టించుకొన్న గేహం బింక
దక్కదు నా కని వెక్కువాఁడు
చూరులో దాఁచిన నూరురూపాయలు
నుసియౌట నిజ మని నోవు వాఁడు
చెలువకుఁ జూపించి కులికింపఁ దెచ్చిన
పడకింటి పటముల కడలు వాఁడు
పెండ్లికిఁ బెట్టిన పెద్దాపురపుఁ బట్టు
పుట్టంబు మసి యని పొక్కు వాఁడు
గీ॥ దేవతార్చన సామగ్రి తీర్చి పెట్టు
కొనఁగఁ జేయించుకొన్నట్టి కొయ్య పెట్టె
నేఁటితో మాయ మగు నని నెగులు వాఁడు
గాన వచ్చిరి సర్వభక్షకుని ప్రోల ! 122

వ॥ అప్పుడు — 123

మ॥ తమ యత్నంబులు వమ్ములై చనఁగఁ జింతామగ్నులై సర్వనా
శము నిక్కం బని గుండెజారి ద్విజు లాశాశూన్యులై యున్న చం
దము వృద్ధద్విజుఁ డొక్కరుం డరసి మద్వాక్యంబు లాలింపుఁ డ
న్యము గా దియ్యది యా గురూత్తముని మాహాత్మ్యంబ
మమ్మాటికిన్ 124

ఉ॥ మీరలు ఱాలు రూపుటకు మేకొని నప్పుడు సిద్ధుఁ డుగ్రుఁడై
సైరణ గూడునే యనుచు సంయమి నాతనిఁ బల్క నవ్వుచున్
వారల పాపమే ప్రబలపావకమై దహియించు నంచు న
వ్వీరగురుండు పల్కుటలు వింటి నిసీ! యిది తత్ప్రభావమే! 125

చం॥ అదియును గాక కొండొక యథార్థము జ్ఞప్తికిఁ దెచ్చు వాఁడ నా
యదనున మీర లట్లు శిల లన్నిట రువ్విన నొక్కఁ డేసియుం
గదలిన యట్లు గాని పుసిగార్చిన యట్లును గాని తోఁచెనే?
పదఁ డనుమాన మేటికిఁ? విపజ్జలరాశిఁ దరింపఁ గ్రక్కునన్ 126

వ॥ అని నిదర్శనసహితంబుగా నతండు హితంబు నుపదేశించుచుండ నట నునికిం జేసి తొల్లి శ్రీశైలంబునఁ గుష్ఠరుజావిముక్తి వడసిన వాఁడు నతని భార్యయు సంభ్రమిల్లి వైదికశేఖరులం జూచి వీరేశ్వరుం జెనకి కొఱంత నుఱుకులై యూరికిం జిచ్చు వెట్టితిరే! ప్రమాదంబు పుట్టె నింక నాలసింప నేల? యిది యెల్లఁ దల్లీలయ కాని యితరంబు గానేర దమ్మహాత్ముని పాలికిం జని ప్రసన్నుని గావించుకొనుటయ కర్జం' బని మఱియు వారిం జూచి— 127

కం॥ కేవలకులమదమత్సర
భావజ్వరపీడితుండు బ్రహ్మేంద్రకథా
జీవనదిఁ గ్రుంక నొల్లక
యా వైతరణీప్రవాహ మందుం బడుఁడే! 128

వ॥ అన నెచ్చరించి పలికిన విని దూరీకృతగర్వాంధులైన పాఱులు గురుదేవు పాలికిం జని ప్రదక్షిణనమస్కారంబు లాచరించి వెక్కుచు— 129

శా॥ అజ్ఞానంబునఁ గన్నుఁ గానక మహాహంకారచిత్తంబుతో
విజ్ఞానాంబుధివైన నిన్ జెనకి నిర్వేదంబు పాలయ్యె స
ర్వజ్ఞా! మా బ్రదు కేమి సెప్పుదుము నేత్రద్వంద్వముల్ విచ్చి ది
వ్యజ్ఞానోదయదీప్తిఁ గంటి మిపుడో బ్రహ్మర్షి చూడామణీ! 130

శా॥ పూలంబూజ యొనర్పఁగాఁదగు మహాత్మున్ నిన్నుదూఱాడుచున్
తూలన్ గాఁడితి మయ్యఘంబు మముఁ దేర్పంగల్గునే? సర్వభు
క్కీలాభీలము నయ్యె మా పురము, రక్షింపం గటాక్షింపవే!
మాలోపంబులు సైఁపవే? పరశురామప్రీతిఁ గావింతువే? 131

కం॥ ఆపద ద్రెంచఁగలుగా నివి
లోపలఁ దలపోయ వలదు లోకారాధ్యా!
చూపుదు మగిల్చి పశ్చా
త్తాపము నిండారు మా హృదయకుహరంబుల్. 132

మ॥ కరుణాసాగర! కావఁగాఁ దలఁపవా? కారుణ్యవారాశి మా
గురుదేవుం డని సిద్ధుఁ డాడిన నుడుల్ గోల్పోవునా? మా కికన్
మరణంబే శరణంబ? బిడ్డల మొఱల్ మన్నింపవా తండ్రి! ది
క్కెఱి యున్నారము పాపనిష్కృతియె లేదా? పల్కవే లింతకున్

మ॥ అటు వీక్షింపఁగ దే దయార్ద్రహృదయా! యాబాలగోపాల మె
ట్లెటు లల్లాడుచు నున్నవారో? తగునే యీ వెట్లుపేక్షించుటల్
ఘటికామాత్రన రుద్రభూమియగు నిక్కం బీపురం బిమ్మెయిం
బుటముం బెట్టి పరీక్ష సేయుదువె? మమ్మున్ దోషభూయిష్ఠులన్

చం॥ అని దయపుట్టఁ బల్కి నయనాశ్రులు చెక్కుల డిగ్గజాఱ సి
ద్ధునిఁ బొడగాంచి నీ వనుఁ దోడ్తన మాయెడఁ దేఱి ప్రోవఁగా
మన సిడవే యటంచు నభిమానము లీగి నుతించి రయ్యెడన్
మును సిరికొండ వీరగురుముఖ్యుని మన్ననఁ గన్న దంపతుల్ 135

ఉ॥ తచ్చరణాంబుజంబులకు దండనమస్కృతు లాచరించి 'యో
సచ్చరితాగ్రగణ్య! గుణసాగర! మాపురి కేగుదెంచి మా
యిచ్చు సపర్య లందుకొనవే' యని వేఁడిన నాఁటి మాటకున్
వచ్చిన మీ పయిం బురనివాసులు రాళ్ళు నాదరించిరే! 136

ఉ॥ హేళన చేసి రప్పు డవు డేము భవత్కథ లాలపింప నీ
వేళ గభీరహృజ్జలధివేల నినుం గని కాన లేక బో
ధాళి నధఃకరించి యిటు లార్తి వహింతురు; వెజ్జు ఖజ్జలిన్
గూళ లలక్ష్యముం జలిపి క్రొత్త రుజల్ మెయికొన్న నేడ్వరే?

కం॥ ఇచ్ఛపలాత్ములు చూపిన
మచ్చరము లడంగెఁ బొగరు మసకలు దీఱెన్
విచ్చెఁ గనుంగవ లిప్పుడు
చిచ్చుం జల్లార్చి యొడ్డుఁ జేర్పవె తండ్రీ! 138

చం॥ అన విని దేశికేంద్రుఁడు దయాపరతంత్రుఁడు భక్తిసంభ్రమ
జ్జనసులభుండు వారి పయిఁ జల్లని చూడ్కులు గ్రుమ్మరించి యి
ట్లను విషమంపు బుద్ధి విడనాడి మనఃపరివర్తనంబుతో
ననుఁ గని నప్పుడే పురమునన్ శమియించె నుషర్బుధోద్ధతుల్

మ॥ అటు చూడుండు పురంబు నల్గడల నాహ్లాదంబుతోఁ బౌరు లె
ప్పటి య ట్లొప్పుచు నున్నవారలు నిజవ్యాపారసక్తాత్ములై
చటులాగ్నిస్ఫురణం బడంగినది; పశ్చాత్తాపవహ్నిచ్ఛటన్
బటుదోషాటవి భస్మమై చనుఁ గదా? భావింప నెవ్వారికిన్ 140

చం॥ అనుసరి కవ్వచోగరిమ కాననముల్ వికసిల్ల నెల్ల రొ
య్యనఁ బురి వంకఁ జూచి కడు నచ్చెరువుం బ్రమదంబు గల్గఁగా
వినఁ గన రావు వింత లిటు వీరగురుం దెలియంగ వచ్చునే!
యని కరముల్ మొగిడ్చి వినతాననులై పరిపూర్ణభక్తితోన్ 141

దండకము॥

శ్రీవీరయోగీశ్వరా! భక్తమందార! గోవిందమాంబా మనో
నాథ! సాక్షాజ్జగన్నాథ! నీలీల లెన్నంగ శక్యంబె? గోపాల
బాలుండవై భావి కాలస్థితిం దెల్పి లోకంబు మేల్కొల్పవే?

యచ్ఛమాంబం గటాక్షింపవే ? యుగ్రసంసారకాంతారమున్
దాఁట రాజయోగంబు మార్గంబుగాఁ జూపవే ! యంబుపూ
రంబు బ్రోక్షించి కుష్ఠవ్యథాపీడితుం బ్రోవవే ! యుద్ధురబ్రహ్మ
రక్షఃప్రచారంబు వారింపవే ! యాత్మవత్సర్వభూతానియంచుం
బ్రబోధించి హింసాబలిక్రూరకర్మంబు వారింపవే! యుజ్జ్వలత్సిద్ధ
సంకల్పు సిద్ధుం గటాక్షించి ప్రోద్యన్మతద్వేషధారాధరాద్ధత్వ
ముం దీర్చెఁగాఁ బూనవే ! కక్కనిం జేరి యస్పృశ్యతాజాడ్య
మున్ మాన్ప నుంకింపవే ! యిట్టి మాహాత్మ్యముల్ గంటిమే ?
యిట్టి సిద్ధాంతముల్ వింటిమే ! యెందు నీవంటి కారుణ్య
ధాముండు గాన్పించునే ? నిర్వికారా ! శిలావర్షధారాప్రయో
గంబు గావించినం బుష్పగిర్యగ్రహారంబు నాశంబు గాకుండఁ
గాపాడి యున్నాఁడ వస్మన్మనోవీధు లందున్ భవత్పాదపంకేరు
హంబుల్ ప్రతిష్ఠించి ప్రార్థింతు మెల్లప్పుడున్ భక్తిసంయుక్తి
సర్వాత్మకా ! యైహికాముష్మికంబుల్ ప్రసాదింపవే ! చిద్వి
లాసా ! మహాపాపనాశా ! నమస్తే నమస్తే నమస్తే నమః—

క॥ అని ప్రస్తుతించి వెండియు
ననఘా ! చాకుండ మమ్ము నందఱ దయ నే
లిన యట్టి మహాత్ముండవు
నినుఁ బొగడను సత్కరింప నేరుతు మొకో ! 143

గీ॥ తాలు రువ్విన యట్టి యీ కేలు తోన
బ్రహ్మరథమును బట్టి మా పాపభరము
దీర్చుకొన నుత్సహింతు మో దేశికేంద్ర !
యల్పసత్కార మని దిగనాడ వలదు 144

వ॥ అని యంతట— 145

చం॥ అనుపమపుష్పశోభితశతాంగము నొక్కెఁ డమర్చి చక్కఁగా
వినయ మెలర్ప నందు నుపవిష్టునిఁ జేసి జగద్గురున్ జయ
ధ్వను లెసఁగంగ నారథము పట్టిరి పాఱులు, దిక్కరీంద్రక
ర్ణనికరముల్ సెవుడ్పడఁగఁ గ్రచ్చఱ మ్రోగెను మేళతాళముల్

కం॥ రవికాంతులు నడడివియులు
నవవిధవాదిత్రఘోషణంబులు స్వస్తి
ప్రవచనము లొక్కమొగిగా
స్తవనీయు బ్రహ్మరథము సాఁగెను వీథిన్ 147

వ॥ ఛత్రచామరంబులు ధరించి సేవించు వారును, దివ్యమాల్యాను
లేపధూపదీపంబులు నివేదించు వారును, నుదాత్తానుదాత్తస్వరి
తంబుగా సామగానంబులు సదువువారు, గీతాభాష్యంబు లుగ్గ
డించు వారు, బిరుదులు పేర్కొను వారు, జయజయధ్వానంబులు
సలుపువారును, గ్రిక్కిఱియు జనంబు లొత్తిగిల్ల నాబాలవృద్ధం
బుగా దర్శన భాగ్యావకాశంబు గల్గించు వారు నైన భూసురులతో
నగ్రహారంబు భూమి కవతరిల్లిన బ్రహ్మలోకంబుఁ బురుడించుచు
బ్రహ్మానందం బనుభవించు చుండె నప్పుడు— 148

ఉ॥ పురుషుల డెందముల్ కఠినభూధరముల్ నవనీతతుల్యముల్
తరుణుల మానసంబు లనుదాన నిజంబు నిరూపణంబు గాఁ
జెరలుచు వాలవాన గుఱిచేసిన వారి పయోదకుంతలల్
గురిసిరి పూలవాన గురుకుంజరు నౌదల నప్పు డయ్యెడన్ 149

ఉ॥ వారిజనేత్ర యొర్తు రథవాహకుఁ డైన నిజేశుఁ జూచి లోఁ
గూరిన రక్తి సామియెడఁ గూడిన భక్తియు నిల్వరించి వి
స్ఫారకటాక్షమాలిక నివాళిగ భర్తకు నొప్పగించుచున్
హారతిఁ బట్టె సంయమి కహో! యిహాముం బర మిచ్చగించెనో!

సీ॥ వదనేందుబింబంబు వాడిపి వెన్నంటిన
జడపాము పిఱుందులం దడవిచూడఁ
జంద్రహాసాకృతి సవరించి ముడిచిన
సిగపూల వలపులు బుగులుకొనఁగ
నురసిజంబుల నెత్తి యొత్తిపట్టిన జైక
యరుజారు పయ్యంట నాదరింపఁ
జిగురాకు టడుగులఁ జీరాడు గాగరా
తొడలరాయిడికిఁ దుందుడుకు గొనఁగ

గీ॥ ముందటికి వచ్చి యొక జగన్మోహనాంగి
పూలదండ సమర్పించి మ్రొక్కి నిలువఁ
జూచిరే కాని చూపఱు చూపుగమికి
గురుఁడె సాక్షాత్కరించు నా తరుణి యందు ! 151

సీ॥ పులు గడిగిన యాణిముత్యాలు వెలవోయు
నెలవంక నగవు వెన్నెలల తోడ
మనసులో నుప్పొంగు మధురాశయంబులు
కొనసాగు కాటుకకనుల తోడ
మొనదేలి కంచుకంబు నదల్చు చనుదోయి
చెలు వాలిగొనిన వంజెఱఁగు తోడఁ
గరకంకణముల ఘల్లులలు వడ్డికి నిచ్చి
నిల్పి రాఁ బట్టిన వల్పు తోడ

గీ॥ మన్మథరథంబు నా నొప్పు మధురవాణి
బ్రహ్మరథమున కెదురుగా వచ్చి మ్రొక్కి
గంధమాల్యాదు లర్పింపఁ గనికరించి
యాత్మసౌందర్యసిద్ధి ర క్షనియె గురుఁడు ! 152

వ॥ అట్లు జగన్మోహనంబుగా బ్రహ్మరథోత్సవంబు ప్రవర్తిల్లె నట్టి సత్కారంబు మానవమాత్రులకు సాధ్యంబె? సాధ్యపడినను దక్కించుకొనుటయు నొక విశేషంబు గాదె? 153

గీ॥ బ్రహ్మరథ మధిరోహించి భ్రష్టుఁ డయ్యె
నపుడు నహుషుండు దురితాత్ముఁ డగుటఁ జేసి
పరమపుణ్యాత్మకుం డైన బ్రహ్మయోగి
యద్వితీయజగన్మాన్యుఁ డయ్యె నిపుడు! 154

వ॥ తదనంతర ముర్వీసుపర్వులు గురుదేవు నర్థించి కాలజ్ఞానవిశేషాదికంబు లవధరించుచుం గొన్నిదినంబులు సేవించి రంత నొక్కనాఁడు వైదికవరేణ్యులం జూచి గురుం డింక నేము సంచారమ్ము సలుపవలయు ననుటయు వారును జేతులు మొగిడ్చి యి ట్లనిరి—

ఉ॥ ఎచ్చటి కేఁగఁగా వలయు నేమి గురూత్తమ! మమ్ము వంటి వా
రెచ్చట నెవ్వరేనిఁ గలరే? మిము మన్నను గాన కుండిరే?
యిచ్చట మా సపర్యలు గ్రహించుచు నుండఁగ రాదె? యాన తే
మిచ్చెద వయ్య మాకు? జగదీశ్వర! గాఢతమిస్రభాస్కరా!

కం॥ అన విని మందస్మితమున
నను వారికి దేశికేంద్రుఁ డంచితఫణితిన్
జన దస్మాదృశు లొక చో
టన కాలము గడుపఁ జూచుటలు వ్యర్థముగాన్. 157

వ॥ కావున నెడసేయం గూడ దది యట్లుండె నింక మీకు నా యిచ్చు నుపదేశం బేమందు రేని వినుండు— 158

ఉ॥ వేదములుం బురాణములు వేధకుఁ బోలె ముఖస్థమైన బ్రా
హ్మ్యాదయితుల్ మహామహులు మీర లెఱుంగని ధర్మమర్మ మీ
మేదిని లేదు; సోదరసమీహితబుద్ధి వహించి నిల్పుఁడా
వైదికధర్మ, మన్యములు వారిని లోఁగొనకుండఁ జూడుఁడా 159

## నంద్యాల విశ్వబ్రాహ్మణ పరాభవము

వ॥ అని హితోపదేశంబు గావించి దేశికావతంసంబు వసుమతీసు
పర్వుల నాశీర్వదించి వీడ్కొని ఛత్రచామరబిరుదపరిభ్రాజిష్ణు
కరకమలు లైన శిష్యుల జయజయధ్వానంబు భూనభోంతరంబు
భోరుకొల్పఁ గర్నూలు నవాబు నాహ్వానంబు పురస్కరించుకొని
చనువాఁడై మధ్యేమార్గంబున నంద్యాల కరుగు నంత నపరా
హ్ణం బగుటయు నట విడిది సేయం దలంచి వైశ్వకర్మణ్యులం
బ్రధానాచార్యు నింటికిం జన నతండు తోడి శిల్పాచార్యులం
గూడికొని స్వామిని సమీపించి యహంభావంబు మై నలక్ష్యంబుగా
నుపలక్షించుచు ని ట్లనియె— 160

కం॥ ఊరూరు దిరిగి స్వాముల
వారలు శ్రమపెట్ట నేల వారిని వీరిన్ ?
దీక్షికలు గలుగ వలదా
వీరికి నిక్కాలువు లెల్ల వేగించుటకున్ ? 161

కం॥ కష్టించి కుడుచు కూడది
పుష్టిని గలిగించుఁ గాని పూఁటకు నొకచో
మృష్టాన్నంబులు గుడుచుట
శిష్టత్వమె ? యట్టి కుడుపు జీర్ణం బగునే ? 162

గీ॥ ఒక్కఁడవు గావు వెనువెంటఁ బెక్కుమంది
బయులు దేరిరి, వీరెల్ల బరమయోగ
భాగధేయులె ? మా పాలఁబడిన వార
పనియుఁ బాటయు లేదె యీ బడుగులకును ! 163

కం॥ మహిలో 'నుదరనిమిత్తం
బహుకృతవేష' మ్మటన్న వ్యాహారంబుల్
బహుళ ప్రచార మెనయుట
లహహా! త్వాదృశులు ప్రబల మగుటం జూవే! 164

ఉ॥ వచ్చితి వాస పెట్టుకొని వచ్చిన దేమియు లేదు నీ కిటన్
వచ్చినదారిఁ బట్టు మని పల్కిన పల్కులు వాఁడిముల్కులై
గ్రుచ్చుకొనంగ శిష్యులు గురుం గని రాతఁ డదల్చి చూడ్కితో
నచ్చలపాది యైన దురితాత్ముని శిల్పినిఁ జూచి యిట్లనున్ 165

ఉ॥ వాటము గాఁగఁ బల్లెలను బట్టణముల్ దిరుగంగ నేర్చి యి
చ్చోటికిఁ జేరి తావకవచోగతిచేఁ గనువిప్పుఁ గంటి మిం
కేటికి నాస దీఱినది యింతట నింటికిఁ బోదు మైన నీ
పూఁటకుఁ బెట్టెఁడన్న మిడి పుచ్చుము పోలినవార మాఁకటన్ 166

గీ॥ మంచి చెడ్డలు మును విచారించు దాఁక
క్షుత్పిపాసలు సయిరించుకొనఁగ నగునె?
ప్రాణివర్గంబు లుదరపరాయణంబు
లదన నబ్బిన పచ్చడిమెదుకు చాలు! 167

కం॥ ఉదరంబు చేత నిడుకొని
సదనమునకు నరుగుదెంచు జను నక్కటికం
బొదవఁగఁ దృప్తుం జేయక
పొదపొద మని వెడల నడువఁ బోలునె చెపుమా! 168

కం॥ ఈపురి శిల్పిబ్రాహ్మణు
లోపుదు రెందఱకు నైన నోగిగ మిడఁగాఁ
ద్రోపాడ రనుచు వింటిమి
యీపగిదిం బలుకఁ జూచు టెల్లిదము గదా! 169

క॥ అన విని మఱొక్క పాంచా
నను( డిట్లను గురుని( జూచి నవ్వుచు( దియతీ
యని మాటల పోఁడిమితో(
బ్రని గడుపుకొనంగ( జూచు వల నిది గాదే! 170

ఆ॥ వె॥ ఊళ్ళు దిరుగు వాని కుచితంబు లీమాట
లెవ్వ రెఱుఁగ నేర రింతవట్టు!
పట్టె( డన్న మిడఁగ( బలికె దిండఱికును
బుట్టె( డన్న మొక్క మూల గాదె! 171

వ॥ అనవుడు గురుండును వానింజూచి— 172

చం॥ అగునగు నింత యేమిటికి నాఁకటి చిచ్చుటువంటిదే కదా!
రగులుచునున్న విప్రు డుదరంబులు నంతటియున్న మిందఱుం
దగ భుజియించు టేమికొద? నాదగు శిష్యుల నొక్కఁ డొక్కఁడా
తెగువకుఁ బూనునట్టి యుపదేశము నందినవార లక్కటా! 173

గీ॥ మాకు నొకపూఁట పెట్టిన మాత్రఁ గొదువ
గలుగ నేరదు సిరిసంపదలను మీకుఁ
బెట్టి మఱతురు మీరు మీ పెట్టుపోఁత
లందు నందును జాటించుకొందు మేము 174

వ॥ నావుడు మఱొక్క శిల్పాచార్యుం డందుకొని కడుంగడు నెల్లి
దంబుగా నమ్మహానుభావునిం జూచి— 175

గీ॥ ఒక్కడును బుట్టెఁడన్న మాహుతిగఁ గొనెడు
నంత యాఁకలి పెల్లుతో నలమటించు
చున్నవార లె? యటు లైన నోగిరంబు
నిడియు పరికించి విడుతు మా యెత్తికోలు! 176

ఉ॥ ఏల యతిక్రమించి వచియింతువు నోరికి వచ్చినట్లు మా
మ్రోలఁ? బ్రగల్భవాఙ్నిచయముల్ నవులాలకు నైన సైపఁగాఁ
జాలని యట్టి రం చెఱుఁగఁజాలవు మమ్ముల నింద్రజాల వా
గ్జాలమునం గొనంగ నవకాశము గల్గదు నీకు నెప్పుడున్ 177

కం॥ అని దురహంకారవివ
ర్ధనచిత్తము తోన పలుక దరహాసముమైఁ
గనికొని వారికి గురుఁ డి
ట్లను మీకడ సాఁగివచ్చునా జాలంబుల్ ! 178

గీ॥ కడుపుఁగక్కుర్తితో మ్రొక్క లిడఁగ నేల
యింద్రజాలాదివిద్యల నెఱిఁగి నపుడు ?
మాటవరుసకు ననిన నామాట కిట్లు
పట్టు పట్టంగఁదగునె మీ వంటి వారు ? 179

ఆ॥ వె॥ అగును బుట్టి డన్న మారగింపఁ గలాని
కిడుదు మనుచు నొకని కియ్యకొంటి
రదియుఁ జాలు నొకరుఁ డసువులతో నిల్చు
వంటకములు సిద్ధపఱచి పిలుఁడు 180

కం॥ అన విని శిల్పాచార్యులు
మన యలవు గ్రహింప కెదురు మాటాడుచు నుం
డినవాఁడు వీని నింతటఁ
జన నిచ్చుట తగదు శాస్తి జరుపన వలయున్ 181

కం॥ అని కూడఁబల్కికొని గీ
మున ధాన్యసమృద్ధి కలిమి భోజనసామ
గ్రిని గూర్చిరి ఘటికామా
త్రన గమగమ నైన నేతితాలింపులతోన్ 182

వ॥ అట్లు వందించి వదరుఁబోతు లుచితప్రదేశంబున నాసనాదికంబు
నిడి నలక్ష్యంబుగా నుపలక్షించి యుపక్రమింపు మని రిది మరియాద
గలవారి తెఱం గెట్లగు నదియునుంగాక— 183

కం॥ అనలనిభు గురునిఁ దమవాఁ
డని నిర్లక్ష్యంబు సేయు టనయము గాదే;
తనయింటి దీప మని చ
క్కన ముద్దిడుకొన్న మూతి గాలక యున్నే; 184

వ॥ అప్పు డమ్మహాత్ముండు వారి యవివేకంబునకు నిట్టూర్చి సిద్ధుంజూచి
"సిద్ధా! నీవు మిక్కుటంబుగ నాకొన్న పిన్నవాఁడవు వీరు నీయాకటి
చి చ్చార్ప నున్నవారు. ఇయ్యవకాశంబు జాఱవిడువంగూడ దుప
క్రమింపు" మనుటయు నతండు గురు నింగితం బెఱింగి తత్పదంబుల
కెఱఁగి కుడువం గూర్చుండి వడ్డించిన శాకపాకంబు లలవోకగా
మ్రింగుచుం ద్రేఁపుచుం బుట్టెఁడన్నంబును బొట్టఁ బెట్టుకొని యెల్ల
రకుం దత్తరంబు పుట్ట నాకటిపెల్లున నార్చి వెండియు— 185

స్రగ్ధర॥ ఉగ్రజ్వాలానృసింహోయుతగతి నతిభీమోద్ధతిం జూచి యామూ
లాగ్రం బావైశ్వకర్మణ్యవిసరము నతం డాహుతిం గోరు మాడ్కిన్
దృగ్రాజీదుర్నివారాకృతి మెఱయఁగ వీరేశ్వరుం జేరి వా రే
కగ్రీవస్ఫూర్తిఁ దంద్రీ! కరుణమెయి మముం గాచి కాపాడు
[మంచున్ 186

కం॥ చరణంబు లంటి వేఁడినఁ
బరమకృపాపరుఁడు గురుఁడు వాత్సల్యముతోఁ
బరికించి వారిఁ దేరిచి
సరగున శాంతింపఁజేసె ఛాత్రోద్యమమున్ 187

కం॥ అది గని పంచార్షేయులు
ముదమును భక్తియును భయము ముప్పిరిగొనఁగా
నొదుఁగుచు గురుశిష్యుల పద
వదనములం జూడ్కి నిలిపి బంధురఫణితిన్ 188

మ॥ మదమున్ మత్సరమున్ బ్రమోహము సహంభావంబు నిండార ని
న్నదఁ గైకోక నిరాకరించితిమి; నీ వేపాటి మన్నింప కుం
డుదు వేనిన్ జఠరాగ్ని కాహుతి గొనండో సిద్ధుఁ డీపాటికిన్
బ్రదిమిం గంటిమి మేము నీవలన వీరబ్రహ్మయోగీశ్వరా! 189

కం॥ గురు నాజ్ఞ యేని లోకము
లరచేతన చూపఁ గలుగునట్టి మహత్త్వం
బరయఁగఁ ద్వదధీనం బని
యెఱిఁగితి మనుకంపఁ జూడు మింతట సిద్ధా? 190

వ॥ అని యభివందనాభినందనంబు లనుసంధించి తక్కటి శిష్యవర్గంబు నగ్గించు యాతిథేయసత్కారంబు లాచరించి పదంపడి కృతాంజలులై 'మాకేమి సెల' వనుశిల్పాచార్యులం జూచి జగచ్ఛిల్పాచార్యుం డైన గురుండు— 191

సీ॥ పంచాననబ్రహ్మవంశంబున జనించి
పంచర్షిశాఖలఁ బరిఢవిల్లి
పంచవృత్తులతోఁ బ్రపంచమునకు మేలు
వాటించు నేర్పున వార లగుట
మీ కసాధ్యంబులు మేదిని లేవని
యేను నెఱుంగుదు నైన యేని
సమయాసమయవివేకము లేక కేవలా
తిశయంబు తోఁన సాధింపఁగలరె!

సీ॥ గీ॥ పట్టువిడుపులు వలదె యేపనికి నైనఁ
బ్రజకు దూరంబు గారె యీ పగిది మీరు
సంచరించుచు నుండిన స్థపతు లార !
లౌకిక మెఱింగి బ్రదుకుఁడీ లోక మందు. 192

వ॥ అని నిర్లిప్తంబుగాఁ బల్కి యున్నకుండె నప్పుడు సిద్ధుండును 193

కం॥ ఒకవంక వేదవిద్యలు
నొకవంకను వృత్తివిద్య లొలికించుచు నే
యొకరికిఁ జెయి సాఁచని వా
రుకదా ! నిజ గౌరవం బెఱుంగని వారే ! 194

శా॥ మీ విన్నాణము క్రింద సేసి యితరుల్ మేల్బంతు ల ట్లాడ రే!
దేవబ్రాహ్మణు లార! యొండొరు లిటుల్ ధిక్కారసూచీముఖ
వ్యావిద్ధాత్మకు లౌదు రేని; వినరే వజ్రాయుధం బిచ్చె ము
న్నా వృత్రారికి విశ్వకర్మ యపు డే మయ్యెం బ్రతీకారముల్? 195

గురుండు కర్మ్మాలు నవాబునకుం గర్తవ్యంబు లెఱింగించుట

వ॥ అనుటయు నవనతాననులైన పాంచాననులం దేర్చి గురుండు కర్మజ్ఞానయోగరహస్యంబు లనేకంబు లుగ్గడించి వీడ్కొని కతిపయప్రయాణంబులఁ గర్మ్మాలు సేర నరిగి నవాబు నామంత్రణంబు వడసి తదాస్థానంబున సత్కృతుం డయ్యె నప్పు డప్పుడమిఱేఁడు గురురాయని కంజలి ఘటించి యి ట్లనియె— 196

శా॥ 'రాజ్యాంతే నరకం ధ్రువ' మ్మనుటతో రాజన్యు లా మోక్షసా
మ్రాజ్యశ్రీసుఖవైభవంబులకు దూరం బౌట గాదే? పరి
త్యాజ్యం బైన యహంకృతిం బొరయ కన్నా! నిన్ను సేవించి యా
త్మజ్యోతిం బరమాత్మఁ జూడ వలతున్ ధన్యాత్ముఁ గావింపవే? 197

కం॥ నినుఁ గొల్చి సిద్ధుఁ డావిగ
మనుజన్ములు జన్మరహితమార్గము లందున్
జనుచుండ నే నొకండను
మనుపీనుఁగు వోలె నింట మసలుట సనునే! 198

వ॥ అని రాజ్యసుఖవిరక్తియు మోక్షానురక్తియు నిజభక్తియుం బ్రక టంబుగా నికటంబునం జేరి ప్రార్థించిన నరేంద్రుం గటాక్షించి గురుండు— 199

కం॥ కర్తవ్యపరాఙ్ముఖ మగు
వర్తన మెవ్వనికిఁ దగదు ప్రజ నేలు ధరా
భర్తకుఁ దగునా! త్రిజగ
త్కర్తకుఁ గర్తవ్యపరులు తగవరు లధిపా! 200

ఆ॥ వె॥ ఆత్మశుద్ధి గలిగి యఖిలంబు నీశ్వర
మయ మటన్న తత్త్వమార్గ మెఱిఁగి
నియమవంతుఁ డైన నృపతికి మోక్షంబు
వలని సుఖము దుర్లభంబు గాదు 201

ఉ॥ నీరము నిప్పు నట్లు మఱి నిప్పును నీరము నట్లు ధర్మవి
స్తారకుఁ డైన భూధవునిఁ దండ్రిగ నెంతురు పాలితప్రజల్
వారల నెయ్యముం బడసి వర్తిలు తేజ మఖర్వమై మనో
హారము నై ప్రజాహితనియంతకు శోభన మిచ్చు భూవరా! 202

సీ॥ ఐశ్వర్యపరులు మధ్యములు పేదలు నాగ
వర్గంబు లివి మూఁడు ప్రజల యందుఁ
గలవారి నయభయంబుల కోడి పేదలు
నో రెత్తఁజాల రెందులకు నేని

కావున రాచటికంపు సౌభాగ్యంబు
మధ్యమవర్గంబు మనువు దెల్పు
నిది గమనించి నీ వెల్లవర్గంబు లా
నందింప రాజ్యంబు నడుప వయ్యా !

ఆ॥ వె॥ దురభిమాన ముడిగి దోషుల దండించి
కూడు గుడ్డలకును గొఱువ దీర్చి
కార్యఖడ్గములను గనుగల్గు నరపాలుఁ
డెందు నందు నెక్కు నందలములు ! 203

వ॥ అని బోధించి పల్కిన మహానుభావుని మధుపిచ్ఛిలధర్మమర్మాలాపంబుల కలరి మహీధవుండు 'ధన్యోస్మి' యని నమస్కరించె నంత శిష్యగణపరివృతుం డైన గురుండు హైదరాబాదున కరుగుటయు నచటి వైశ్యకర్మణ్యు లెదురు సని యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి తోడ్తెచ్చి తమ మనంబు లందు— 204

హైదరాబాదు పురప్రముఖులు స్వామిని సత్కరించుట

సీ॥ ఎపుడు కాలజ్ఞానదృష్టి సంపాదించె
విహరించె నావుల వెంట నెపుడు
ఎపు డభ్యసించె వేదపురాణగాథలు
సాధించె శిల్పకౌశలము నెపుడు.
ఎపుడు బ్రహ్మజ్ఞాననిపుణత గడియించెఁ
బడసె గార్హస్థ్యానుభవము లెపుడు
ఎపు డణిమాదుల నెనసి ప్రకాశించె
సాగించె ధర్మప్రచార మెపుడు

గీ॥ తెలిసి నట్లుండు నంతలోఁ దెలియకుండు
దలఁచిన కొలంది బ్రహ్మంబు కోలఁది మీఱు
జగతి నెపుడేని కారణజన్ము లైన
వారి గాథలు గంభీరవారినిధులు ! 205

వ॥ అని భావించి భక్తిశ్రద్ధాభరంబుల నభివందనంబు లాచరించి యప
వర్గసాధనవిధానంబు లెఱింగింపు మని వేఁడుటయును— 206

సీ॥ యమనియమంబుల నలవరించు తెఱంగు
రిపుషట్కమును నాహరించు వెరవు
చిత్తచాంచల్యంబుఁ జెఱచు నుపాయంబు
తాపత్రయంబు నదల్చు మెలపు
మొనసి ప్రాణాయామ మొనరించు మార్గంబు
నాధారచక్రాది నరయు విధము
ముద్రానిరూఢిమై నిద్రించు చందంబు
బ్రహ్మానుభవమును బడయు భంగి

గీ॥ విదితపేషిణి హనుమంతబిరుదశోభి
విశ్వకర్మాన్వయుల కెల్ల విశదఫణితి
బోధ మొనరించె నాత్మప్రబోధగీతి
నాఱితేఱిన వీరనారాయణుండు 207

గీ॥ బ్రహ్మయ యనంగ నొక శిల్పివర్యుఁ డపుడు
గురునకు నమస్కరించి యో పరమదేవ !
కాలరక్షోరదాంకుర క్రకచఘాత
పాటితం బయ్యె జీవితపాటవంబు 208

ఉ॥ ప్రాయము చెల్లుచున్నది నిరర్థకమై పరతత్త్వసిద్ధికిం
గాయముఁ జిత్తమున్ నిలుపఁగా నవకాశము లెండమావులై
పాయుచునుండు నెంతకును బ్రాప్తము చాలని నాదు జీవిత
ధ్యేయ మనుగ్రహింపఁ గదవే! కరుణానిధి! నీకు మ్రొక్కెదన్

వ॥ అనిన నతని శిష్యునిగాఁ బరిగ్రహించి గురుం డప్పురాధీశ్వరు నాహ్వానంబు పురస్కరించుకొని చని గృహీత సత్కారుండై తదీయహృదయగతాభిప్రాయంబు మునుమున్న యెఱింగి యి ట్లనియె— 210

ఉ॥ నీరము నందు నిప్పు మఱి నిప్పున నీరము గల్గుటల్ నిజం
బారయనేర్తు రందలి యథార్థరుచుల్ మహితాత్ము; లాత్మసం
స్కారము లేనివారు గనఁజాలరు, నీవు నిదర్శనంబుగా
నారయఁ గోరినాఁడ వది యౌనుగదా? ధరణీతలేశ్వరా! 211

మ॥ ఉచితస్నేహపరాయణంబు లయి వెల్గొందున్ సమంచద్గుణ
ప్రచయం బద్ది జడానుషంగమున విభ్రాజిల్లునే యంచు లోఁ
బ్రచలింపం బనిలేదు యోగులు జడప్రాప్తిన్ వెలింగింతు ర
య్యుచితస్నేహవశంవదంబు లగు నట్లుర్విన్ గుణస్తోమమున్ 212

కం॥ కావునఁ బ్రమిదల లోపల
వావిరిగా నీరు పోసి వత్తులు నిడి నీ
వై వెలిఁగించి నిదర్శన
మావలఁ జూడంగ వలతు నయ్యా! నరేంద్రా! 213

కం॥ అన విని తన హృదయరుచిన్
మునుమున్న గ్రహించి పలుకు ముని కానతుఁడై
జననాథుఁ డట్లు కావిం
చిన దీపిక లెల్ల వెలిఁగెఁ జిత్రము గాఁగన్ 214

కం॥ వినుతించి రది కనుంగొని
జను లచ్చెరువుట్టఁగా, విశాంపతి కేలో
డ్చి నమస్కరించి యి ట్లను
ననిదంపూర్వంబు లీ మహత్త్వము లనఘా! 215

శా॥ సిద్ధాదుల్ భజియించుచుండఁగ జగజ్జేగీయమానంబుగా
నిద్రాత్రిం జరియించుచున్ సుజనతాభీష్టంబు లీడేర్చుచున్
బుద్ధిజ్ఞానవివేకశూన్యులను నుద్బోధించు చున్నట్టి నీ
సిద్ధాంతంబు లెఱుంగ నయ్యె నిపు డక్షీణప్రభావోదయా! 216

సీ॥ బనగానపల్లెలోఁ బ్రబలిన విషమప
రీక్షాభిలాష లదృశ్య మయ్యెఁ!
గడపలో రేఁగిన కర్కశక్రౌర్యంబు
భాండంబు పోలిక బ్రద్ద లయ్యె!
నగ్రహారంబున నడరిన గర్వరే
ఖాకుట్మలంబులు కాలిపోయె!
నంద్యాలలోనఁ గన్పడిన ధిక్కారంబు
లిప్తమాత్రన నిబళింపఁ బడియెఁ!

గీ॥ కులమతద్వేషరాగముల్ కూడ వనుచు
బోధ మొనరించు పనిపూని సాధుమౌళి!
నీవు శిష్యుండు వెడలితి రీ విధాన
ననుచు నెఱిఁగితి మిప్పటి కైన నేము 217

గీ॥ తాలు పూలయ్యె హైందవప్రతిభ, బండ
బ్రద్ద లయ్యెఁ దురుష్కుని ప్రార్థనమున
నెల్ల హిందూముసల్మాను లేక మైన
దేశకళ్యాణమునకు సందేహ మున్నె? 218

కం॥ అనుచు విధేయతమై ని
ల్చిన నృపు నాశీర్వదించి సేవలు గొని వీ
డ్కొని చని దిగ్దేశంబులు
తనిపెన్ గురుమౌళి నిజసుధామయసూక్తిన్ 219

తస్కర పరాభవము

వ॥ అట్లు ప్రజాప్రబోధంబులు గావించి బ్రహ్మేంద్రుండు గృహోన్ము ఖుండై శిష్యసమేతంబుగాఁ గందిమల్లయపల్లెం జేర నరుగుటయు నంతకు మున్న యవ్వార్తమూనంబు విన్న గోవిందయాచార్యుండు సోదర్యులుం బౌరులుం దల్లియుఁ దోడురా నభంగురమంగళవాద్య రవంబులు రోదసీకుహరాంతరంబు నిండుకొనఁ బితృపాదు నెదు ర్కొని సాష్టాంగదండప్రణామంబు లాచరించి పూజించి యాశ్రమ ప్రవేశోత్సవం బతివైభవంబుగా నడపె. నమ్మహానుభావుండును సంచారసమాచారంబు లెఱింగించి యథాప్రకారం బుండె నంత నొక్క రేయి దురాశాపరులైన చోరులు— 220

ఉ॥ చక్కని గారడీపనులు సల్పుచు సామి నటంచుఁ బల్కుచున్
బెక్కురు వెన్నఁగాచి జయవెట్టుచు నుండఁగఁ బట్టణంబులుం
బక్కణముల్ చరించి జనపాలకు లిచ్చిన రత్నరాశితో
నిక్కుచు నున్నవాఁ డితని నేఁడు దరిద్రునిఁ జేయు టొప్పదే! 221

వ॥ అని తదాశ్రమనివేశంబునం బ్రవేశించి నలువంకలు గాలించి ధనకనకమణిమండనంబు లేమియుం గానరామి నెటనేని యిమ్మని ముచ్చు దాఁచెనో యని మలిమ్లుచు లాగ్రహించి కాషాయాంబ రంబులు రుద్రాక్షమాలికాభరణంబులు దండకమండలంబు లప హరింపం బూని మున్కొని గ్రుడ్డివారై పోరామి కీడిగలం బడుచుఁ బరుండిన వారి కాళ్ళడ్డుకొని విధివిలాసంబునం జేసి గురుచరణ సమీపంబునం బడి రప్పుడా చప్పుడు విని— 222

ఉ॥ గొల్లున లేచి రెల్లరును గొట్టుఁడు పట్టుకొనుం డటంచు నా
యల్లరి నిల్వరించి దరహాసముతోఁ బరికించి యిస్సిరో!
నల్లని రేయి యేమిటికి నాకడకుం జనుదెంచి యుంటిరో
తెల్లమిగా వచింపుఁ డని దేశికుఁ డాడినఁ జోరు లెల్లరున్ 223

గీ॥ చరణములు పట్టి రయో జగజ్జనక! యేము
కన్నుఁగానక యిటవచ్చి కట్టకడకుఁ
గన్నుగానని వారమై కట్టువడితి
మెఱుఁగ నల్లల పలికెదు గురువరేణ్య! 224

గీ॥ పార్థివేంద్రులు గొడుగులు పట్టి రనఁగ
వినియు లక్షింప మైతిమి, కనికరింపు
మాలుబిడ్డలు మారాకకై తపించు
చుందు రయ్యయో! బాలభానూదయమున! 225

మ॥ అనృతం బా బనగానపల్లె నరపాలాస్థానిఁ బండ్లారగిం
చిన వృత్తంబు ద్విజాగ్రహారదహనోత్సేకం బలీకంబు క
క్కని యిల్లాలికిఁ బ్రాణ మిచ్చుట నిరాఘాటేంద్రజాలంబు మ
మ్మనుకంపామతిఁ జూడకుండిన మహాత్మా! వీరయోగీశ్వరా!226

గురుండు జ్యేష్ఠకుమారుని మఠాధిపతిం గావించుట

వ॥ అని పరిపరి విధంబులం బ్రార్థించుచున్న చోరులం గనికరించి గురుం డెప్పటట్ల దృష్టి ప్రసాదించి హితముపదేశించి పంచె ని ట్లయ్యాశ్రమమఠం బభేద్యంబై పరార్థసాధనారాధ్యం బయ్యె. నంత నొక్కనాఁడు గురుండు పరబ్రహ్మవిద్యాకలితుండును జ్యేష్ఠ సుతుండును వినతార్యుండును సభార్యుండును నగు గోవింద యాచార్యునిం జూచి సతీసుతశిష్యవర్గంబు విన ని ట్లనియె—227

ఆ॥ వె॥ నీవు నీతిశాస్త్రనిపుణశీలుండవు
శమదమాదిసుగుణసంయుతుండ
విమ్మఠాధిపత్యసమ్మానము వహించి
నడుపవలయు నింక నయగుణాఢ్య ! 228

వ॥ అనిన విని భయభక్తివినయవివేకపురస్సరంబుగాఁ గుమారాగ్రజుండు మునిగ్రామణిం జూచి—— 229

ఆ॥ వె॥ ఇమ్మఠాధిపత్యసమ్మాన మొరులకుఁ
జెల్లునయ్య ? నీక చెల్లుఁ గాక !
జడున కర్హ మగునె ? చదువరి పట్టంబు
మూసి ముట్టుకొనఁగఁ బూర్ణపురుష ! 230

వ॥ అను నతని వినయవిధేయతల కంతరంగంబున సంతసిల్లి యంతర్వేది—— 231

ఆ॥ వె॥ నిర్వహింప వలయు నీవ నా యాజ్ఞప్తి
యన్యథాకరించు టర్హ మగునె?
పెద్దవాఁడ నైతిఁ బిత్రార్జితం బిది
యింతకంటె నాకు నేమి గలదు ! 232

ఆ॥ వె॥ నన్ను నమ్మి కొలుచు నయధనుండవు నీకుఁ
గరగతంబు లమృతకల్పలతలు
నీవు నిర్వహింప నేరకయుండిన
నొరులు నేర్తు రయ్య ! యోయి పుత్ర ! 233

వ॥ అని యవధ్యప్రతివచనంబుగాఁ దదీయసామర్థ్యంబు నిరూపించి పల్కి శిష్యనివహంబు సముచితసన్నాహనంబు గావింప నొక్క సుముహూర్తంబున నక్కుమారజ్యేష్ఠునకు మఠాధిపత్యంబు సంఘటించె నంతట—— 234

సీ॥ గురుదేవదర్శనకుతుక మిం పెసలార
ఐరుదెంచు భక్తుల నరయుచుండు
బహుళశ్రమంబుల వాలైన శిష్యులఁ
దగు పరామర్శలఁ దనుపుచుండు
భక్తిఁ గాలజ్ఞానసూక్తులు వెలయించి
ప్రతులు పంపించు దిగ్భాగములకు
నెల్లరుఁ దృప్తిమై నుల్లసిల్ల మహాప్ర
సాదంబు లిప్పించు నాదరమునఁ

గీ॥ దల్లిదండ్రులు సిద్ధుండుఁ దమ్ముఁగుజ్జ
లిష్టబాంధవకోటి సంతుష్టిఁ బొదల
నాశ్రమము నిర్వహించు నయ్యగ్రసూతి
శతగుణాధికకీర్తిప్రశస్తిఁ డయ్యె ! 235

## యోగఫలము

కం॥ అరుదారు ఛత్రయోగము
వరసిన మతసమానభావ మభిమతఫలమై
కొఱవడుఁ గులగర్వంబులు
కొఱలుం బరిపూర్ణశోభ గుణకాండంబుల్ ! 236

## ఆశ్వాసాంతము

మ॥ దరహాసాంకురభాసురాననవిధుల్ తంతన్యమానాతిసుం
దరగాత్రస్థస్వసుఖావధుల్ పరహితార్థప్రక్రియా సన్నిధుల్
పరిహాసావసరాపవారితమహాపాపప్రలాపౌఘుసు
ర్భరవాగ్వ్యపథు లాత్మసంయమసమగ్రజ్ఞానవారాన్నిధుల్ 237

క॥ అంబుధిగంభీరులు కకు
బంబరవిలసద్యశోవిహారులు దురితా
లంబారులు వేంకటవర
సాంబాబ్రహ్మాంకసత్యసంధాధారుల్. 238

గద్యము - ఇది శ్రీపూసపాట్యన్వవాయపయఃపారావారరాకాకురంగ
లాంఛన, సహజకవిపంచానన, కవిశేఖర, నాగేశ్వరప్రణీతం
బైన శ్రీవీరబ్రహ్మేంద్రచరిత్రంబు నందు ఛత్రయోగం బను
చతుర్థాశ్వాసము— 239



# శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్రము

## పంచమాశ్వాసము - సమాధియోగము.

కం॥ శ్రీభవభూతిలసద్వపు
షాభరణులు వేంకటనరసాంబాబ్రహ్మ
శ్రీభరితయశస్సరణులు
ప్రాభాతారాధ్యహృద్యపద్యాచరణుల్ 1

గీ॥ అవధరింపుఁడు పరమదయాపరుండు
బ్రహ్మవిద్యావినోది యా బ్రహ్మయోగి
జ్యేష్ఠసుతునకు నధికార మిచ్చి తాను
జ్ఞానబోధలు సలుపుచుఁ గడపుచుండ. 2

### వసంతర్తు వర్ణనము

కం॥ వచ్చెను వసంతకాలము
హెచ్చెను గ్రొంగ్రొత్త సొబగు లెలదోఁటలకున్
మెచ్చెను శుకసంతానము
వ్రచ్చెను మునిముచ్చులైన వారల గుండెల్ 3

మ॥ చివురుం జొక్కపుఁజీర గట్టి సిగపైఁ జెల్వంబుగాఁ జుట్టి క్రొ
త్తవిరుల్, వాలిక తేటిచూపుల నిజాంతర్దృష్టి గావించి మా
ధవసేవం దనియంగఁ జాలు వనపద్మాదేవిఁ గీర్తించె నె
ల్ల విధాలం బ్రియ మంది యభ్రచరజాలం బాత్మవాచాలతన్ 4

శా॥ ప్రచ్ఛన్నావసథంబులన్ బడలుచున్ వాహ్యాళిరా దంపతుల్
తచ్ఛాంతిక్రియ లాచరించుచు నవోత్సాహంబు సంధించెడిన్
స్వేచ్ఛావాయువు లుజ్జ్వలత్కుసుమరాజీవాసనావాసముల్
స్వచ్ఛందాసవపూరపూర్ణ సరసీవారూర్మికోదారముల్. 5

ఉ॥ ఈ యెలదోఁటలో సరసి కింతట నంతటఁ జేరువన్ దరు
చ్ఛాయలఁ బూలపాన్పులను జల్లని గాడ్పుల సేదదేర రం
డో! యను గండుఁగోయిల నవోదితముల్ విని విప్రయోగు ల
య్యో! యన యోగు లందుకొన నుండిరి సౌఖ్యసమాధియోగముల్!

చం॥ ప్రకటశుకాదిపక్షినికరంబు లభీష్టఫలంబు లందఁగా
సకలమహీజముల్ వొలుచు చక్కని యామని రాఁగ నొక్క జా
తికిఁ దలనొప్పి యయ్యె! జగతీస్థలి నెంతటివాఁడు నెల్లవా
రికి హితభాజనంబుగఁ జరించుట దుర్లభ మింత యేటికిన్! 7

సీ॥ కుపితకంటకములు సరీసృపపరీవృ
తాంతరంబులు గేడిగు లధ్వగునకు
నభినవామోదములు గూర్చు నట్టి వయ్యె
నిగ్రహానుగ్రహంబును నేర్చి నపుడు! 8

కం॥ గుగుకుచ నలంకరింతురు
గురు నర్చింతురు సుగంధికుసుమంబులతో
నరు లని యిహపరములకుం
దరు లుభయుల కభయ మొసఁగి తనరుచు నుండున్ 9

మ॥ ఫలపత్రంబులు పూలు పుప్పొడులు గుప్పల్గాఁగఁ జిప్పిల్లఁగా
ఫలసారంబులు పుష్పసారములు పైపైఁ గీరసారంగముల్
కలకంఠంబులు మంగళధ్వనులతోఁ గైవారముల్ సల్పఁగా
నిల భాసిల్లు సమాధి వేడుకలతో హృద్యాఖిలోద్యానముల్ 10

గురుదేవుండు సమాధిం బ్రవేశింపఁ బూని సతీసుతశిష్య
వర్గంబు నోదార్చుట

వ॥ అట్టి మనోహరవాసంత వాసరంబులం గొడుకులుం గోడండ్రురు కూఁతు రల్లురు శిష్యప్రశిష్యవర్గంబులు పౌరజనంబులుం గొల్చు చుండ నుల్లసిల్లుచు నొక్కనాఁడు స్వైరప్రసారప్రకారం బారసి గురుం 'డాగామి వైశాఖశుద్ధదశమీదివసంబున సమాధియోగంబు వహింతు' నని పల్కుటయు నుల్కి యెల్లరు వెలువెల్ల నగు మొగంబులు వ్రేలవైచి రదిసూచి దరహాసరుచిరవదనారవిందుం డగుచు గురుండు పేర్పేరసంబోధించి యి ట్లనియె— 11

సీ॥ ఇదియేమి దేవి! నీ వి ట్లుదాసీనత
నశ్రులు చిందుదు వనుచితముగఁ
గార్మొయిల్లు మొగానఁ గ్రమ్మఁ దేరఁగ నట్లు
కూరుచున్నా రేల కొమరులార!
దీనభావమున కాతిథ్యంబు సలుపుచుఁ
జెలువ మేదితి రేల శిష్యులార!
యింత లంతలు గాఁగ సంతాపజలనిధి
మునుఁగ నేటికిఁ బౌరజనము లార!

గీ॥ తత్త్వవిద్యావివేకంబు దారి పట్టి
నేమి? మీ తెఱఁ గిట్లయ్యె నేమి తుదకు?
నాకు మిముఁజూడఁ జూడంగ నవ్వు వచ్చు
ననిన గోవిందమాంబ యి ట్లనియెఁ బతికి 12

మ॥ పతి లోకోత్తరపూరుషుం బరమతత్త్వజ్ఞానతేజస్వి నూ
ర్జితభక్తిం జిరగౌరవస్ఫురణతో సేవించు భాగ్యంబు వో
వతిమాత్రంబగు తద్వియోగవిరసం బాలించి యే నిట్లు ని
ల్చితినే యంచు విచార మందుదును నా చిత్తాన నాత్మేశ్వరా! 13

ఆ॥వె॥ మీ యనుగ్రహమున మెలఁగితి మాన్యనై
కాంక్షితంబు లొందు గాన రావు
నాకు వేఱ వలదు మీకంటె ముందుగా
నరుగు వరము నిండు పరమదేవ ! 14

కం॥ అని గాద్గద్యముతో నా
డిన చేడియ మోము పిక్కటిలు నగుచూడ్కిం
గనుచు జగత్పతి పతి యి
ట్లను మృదుమధురోక్తులను సమాదరసరణిన్ 15

సీ॥ వినయాదిగుణసమావేశంబునకు స్థాన
మనుచితాహంకృతి కాటవిడుపు
అతిథిమర్యాదల కన్నపూర్ణాదేవి
యువతీలలామల కొజ్జబంతి
పుణ్యైకకర్మఫలోపభోగంబులకు నిక్క
యధ్యాత్మవిద్యకు నాశ్రయంబు
నిజభక్తకోటికి నిర్జరధేనువు
మునిమనోదృష్టికి మోక్షలక్ష్మి

గీ॥ యనఁగఁ బ్రఖ్యాతి వడసిన యట్టిదాన
విట్టి చందాన బేలవై తేల యిపుడు ?
నేను జాటున కేఁగిన యేని నీకు
నైదువతనంబు లోపింప దబ్జవదన ! 16

మ॥ ఉవిదా ! జీవసమాధియోగమున నేనుండంగ సౌభాగ్యవై
భవలోపం బగునే యొకప్పుడు నిసీ ! వైధవ్యధర్మంబుగా
నవలంద్రోయకు గాజుపూసయును నా యాజ్ఞప్తి పాటింపు ని
న్నవమానించిన వాఁడు గాంచు ఫలితం బామీఁదఁ దెల్లం బగున్

ఉ॥ ఈవిధి గాజుపూసయు వహించుచు నుండెదు నిన్నుఁ బెక్కు నిం
దావచనంబు లాడి మఱి నాయెడ శంక వహించు వారికిన్
నీవొక హేతుభూతముగ నిల్తువు గన్నులు విప్పి చూపఁగా
జీవసమాధియోగమునఁ జేష్టడకుండుదు నన్న పోఁడుముల్ ! 18

కం॥ కావున నిది యెల్లను సం
భావించుచు భక్తిముక్తిపదములు నిజభ
క్తావళికిం జూపుచు నీ
వీవిధమున నుండవలయు నింకను దేవీ ! 19

కం॥ అన విని యుమ్మలికం దే
ఱి నమస్కృతి సలుపు నింతిఁ గృపమెయి దీవిం
చెను రాజయోగి; పదపడి
జనకునిఁ గని జ్యేష్ఠసుతుఁడు సాంజలి యగుచున్ 20

కం॥ జనకునిఁ ద్రిజగన్మాన్యుని
నిను నారాధించు నట్టి నిరవధికమహం
బున కెడసి బ్రతుకనుండితి
ననుచు విచారింతు నంతరాత్మను దండ్రీ ! 21

కం॥ అన వినియును గరుణారస
జనకం బగు నగ్రసుతుని చందము నెల్లం
గనియు జగజ్జనకుం డగు
జనకుం డి ట్లనియెఁ గూర్మి సందడికొనఁగాన్ 22

ఉ॥ శాంతికి దాంతికి న్నెలవు సత్యగుణంబున కాశ్రయంబు వే
దాంతమయప్రపంచవిశదాశయశుద్ధికి జన్మభూమి వి
భ్రాంతికి వేరువిత్తనఁగ భాసిలి వాసికి వన్నె కెక్కి నా
యంతటివాఁడ వయ్యు నిటు లాఱడిపా లగు టేల పుత్రకా ! 23

కం॥ ఊటబడి మఠనిర్వాహక
భారము వహియించి శిష్యవాత్సల్యముతో
నారాధింపుము ననుఁ జే
కూరం గల వెల్ల భంగిఁ గోరిన కోర్కుల్ 24

గీ॥ నాకుఁ బ్రియమును గూర్పు నందనుఁడ వయ్యు
నీశ్వరికి జన్మదాతవై యొసఁగ మెసఁగు
నీదు భాగ్యంబు వర్ణింప నాదిశేషుఁ
డైన శక్తుండు గానేరఁ డది నిజంబు ! 25

కం॥ అని పలికి కలఁకఁ దేఱిన
తనయుని నాశీర్వదించెఁ దాపసి యంతన్
మునుకొని నమస్కరించుచు
నను నిట్లని పోతులూరయాచార్యుండున్ 26

ఉ॥ యోగసమాధిశోభఁ గొననుండుదువే ? భవబంధమోక్షవి
ద్యాగరిమంబు నారయని వ్యర్థుని నాగతి యేమి తండ్రి ! దు
ర్యోగవశంబునం గడు నయోమయచిత్తుఁడ నైతి నయ్యయో !
నాగ గురూత్తముండు వెడనవ్వు మొగంబున వానికిట్లనున్

ఉ॥ ఆకొనియున్న వాని యటు లంగలు పంగలు వైచి మానసో
ద్రేకమునం జరింతువు భరింతువు గావు సుఖంబు దుఃఖమున్
నాకడ విన్నమాటలు మనంబునఁ గైకొన వాచరింపవున్
బాకము మీఱఁగాఁక సలుపాయ వడెన్ వగవంగఁ దప్పునే ? 28

చం॥ గతమును విస్మరించి యవుఁ గా దనఁబోక భవత్ప్రసూపదా
ర్పితమతి సంచరించి గుణవృద్ధుఁడు సిద్ధుఁడు దారి చూపఁగా
బ్రతుకుము కర్మమోచనవిపక్వదశం బడయంగ నేర్తు వీ
ప్సితములు దీరు నీశ్వరనివేదనభాగ్యము గల్గుఁ బుత్రకా ? 29

కం॥ అనఁ బుణ్యగర్భవాసం
బును గాంచిన యేను ముక్తిఁ బొందమిఁ గలదే
యని పైపైఁ దిరిగితి నో
యనఘా! దురహంక్రియాపరాయణమతితోన్ 30

సీ॥ ఆలుబిడ్డల మీఁది యనురాగ మొకవంక
నొకవంక నియతనైష్ఠికుల దృష్టి
దేహాభిమానంబు తీఱమి యొకవంక
నొకవంక నాత్మసాధకుల బుద్ధి
త్రికరణోద్రేకాతిరేకంబు లొకవంక
నొకవంకఁ బరమశాంత్యుపలబ్ధి
గురుతిరస్కారసంచరణంబు లొకవంక
నొకవంక గురుభక్తియోగభరము

గీ॥ నన్ను ముంచుచుఁ దేల్చుచు నున్న వగుట
రెంటికిం జెడ్డ రేవడరీతి నైతిఁ
బిన్నవాఁడైన సిద్ధుని కున్న తెలివి
నొక శతాంశంబు నాకు లేకుండఁ బోయె! 31

వ॥ అని కాలు జాఱిన తఱి నవలంబునకుం జెయిసాఁచు వాని తెఱంగునఁ జేతులు గాలి నపు డాకులకుం బఱచు వాని వడువునఁ దలదూర్చిన తదుపరి నపరిమితంబుగా దూరపిల్లు వాని పురుడునం గన్నీరు నించునతనిం జూచి సిద్ధాదు లుమ్మగిల్లి రప్పుడు— 32

కం॥ ఇట్టి యహంభావముమై
గట్టెక్కనె యెవ్వఁడైనఁ ? గమనీయంబౌ
చెట్టునఁ బుట్టిన మాత్రన
పట్టునె చవి యపరిపక్వఫలమున కోయీ! 33

ఉ॥ కావున నీవు పక్వరుచి గావలయున్ భవతారణప్రియం
భావుకబుద్ధి వేని ననుభావము తోడను మాతృపాదముల్
భావము నందు నిల్పి పరిభావ మొనర్పక కొల్వు మంచు బల్
దీవెన లిచ్చె నాతనికి దీనజనైకశరణ్యుఁ డంతటన్ 44

కం॥ సాశ్రుదృగంచలయై విది
తాశ్రితవత్సలుని జనకు నారసి మది భ
క్తిశ్రద్ధలు దీపింపఁగ
విశ్రుతమధురోక్తిఁ దనయ వేడ్కొనియె నిటుల్ 35

కం॥ ఏ నొక్కదాన భవదీ
యానుపమానాంఘ్రియుగసమర్చన కెడమై
కానం బరమార్థ మనూ
చానజ్ఞానారణిం బ్రసాదింపఁ గదే ! 36

కం॥ మీా చెప్పిన చందమునం
దూచా తప్పకయ పతిమనోధనరాశిన్
నాఁచికొని కొలుచుచుండుదు
వాచంయమివర్య ! ముక్తి పట్టము నీవే ! 37

చం॥ అన విని రాజయోగి తనయం గని యిట్లను నా మధూక్తిఁ చే
కొని చరియించు నీకు సమకూడని పట్టము లున్నె చెప్పుమా !
మనమున లేశమాత్ర మనుమానము మానుము నాకుఁ గూర్చు మె
త్తని నవనీతపాత్రిక వుదాత్తచరిత్రవు నీవు పుత్రికా 38

కం॥ ఈహా మెయి మతాకుము వై
వాహికసమయమున నేను బలికిన తత్త
ద్వ్యాహారమ్ము లమోఘము
లూహాపోహమ్ము లుడిగియుండు కుమారీ ! 29

కం॥ అన విని యమ్మౌలికం దే
ఱీ నమస్కారంబు సలుపు ప్రియనందన న
య్యనఘుం డాశీఃకలితా
భినవోక్తులఁ దనిపి కూర్మి వెన్నలు వెట్టెన్ 40

వ॥ అంతట నత్యంతభక్తిప్రపత్తులు చిత్తంబులం దత్తమిల్ల గురూ
త్తము నుపలక్షించి ప్రియశిష్యుం డైన సిద్ధుండు సాంజలియై— 41

మ॥ గురు లోకైకగురున్ సమాశ్రితమనఃశోకార్ధచోరున్ నినుం
జిరకాలంబు భజించు భాగ్యమున కిస్సీ ! దూరమై పోవ నె
వ్వరు దిక్కయ్యెద రయ్య ! నా కని వగర్పం జూచి యోగీం
[ద్రుండున్
దరహాసంబున వాని కిట్లనియె మత్స్యండీ సమానోక్తులన్ 42

సీ॥ నయవిధేయోపాయభయభక్తులకు తావు
శిష్యప్రవృత్తికి జీవగఱ్ఱ
యచలమనోనిగ్రహమునకు మేరువు
బ్రహ్మవిద్యాసాగరమున కవధి
దివ్యదృష్టిప్రదీప్తికి నభోరత్నంబు
బహుముఖప్రజ్ఞకుఁ బట్టుఁగొమ్మ
కలుషలతాకుంజములకు గొడ్డలిపెట్టు
గర్వాంధనృపకరి కట్టుఁగంబ

గీ॥ మనఁగ నొప్పారు ధన్యుండవై వగర్పఁ
జనునె ? యేను నీ, వీవు నే నని యెఱుంగు
మింతకంటెను వాక్రువ్వ నేల యనినఁ
జేతులు మొగిడ్చి యిట్లను శిష్యమాళి. 43

శా॥ ఏమో పల్కెదు వింత లంతలుగఁ దండ్రీ ! నాకు నీ యాశయం
బేమో గ్రాహ్యము గాదు బాలుఁడను నన్నేరీతి మన్నింతువో
సామీ! నీపదదాసు నే మనుచు నాజ్ఞాపింతువో తెల్పవే
నామీఁదం గరుణాకటాక్షవిసరన్యాసంబు గావింపవే! 44

కం॥ నన్నొక యుల్పుని నధికవి
పన్నుని నిట్లాడుచునికిఁ బరికింపంగా
నెన్నఁడు లేని భయం బు
త్పన్నం బగుచున్న దొండు వలుకఁగ నేలా? 45

చం॥ అన విని వాని బుద్ధికిఁ దదాశయశుద్ధికి నాత్మ మెచ్చుచున్
మునిజనవల్లభుండు గురుముఖ్యుఁడు సాదరదృష్టి నిట్లనున్
వినుకొనుమీ వృథా పరితపింపఁగ నేటికి ? నే సమాధికిం
జనునపు డాజ్ఞ వెట్టెదను సంశయముల్ విడనాడు మాత్మలోన్ 46

కం॥ తావకవినయవివేక
శ్రీవర్ధనవర్తనంబు సేవావిధియున్
భావమును జూచిగొన్నవి
నా వాచిక తథ్య మింత నమ్ముము సిద్ధా ! 47

కం॥ అనుటయు నడుగులఁ బడు శి
ష్యుని గురుఁ డాశీర్వదించె శుభమస్తని త
క్కినవారుం దమ సందే
హనివృత్తిం బడసి రమ్మహాత్ముని వలనన్ 48

సమాధి కార్య సన్నాహము

వ॥ అట్లు కలంకలు దేఱిన వారి సందఱ నవలోకించి శ్రీముఖరచనా దికంబు లగు కార్యంబులు నిర్వర్తింపుఁ డని దేశికుం డాదేశించె నప్పుడు- 49

సీ॥ శ్రీముఖరచనావిశేషభారంబులు
భరియించి మసలక వ్రాయు వారు
వ్రాసిన లేఖలు వార్తాహరుల కిచ్చి
యమ్మెయ్యి విలాసాల కనుపు వారు
సాగసరి పందిళ్ళ కగు జమాఖర్చుల
పట్టికల్ సంసిద్ధ పఱచు వారు
నేల యీనిన యట్లు నెలకొను జనముల
కనువైన వసతుల నరయు వారు

గీ॥ కాలయాపన సలుపక రేలు పగలు
పెద్దయు శ్రమించియును జిన్న పెద్దపనికి
నేము మేమని మునుకొని యేగువారు
గానవచ్చిరి నాఁడు నల్లపల యందు ! 50

శా॥ ఆకల్పించిరి కాయమానము లదభ్రాభ్రంలిహోదారముల్
ప్రాకట్యాంతరపూర్వభాగముల రంభాస్తంభముల్ నిల్పి రా
లోకోత్సేక మెలర్ప నేర్పఱచి రాలో వేదికాశ్రేణిఁ బ్ర
త్యేకశ్రీకమనీయదీపకళికల్ దేదీప్యమానంబుగాన్. 51

కం॥ శ్రీమద్గురుచరణనిపం
గామలమతి రాఁదొడంగి రంతట నానా
గ్రామాంతరనగరాంతర
సీమాంతరవాసు లైన శిష్యులు భక్తుల్ 52

కం॥ కానుకలు దెచ్చిరి కొందఱు
కానుకలు మునుమున్న పంపి కదలాడిరి వె
న్వెనుకను గొందఱు వారల
పూన్కి యసాధారణం బపూర్వం బయ్యెన్

సీ॥ సముచితమేళతాళములతో గురుచిత్ర
పటము లూరేగించి వచ్చువారు
గురుదేవు జీవితపరమార్థ మిది యని
చెవికింపుగ నుపన్యసించువారు
కాళ్లగజ్జెలు మ్రోయఁగాఁ జిందు ద్రొక్కుచు
జనపదభజనలు సలుపువారు
భావార్థములు సమన్వయ మొనర్చుచునుగా
లజ్ఞానగీతికల్ సదువువారు

గీ॥ క్రిక్కిఱిసియున్న జనములు ప్రక్కఁ గొదుఁగ
గురుని దర్శించి సాష్టాంగ మెఱఁగువారు
స్తోత్రపాఠంబు లొనరించి చొక్కువారు
వేడ్కఁ గూర్చిరి చూపఱు చూడ్కిగమికి ! 54

వ॥ ఇట్టి కోలాహలంబు నొరసి ప్రవేశించిన నవమి నాఁటిరేయి సతీ సుతశిష్య వర్గంబు వలనం బరివేష్టించియున్న గురుఁ డెల్లరం గటాక్షించి ప్రహృష్టాంతరంగంబునై యి ట్లనియె—

కం॥ ఏతత్కార్యభరంబున
రాతురులుం బవలు నిర్విరామశ్రమ పా
లై తిరి మీ రెల్లరు నా
చేతము లోఁగొనుచు నెల్లి చెల్లింపుఁ డిఁకన్ 56

సీ॥ జరుగుఁగాక! సమాధిసన్నిధికార్యముల్
గోవిందు ననుభావభావగరిమ
సపరివారాగతనృపతిపరామర్శ
లగుఁగాక ! పోతులూరయసమీక్ష

నభినవోత్సవసన్నహనము లన్నాజయ్య
పర్యవేక్షణమునఁ బరఁగుఁ గాక !
భోజనసదుపాయములు నిర్వహింపంగఁ
బడుగాక ! బ్రహ్మయ్య పలుకుబడిని

గీ॥ వీరనారాయణమ్మ దీపించుఁ గాక!
పరమపుణ్యాంగనామనస్కరణలీల
నని నిరూపించి పలికి యత్యాదరమునఁ
దనదు దేవేరిఁ జూచి యి ట్లనియె గురుఁడు. 57

కం॥ దేవీ ! మదుపాంతస్థలి
నీ వెడపక వలయువాని నేర్పునఁ గూర్పం
గావలయుఁ గటాక్షనిరీ
క్షావలనముఁ బట్టి శిష్యజనములు నడువన్ 58

వ॥ అని యాదేశించి యనంతరంబు ప్రియశిష్యుం డైన సిద్ధుని యెడం
జూడ్కి నిలిపి— 59

కం॥ వేఁకువఁ జీఁకటిపాటున
నై కటికాటవికి నరిగి నవవికసత్పూ
జాకుసుమంబులు సేకొని
నాకుం బొడసూప వలతు నయతత్త్వనిధీ ! 60

ఉ॥ ఈపని కీవు దక్కఁగ మఱెవ్వరు సాల రరణ్యసీమఁ బు
ష్పాపచయం బొనర్చి నమయంబునకుం బఱతెంతు వం చమే
యాపరిమేయవత్సలత నంపుదు నయ్య ! మదర్థితక్రియో
ద్యాపన మాచరింపుము కృతార్థుఁడ వౌదువు శిష్యశేఖరా ! 61

కం॥ అనవుడు సిద్ధుండును ద
క్కిన యచ్చటివారుఁ దావకీనానుమతిం
జనియెద మనఁ చందంబునఁ
గనిపించి రనల్పభక్తిఁ గయిమోడ్పులతోన్ 62

కం॥ ఆ రే యెవరికి నిద్రా
హారంబులు పట్ట వయ్యె నభినవశుభకృ
ద్వీరేశ్వరనామాక్షర
పారాయణపరిణతాత్మపరవశు లగుటన్ 63

ఉ॥ నిద్దుర కేమి భాగ్య మిఁక నేని స్మరింపఁగ లెండు శ్రీగురుం
దద్దయు భక్తితో ననుచుఁ దక్కటి వారుల నెచ్చరించె నాఁ
డద్దిర ! జాముకోడి, యిరు లల్లనఁ జెల్లుకొనంగ వెల్గులన్
దిద్దెను వేగుఁజుక్క, నలుదిక్కుల కేఁగె విహంగసంఘముల్ 64

సిద్ధుండు పూలకై యరణ్యంబున కరిగి గాలివానల కగ్గ మగుట

గీ॥ అపుడు శిష్యులు కాలకృత్యములు తీర్చి
వార్చి నిర్దిష్టకార్యనిర్వాహణదీక్ష
నుద్యమించిరి, సిద్ధుండు యోగివర్యు
పాదముల వ్రాలి పూలకుఁ బయన మయ్యె 65

ఉ॥ శ్రీగురుదేవు నంఘ్రులు భరించి హృదబ్జమునన్ దదీయసం
జ్ఞాగణనాభివేశమున సర్వముఁ గాంచుచుఁ దన్మయుంబుగా
వేగురుఁ జుక్క చీఁకటిని వెన్కకుఁ ద్రోయుచు నుండ నేఁగినాఁ
డా గుణశాలి పుష్పనిచయగ్రహయాళుకుతూహలంబుతోన్ 66

కం॥ తెలవాఱు సరికి నాతఁడు
నిలిచెన్ నీరంధ్రనిబిడనికటాటవులన్
గలఁగించి పరీక్షింపం
దలఁచెన్ భూతప్రవిష్టతనుఁడై గురుఁడున్ 67

కం॥ గురుఁడు పరీక్షింపఁగ నే
వెరవున శిష్యుండు నిలిచి విరులం గొనునో
యరయుదు నియ్యర్థం బని
చెరచెర రవి యుదయశిఖరి శిఖరము నెక్కెన్ 68

ఉ॥ అప్పుడు దిక్కు లారసి మహా యిది యేమి ! వసంతకాల మం
దిప్పుడు పూవుఁదీవియలు మృగ్యము లయ్యె విరుద్ధ మేమొకో !
యొప్పిదమై కసంబడెడు నుల్లపొదల్ పరికింతుఁగా కటం
చెప్పటి భంగి మున్కొనియె నిద్ధచరిత్రుఁడు సిద్ధుఁ డంతతోన్ 68

ఉ॥ ఎక్కడినుండి తారసిలె నెవ్వఁ డెఱుంగఁగ నోపు గాడుపుల్
గ్రక్కదలించె భూరుహనికాయముఁ గొమ్మలు ఫెళ్లుఫెళ్లనన్
దిక్కులఁ బండుటాకులు విదిర్చెను దుమ్ములు సల్లెఁ గన్నులన్
బ్రక్కల కీడ్చె సిద్ధుని నపారమనోబలసంవిదగ్ధునిన్ 70

కం॥ పరిసరవసుధాధరగ
హ్వరములఁ జొరఁబాఱి ప్రబలవాయువు నిద్రా
పరవశజంతుసమాజముఁ
బురికొల్పుచు వానిఁ గూడి మొఱపము సలిపెన్ 71

గీ॥ అర్కకిరణంబులం గ్రాఁగి యబ్ధిజలముఁ
ద్రావఁ బోయిన జలదసంతానములను
దఱిమి కొట్టెను దిగ్దిగంతముల నుండి
గాడ్పుబలగంబు మిగుల వేగముగ నపుడు 72

ఆ॥ వె॥ గాడ్పు ప్రాపకమున గండరించిన యంబు
ముక్చయంబు ప్రొద్దుపొడ వడంచె;
రాజముద్ర వలని ప్రాప్తి దుశ్శీలుండు
సత్కులంబు నడఁచు చందముననుం ! 73

గీ॥ నిబిడనీరంధ్రధనీరదోన్మేషమునను
గ్రమ్ముకొనిన చిమ్మచీఁకట్ల లోన
దారి చూపుచునున్న సౌదామినులను
మాటి కార్పుచునుండె నమ్మారుతములు 74

గీ॥ ఒక్కపరి ముంచి యెత్తుదు ముర్వి యెల్ల
ననుచు సనవసరాగ్రహంబునఁ గడంగి
వారిధరములు పటపట పండ్లు గొఱుకు
చున్నవో యన నొప్పారె నుఱుము మ్రోఁత 75

కం॥ కలన విజృంభించిన యా
జ్వాలధన్వి ధనుర్విముక్తశరములు పోలెన్
జలజల రాలఁ దొడంగెను
బలపల వాహినులు పాఱ వాఃపూరంబుల్ 76

సీ॥ తృషితధరాకుమారికఁ దన్పు నాకాశ
తరుణి పయోధరధార లేమొ !
నదుల కందింపంగ నుదధి పంపిన మేఘ
సందేశరసబిందుబృంద మేమొ !
ఘనఘనాఘనమత్తగజము పీల్చిన నీరు
చల్లులాడఁగఁ దారసిల్లె నేమొ !
బలుగాడ్పుఁ గ్రొత్తకోడలి చేతిలో మబ్బు
కడవకుఁ జిల్లులు వడియె నేమొ !

గీ॥ క్రతువిముఖమైన క్షితి శతక్రతువు కనలి
పఱచు మేఘాస్త్రముల జలప్రళయ మేమొ !
నాగఁ గ్రమముగఁ బెంపొంది సాఁగి రేఁగి
కురిసె జడివాన ప్రాణుల గుండె లవిసె ! 77

వ॥ అట్టి గాలివానకుం దూలి యడుగు లీడిగిలం బడ బడల్పడి డోలాయమానమానసుండై యతండు— 78

గీ॥ మిట్టు పల్ల మేకం బయ్యె మీఁదు చనఁగ
నెట్టు లోపుదు ? నందందు వృక్షశాఖ
లడ్డుకొని యుండె గాడ్పు త్రోపాడు చున్న
దేమి చేయుదు ? నిఁక మీఁద నేది దారి ? 79

కం ॥ఎప్పటికిఁ దెఱపి గాను నిది ?
యెప్పటికిం గోసికొందు నెడనెడఁ గల పూ
లెప్పటికి నిల్లు సేరుదు
నిప్పటి కీతీరు కాఁగ నేమి కతంబో ! 80

ఉ॥ పూలకు గాఁగ నిచ్చటికిఁ బుచ్చి ననుం బరికింపఁ గోరి యీ
లీల ఘటించెనో గురుఁడు ! లేనియెడం గలఁగించి దైవఁగాఁ
జాలునె యక్కటా ! ప్రకృతి సంయమనాంచితశీలునిన్ ననున్
బాలిశు న ట్లిదేమిటికి నా గురుదేవుని సంశయించితిన్ ? 81

కం॥ న న్నలయించునె గురుఁ డా
పన్నశరణ్యుండు భక్తవత్సలుఁ ? డిట్టి
దన్నము తానై కూర్చినఁ
దన్నిర్ణీతార్థమునకుఁ దడ వగుఁ గాదే ? 82

కం॥ అని కొంత సంచలించియుఁ
దన మనసును నూలుకొల్పి దమిపాదధ్యా
ననిమగ్నుం డయి మునుకొని
చనుచుండె నతండు సుడియు జడిగాడ్పులలోన్. 83

కపటవృద్ధుని విఫలప్రయత్నము

గీ॥ అప్పు డయ్యెడఁ బిఱుదెస 'నాఁగు మాఁగు
మాత్ర మేటికి? నేను ని న్ననుసరించి
వచ్చుచున్నాఁడ సిద్ధుఁడా! పలుక వేల?
యంచుఁ దనుఁ బిల్చు పిలుపు విన్పించుటయును 84

చ॥ అడుగు లిడంగనోడి వడఁకాడుచు నూర్చుచు నూఁతకఱ్ఱతో
నెడనెడ దేహయష్టి యొకయింత కదల్చుచు వంగి క్రుంగు నె
న్నడుమును జేతఁ బట్టి వెడనవ్వులు మీసలు వియ్యమాడ వ
చ్చెడు నొక వృద్ధుఁ గన్గొనియె సిద్ధుఁడు మోము మరల్చి వెన్కకున్

వ॥ అట్లు సమీపించిన వృద్ధునిం జూచి సిద్ధుఁ డెవ్వండ వస్మదీయాభి
ధానంబు సంబోధించి పల్కె తె ల్పెఱుంగుదు వని సతండు వానిం
జూచి— 86

చ॥ ఎఱుఁగుదు నిన్ను నీ గురుని నే నపుడప్పుడు సూచుచుండుదున్
బరిసరవాసి నౌట నిట వచ్చితిఁ గొండొక కార్య మూని నా
చరితకు నేమి గాని యొక సంగతి ని న్నడుగంగఁ గోరుదున్
నిరసనదృష్టిఁ జూడకయు నిల్చి యథార్థ మెఱుంగఁ బల్కుమా!

కం॥ అన విని సిద్ధుం డేమది
వినిపింపుము సత్వరంబ వెడలఁగ వలయున్
బనివడి వచ్చితి నన విను
కొని మాయావృద్ధమూర్తి గురుఁ డి ట్లనియెన్ 88

చ॥ అరయఁగ నీ ముఖాబ్జ మడియాసలఁ గ్రుంకిడి నట్లు దోఁచుఁ దాం
దరపడువాఁడ వూఱకయ దారియు డొంకయు లేని యీ వనాం
తరమున దుర్లభం బయిన ద్రవ్యము రోయుచు నుందు వంచు నే
నెఱిఁగితి నయ్య! నీ తెఱఁగు నెల్లను జూచుచు నున్కి నిచ్చటన్

కం॥ మది డాఁపక చెప్పుము నీ
వెది కోయుచు నున్నవాఁడ వెఱిఁగిన యది యే
నది దారిం జూపుదు ని
మ్మదికనితో నేమి యనుచుఁ బోవకు మోయీ ! 90

చం॥ అనవుడు సిద్ధుఁ డిట్లను దయానిధి మద్గురుదేవుఁ డీ దినం
బునన సమాధియోగమును బూనఁ దలంచి లతాంతసంతతిం
గోవి చనుదె మ్మటన్న నిటకుం జనుదెంచితి నింకుఁ బూఁబొదల్
గనఁబడ వయ్యె నింతటను గాలిదుమారము రేఁగ వానతోన్ 91

కం॥ నీకుం బున్నియ మబ్బును
నాకుం జూపింప వయ్యా ! నవకుసుమలతా
నీకంబులు గల తావుల
నాకాంక్షలు దీర నతిరయంబునఁ జనుదున్ 92

చం॥ అన విని వెచ్చనూర్చి కపటాత్మకుఁ డైన జరాకృశాంగుఁ డే
ననుకొని నట్టు లే జరిగెనా ? యని పల్కఁగ నుల్కి సిద్ధుఁ డే
మనుకొని తీవు తెల్పు మన నాతఁడు వెండియు నీసడింపుతో
మనసున మీఁ దెఱుంగక ప్రమాదమునం బడినాఁడ వక్కటా!93

చం॥ తెఱిమె వనాంతరంబునకుఁ దావక దేశికుఁ డీ నెపంబుతోఁ
దఱి నట నిల్వనీక విరితండము శూన్య మొనర్చె నిచ్చటన్
బరువడి గాడ్పు తోడి జడివాన ఘటించె నిఁకేమి చాలదా!
త్వరపడినం ప్రయోజనము దారొకనునే యిపు డింత యేటికిన్?94

సీ॥ ఆపద సూచి సంతాపంబు వెలివుచ్చి
సమయంబునకుఁ గాని సఖుని యట్లు
పలికించి కుశలవార్తలు పరామరిసించి
క్షుద్బాధ నరయని చుట్ట మట్లు

సాహాయ్య మొనరింతు సాఁగు మీ వని పల్కి
మఱి కానరాని శ్రీమంతు నట్లు
పనిపాటు చేయించుకొని జాలి ప్రకటించి
వట్టి చేతులఁ బంపు ప్రభుని యట్లు

గీ॥ నీ మనస్తాప మెఱిఁగి మన్నింపఁ బలికి
యాస పుట్టించి తుదకు నట్టడవిఁ ద్రిప్పు
కపటగురుదేవు హృదయంబు గాన లేక
తిరుగుచున్నాఁడ వింకను దిరుగు మీవు! 95

కం॥ అన విని సిద్ధుం డేమీ!
మనసున నొకభంగిఁ దలఁచి మద్గురువరుఁ డీ
యనువునఁ గావించిన వాఁ
డనియా? భవదీయనిశ్చితార్థము తాతా! 96

చం॥ చల్లని వాఁడు జ్ఞానమయుసంగతి వాఁడు దురాగతంబు లో
నొల్లని వాఁడు సాధునుతయోగ్యచరిత్రము వాఁడు కూర్మిమై
నెల్లెడ జూచువాఁడు నను నేలినవాఁడు జగద్గురుం డహో!
యొల్లని వాఁ డటంచు నిటు లుత్తలపాటు ఘటింపఁ జెల్లునే! 97

గీ॥ పెద్దవాఁడవు నీవు శ్రీవీరగురుని
నెఱుఁగుదు నటంచుఁ బల్కితి వింత దనుక
నిట్టు లాడంగఁ జెల్లునే యెఱిఁగి యెఱిఁగి
నన్ను నడికింపఁ జూచు చున్నాఁడ వేమి? 98

చం॥ అన విని బోసినవ్వు లొలయం గృతకాద్భుతవేషధారి యి
ట్లను భవదీయమానసదృఢాశయశుద్ధికి మెచ్చు వచ్చె నై
నను దుది నిహ్నవించు గురునాథుని బుద్ధి యెఱుంగ వైతి వే
యునిమెదఁ గోపగింపక యథార్థ మెఱుంగు మొకండు సెప్పెదన్

చం॥ కడపనవాబు స్త్రోల నవికల్పుఁడ వైతిఁ ద్విజాగ్రహార మం
దుడుగక వాదు లాడితివి హుంకృతి తోడను బుట్టెఁ డన్నముం
గుడిచితి వౌఁ గదా ! ప్రకృతి కోర్తల పుచ్చుచునుండ నిందుఁ జే
ర్పడితి వి దేల ? యెచ్చటను డాఁగె మనోబలసంచితార్థముల్ !100

కం॥ వంచింపఁ దలఁప కుండిన
నంచితమతి వైన నీదు నాంతరశక్తిం
గుంచించి కిలంచునె గురుఁ
డించుక యోచింప వైతి వేమి గుణాఢ్యా ! 101

కం॥ లోకంబు గొడ్డు వోయెనె ?
యా కపటిని నమ్మికొనుట లవివేకమ యా
నీ కిఁకఁ బరవిద్య నసం
ఖ్యాకులు సంఖ్యావదగ్రగణ్యులు లేరే ? 102

కం॥ అన విని చాలింపుము నీ
యనుచితవాచికలు పెద్ద వని యిప్పాటం
జన విచ్చి నందులకు ని
య్యనువున మాటాడు వాఁడ వంతియు కాదే ? 103

కం॥ కరుణారసభరితుం డగు
గురుఁ డేమిటి కిడుమఁ గూర్చుఁ గూర్చిన యేనిన్
గరుణించి విడిచి పుచ్చును
విరులుం గాన్పించు నుడుగు పీవలివానల్ ! 104

కం॥ గురు తెలుఁగని వా రెల్లరు
గురు లగుదు రె ? కొలువు మన్నఁ గొలుతురె ? లోకో
త్తరుఁ డైన వీరగురునకు
దొరయే తదితరులు నిన్నుఁ దొట్టిన వారల్ ? 105

సీ॥ వినువీధి నిప్పులు విడురుచు మాత్రాన
బ్రహ్మాస్త్ర మగునె హవాయిచువ్వ ?
తెలిమెఱుంగులు నొక్క తెఱఁగైన మాత్రానఁ
గప్పురసిర మానె యుప్పుఁబలుకు ?
కొనకొమ్మపై నెక్కి కూర్చున్న మాత్రాన
హనుమ యానే వానరాధమంబు ?
పసపుగంరపుఁబూఁత లెసఁగిన మాత్రానఁ
గఱకంఠు హాయ మానె గంగిరెద్దు ?

గీ॥ జడలు గడ్డంబు పెంచి మున్నుడులు గఱచి
నిండుఁదనముగ దండకమండలములు
చేతఁ బట్టిన మాత్రానఁ బోతులూరి
వీరగురుదేవు లగుదురే వెడఁగు గురులు ?

మ॥ గురుదేవుం డొక దోసకారి యని నాకుం దెల్పి చిత్తంబు ని
బ్బర మెల్లం జెఱుపంగఁ జూచెదవు వాహ్వా ! నీ ప్రయాసంబు ల
త్తఱి వమ్మయ్యెఁ గదా ? యెవం డయిన జీతం బిచ్చి పుత్తెంచెనే?
జర పైకొన్న నగణ్యాపుణ్యాఫలవాంఛాబుద్ధి లే దయ్యెనే ? 107

కం॥ అనవసరకాలయాపన
మొనరిచి కొన్నాఁడ నింత కుజ్జ్వలసుమవ
ర్ధనదేశము చూపుదు వనిఁ
చనుమా ! నాతోడ నేల సంవాదంబుల్ ? 108

వ॥ అని యచంచలమనోనిశ్చయంబు తేటపడం బల్కి సిద్ధుండు
పురోగమింప నుంకించుచుండం జూచి యభివృద్ధినిరోధకశక్తియుం
బోని వృద్ధుండు — 109

కం॥ మనసున నామాటలు గై
కొన విప్పుడు పూలు కోసికొని చని దయమీమా
లిన యా గురుని సమాధిం
గని నప్పుడు గాక! చనుము కర్మానుగతిక 110

వ॥ అని పల్కి యతని మనోద్రఢిమ కలరుచు నెందేనిఁజన్నువాఁడురా
బోలెఁ బ్రక్కలకొత్తిగిల్లి యక్కపటనాటకసూత్రధారి తిరోధానుఁ
డయ్యె. సిద్ధుండును మనస్థైర్యంబు మెఱయ గురుధ్యానతత్పరుం
డగుచుఁ గుసుమగవేషణాభిలాషంబున మున్కొనియె. నంత నతనిం
గనికరించె నోయనఁ గారుమొయిళ్లు విరిసె. జడిగాడ్పు లుడిగె
నిడుమ గడసి యూఱడిల్లిన మనంబుం బోలె నినమండలంబు
ప్రకాశించె నప్పుడు— 111

గీ॥ అనుపలబ్ధపదార్థంబు నాసఁ జేసి
విసుగు పుట్టించు బిడ్డను గసరికొట్టి
తల్లి తా నశ్రు లురలు చందంబు గాఁగ
నాకుఁగొమ్మ విదిర్చెఁ బత్రాంబుకణము! 112

సిద్ధుండు పూల మూఁటతో నదీప్రవాహంబు దాఁటి
గృహోన్ముఖుం డగుట

గీ॥ సిద్ధు నాశాలతల్ ప్రకాశించు నిట్టు
లని ప్రకృతి ప్రదర్శించు చున్నది యనంగ
నభినవమనోజ్ఞకుసుమసంహతుల నలరు
వల్లికాపాళి నయనపర్వం బొనర్చె! 113

సీ॥ విచికలనిచయంబు వికవిక నవ్వంగ
నెఱ్ఱగన్నేరు కన్నెఱ్ఱ జేసెఁ !
జేమంతి క్రొంగ్రొత్త సింగారములు దాల్చ
వలపుల నొలికె సంపంగికొమ్మ !
మందారములు మకరందంబు గురియింపఁ
బూదొప్ప నూనెఁ గర్పూరకదళి !
మొగలిపూగములు పుప్పొడి దుమారము రేపఁ
బున్నాగ మామోదమున రహించె

గీ॥ మఱియు నానావిధలతాంతపరిమళములు
గుబులు కొనియెను నలుదెస విబుధనాథు
నందన మనంగ నొప్పెఁ గాంతారవీధి !
సిద్ధు నయనాంచలంబులు చెమ్మగిలె ! 114

గీ॥ పరమగురుపాదపూజ కర్పణ మొనర్ప
మమ్ముఁ గొనిపొమ్మ రమ్మని మంజుమంజు
రీచయంబులు సిద్ధు నర్థించుచున్న
ననఁగ భ్రమరఝుంకారంబు లతిశయిల్లె! 115

వ॥ అంతట నతం డత్యంతసంతోషతరంగితాంతరంగంబునై లతాంత సంతానంబు సంతరించి మూఁట మూఁపునఁ బెట్టి పురాభిముఖుండై త్వరితగమనంబున నరణ్యంబునం దరుగు నవసరంబు నందు— 116

శా॥ ప్రావృణ్ణీలపయోధరప్రబలగర్జాభీతిఁ గుత్కీలకుం
జావాసంబుల డాఁగి యుండిన వరాహవ్యాళశార్దూలఖ
డ్గీవేదండలులాయభల్లుకతతుల్ గీపెటుచున్ వర్షధా
రావిభ్రామము గాంచి వెల్వడి విహారక్రీడఁ గోరాడుచున్ 117

కం॥ సిద్ధుని ముఖతేజస్సం
బద్ధములై సహజజాతివైరము తోడం
గ్రుద్ధములు గాక యొండొరు
శ్రద్ధాసఖ్యముల మసలె సాధువు లగుచున్ 118

వ॥ అట్టి యరణ్యంబు గడచి చనిచని ముందట— 119

మ॥ నురుగుల్ గ్రక్కుచు నన్ను దాఁట వస మానో యన్న తీర్ణా నభం
గురభంగార్భటి నార్చుచుం గడువడిం గూలంబు రాపాడుచున్
బొరలం జొచ్చిన కొండవాగుఁ గని యా పుణ్యుండు కూలారి యే
తరణిన్ దాఁటఁగ నేర్చు దీని నకటా! గాంభీర్యగర్భాకృతిన్ 120

కం॥ ఈ పూలు సకాలమునకు
శ్రీపదసన్నిధికి నెట్లు సేర్చెద నయయో!
నా పాప మిట్టి సెలయే
రై పాఱుచు నున్న దేమి రక్కసనడతోన్ 121

ఉ॥ ప్రొద్దుటఁ జూడ నిందు జలపూరము గానఁగ రాదు వానయున్
గద్దన గాఁగ వెల్లిగొనఁగాఁ జనఁగా నెటు లోర్తు నిప్డు డా
ప్రొద్దును మింటిపై నెగసి యున్నొకని యూడనిబాడు నయ్యయో!
యిద్దురవస్థ నీఁగుటకు నెద్ది యుపాయ మపాయమే కదా! 122

సీ॥ బహుపుష్పవల్లికా ప్రఖ్యాతవనమునఁ
బూలు గాన్పింపక పోవు టేమి?
గాడ్పు తోడ్పాటుతోఁ గరము విజృంభించి
కుండపోఁతగ వాన గురియు టేమి?
ముదుకండు వచ్చి నా కిదియుది వాక్రుచ్చి
కాలంబు వృథయుగఁ గడపు టేమి?
జలమయం బగు నిర్ఝరి దారి కడ్డమై
పులి వోలె నన్నిందు నిలుపు టేమి?

సీ॥ గీ॥ యొకటి రెండైన నెవఁడేని నోర్వఁ గలుగు
నడుగు గదిపిన బాధలే యగున యేని
బ్రదుక నేర్చునె యెంతటి బలియుఁడైన
పడిన శ్రమ మెల్లఁ దుదకా నిష్ఫలము నయ్యె! 123

మ॥ ముదుకం డాడిన యంతవట్టు నిజమో! పుష్పాళికిం బంపి నా
కిది యిచ్చోట ఘటించెనో గురువరుం గేనెట్లు పోనేర్చెదన్?
దుది నాపై నెపపెట్టి తా నరుగునో దోదూయమానంబుగా
మది నారాటము పుట్టసాఁగె నిపు డున్మాదంబు పైకొన్నటుల్ 125

మ॥ అని నిట్టూర్చి యతండు వెండి యిది బ్రహ్మశ్రీప్రభావంబ త
ద్ఘనసంకల్పబలంబు గాని యెడలం గట్టా! వికల్పంబు గ
ల్గునె నాబుద్ధి కొకప్పు డేనియును? సంకోచంబు లింకేల? వృ
ద్ధుని రూపంబున వచ్చి నాతఁడును దద్యోగీంద్రుఁ డౌనౌఁజుమా!

మ॥ తన పాదార్చనచింతతోఁ గుసుమసంతానంబు తేరంగ వ
చ్చిన నన్నీగతి దేశికేంద్రుఁ డలయించెం గాక నాకా విమ
ర్శన మేలా? తదనుజ్ఞ సేయుటయ కర్తవ్యంబు నా ధర్మ మే
నొనరింపన్ మునుకొందు నంచు నతఁ డుద్యోగించి భావంబునన్ 126

శా॥ కోలం ద్రిప్పుచు నాలమేపుచు వనిఁ గోపాలబాలుండుగా
లీలల్ సూపుచు నుండి భావితరముల్ మేల్కొంగఁ దాల్కొడియై
కాలజ్ఞానము గల్గఁజేసి వెలుఁగుల్ కల్పించి నాఁ డెవ్వఁ డా
బాలబ్రహ్మమహోదయంబు హృదయాబ్జాతంబు బోధించుతన్

శా॥ భుగ్నభ్రూకుటిమాత్రతఁ దూలఁగొనియున్ బోకార్చి వారించి చో
రాగ్నిస్ఫోటకశక్తిసారములు సాహంకారబుద్ధుల్ భయో
ద్విగ్నుల్గాఁగ ననుగ్రహించు నదియా ప్రేయశ్శుభోదర్కదృ
గ్లగ్నబ్రహ్మవరాశిషంబు దృఢదీక్షావంతుఁ గావించుతన్ 128

శా॥ రక్షోభూతపిశాచసంహతికి నిర్బంధంబు లార్తప్రజా
రక్షాభిక్షులు సత్కృపాపరతయుం బ్రత్యక్షసాక్ష్యంబు ల
ధ్యక్షస్థానము లద్భుతంబులకు నే యార్యావలోకంబు లా
సాక్షాద్బ్రహ్మకథాసుధారసము లాస్వాదింతు నిష్టార్థినై 129

శా॥ ఆధివ్యాధిజరాకృశాత్ములకు సేవ్యం బైన దివ్యౌషధం
బాధారం బపమృత్యుసంశయభయవ్యాపన్నలోకాళికిన్
బాధేయం బణిమాదిసిద్ధులకు యద్బ్రహ్మణ్యనామంబు త
త్సాధుబ్రహ్మపదాంబుజాతములు నా స్వాంతంబున న్నిల్చుతన్

శా॥ రారాజన్నిజనిర్మలాశయముతో రంజించి లోకంబు సం
సారాబ్ధిం దరియించి బ్రహ్మరథసంచారక్రమోద్భాసిము
ద్రారూఢిన్ సశరీరశాశ్వతపరబ్రహ్మంబునై యొప్పు శ్రీ
వీరబ్రహ్మసమాధిసన్నిధిసమావేశంబు నా కబ్బుతన్ 131

వ॥ అని యాపన్నివారణ ప్రవణ గురుధ్యానధారణంబునం జేసి గజా
గ్రోహణంబు వడసి నట్లుబ్బుచు భయభీతు లెఱుంగక గభీరనీరావర
ణంబు డిగ్గ నుఱికె నతం డదది గురుని కరుణారసప్రవాహం బని
భావించెనేమొ! కాకున్న నిట్లు తెగించునే యని జగచ్చక్షు వంత
రిక్షంబు నందుండి నిరీక్షించుచుండె నప్పుడు— 132

కం॥ అది యెట్టి చిత్ర మాతని
పదములు గ్రుంకిడక నేలపైఁ బలె నీటం
గదలాడె; గురుని మహిమయొః
యిది శిష్యుని శక్తియో! గ్రహింపం గలమే! 133

గురుదేవుండు సమాధిం బ్రవేశించుట

వ॥ ఇట్లతివిచిత్రంబుగా నిర్ఝరి నిస్తరించి యతం డిదియెల్ల గురుని
కరుణావిశేషం బని సంతసిల్లి త్వరితగమనంబు మెఱయం బఱ

తెంచుచుండె. నింక నట కందిమల్లయ పురంబునం దుత్సవాది కంబులు నిర్వర్తించి సిద్ధ నాగమనంబు ప్రతీక్షించుచుండి. రట్టి యెడ గురుం డెఱుంగని వాని పోలె సతీసుతశిష్యవర్గంబు నుప లక్షించి యిట్లనియె— 134

ఉ॥ కాల మతీత మయ్యె శుభకాలము చేరువ యయ్యె నయ్యయో !
పూలకు నేఁగి రాఁడు గుణపూర్ణుఁడు సిద్ధుఁడు వాని లేని యీ
వేళ కళావిహీనముగ వేదన గూర్చుచు నున్న దాఁగఁగాఁ
బోల దిదిట్టు లౌననుచు బుద్ధిఁ దలంపక పోయితిం గదా ! 135

శా॥ నా పాదార్చనమే స్వధర్మముగ నానందించు శిష్యుండు నా
రూపం బందుఁ జరాచరప్రకృతి నారోపించు సద్భక్తుఁ డా
జ్ఞాపింపం బెనువాక దూఁక నయినన్ సంసిద్ధమౌ సిద్ధుఁడా
హా ! పుష్పంబుల కేఁగి వేగిరము రాఁ డాయెంగదా వేళకున్ ! 136

ఉ॥ ఇంతకు వాని ప్రాప్త మిది యిట్టుల నుండఁగ మీరు నేనునుం
జింతిలినం బ్రయోజనము చేకుఱఁబోవ దనంతరక్రియా
సంతతి నిర్వహింపుఁ డికఁ జాటున కేఁగుదు నంచుఁ బల్కఁగా
నాంతరభంగి నచ్చటి జనావళి యెంతయుఁ ద్రొక్కులాడుచున్ 137

సీ॥ శిష్యాగ్రగణ్యుండు సిద్ధుండు రాకుండ
గురుఁడు సమాధికి నరుగు నేమి !
అపు డనంగాఁ జన్నయతఁ డింత తడయంగ
హేతు వే మనుచు నూహింప వచ్చు !
శ్రమపడి నంతమాత్రనె ప్రయోజన మున్నె
ప్రాప్తంబు లేకున్న ఫలము గలదె !
అయినను నొకకొంత యరయక గురుదేవుఁ
డింత వేగిరపడు టేమి తుదకు !

సీ॥ గీ॥ ననుచు లోలోనఁ దలపోసి గంతె కాని
కొంచె మూఁగు మటంచు వేడ్కొనఁగ లేరు
పెద్ద లని పేరు వడసిన పిదప వారి
కెదురు వలుకంగ నేర్తురే యెందు నెవరు ? 138

కం॥ అప్పుడు గోవిందాంబిక
యప్పరతత్త్వార్థవేది నారసి వినయం
బొప్పఁగ నిట్లను సిద్ధుం
డిప్పాటికి వచ్చుచుండు నిచటికి దేవా ! 139

గీ॥ ఆతఁ డరుదెంచు నందాఁక నాఁగి యతని
చేయు పాదార్చనంబును జిత్తగించి
దీవన లొసంగి చనఁగఁ బ్రార్థించు దాన
నన్ను మన్నింపు మిట్లాడు చున్న దనక 140

మ॥ భవదాజ్ఞాపన మొక్క వ్రేల్మిడి ఘటింపం జూచువాఁ డిట్లు తా
నవివేకంబున నేల రాక మసలున్ ? వ్యాఘాతముల్ కల్గెనో !
యవలోకింపఁగ నయ్యె నాదెసఁ బయోదావేశ మిందాఁక నా
ర్జవ మయ్యెం జపలాలతాకలితగర్జాతర్జనోజ్జృంభముల్. 141

శా॥ తల్లిం దండ్రినిఁ బాసి రోసి నిజబాంధవ్యంబు యుష్మత్పదం
బుల్లం బందున నిల్పికొన్న ప్రియశిష్యుం డాతఁ డిప్పాట రా
నొల్లం డంచుఁ బరిత్యజింపఁ దగునే ? యోగీంద్ర ! నా బిడ్డలం
దెల్లన్ యోగ్యుఁడు తద్విషణ్ణవదనం బెబ్బంగిఁ జూతుంగటా ! 142

కం॥ అన విని గురుఁ డింతి మొగం
బునఁ జూడ్కులు నిలిపి నగవు మొలతేరఁగ ని
ట్లను దేవీ ! నీ వని న
ట్ల నిజం బగు నైన మూర్త మాపం దగునే ? 143

కం॥ సమయ మమూల్యము దాసిని
గమనింపక కాలవిదువఁ గ్రమ్మఱ గగుటన్
విమలాత్మ్మఁ డైన సిద్ధుని
శ్రమ మెఱఁగియు సమయగతివశంవదుఁ డైతిన్ 144

వ॥ అని కలయుం జూచి వెండియు గురుండు— 145

గీ॥ అతసపై నాకు వాత్సల్య మధిక మగుట
యెల్ల రెఱిఁగిన మాటయే! యింత యేల?
వలయు వానిని నిట సిద్ధపఱచు చుండుఁ
డింతలో నాతఁ డరుదెంచు నేమొ! యనుచు 146

కం॥ గోవిందాచార్యుఁడు పిత్రు
దేవున కంజలి ఘటించి దేశికముఖ్యా!
నా వలన క్షమింపు మతం
డా వేళకు రాకయున్న నరయమి గాదే! 147

శా॥ అన్నా! నీవును మిన్న కుండితివె? యభ్యర్థింపఁగా నోపవే
యన్నన్నా! యని నీ సమాధి కడ దుఃఖాశ్రుప్రపాతంబుతో
నన్నుం జూచుచు నంగలార్చు సమయానన్ సిద్ధు నోదార్పఁగాఁ
దెన్నెమో? సెల విమ్ము నాకు సుగుణాబ్ధీ! యోగిచూడామణీ! 148

కం॥ అన విని చిఱున వ్వొలయఁగ
నను నిమ్మయి దేశికేంద్రుఁ డతనికి నీ వి
ట్లనఁ జెల్లునె? శుభసమయం
బని యెఱిగియు మొఱఁగి చను టనర్థము గాదే! 149

చం॥ తఱి కతఁ డేఁగుదెంచిన వితాకుపడం బనిలేదు రానిచో
గురుఁడు ప్రతీక్ష సల్పి కడకున్ భవికక్షణికంబు మిక్కిలిన్
దఱియుట నేఁగి నాఁడని యథాగతిఁ దెల్పి మహంతిమోక్తిగాఁ
బరువడి నందఁ జేయు మిటు వానికి సద్గుణరత్నఖానికిన్ 150

శా॥ "నీకుం దెల్పితి నెల్ల ధర్మములు నాకీ భేదమే లేదు క
న్నాకై నిల్చి యతీంద్రియప్రతతి నాజ్ఞాపించు ధన్యుండవై
నా కీర్తిప్రభ లిన్మడింపు మెటనున్నం గాని దీవించి నీ
యాకాంక్షల్ ఫలియింపఁ జేసెదను సిద్ధా ! శిష్యచూడామణీ !"

వ॥ అని సిద్ధు నుద్దేశించి పల్కి వెండియు గుహసం డచ్చటి వారి నవ
లోకించి కర్తవ్యంబులు నిర్వర్తింపుఁ డని పల్క వారును గలంకెలు
దేఱి సిద్ధుని భవితవ్యంబు ప్రాప్తార్థంబునకు దిగవిడిచి తదనుగుణ
క్రియావిశేషంబులు నిర్వర్తించి రంతట— 152

సీ॥ రంగవల్లికలు దీర్పంగఁ గూఁతు రిల్లాలు
కుంకుమద్రవ్యాది గుస్తరించె
జ్యేష్ఠాత్మజుండు ప్రోక్షింపఁ గమండలు
జలము తత్సహజు లక్షతల నిడిరి
బ్రహ్మాయప్రముఖులు ప్రసవంబు లునుప న
న్నాజయ్య పఱచెఁ గృష్ణాజినంబు
ధరణీతలేశ్వరుల్ బిరుదులు పడువంగ
జయవెట్టి రఖిలశిష్యప్రశిష్యు

గీ॥ లాకసం బంటె సకలవాద్యముల రవళి
భూతిరేఖలతో జటాస్ఫూర్తి తోడ
దివ్యరుద్రాక్షమాలికాదీప్తి తోడ
గురుఁడు సాక్షాత్కరించె శంకరుఁడు వోలె ! 153

గీ॥ అట్లు సాక్షాత్కరించి 'రాఁడాయె నింక
సిద్ధుఁ' డని వెచ్చనూర్చి, యాశీర్వదించి
యెల్ల జనముల, నుజ్జ్వలత్ఫుల్లవదన
వారిజుండై ధరిత్రిగర్భమున కరిగె. 154

గీ॥ అరిగి పద్మాసనాసీనుఁడై గురుండు
యోగనిద్రానిరూఢి నిశ్చయుండు గాఁగ
నలరువానలు గురిసె వాద్యములు మొఱసె
భూరిఘంటావిరావముల్ భోరుకొనియె ! 155

చం॥ తొలఁగని భక్తిభావములతోఁ గయిమోడ్పులతో సమాధికిన్
నలగొని రెల్లవారుఁ దొలిపట్టి శ్రుతిస్మృతిసూక్తమంత్రఘో
షలు జయనాదముల్ వొలయ సాఁగి నమస్కృతు లాచరించి ని
శ్చలమతి, దత్కవాటముల జంటశిలల్ గదియించి భక్తితోఁ 156

గీ॥ మంత్రపుష్పంబు వెట్టె సమాధి మీఁద
బహువిధనివేదనంబులు ప్రసవసమితి
రాశిగొనె నంత దివ్యనీరాజనంబు
వినయభరమున నెత్తె గోవిందమాంబ 157

సిద్ధుని నిర్వేదము

గీ॥ అప్పు డయ్యెడ సిద్ధుఁ డాయాసజనిత
ఘర్మసలిలంబుతో నడికట్టు తోడ
బుజముపై నున్న పూవుల మూఁట తోడ
వచ్చి పడియెను గన్నూడి పడిన యట్లు ! 158

కం॥ వానిఁ గని వివర్ణానను
లై నిల్చిరి చేష్ట లుడిగి యఖిలజనంబుల్
పూనిన నివాళి పళ్ళెము
మానవతీబాష్పజలసమన్విత మయ్యెన్ 159

కం॥ నివ్వెఱఁగొని సిద్ధుండును
బువ్వుల నటడించి యామె మోమరసి గురుం
డెవ్వలనఁ గలఁ డనంగా
నవ్వలనికిఁ జూడ్కివఱపె నా సతి వెతతోన్ 160

కం॥ అది సూచి హా! యిదే మని
గుదిగొను హృదయమున నతఁడు కూలంబడియెన్
మొద లంట నఱికి విడిచిన
కదళీతరు వటు సమాధి కడ నయ్యెడలన్ 161

కం॥ అది గని శీతలజలములు
వదనమునం జల్లి యువటి వారలు దేర్పన్
గదలాడి మగుడి సిద్ధుం
డెదఁ గదిరిన వగవు తోడ నిట్లను గురునిన్ 162

సీ॥ శరణన్నచోఁ దన కరసరోజము సాఁచి
పాదాభివందన మాదరించెఁ
గుటిలావనీశుని కొలువుకూటంబున
కరిగి రమ్మని నన్ను ననుమతించె
నెరియించు నుదరాగ్ని కింధనం బగు వేళ
శక్తిసారము లిచ్చి భోక్తఁ జేసె
నష్టాంగయోగవిద్యారహస్యార్థంబు
లడిగిన యవసరం బందు నిచ్చె
గీ॥ భక్తిరసభావపుంభావ! భాసమాన
సిద్ధసంకల్ప! యని నన్నుఁ జేరఁ బిలుచు
గురువరేణ్యుని కడసారి దరిసెనంబు
వడయఁ జాలని పాపంపుఁ బొడవ నైతి! 163

వ॥ అని యొక్కింత తడ వాఁగి గురు నుద్దేశించి వెండియు నతండు—

చం॥ నను భవదీయదివ్యచరణమ్ములు నమ్మి భజించు వాని నే
మని దిగనాడి పోయితి వయా! తుది దర్శన భాగ్య మందఁ జా
లని దురితంబు గంటిని విలంబ మొనర్చిన వాఁడ నంచు నె
మ్మనమున నాగ్రహించితివొ? మానికులాభరణంబ! పల్కవే! 165

గీ॥ గాలివానలు పెనువాఁక క్రమ్ముఁజేతి
యడ్డగించుట నాలస్య మయ్యెఁ గాక
యెన్నఁ డేనియు మీ యాజ్ఞ కెంత తడవు
చేసి నాఁడనె? యెఱుఁగవే సిద్ధ నీవు? 166

ఉ॥ తల్లియుఁ దండ్రియున్ గురువు దైవము నీవని చీఁకటింటిలోఁ
ద్రెళ్ళఁగ నీక ప్రోతు వని దీనుల పాలిటి దిక్కు వంచు నా
యుల్లము నందు నమ్మికొని యుండుదు నిక్కట! గంపెఁ డాసతో
నెల్లర లోన నింక మొగ మెత్తఁ గలాఁడనె? దేశికోత్తమా! 167

ఉ॥ నాగతి యే మటంచుఁ గరుణాజనకంబుగ వేఁడగాఁ గృపా
సాగర! నాఁడు తుట్టతుది సర్వముఁ దెల్పెదు నంచుఁ బల్కవే?
యీగతిఁ బూల కంపి తగునే దయమాలి సమాధిఁ జేరుటల్!
నాగతి యేమిగాఁ దలఁచినాఁడవు సత్యపదార్థవర్ధనా! 168

సీ॥ వినుతించెనో లేదొ! మునుపు కుష్ఠవ్యాధి
పీడితద్విజునిఁ గాపాడి నావు
ప్రార్థించిరో లేదొ! యగ్రహారద్విజ
శ్రేణికిఁ గృపఁ గటాక్షించి నావు
వేఁడిరో లేదొ! శిల్పిబ్రాహ్మణజనంబు
నంచితమతి నాదరించి నావు
మొఱపెట్టిరో లేదొ! మూర్ఖచోరకులంబుఁ
జేరంగఁ దీసి రక్షించి నావు

గీ॥ దీనజనపాలనంబున దీటు లేని
వాఁడ వని పేరు వడసిన వాఁడ వీవు
చిన్ననాఁటను గోలె నీసేవ చేసి
కాచుకొని యున్న నన్నేల కరుణఁ గొనవు? 169

కం॥ శ్రమపడి కొనితెచ్చిన పు
వ్వము లేమి యొనర్పవలయు సద్గురువర్యా !
శ్రమమున కిది ఫలితంబా ?
శ్రమజీవుల మనుగడలు విషాదాంతములా ? 170

చం॥ ఇది నిజమా ? యబద్ధమ ? సహింపఁగ రాని దొసంగుఁ గంటివా ?
మది తెలియంగఁ గోరి క్షణమాత్ర మిటుల్ ఘటియింప నుంటివా ?
విదిత మొనర్పు మయ్య ! నిను వేఁడుదుఁ జేతులు మోకరించి నా
హృదికి నయోమయం బగు పరిస్థితి నేల ఘటింతు వయ్యయో !

వ॥ అని పెక్కు తెఱంగులం బొక్కి చెక్కుల దిగజాఱు బాష్ప
పూరంబులు కొనగోరం దుడిచికొని గురుపత్నీసుతశిష్యవర్గంబు
నతిదీనంబుగా నవలోకించుచు నెలుంగు రాల్పడ నతం డి
ట్లనియె — 172

శా॥ ఏ నేపాప మొనర్చినాఁడ నని తా నీరీతి వేధింపఁగాఁ
బూనెన్ శ్రీగురుదేవుఁ డక్కటకటా ! పుణ్యాత్ములు మీరు దీ
నానాథుం డగు నాకుఁగా గురువరుం బ్రార్థింపరే ? నిల్పరే ?
యీ నిర్భాగ్యుని మీఁద మీకు దయలేదే ? యెంత శోచ్యం బిసీ!

కం॥ అన విని గోవిందాంబిక
కనుఁగొలఁకుల నశ్రుజలము గడలుకొనంగా
నను నప్పుడు "ప్రార్థించితి
మనఘా ! గురుదేవు నీకునై నిలు" మనుచున్ 174

ఉ॥ కాల మతీత మయ్యె శుభకాలము చేరువ యయ్యె నంచు రాఁ
జాల వటం చెదు ళ్లరసి సంయమి యోఁగె సమాధి కేఁగుచున్
జాలిగ వెచ్చనూర్చె నిను ఛాత్రవరేణ్యునిఁ గాన కున్కి నీ
పాలిటి ప్రాప్త మిట్టి దని భావన సేయు మిఁకేల పుత్రకా ! 175

వ॥ అనె నప్పుడు గోవిందయాచార్యుండును వానిం జూచి — 176

శా॥ "నీకుం దెల్పితి నెల్లధర్మములు నానీ భేదమే లేదు క
న్నాకై నిల్చి యతీంద్రియవ్రతతి నాజ్ఞాపించు ధన్యుండవై
నా కీర్తిప్రభ లిన్మడింపు మెటనున్నం గాని దీవించి నీ
యాకాంక్షల్ ఫలియింపఁ జేసెదను సిద్ధా ! శిష్యచూడామణీ !"

కం॥ అని తుది సందేశము నీ
కు నొసంగె గురూత్తముండు కుతిలపడంగాఁ
జనునయ్య ! నీవు సామా
న్యుని పోలిక ? దిటవు పూని యూఱడు మనుజా ! 178

కం॥ అన విని తలవాంచి సమా
ధినిఁ జేర్చి యొకింతతడవు తెక్కలిపాటుం
గొని వెచ్చనూర్చి సిద్ధుఁడు
కను లశ్రుసమన్వితములుగాఁ గనుఁగొంచున్ 179

కం॥ ఒకకొంత చూడ కుండఁగ
నకటా ! నెపపెట్టి చనుట న్యాయంబె ? కకా
వికలౌట నీ వెఱుంగవె !
సకలజ్ఞా ! వనము లోన జడిగాడ్పులకున్ 180

ఉ॥ కాశిక లోని లింగమును గైకొని యెంతకు రాఁ డటంచు నా
శాశలు సూచి సూచి పవనాత్మజునిన్ నెపపెట్టి సైకత
శ్రీశివలింగముం జలిపి శ్రీరఘురాముఁడు కొల్చి నట్లుగా
దేశికముఖ్య! నీ వరిగితే? తుది నాపయిఁ బెట్టి దోసమున్ 181

శా॥ కాలాతీతుఁడ వెల్లకాలగతి నాఁకట్టంగ శక్తుండవున్
గాలజ్ఞానతపోధనుండవు కటా! కాలం బతీతం బటం
చాలస్యం బొనరించి నాఁ డనుచు సవ్యాజంబుగా నేర్పుగా
నాలీలం జనినాఁడ వీ జనము లౌనౌ నంచుఁ జేయొగ్గఁగన్! 182

కం॥ 'నమ్మించి గొంతు గోయుదు
రిమ్మహి జను' లంచుఁ బల్కవే కాలజ్ఞా
నమ్మున నీ, వది తార్కా
ణమ్ముగఁ జేసేఁతఁ జేసినాఁడవు దేవా! 183

మ॥ చిననాఁటంగొలె నీ పదాబ్జయుగళిన్ సేవించుచున్నట్టి సి
ద్ధుని నన్నీగతి ముంచి నందులకు సంతోషింపగాఁ బోకుమా
నిను నిం కెవ్వఁడు నమ్మి కొల్చు నిలపై? నీ సచ్చరిత్రంబు మా
యని మచ్చం గలుషీకృతం బగుట తథ్యం బాత్మవిద్యానిధీ!

మ॥ తలిదండ్రుల్ వల దన్న జాతి మరియాదల్ తప్ప నేలంచు బం
ధులు నిందించిన నిష్టభోగముల సంతోషింపుమా యంచు మి
త్రులు బోధించిన లెక్కసేయక భవత్పూజాసమాసక్తని
ర్మలచిత్తంబున నున్న నా కిది ఫలంబా? వీరయోగీశ్వరా! 185

మ॥ ధనధాన్యంబులు గోర లేదు భవనోద్యానంబు లాసింప లే
దనవద్యం బగు కీర్తి నిమ్మనఁగ లే దర్థింపఁగా లేదు వా
హనముల్ వస్తులు నమ్మినందులకు నెయ్యంబార నీక్షించి దీ
వన లిమ్మంటిని దాని కింత మొగదప్పం గారణం బేమయా! 186

సీ॥ అడవికి నేఁగిన యపుడ పుష్పంబులు
గానరా కున్కికిఁ గారణంబు
నుఱుములు మెఱపులు తుఱఁగలింపంగ నా
సారంబు పయికొన్న కారణంబు
వృద్ధుని రూపుతో నీ తెంచి నీవట్లు
కాలంబు గడపిన కారణంబు
వనినుండి వచ్చుచోఁ బె ుఁవాఁక రానీక
కలఁత చేకూర్చిన కారణంబు

గీ॥ తెలిసికొన్నాఁడ నిపుడు సందేహ మేల?
యిట్టివాఁడవు నన్నుఁ జేపట్టనేల?
యపుడు గాదన్న వాఁడ వన్నట్టు లుండి
మూదలించిన నాచావు నాది కాదె? 187

సీ॥ కడపనవాబు ని న్నెడమాట లాడిన
సైరింపఁ జాలక తారసిల్లి
అగ్రహారద్విజు లపలాప మొనరింప
వాగ్యుద్ధమునకుఁ దీవ్రముగఁ గడఁగి
నంద్యాల పంచాననబ్రహ్మవంశ్యులు
పెట్టిన కూడెల్ల నట్టె మ్రింగి
ఘోషభీషణముగఁ గొండవాగడ్డమై
నిలిచిన నుంత భీతిలక దూఁకి

గీ॥ యెంత చేసిన నేమాయె ? నింత కీవు
కనికరం బూన కుండిన కారణమున
బ్రతుకు నవ్వుల పా లయ్యెఁ బరమదేవ !
గ్రుడ్డినమ్మిగ నూతిలోఁ గూలఁ బడితి ! 188

కం॥ అని గురుదేవుని నెప మిడి
వెనుకాడక తూఱినాడు విధమున్ విని యా
తని నవ్వుఁగా దన రెవ్వరు
మనసుల ద్వంద్వార్థగతులు మల్లడి గొనియెన్. 189

వ॥ అంత నతండు నిట్టూర్చి సమాధి పయిం జూడ్కి నిలిపి — 190

మ॥ అయయో! పాపము మూఁటఁ గట్టికొనఁగా నయ్యెంగదా నాకుఁజి
న్మయమూర్తిన్ గరుణాసముద్రు నిను నిందాగర్భితుం జేయుటన్
సయిరింపం గదవే భవత్పదయుగీసంసేవనాసక్తు నిం
ద్రియసంరంభవశంవదాత్మగతునిన్ దీనాతిదీనున్ ననున్ 191

ఉ॥ ఎచ్చట నేమి చేసినను నే నది నీ కరుణాకటాక్షముల్
నిచ్చలు వెన్నుఁ గాచుకొని నిల్చుటఁగాదె? నిజాభిమానపుం
బిచ్చితనాన నిందనుకఁ బ్రేలితి లెంపలు వేసికొందు నీ
యిచ్చకు వచ్చినట్టు లలయింపుము నా తను వప్పగించుదున్ 192

ఉ॥ అన్నము పున్నె మే నెఱుఁగ నన్నిటి కీవ ఫలప్రదాత వీ
తెన్నునఁ బొమ్మ టన్న వెనుదీయక పోవుదె నాదు ధర్మ మా
పన్నుఁడ నాశ్రితార్తుఁడను బాలుఁడ దిక్కఱి యున్నవాఁడఁ జి
త్సన్నుతగాత్ర! యొక్కపరి పర్శన మిమ్ము కృతార్థుఁ డయ్యెదన్

వినిపింపదా? నీకు వినమితముఖుఁడైన
సిద్ధు నాలాపంబు సిద్ధపురుష!
కనిపింపదా! నీకు ఘనతరవై వర్ణ్య
భరశిష్యవదనంబు గురువరేణ్య!
పలుకవా? నాతోడఁ బలికిన నీనోటి
ముత్యాలు రాలునా? సత్యవచన!
చూడవా! నావంకఁ జూడ్కులు నిగుడించి
కారుణ్య భరమునఁ గమలనేత్ర !

సీ॥ గీ॥ యేను జేసిన పాతక మేమి చెపుమ?
వలసె నేనియు గుండియ వ్రచ్చి యిత్తు
నింక సందేహ మేల యోగీంద్రచంద్ర!
రమ్ము నాచేయు పాదార్చనమ్ము గొమ్ము! 194

గీ॥ శ్రమ మనక షోడశోత్తరశతసహస్ర
పుష్పముల నేరికోరి నీపూజ కొఱకుఁ
దెచ్చినాఁడను దేవాదిదేవ! రమ్ము
స్వీకరింపుము కరుణావిపాకదృష్టి 195

కం॥ అని భక్తిభరాశ్రులు చె
క్కున జాల్కొనుచుండ వేఁడికొను నాతనిఁ గ
న్గొని తన్మయతం బొందిరి
జను లందఱు నధిక మైన జాలింగొనుచున్ 196

గీ॥ సిద్ధుఁ డేకాగ్రభావవిశిష్టబుద్ధి
మఱియు నిట్లను నో జగన్మాన్యచరిత!
యేల కరుణింప వయ్యా! నన్నేల నిప్పు
డింత భరమైతి నయ్యయో! యేను నీకు! 197

మత్తకోకిల॥ ఏల జాలము సేయ నిమ్మెయి నీవు నిక్కము పల్కుమా!
చాలుఁజాలును బింక మేటికి? స్వామి! కూరిమి చిల్కుమా!
బాలిశుండను బాదపద్మము పట్టినాఁడను దేవరా!
కాలయాపన సైపఁ జాలను గావరావె శుభంకరా! 198

శా॥ రావా! దర్శనభాగ్య మీవ! కుసుమార్చాభంగి మన్నింపవా?
దీవింపం దలపోయవా? కరుణమై దీనుం గటాక్షింపవా?
యీ వైముఖ్యము నేల పూనితివి? నిర్హేతుప్రతీపస్థితిన్
దేవా! దీనజనావనా! ప్రణవమూర్తీ? వీరనారాయణా! 199

### కందగీతగర్భ చంపకమాల

*చం॥ వరకరుణానిధీ! సుగుణభాసురవర్తన! శోభనాంగ! సుం
దరవదనా! మహానియమధర్మపరాయణ! నిర్మలాత్మకా!
యరవిరిచాద్యులం గొలిచి యంఘ్రిరజం బిడుకొందు నెత్తిఁ గిం
కరవరదా! సమాదరవికాసవిలోకనఁ దన్పు మయ్య యోః 200

వ॥ అని భక్త్యావేశంబును దదీయదర్శనాభిలాషంబును నతిశయింపం బ్రస్తుతించియుఁ బ్రార్థించియుఁ బ్రయోజనంబు లేమికి వగచి యెట్టకేనియు నతండు గురు నుద్దేశించి— 201

చం॥ త్రికరణశుద్ధిగా గురువరేణ్యుని నిన్ను భజింప సాఁగి నేఁ
టికిఁ బదిరెండు వర్షములు, డెంకము కొందల మంద నిప్పుడే
మొకమున నింటికిం జనుదుఁ? బుణ్యమొ పాపమొ నిర్ణయింపఁగా
నొకళులు భావికాలమున నుందురు! కీర్త్యపకీర్తు లుండవే! 202

---

### గర్భకందము

* కం॥ కరుణానిధీ! సుగుణభా
సురవర్తన! శోభనాంగ! సుందరవదనా!
విరిచాద్యులం గొలిచి యం
ఘ్రిరజం బిడికొందు నెత్తిఁ గింకరవరదా!

### గర్భగీతము

గీ॥ సుగుణభాసురవర్తన! శోభనాంగ!
నియమధర్మపరాయణ! నిర్మలాత్మ!
కొలిచి యంఘ్రిరజం బిడుకొందు నెత్తి
దరవికాసవిలోకనఁ దన్పు మయ్య!

సీ॥ మధుకరప్రేమాభిమానపాత్రము గాని
నామమాత్రం బైన హేమ మేల ?
నవవసంతోత్సవానందంబు నందని
విరజాజి కొమ్మకుఁ బరువ మేల ?
పరమేశ్వరార్చనాభాగ్యంబు వడయని
మొగలిరేకునకు నామోద మేల ?
భువనబాంధవపాదమూలంబునకుఁ గాని
కలువకు జీవనగమక మేల ?

గీ॥ పరమగురుదేవ ! నీ పాదపద్మములకు
దూర మగునట్టి నాయీ శరీర మేల ?
పరువ మేల ? ప్రాపక మేల ? బ్రతుకు నేల ?
హృదయపుష్పాంజలి గ్రహింపు మింక నీవు ! 203

మ॥ కదలింపం గలరా ? సమాధి ముడుఁగంగా న న్నొక ళ్ళంచు నీ
వెద నూహించితి వేము ! నా హృదయ మందే యుండు బ్రహ్మేంద్రుఁ డీ
చదురుల్ నేరని మాట లేదు గురుశిష్యన్యాయ మూహింప నా
నదియా పెద్దతికంబు నిల్పుకొన వయ్యా ! చాలు నాత్మేశ్వరా !

బ్రహ్మేంద్రుండు సాక్షాత్కరించి సిద్ధు నాశీర్వదించుట

భుజంగప్రయాతము
అనం జూప రయ్యా ! యటం చొడ్చి రశ్రుల్
వినన్ వచ్చి శాంతింపవే యన్న పిల్పుల్
ధనంధాన మం చూడెఁ దల్పుల్ సమాధిన్
గనత్కాంతి బ్రహ్మంబు గానంగ నయ్యెన్ ! 205

సీ॥ అప్పు డయ్యెడఁ జూప హాశ్చర్యసంభ్రమా
మోదంబు లాత్మలఁ బాదుకొనఁగఁ
గయిమోడ్పులు ఘటించి జయవెట్టి, రనిమేష
దృష్టిమై సిద్ధుండు దేశికేంద్రు
నరసి దేవా ! యంచు నడుగుఁదమ్ముల వ్రాలి
యశ్రూదకమునఁ బాద్యంబు సలిపె
గురుఁడును జేయెత్తి పరమాదరమున మూ
ర్ధాఘ్రాణ మొనరించి యనియె నిట్లు

గీ॥ లెమ్ము లెమ్మోయి సాహసిక్యమ్ము తెరువు
తగునె నీవంటి పరమార్థతత్త్వనిధికి ?
హృదయనైశ్చల్య మరయంగ నిచ్చగించి
యింత చేసితిఁ గాక ! యీ వంత మేల ? 206

చం॥ అదియును గాక సిద్ధ నెడ నాదర మెక్కుడు పూనియుండు నె
మ్మది గురుఁ డంచు గొంద ఱభిమానము పేర్మిఁ దలంతు రట్టి వా
రెద నసమానతావకమహిమగరిష్ఠవరిష్ఠభక్తిసం
పద గుఱుతింప నిట్టి బలవత్తమదుర్ఘటనంబు గూర్చితిన్ 207

ఉ॥ ఓరిమితో ననుం గొలిచి యుల్లము రంజిలఁ జేసి తీవు నా
పే రవలంబనంబుగ భువిం బుడమివియ వోలెఁ బ్రాఁకి నీ
పేరు చిరంబుగా నిలుచు వేయును నేటికి ? నీకు సాటి గా
నేరుతురే ననుం దలఁప నేరని వా రితరుల్ ? కుమారకా ! 208

కం॥ మెచ్చితి నీ భక్తికి వా
క్రుచ్చితి నిఖిలంబు నీకు గుణసంపన్నా !
యిచ్చితి నభీష్టఫలములు
చొచ్చితి నీ హృదయ మందుఁ జూడుము వత్సా ! 209

వ॥ అని బ్రహ్మోపదేశంబు గావించి పాదుకాయుగాదికం బిచ్చినం బుచ్చుకొని కనుదమ్ముల కద్దుకొని సిద్ధుండు గురు నంద చూడ్కులు నిల్పి బ్రహ్మానందపరవశుం డయ్యె నప్పుడు నదీసాగరసంగమంబును శశిభాస్కరైకరాశిస్థితిత్వంబును ధనఋణశక్తిప్రసారకేంద్రీకృత విద్యుత్ప్రవాహంబును దలపించుచుఁ బుణ్యవంతంబును దేజస్వంతంబును శక్తిమంతంబు నైన తదీయదృశ్యంబున కంజలి ఘటించి చూపఱెల్లఁ బ్రదక్షిణంబు లాచరించి నిల్చి రంత గురుండు సిద్ధుని మూర్ధంబు నిమిరి యి ట్లనియె— 210

శా॥ ఆనందంబున నింటికిం జని వివాహం బాడి మన్నింపఁగా
నానాబంధుజనంబు, శిష్యతతు లానందింప మత్పాదుకా
ధ్యానారాధనతత్పరుండ వగుచుఁ ధర్మార్థకామంబు లా
పై నిర్వాణసుఖంబు లందు మవికల్పప్రౌఢి శిష్యాగ్రణీ ! 211

కం॥ అన విని మెయి పులకింపఁగఁ
గనుఁగొలఁకుల సమ్మదాశ్రుకణము లురలఁగా
వినయభరంబున సిద్ధుం
డను నమ్మహితాత్ముఁ జూచి సాంజలి యగుచుఁ 212

కం॥ దేవ ! కృతార్థుఁడ నైతిని
దావకసందేశవాక్సుధాపరమార్థం
బేవేళ నిచ్చగొనుచుం
గైవల్యపదంబు నందఁగాఁగల ననఘా ! 213

మ॥ ఒక యల్పజ్ఞుని నన్ను దీనజను శిష్యుంగాఁగ మన్నించి సా
ర్థకజన్మంబు గలట్టి వానినిగఁ దీర్పం జాలినా విట్టి దే
శికమౌళిం బడయంగఁ జాలిన శుభశ్రీకంబు నాపాలి దే
నె కృతార్థుండ మహానుభావ ! గుణకంధీ ! వీరనారాయణా ! 214

చం॥ ఎఱుఁగని యట్లు నన్ను నలయించి కలంచి యదృశ్యమూర్తి వై
మొఱ లిడఁ గానిపించి పరిపూర్ణ గుణోత్తరుఁ డంచు సూటిగా
నొరులకు వెల్లడించి భవదుజ్జ్వలపీఠము ముందు నాకు సు
స్థిర మగు స్థాన మిచ్చితి వదృష్టము నాదిగదా ? దయానిధీ ! 215

## నిరోష్ఠ్యము

మ॥ కరుణాసాంద్ర ! సుహృచ్చకోరసితరాకాచంద్ర ! సంసారసా
గరనిస్తారక ! తారకాద్యఖిలయోగజ్ఞానసంధాయకా !
దురితారణ్యహుతాశనా ! నతజనోద్యోగక్రియాసాధనా !
నరనాథోత్కరసన్నుతాంఘ్రియుగళా ! నానాగుణశ్రీకళా ! 216

## మాలికాబంధము

చం॥ చిరతరవీరదేవ ! చిదచిన్నిచితార్థశుభాశుభా ! శుచి
స్థిర! పరదారదూర! దితదిజ్నదితాఖ్య! ఘనాఘనాఘభీ
కరతరవైరవాత! కనకప్రకటాత్మక! లోకశోకని
ర్జరవరసూర! యాత్మజ! భజన్నిజభక్తవశంవదా! వశీ! 217

మ॥ నినుఁ గీర్తింపఁగ నెంతవాఁడ ననఘా! నీ దివ్యచారిత్ర మె
న్న నశక్తుండు గదా సహస్రముఖుఁ డా నాగేశ్వరుం డేని? న
న్ననుకంపారసదృష్టిఁ జూడుము త్వదీయాంఘ్రిద్వయం బాత్మ ని
ల్పి నమస్కారము లాచరింతు నితరం బేనేర నేమాత్రమున్ 218

కం॥ అనుచు సుమంబులఁ బూజిం
చి నమస్కారంబు సలుపు సిద్ధుని దీవిం
చె నభీష్టసిద్ధిర స్తని
ఘనుఁ డా గురుదేవుఁ డధిక కారుణ్యముతోన్ 219

కం॥ జయవెట్టిరి చూపఱు భ
క్తియు శ్రద్ధయు నినుమడింపఁ గేల్మోడ్పులతో
నయగతి గురుశిష్యులకున్
దయివాఱ నభేదభావతాత్పర్యంబుల్ 220

సీ॥ అప్పుడు గోవిందమాంబయుఁ గూఁతురు
ప్రణమిల్లి రా గురుపాదములకు
గోవిందుఁ డాదిగాఁ గొమరులు గోడండ్రు
వలగొని మ్రొక్కిరి పరమభక్తిఁ
గక్కండు మొదలుగాఁ గల శిష్యజనములు
సాఁగిలపడి నమస్కార మనిరి
ధరణీతలేశ్వరుల్ కరములు ముకుళించి
బహుభంగి సలిపిరి ప్రస్తుతులను

గీ॥ వారి నెల్లర దీవించి పరమగురుఁడు
మఱల శుభయోగనిద్రాసమాధి మునిఁగె
నెప్పటట్ల కవాటంబు లెసక మెసఁగె
గంధపుష్పాక్షతలు రాశిగాఁ దనర్చె ! 221

గీ॥ నారికేడములు పాయసాన్నములు పండ్లు
పప్పు లర్పించి మంత్రపుష్పములు వెట్టి
కనులు చెమరించి గురుపత్ని కప్పురంపు
టారతి ఘటింప నేకశారీరు లగుచు 222

మంగళమహాశ్రీ

మంగళము భక్తజనమానసపయోజరవిమండల! ప్రబోధగుణశీలా!
మంగళము యోగిజనమండన! యఖండసుషమావలయ వైభవ
[నిధానా !
మంగళము సర్వమతమార్గహితకారినిజమార్గ! విజితాంతరరివర్గా!
మంగళము నీకు గురుమౌళికిఁ బ్రణేయనృపమండలికి మంగళ ..
[మహాశ్రీ 223

కం॥ అని మంగళగీతిక పా
డి నమస్కారములు సంఘటించుచు నీరా
జన మందికొనుచు నెల్లరు
మునుమున్న మహాప్రసాదములు గొని రంతన్ 224

వ॥ నానాదిశాగతజనంబును నరనాథసంతానంబును గురుపత్నీ పుత్రులయు సిద్ధునియు వీడ్కోలు వడసి గురుని స్మరించుచు నిజ నివాసంబుల కరిగి రంత నొక్కనాఁడు— 225

సీ॥ సిద్ధసంకల్పుఁ డా సిద్ధుఁడు గురుదేవు
ఘనసమాధికి నమస్కార మిడియు
గురుసతీతనయుల చరణంబులకు మ్రొక్కి
వీడ్కొని యింటికి వేడ్క నరిగి
పరిణయం బాడి శ్రీగురుని పాదాపూజ
నేమఱ కుండెను హృదయ మందు;
నిట మఠంబును నిర్వహించుచుఁ బండు ము
త్తైదువ యగు తల్లి సోదరులును
గీ॥ శిష్యు లలరంగ గురుదేవు జ్యేష్ఠసుతుఁడు
లాలితాకార మైన యిల్లాలి వలనఁ
గనియె నీశ్వరి! గురువియోగమున నున్న
కందిమల్లయపల్లె యానంద మందె ! 226

## యోగఫలము

కం॥ మమకార మూడ్చి ప్రకృతి
 భ్రమ కగ్గము గాక నిల్చి బ్రహ్మము దర్శిం
 చు మనోలయమును బడయుదు
 రమనస్క సమాధియోగ మాలించినచోఁ  **227**

## కావ్యఫలము

కం॥ ఏతత్పుణ్యచరిత్రము
 జాతికి నీతికిని దోడవు చదివిన వినినన్
 బ్రాఁతిగ నిచ్చు జగద్గురుఁ
 డాతతభవికంబు లైహికాముష్మికముల్ !  **228**

## నమస్కారము

సీ॥ శ్రీవీరగురుమౌళిచిరదయారసదృష్టి
 మీ యనుగ్రహము నా మీఁద నునికి
 నిహపరసాధన మిమ్మహాకావ్యంబు
 వ్రాయంగఁ గంటిఁ మీ కీయఁగంటి
 నాంధ్రభాషాయోష కవతంసకుసుమభూ
 షావిశేషముగఁ బ్రశస్తి వడసి
 పండితపామరప్రస్తూయమానమై
 యాచంద్రతారార్క మలరుఁ గాక !

గీ॥ బ్రహ్మయోగీంద్రవాక్సుధారసము గ్రోలి
 ప్రజలు నడతురు గాక ! సత్పథము నందు;
 జన్మదాతలు మీకు నా స్వామి కిదియె
 కృతి సుకృతి నైన నా నమస్కృతి శతంబు !  **229**

## ఆశ్వాసాంతము

మ॥ త్రిపురారిప్రణిధానగానవివశుల్ ! కృష్ణానదీతీరగ
ర్తపురీమండలమాళిభూతలసముద్యద్దావెలగ్రామధా
మపరిష్కారవినోదవిస్తృతయశుల్ ! మంత్రాంగశిల్పాంగ ధ
ర్మపరావేశు లవైదికాధ్వవిచరత్ప్రత్యర్థికర్యంకుశుల్ ! 230

కం॥ ప్రాచీనార్వాచీనశు
భాచరణులు ! వేంకటనరసాంబాబ్రహ్మా
ర్యాచార్యతుహినకిరణు ! ల
నూచానజ్ఞానమయమనోరథసరణుల్ ! 231

గద్యము :- ఇది శ్రీపూసపాట్యన్వవాయపయఃపారావారరాకాకురంగ లాంఛన, సహజకవిపంచానన, కవిశేఖర, నాగేశ్వరప్రణీతంబైన శ్రీవీరబ్రహ్మేంద్ర చరిత్రంబు నందు సమాధియోగం బను పంచమాశ్వాసము — సర్వంబును సంపూర్ణము— 232

ఓమ్ తత్సత్

లోకా స్సమస్తా స్సుఖినోభవంతు



## తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 21 | బ్రహేంద్రుని | బ్రహ్మేంద్రుని |
| ౫ | 12 | జపలు | జపల |
| ౧౪ | 7 | మనకు | మనసు |
| 2 | 1 | తీర్ధాట | తీర్థాట |
| 6 | 6 | గనకర | గనికర |
| 8 | 17 | ఢప్పు | దప్పు |
| 24 | 23 | న్నివినీతు | న్నవినీతు |
| 44 | 1 | దేహామ్మై | దేహమ్మై |
| 48 | 10 | మనమయు | మనుమయు |
| 54 | 19 | గటెను | గట్టెను |
| ,, | 20 | త్రోకుచు | త్రొక్కుచు |
| 55 | 21 | రైపోవు | ర్చైపోవు |
| 59 | 10 | ప్రార్ధించు | ప్రార్థించు |
| 61 | 12 | కరాంగి | కర్థాంగి |
| 62 | 14 | విప్రు | విజ్ఞు |
| 69 | 10 | నిధి | నిది |
| 70 | 9 | కాలజాన | కాలజ్ఞాన |
| 73 | 7 | కెవ్వండో | కెవ్వఁడో |
| 77 | 13 | యభాగ్య | యభాగ్య |
| 93 | 17 | లక్షణముల్ | లక్షణమున్ |
| 94 | 22 | కృత | కృత |

| పుట | వంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 101 | 19 | మనం | మనంబు |
| 116 | 9 | మాగుహ్యాంబు | మల్లగుదంబు |
| 117 | 21 | పొమ్మవి | పొమ్మని |
| 119 | 3 | మెన | మైన |
| ,, | 6 | వ సము | వతంసము |
| 121 | 14 | పొగచుట్టును | పొగచుట్లను |
| 128 | 15 | తీజి | తేజి |
| ,, | 24 | సుఖయిందు | సుఖయించు |
| 129 | 4 | తుగి | తుది |
| 144 | 4 | జూటు | జాటు |
| 145 | 17 | అస్పృతా | అస్పృశ్యతా |
| 152 | 13 | యెడండ | యెడంద |
| 155 | 14 | కొ ఁపోయి | కొంపోయి |
| 160 | 15 | వదిరిన | వదరిన |
| ,, | 23 | దుర్భరాస్పృతా | దుర్భరాస్పృశ్యతా |
| 163 | 14 | నన్కైక | నన్నైక |
| ,, | 17 | నహాజీవన | సహాజీవన |
| 178 | 2 | నలక్ష్యంబు | యలక్ష్యంబు |
| 191 | 2 | పాభరణులు | రాభరణులు |
| 193 | 16 | తత్వవిద్యా | తత్వవిద్యా |
| 195 | 21 | సత్య | సత్వ |
| 197 | 17 | నవలంబునకుం | నవలంబంబునకుం |
| 199 | 1 | యమ్మలికం | యుమ్మలికం |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 203 | 15 | వేఁకోప | వేఁకువ |
| ,, | 20 | నమయంబు | సమయంబు |
| 205 | 15 | పరశవ | పరవశ |
| 211 | 1 | వైతిఁ | వైతి |
| 214 | 12 | చెమ్మగిలె | చెమ్మగిల్లె |
| ,, | 14 | మంజుమంజు | మ్రంజుమంజు |
| ,, | 23 | గీపెటుచున్ | గీపెట్టుచున్ |



# చందా పట్టిక

1. శ్రీ నల్లపాటి సుబ్బారావుగారు B.E; A.M.I.E;
చార్టర్డు ఇంజనీర్, గుంటూరు రు. 1000-00
2. ,, కనగపాటి మధుసూదనరావుగారు
P. W. D. Work shop, సీతానగరం. 558-00
3. శ్రీమతి. సుతారి అచ్యుతాంబ గారు
జ్యువెలరీ షాపు, తెనాలి. 216-00
4. శ్రీ యలవర్తి శ్రీరాములు చౌదరిగారు
కూచిపూడి తెనాలి తా॥ 116-00
5. ,, శరణం సత్యనారాయణగారు, మేనేజింగ్ పార్టినర్
శ్రీ జయలక్ష్మి రైస్ & ఆయిల్ కంపెనీ, మంగళగిరి 116-00
6. ,, కాగిత వీరాంజనేయులు గారు
హింది పండిట్, C. K. High School, మంగళగిరి 116-00
7. ,, విప్పర్ల మల్లికార్జునరావు గారు
వూటుకూరు, సత్తెనపల్లి తా॥ 116-00
8. కీ॥ శే॥ పూసపాటి గురుబ్రహ్మయ్యగారు
నరసరావుపేట 100-00
9. శ్రీ. డా. యస్. నరసింహారావు గారు. M B.B.S.
T.B. Sanitorium, Mangalagiri 50-00
10. ,, చిమటా పిచ్చయ్యగారు, మంగళగిరి 30-00
11. ,, వల్లూరు సాంబశివరావు & చిగురుపాటి
సుబ్బారావు; ధనలక్ష్మి రైస్ మిల్లు మంగళగిరి 50-00
12 ,, మంగళాపురపు వీరభద్రాచార్యులుగారు
పోష్టుమాష్టరు, చీరాల 30-00
13. కీ. శే. పులిపాక బుచ్చిరామయ్యగారు, మంగళగిరి 25-00
14. ,, జొన్నాదుల రామారావు ,, 25-00

| | | | | |
|---|---|---|---|---|
| 15. | క. శె. | దామర్ల రమాకాంతరావుగారు M.A. | ,, | 25-00 |
| 16. | ,, | కొల్లి ద్వారకాకృష్ణ. | ,, | 25-00 |
| 17. | శ్రీ | అన్నె సంజీవయ్య. B.A. | ,, | 25-00 |
| 18. | ,, | తాతా రామయ్య. | ,, | 25-00 |
| 19. | ,, | తెనాలి సాంబయ్య. | ,, | 25-00 |
| 20. | ,, | ప్రెగడ ఆదిసుదర్శన సుందరరావు | ,, | 25-00 |
| 21. | ,, | ఇర్ల మార్కండేయులు. కె.సి. వర్క్సు, తాడేపల్లి | ,, | 25-00 |
| 22. | ,, | కొప్పరపు మణిభూషణాచార్యులుగారు | నరసరావుపేట | 25-00 |
| 23. | ,, | కంచేపు వీరాచారిగారు | ,, | 25-00 |
| 24. | ,, | అత్తిలూరి సూర్యనారాయణ గారు | ,, | 25-00 |
| 25. | ,, | కూనిసెట్టి చినఆంజనేయగుప్తా | ,, | 25-00 |
| 26. | శ్రీమతి | కూనిసెట్టి కోటమ్మ | ,, | 25-00 |
| 27. | శ్రీ | డాక్టర్ మహేశ్వరపు వీరబ్రహ్మచార్యులుగారు L.A M. | బ్రాహ్మణపల్లి పల్నాడు తా॥ | 25-00 |
| 28. | ,, | దీవి కోటేశ్వరరావుగారు, | చిలకలూరిపేట | 25-00 |
| 29. | ,, | దీవి వీరబ్రహ్మంగారు, | వూటుకూరు, సత్తెనపల్లి తా॥ | 25-00 |
| 30. | ,, | వెనిగళ్ళ షణ్ముఖరావుగారు, | మంగళగిరి | 20-00 |
| 31. | ,, | యక్కలి రామయోగీశ్వరరావు, | ,, | 20-00 |
| 32. | ,, | వూట్ల ద్వారకాకృష్ణగారు | ,, | 20-00 |
| 33. | ,, | పుడతా రాధాకృష్ణమూర్తి | ,, | 20-00 |
| 34. | ,, | చిరందాసు సాంబశివరావు | ,, | 20-00 |

35. శ్రీ అన్నపరెడ్డి వెంకటరామిరెడ్డిగారు, ఆత్మకూరు 20-00
36. ,, అంగలకుదిటి వేంకటేశ్వర్లుగారు, గుంటూరు 20-00
37. ,, యన్. భాస్కరాచార్యులుగారు, పర్సనల్ మేనేజరు. సింగరేణికాలరీస్; కొత్తగూడెం, 20-00
38. శ్రీ నందికంటి సాంబశివరావు గారు, మంగళగిరి 15-00
39. ,, జంజనం కోటిరామమూర్తి ,, 10-00
40. ,, కీ॥ శే॥ బుల్లా బుచ్చయ్య ,, 10-00
41. శ్రీ పేర్ల రామకృష్ణ ,, 10-00
42. ,, కాటాబత్తుల అమరయ్య ,, 10-00
43. ,, కొడాలి వేంకటేశ్వరరావు B. A. ,, 10-00
44. ,, పి. యల్. కాంతారావు ,, 10-00
45. ,, ఇసునూరి కోటిరత్నం & సన్సు ,, 10-00
46. ,, దీపాల వేంకటస్వామి ,, 10-00
47. ,, కె. సుబ్బారావు ,, 10-00
48. ,, తమ్మిసెట్టి రామకృష్ణ ,, 10-00
49. ,, నందం వేంకటేశ్వర్లు ,, 10-00
50. ,, కొనకళ్ళ వేంకటేశ్వరరావు ,, 10-00
51. ,, వి.వి.పి. కుటుంబరావు ,, 10-00
52. ,, మంచికంటి రాఘవయ్య ,, 10-00
53. ,, డాక్టర్. కె.బి. స్వామి. M.B.B.S. ,, 10-00
54. ,, చెరువు లక్ష్మినరసింహం ,, 10-00
55. ,, పి. కోటేశ్వర విఠల్‌గుప్తా ,, 10-00
56. ,, బొమ్ము నరసింహారెడ్డి ,, 10-00
57. ,, దామర్ల శివకృష్ణారావు ,, 10-00
58. ,, దామర్ల జగ్గారావు ,, 10-00
59 ,, నిడుముక్కల వేంకటేశ్వరరావు ,, 10-00

| | | | |
|---|---|---|---|
| 60. | శ్రీ నేరెళ్ళ కొండలరావుగారు | మంగళగిరి | 10-00 |
| 61. | ,, తాడికొండ లక్ష్మీ కాంతరావు | ,, | 10-00 |
| 62. | ,, యస్. మోహన్‌దాస్ బాపూజీ | ,, | 10 00 |
| 63. | ,, పి. హనుమంతరావు | ,, | 10-00 |
| 64. | ,, పలగాని కోటేశ్వరరావు | ,, | 10-00 |
| 65. | ,, మాజేటి కుసుమ హరనాథ్ | ,, | 10-00 |
| 66. | ,, మాజేటి రామారావు | ,, | 10-00 |
| 67. | ,, దామర్ల వీరాంజనేయులు | ,, | 10-00 |
| 68. | శ్రీ అన్నపరెడ్డి వేణుగోపాలరెడ్డి B.Sc; B.E. | ఆత్మకూరు | 10-00 |
| 69. | ,, అన్నపరెడ్డి సత్యనారాయణరెడ్డి, M.B.B S. | ఆత్మకూరు | 10-00 |
| 70. | కీ.శే. కొల్లి రామిరెడ్డి | ,, | 10-00 |
| 71. | శ్రీ ఆత్మకూరు లక్ష్మీనారాయణ | ,, | 10-00 |
| 72: | ,, ఎమ్మెల కృష్ణారావు, | కొలనుకొండ | 10-00 |
| 73. | ,, ఆర్. వి. రమణరావుగారు K.C works | తాడేపల్లి | 10-00 |
| 74. | ,, వి. రవీంద్రనాథ చౌదరి | ,, | 10-00 |
| 75. | ,, B.H. సింగు | ,, | 10-00 |
| 76. | ,, పి.వి ఎ.ఆర్. సోమయాజులు | ,, | 10-00 |
| 77. | ,, యస్. పిచ్చయ్యగారు రిటైర్డ్ హెడ్మాష్టరు | ,, | 10-00 |
| 78. | ,, బి. వెంకయ్య | ,, | 10-00 |
| 79. | ,, ఎ. శంభుసింగు | ,, | 10-00 |
| 80. | ,, షేక్ మీరా | ,, | 10-00 |
| 81. | ,, ఆదంఖాన్ | ,, | 10-00 |
| 82. | ,, డి. సత్యనారాయణ | ,, | 10-00 |

| | | | |
|---|---|---|---|
| 83. | శ్రీ పి. యస్. స్వామిగారు | ,, | 10-00 |
| 84. | ,, యం. కృష్ణమూర్తి | ,, | 10-00 |
| 85. | ,, పట్టా నరసింహారావు | ,, | 10-00 |
| 86. | ,, కె. చలపతిరావు | ,, | 10-00 |
| 87. | ,, డి.ఆర్.వి. ప్రసాద్ | ,, | 10-00 |
| 88. | ,, కొండూరి సుబ్రహ్మణ్యసిద్ధాంతి, | తెనాలి | 10-00 |
| 89. | ,, పల్లపోతు వేంకటేశ్వరరావు, కొరగల్లు, గుంటూరు తా॥ | | 10 00 |
| 90. | ,, గాదం సెట్టి సుబ్బరాయప్ప, కళ్యాణదుర్గం | | 10-00 |
| 91. | ,, ధేనువుకొండ సుబ్రహ్మణ్యాచారిగారు, కళ్యాణదుర్గం | | 10-00 |
| 92. | ,, రావుట్ల వెంకయ్యాచారి గారు, తాళ్ళూరు - ఒంగోలుజిల్లా | | 10 00 |
| 93. | ,, రామచల్లు కన్నయశ్రేష్ఠిగారు-చిలకలూరి పేట | | 10-00 |
| 94. | ,, గొత్తిపాటి పున్నయ్య పంతులు | ,, | 10-00 |
| 95. | ,, ఉండవల్లి బసవాచారి గారు | ,, | 10-00 |
| 96. | ,, ఉండవల్లి బ్రహ్మయ్య | ,, | 10-00 |